





# జీవిత చరిత్ర

గాంధీజీ

# మహాత్మా గాంధీ





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010006094

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మహాత్మా గాంధీ

రచన:

విన్సెంట్ షీన్

అనువాదం:

విద్వాన్, దేవరకొండ చిన్నికృష్ణశర్మ



# పరిచయము

ప్రజాసామాన్యానికి ఆకర్షకంగా, విశేషోపయోగకరంగా ఉండే పుస్తకాల ప్రచురణకు దోహదం చెయ్యాలనే సంకల్పంతో దక్షిణభారత పుస్తకసంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింపజేసింది. ఆ ప్రచురణలవలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ ద్రావిడభాషలలోకి అనువాదం చేయించి ప్రచురింపజేస్తూంది. పాఠకులలో భిన్న భిన్న అభిరుచులకు తగినట్లు ఈ పుస్తకాలను శ్రద్ధగా ఎన్నిక చేశారు. అందువల్ల మానవజీవితానికి సంబంధించిన వివిధవిషయాలనుగురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహానాయకుల జీవితచరిత్రలు, వారు చేసిన ఘనకార్యాలు వివరించే గ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథపరంపరలో ఒకశాఖ. మన దేశశ్రేయస్సుకోసం, అభ్యుదయంకోసం ఆ మహాపురుషులు ఏమి చేసినది, వారికి తామెంత ఋణపడిఉన్నది, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించడానికి వారెన్నెన్ని పాట్లు పడినది ముందుతరాలవారంతా తెలుసుకుని ఉండటం మంచిది.

తత్త్వశాస్త్రం, మతం, విజ్ఞానశాస్త్రం, సాహిత్యం — ఈ గ్రంథపరంపరలోని ఇతర శాఖలు. కథానికలు, ప్రాచీనకళాసంపదలను అభివర్ణించే గ్రంథాలుకూడా ఇందులో ఉండటం ముదావహం. నాటకకళ, శిల్పశాస్త్రం, పురావస్తుపరిశోధనలు, నిరతాద్భుతావహములైన దాక్షిణాత్య దేవాలయాలనుగురించిన గ్రంథాలు ఈ పరంపరలో ఉన్నవి. విజ్ఞాన వికాసదాయకములైన భిన్నభిన్నవిషయాలను గురించిన ఈ గ్రంథాలు ప్రజ

లను విశేషంగా ఆకర్షింపగలవని, ఆ విధంగా ఇట్టి ప్రచురణలకు ముందుముందు విస్తారప్రచారం కలుగగలదని నా విశ్వాసం.

దక్షిణభారతభాషలలోని ఉత్తమగ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్య భాషలలోకి అనువదింపచేయటం ఈ ద్వితీయ గ్రంథపరంపరలోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడినప్పుడు, విద్యావంతులలో ఎక్కువమందిని వివిధవిషయాలనుగురించిన జ్ఞానాసక్తిగల పాఠకులుగా ఆకర్షించి, ఆ జ్ఞానపిపాసను తృప్తిపరచడానికి యోగ్యమైన గ్రంథాలనుకూడా వారికి అందజేసినట్లు అవుతుంది.

ఈ దక్షిణభాషా పుస్తకసంస్థ ఆశయాలు శీఘ్రగతిని సఫలం కాగలవని ఆశిస్తున్నాను.

ఇట్లు,
ఎ. లక్ష్మణస్వామి మొదలియార్,
వైస్‌చాన్సెలర్
మద్రాసు విశ్వవిద్యాలయం.

మద్రాసు,
7-10-1958.

•

# తొలిపలుకు

విన్సెంట్ షీన్ రచించిన ఈ మహాత్మాగాంధి జీవితచరిత్ర ఒక మనోహర రచన. ఇది ఒక మహాపురుషుని హృదయం లోని క్రమపరిణతిని గూర్చిన పరిశీలన. బాల్యంలో గాంధిజీ అకారణ లజ్జా సంకోచాలతో క్రుంగిపోయే వాడనటంలో సందేహంలేదు. ఎవరితో మాట్లాడవలసి వస్తుందో అనే భయం చేత ఇంటినుంచి బడికిగానీ, బడినుంచి ఇంటికిగానీ పరుగెత్తే వాడు. తోడివారితో మాట్లాడటమంటేనే ఆయనకమిత భయం. అయితే సత్యంకోసం సమస్తం త్యాగంచేసిన హరిశ్చంద్ర మహా రాజుకథ నాటకరూపాన చూచినతర్వాత ఆయనలో ఒక గొప్పమార్పు వచ్చింది. అతిబాల్యంలోనే ఆయన ఆ నాట కాన్ని తనలో తానే ప్రదర్శించుకొని ఆనందించేవాడు. అప్పటి నుంచీ సత్యవ్రతాన్ని అవలంబించాలనే పట్టుదలకలిగి, అది నానా టికీ బలపడి అచంచలమైనది. అది ఆయన హృదయఫలకం మీద స్థిరంగా ముద్రితమైంది. అదే తనయావజ్జీవితానికీ పరమ లక్ష్యంగా దృఢపడేవఱకూ సంతతాభ్యాసం సాగించాడు. బడిలో దుస్సహవాసాల పాలైనప్పుడు కూడా ఆ సత్యవ్రతమే ఆయనను అకార్యాలపాలుగాకుండా రక్షించింది. తాను చేసిన తప్పిదాన్ని యథాతథంగా తండ్రిదగ్గఱ అంగీకరించి, బాధాదుఃఖాలతో తండ్రికార్చిన కన్నీరుచూచి, ఇక అటు వంటి తప్పెన్నడూ చేయగూడదనే నిశ్చయానికివచ్చాడు. ప్రతి ముఖ్యఘట్టంలోనూ సత్యపరిపాలనలో ఆయన సాధించిన విజ

యమే ఆయనను శక్తిసంపన్నుడుగా, ఉత్తముడుగా, ప్రజా నాయకుడుగా రూపొందించింది.

గాంధిజీ జీవితం కేవలం ఆయన ఉద్దిష్టలక్ష్యాలకు అనుగుణంగా రూపొందిన గాథమాత్రమే అని ఈ పుస్తకం చెప్పుతున్నది. ఇదే అభిప్రాయంతో ఆయన ప్రబోధపరాజయం నిర్వచింపబడ్డది. గ్రంథకర్త ఇలా అంటున్నాడు:

"అలా చిట్టచివరకు ఆయన మహాత్ములందరూ తప్పకుండా చేసే పొరపాటే చేశాడు: "నేను జీవితవిజయానికి కావలసిన ప్రధానలక్షణాలేవీ లేని సామాన్యవ్యక్తిని. అయినా నేను లక్ష్యాన్ని సాధించగలను. మరి తక్కినవారందరూ నా మాదిరిగానే ఎందుకు చేయలేరు? క్రమశిక్షణ పాటించటం మొదలయినవి అతిపరిమితశక్తిగల నాకే సాధ్యమైనప్పుడు ఇతరులకు ఇంకెంతో సులభసాధ్యం కావాలి. లేదా కనీసం నా మాదిరిగానైనా వారు వాటిని సాధించగలరు." ఆయన చేసిన పెద్దపొరపాటు ఇదే. దక్షిణాఫ్రికాలోగానీ, భారత దేశంలో గానీ, మరి ప్రపంచంలోగానీ ఆయన పొందిన పరాజయాని కంతటికీ ఇదే కారణం. కార్యనిర్వహణదక్షతలో ఇతరులందరూ తనకంటె మిన్నలని భావించటంచేత తాను చేయగలిగినదంతా వారు చేయగలరని ఆయన పొరపడ్డాడు. ఈ పొరపాటు ఎంతో కీడు కలిగించింది. దీనివల్లనే ఆయనకూడా సోక్రటీసు, గౌతమబుద్ధుడు, నాజరైతు, ఏసుక్రీస్తులతో జమ అయినాడు. మానవజాతిచరిత్రలో మహనీయులుగా లెక్కకువచ్చిన ఆ ముగ్గురూకూడా తమ జీవితలక్ష్యసాధనలో పరాజితులైనవారే. తాము చేసినది ఇతరమానవులూ చేయగలరని వారందరూ

విశ్వసించారు. అదే వారి పొరపాటు. గాంధిజీ పొరపాటు కూడా అదే."

తమ అనంతరంకూడా శతాబ్దాలతరబడి మానవలోకం తమ ప్రబోధాలను శిరసావహించేటట్లు చేసికోగలిగిన క్రీస్తూ, బుద్ధుడూ, సోక్రటీసుకూడా జీవితలక్ష్యసాధనలో పరాజితు లయినారంటే ఇక జయం సాధించేవారెవరు ? కానీ, గాంధిజీ పరాజయాన్ని ఇలా నిర్వచించటంవల్ల చరిత్రలో ఆయన సుస్థిరం చేసికొన్న మహావిజయాన్ని ఉపేక్షించినట్లవుతున్నది. గాంధిజీ రాజకీయరంగంలో కాలుమోపటానికిపూర్వం భారత దేశంలో జాతీయనాయకత్వం వహించినవారంతా ఒకే శ్రేణి వారు. వారందరూ కేవలం ఉపన్యాసాలలోనే తమ సామ ర్థ్యాన్ని వినియోగించుతూ రావటంవల్ల సామాన్యప్రజలు వట్టి ప్రేక్షకులుగానే ఉండిపోయారు. అయితే గాంధిజీ అందరికీ పని కల్పించాడు. లోకసాధారణంగా బాల్యంగడపినా, అసాధా రణ నాయకుడుగా రూపొందగలిగిన మహాత్ముని పరిణతి, బానిసతనంతో క్రుంగి, అవినీతిమగ్నులైఉండే పామరులకు కూడా సంపూర్ణమానవత్వాన్ని సాధించాలనే ఆకాంక్షనూ, ఉత్సాహాన్నీ సంఘటించింది. ఇదే మహాత్ముని విశిష్టత. ఆయన వట్టి మట్టిముద్దనుంచి మహానాయకులను సృష్టించగలి గాడు. ఇది ఇతరులపట్ల ఆయనకుగల విశ్వాసానికి విజయం. ఈ విశ్వాసమే దేశంలో ఆయనకు ప్రోత్సాహంకలిగించి, దేశ స్వాతంత్ర్యసంపాదనాపథంలో నడపింది. ఆయన అసాధారణ వ్యక్తిత్వాన్ని గుర్తించిఉండికూడా సమాజధోరణిలోనే సిద్ధాంతీక రిస్తూ పోవటంవల్ల ఉపయోగంలేదని చెప్పితే చాలు.

మహాత్ముని చరిత్రను విన్సెంట్ షీన్ ఈ క్రింది ప్రశంసతో ముగిస్తున్నాడు: "మానవుల నందఱినీ ఆత్మసమానులుగా మన్నించిన యీ మానవునికి మనకాలంలో సమానులెవరూలేరు. మనకింతవఱకు తెలిసినంతటి దానినిబట్టి పూర్వకాలంలో సోక్రటీసును గుఱించి లోకం చెప్పినట్లే మహాత్ముడు ఉత్తముడూ సత్తముడూ అనిమాత్రమే చెప్పగలము." ఇది గాఢపరిశీలనచేసి, హృదయానికి పరిపూర్ణతృప్తికలిగి చేసిన ప్రశంస. ఇందులో అతని అసాధారణ పరిశ్రమ వ్యక్తమవుతున్నది. గీతాప్రబోధాన్నీ హైందవ జీవనవిధాన పరమార్థాన్నీ ప్రశంసార్హంగా అవగతంచేసికొని చేసిన యీ ప్రశంస ప్రాచ్యపాశ్చాత్య సామరస్యానికి అమూల్యమైన దోహదం చేస్తుంది. ఆ మహత్తర పదగుంభనం పఠితలకు ఉల్లాసం కలిగిస్తుంది.

23-4-1957 ఖాసా సుబ్బారావు.

M/R. 23-4

# మహాత్మాగాంధి

## ప్రథమ ప్రకరణం

### పోరాటానికి పూర్వం

ఈశతాబ్ది ప్రారంభంనుంచీ ప్రసిద్ధులైనవారిలో గాంధి మహాత్మునివలె ప్రజలదృష్టిని ఆకర్షించినవారు ఇంకొకరులేరు. ఆయన పలికిన ప్రతిపదమూ గ్రంథస్థమైనది; చేసిన ప్రతి కార్యమూ ప్రకటితమైనది. మహాత్ముని నాడి ఎల్లా స్పందిస్తున్నదీ, జీర్ణకోశం ఎల్లా పనిచేస్తున్నదీ అనుక్షణమూ లోకం తెలుసుకుంటూ వచ్చింది. చేసినతప్పు ఒప్పుకోకుండా దాచిపెట్టి, సత్ఫలితంకోసం ప్రయత్నించడం ఆయనకు చేతగాని పని. రోగపీడితమై చావడానికి సిద్ధంగా ఉన్న ఒక ఆవుదూడకు మత్తుమందు ఇయ్యవలసిందని మహాత్ముడు వైద్యుడికి ఉపదేశించినప్పుడు ప్రపంచం దిగ్భ్రాంతిపడ్డది. ఆయన నిద్రపోకపోతే లక్షలకొలదీ ప్రజలు నిద్రపోలేదు; ఆయన అన్నం మానితే అల్లాగే లక్షలాది ప్రజలు అన్నం ముట్టలేదు. ఆయన మృదుమధురవాక్కులు ప్రతిదినమూ అనేకపర్యాయాలు దాదాపు అర్థఖండంవరకూ ఆకాశవాణిద్వారా ప్రసారమయ్యేవి. మెఱుపు దీపాల మిఱుమిట్లు మధ్యనూ, ఛాయాగ్రాహక యంత్రాల 'క్లిక్కు-క్లిక్కు' మనే సవ్వడుల నడుమనూ ఈ యిరవయ్యో శతాబ్దంలో ప్రజలకోసం యోగి అయ్యే అసామాన్య దుర

దృష్టం ఆయనకు మాత్రమే పట్టింది. నిర్విరామంగా తన బాధ్యతలను ఏకాగ్రచిత్తంతో నిర్వహించవలసి ఉండటంచేత లోకుల విపరీతభావాలను గురించి ఆలోచించటానికి ఆయనకు తీరికే ఉండేదికాదు. ప్రశాంతాత్మతను స్థిరపఱచుకొనటంకోసం తనకు సహజం కాని శాంతాన్ని ఆయన అతిప్రయాసతో సృష్టించుకోవలసి వచ్చింది. అందుకే 'మహాత్ముల శోకాలు మహాత్ములకే తెలుసు' అని ఆయన వక్రోక్తి విసిరాడు.

ఏది యేమైనా ఒక మహాగాథ పుట్టింది. అది ప్రజానీకం నడవడికే మార్చివేసింది. చరిత్రగమనాన్నే మళ్లించింది; సామ్రాజ్యభాగ్యాన్ని మఱోదిక్కుకు నడపించింది. విడివిడిగా ఏ ఘట్టాని కా ఘట్టం మనకు తెలిసిందైనా అన్నీ కలిస్తే ఫలితం ఎల్లా ఉంటుందో ఊహించరాని యిటువంటి అద్భుత సంఘటనమఱొకటిలేదు. మహాత్మునిమహిమ యిటువంటిది అని మనం విశదీకరించలేము. గాంధిమహాత్ముడు మరణించినవెంటనే ఆ సంవత్సరం మాస్కోలో ప్రకటితాలైన 'ఫిలసాఫికల్ రివ్యూ' 'ప్రవ్దా' పత్రికలు ఈ సందర్భంలో ప్రకటించిన అభిప్రాయాలు మార్క్సుతత్త్వంమీద ఉండే వ్యామోహంతో అంత వఱకూ అవి ప్రదర్శిస్తూ వచ్చిన ధోరణులన్నింటికంటెనూ విభిన్నంగా ఉన్నాయి. మహాత్మునిగుఱించి వ్రాస్తూ ఇర్విన్ ప్రభువు "ఆ కొద్దిపాటి మనిషి చాలా ఉత్తముడు" అనడంలో ఎంతో సత్యం ఉన్నది. సరసుడూ, దయాళువూ అయిన ఆ రాజప్రతినిధి (ఇర్విన్) తన ప్రతిస్పర్థి తత్త్వాన్ని తెలుసుకొన్నాడు. వారిద్దరూ ఒకరిని ఒకరు అర్థం చేసుకొన్నారు.

అసలు సౌజన్యమే అంతటికీ మూలమై ఉంటుంది. మహా

త్ముడుకూడా ఇల్లాగే అనుకొనిఉంటాడని నా ఊహ. భగవద్గీత ఉపదేశసారాన్ని జీర్ణించుకొని అక్షరాలా దాన్ని ఆచరణలో పెట్టి తనజీవితంలో అత్యధికభాగం దాదాపు 50 సంవత్సరాలు తదనుగుణంగా గడపడంలోనే ఆయన గొప్పతనం స్పష్టమౌతున్నది. ఆ విశిష్టత ఆయన సొమ్ము. ఇది ఒక నైతికమైన అభ్యున్నతితప్ప అప్రశస్తవిషయంకాదు, తత్త్వవిచారణా కాదు. మహాత్ముడు తాత్త్వికుడే కాడు. ఆయన సజ్జనుడుగా ఉండాలనుకొన్నాడు. నిష్కళంకమైన జీవితం గడపవలెనని నిశ్చయించుకొన్నాడు. వంచనం అంటే తెలియని సౌజన్యం ఆయనతో మైత్రిచేసింది. "నేను నిర్దుష్టమైన అహింసాలబ్ధమైన ఆహారమే స్వీకరిస్తాను." అని ఆయన నాతో అన్నాడు. కోల్పోయిన అమాయికత్వాన్ని తిరిగి సంపాదించుకోవటం వ్యర్థప్రయత్నంగా కనిపించవచ్చును. మహాత్ముడు కొన్ని సందర్భాల్లో ఇటువంటి ప్రయత్నంలో పరాజయం పొందినట్లే భావించాడు. శరీరం నిలుపుకోటానికి అవసరమైనప్పటికీ మేకపాలు త్రాగడమనేది ఆయనకు ఎన్నటికీ నిర్దుష్టమైన పనిగా తోచలేదు. ఆయన కొన్ని సమయాల్లో క్రోధాన్ని మరికొన్ని సమయాల్లో విసుగుదలనూ జయించవలసివచ్చింది. కామాన్ని లోబరుచుకొనడం చాలాశ్రమ. బుద్ధదేవుడు వనగజాన్ని లోబరుచుకొన్నవిధంగా ఇది దుస్సాధ్యమైన విజయం. ఆయన అపరిపక్వతలనేవి ఆయనకెల్లా కనిపించినా, జీవితనిర్వహణం కంటెనూ, నైతికప్రవృత్తిని క్రమబద్ధంచేసుకోవటం ముఖ్యంగా భావించికాని, కేవలం మంచితనంతో సమన్వితంచేసుకొనికాని, జీవించే మానవమాత్రుడు ఇంకొకడుఉంటాడని ఊహించలేము.

సౌజన్యంకూడా అల్లాగే గాంధి వింతప్రభావాన్ని విశదీకరించ లేదు. ఆయన ఏకోశానా ఒకర్ని శాసించాలని అనుకోకపోయినా ఆయన వ్యక్తిత్వమే లోకాన్ని వశంచేసుకునే దనడం నిర్వివాదాంశం. ప్రతిపక్ష శక్తుల్ని వశపర్చుకోవడం అనేది ఆయన చరిత్రలో ఎప్పుడూ కనబడుతూనే ఉంటుంది. ఆయన నమ్రుడైనకొద్దీ యెంతో శక్తిమంతుడుగా ఉండేవాడనడం యథార్థం. అవసానకాలానికి ఈ అత్యద్భుత రహస్యశక్తి విస్పష్టమైంది. తన శరీరాన్ని విసర్జించడంవల్లనే ఆయన తన జీవితలక్ష్యాన్ని సాధించగలిగాడు. మృతివల్ల ఆయన అనన్యపరిపూర్ణత స్పష్టమైంది. ప్రజలు ఆయనను అనుసరించకుండా అన్యమార్గాలు పట్టినసమయంలో తిరిగి అందర్నీ అది ఒక్కచోట చేర్చి ఆయనకు ఒక్కసారి భక్తిశ్రద్ధాంజలి అర్పించేటట్లు చేసింది.

ఆ మహిమకు మూలం ఏదని మనం నిర్ణయించగలం? ఆ అద్భుతం దేనివల్ల కలిగిందని చెప్పగలం?

దీనికి సరైనసమాధానం అతిరహస్యమైనది. మనం తెలుసుకొనటానికి వీలుగానిదై, తెలియని దానిని తెలియజెప్పేది కనుకనే ఆ సమాధానం దీనికి ఉచితమైంది. క్రైస్తవ సిద్ధాంతానుసారం అది భగవదనుగ్రహం, అది ఒక్కటే దీనికంతటికీ మూలం అని చెప్పితీరాలి, కాకపోయినట్లయితే గాంధి చరిత్రలోని ప్రత్యంశమూ వాస్తవమే అయినా దానికి కేవలం చరిత్రాత్మకమైన ప్రాశస్త్యంలేనేలేదు. ఆయనలో ఒక విశిష్టత ఉండాలి. జనసామాన్యపు నాడీమండలంలోనుంచి ఒకనాడీ, నలుదిక్కులా ప్రసరించే ఒక మహాశక్తి ఆయనలో ఉండాలి.

అందువల్లనే అందరూ ఊహించలేని విషయాలు ఆయన ఊహించేవాడు. ఇతరులకు వినిపించని ఒకవాణి ఆయనకు వినిపించేది. సోక్రటీసువలెనే ఆయన తనజీవితంలో చాలా భాగం అనుభవపూర్వకంగా అంతర్వాణిని ఆలకించాడు. ఆయన మానవుడులాగానే జీవించినప్పటికీ, తనలో మహిమలు ఉన్నట్లు ఎప్పుడూ చెప్పుకోనకపోయినప్పటికీ, మానవజాతి మీద ఆయన యావజ్జీవితమూ ప్రసరించిన తత్ప్రభావాన్ని బట్టి, ఆయనలో ఒక మహిమ ఉండేదనీ ఎప్పటికైనా అది ఒక అద్భుత విషయమేననీ నా నమ్మకం.

బొంబాయికిపైన పశ్చిమహిందూదేశంతో అనుబంధం కలిగించే ఒక చిన్న స్వదేశసంస్థానం గాంధిజీ జన్మస్థానం. ఆ సంస్థానం పోరుబందరు. గాంధిగారి తాతగారూ, తండ్రిగారూ ఒకరితర్వాత ఒకరు దానికి ముఖ్యమంత్రులుగా పనిచేశారు. వారిది వైశ్యకుటుంబం. హిందువుల్లో వారు వైష్ణవశాఖకు చెందినవారు. అనేక లక్ష్యాలతో విష్ణువును ఆరాధించే వైష్ణవులు అందరూ ఒకే ఆచారకాండని అనుసరించకపోయినా, వైష్ణవులనే వారిసంఖ్య హిందూదేశంలో చాలా ఎక్కువగానే ఉన్నది. పదహారవ శతాబ్దంనుంచీ పాపమూ, తత్పరిహారమూ అనే వాటినిగురించి విశిష్టసిద్ధాంతాలు ఏర్పరుచుకొన్న ఈ వైష్ణవులలో ఒక దివ్యశక్తి ఉదయించింది. దీనిమీద క్రైస్తవ మతప్రభావం ఏమీలేదు. ఇది ఒక ఆంతరికమైన అభ్యున్నతి. శివారాధనానికి ప్రాముఖ్యంకల హిందూమతంవల్లనే ఈ అంతరభ్యున్నతి గురించి తెలుసుకోగలము.

పోరుబందరులో గాంధిజీ కుటుంబం నివసించినచోట

ఎట్టి పరిస్థితుల్లోనూ జీవహింస అంగీకరించని జైనులు చాలా మంది ఉండేవారు. వారు తఱచూ వీరియింటికి వస్తూ పోతూ ఉండేవారు. ఆప్తమిత్రులుగా వ్యవహరించేవారు. అందుచేత జైన విశ్వాసాలు కొన్ని వీరికికూడా సంక్రమించాయి అని దృఢంగా చెప్పవచ్చును. అయినప్పటికీ గాంధిజీ తన జీవిత మంతా పూర్వాచారపరాయణుడైన హిందువుగానే జీవించాడు. కుల విభేదం మొదలైన కొన్ని సిద్ధాంతాలలో హిందూ పండితులు ఆయనతో ఏకీభవించకపోయినా, హిందూమతం సర్వమత సమన్వయంకల ఒక విశాలమతం కాబట్టి ఆయన హిందువుకాడని యెవరూ ఎన్నడూ గట్టిగా అనలేదు—

ఆయన తల్లిదండ్రులు పరమభక్తులు. వ్రతాలూ మత సంప్రదాయాలూ మొదలైనవి తూ. చా. తప్పకుండా అనుసరించడంలో బాల్యంనుంచీ ఆయన ప్రవర్తన అచంచలంగా ఉండేది. అన్నింటికీ మించిన విషయం ఏమిటీ అంటే ఆయన తల్లి, దాదీ, పవిత్ర హైందవాంగనలు. వారు మతాచారాలను అసిధారావ్రతంగా అనుసరించేవారు. వారి లక్షణాలు గాంధిజీకి అబ్బినాయి. వారిని ఆయన ఎన్నడూ మఱచిపోలేదు. అనేకసంవత్సరాల క్రింద చేసినశపథాన్ని అనుసరించి ఆయన తల్లి సూర్యదర్శనం కానిరోజున భోజనమే చేసేదికాదు. ఆకాశం మబ్బులమయం అయిన రోజుల్లో ఆమెబిడ్డలు సూర్యదర్శనంకోసం వేచిఉండేవారు. సూర్యుడు కనిపించగానే తల్లి దగ్గఱకు పరుగెత్తుకొనివెళ్లి చెప్పేవారు. అప్పుడు కాని ఆమె ఆహారం ముట్టేదికాదు.

మహాత్ముడని బిరుదనామం పొందిన మోహనదాసు

కరంచందుగాంధి 1869 వ సంవత్సరం అక్టోబరు నెల రెండవ తేదీన పోరుబందరులో జన్మించాడు. కరంచందుగాంధికుమారుల్లో ఆయన కడసారివాడు. కరంచందుగాంధికి 'కాబా' అనే పేరుకూడా ఉండేది. ఆయన కథియవారు దేశంలోని పోరుబందరు, రాజకోట, వంకనేరు సంస్థానాల్లో చాలాసార్లు ముఖ్యమంత్రిగా ఉద్యోగించేశాడు. కాబా గాంధిగారి తండ్రీ, ఒకసోదరుడుకూడా అటువంటి పదవులే నిర్వహించారు. అయితే వారి ఉద్యోగాలు ముఖ్యమంత్రి అనే శబ్దానికి తగనివే. ఎందుచేతనూ అంటే ఆ సంస్థానాలు చాలా చిన్నవి. వారి కుటుంబంలో ఒకరు చాలా ధనం గడించారు - కాని గాంధిగారి కథనం ప్రకారం ఆయన తండ్రి అయిన కాబా గాంధిగారు సర్వసమర్థుడు. తన సంస్థానానికి సంబంధించిన అన్ని వ్యవహారాలూ ఆయన అతి సమర్థతతో పరిష్కరించేవాడు. ఆయన నిత్యమూ దేవాలయానికి వెళ్లే పరమ భక్తుడు. జీవితాంతమువరకూ భగవద్గీత పారాయణం చేశాడు. బాలగాంధి మనస్సుమీద తండ్రిగారి యీ పరమ భక్తి ప్రభావం ప్రసరించింది.

అయితే బాల్యంలో గాంధిగారిలో ప్రత్యేకంగా గమనించదగ్గ విశేషాలు ఏమీలేవు - ఆయన తన్నుగురించి చెప్పుకొన్న దానినిబట్టి విద్యాభ్యాసకాలంలో ఆయన విశిష్టత ఏమీ వెల్లడి కాలేదు. చిన్నతనంలో ఆయన నలుగురితో కలసిమెలసి ఉండడానికి సిగ్గుపడేవాడు; భయపడేవాడు. ఎవరితో మాట్లాడవలసివస్తుందో అనే భయంతో ఇంటినుంచి - బడికి పరుగెత్తుకొనే వెళ్లేవాడు - బడినుంచి ఇంటికిన్నీ అల్లాగే పారిపోయేవాడు. ఆయన బాల్యజీవితంలోని ఒక చిన్నఘట్టం

ఆయనలో ఒకమార్పు తెచ్చినట్లు కనబడుతుంది. మహాభారతేతిహాసంలోని హరిశ్చంద్రచరిత్రను ఒక నాటకసమాజం వారు ఊరూరా ప్రదర్శిస్తూ అక్కడకూడా ప్రదర్శించారు. అది సత్యంకోసం తన సర్వస్వం త్యాగంచేసి, కష్టాలనుంచి విముక్తి పొందేవఱకూ ఎన్నో బాధలుపడ్డ ఒక మహారాజు కథ. గాంధిగారు తన అస్తమయానికి కొద్దిరోజుల ముందు ఆ కథను నాకు చక్కగా చెప్పారు. ఒకసారి మనస్సులో హత్తుకొన్న విషయం ఆయనకు ఎన్నడూ మఱపువచ్చేదికాదు. చిన్నతనంలో ఆయన తనకు తాను హరిశ్చంద్రపాత్ర అభినయించుకొనేవాడు. ఆయన అన్నట్టుగా "అలా ప్రదర్శించడం ఎన్నిసార్లో." సర్వోత్కృష్టమైన సౌజన్యంలాగానే, ఈ సత్యదీక్షకూడా ఆయనలో చాలా చిన్నతనంలోనే నెలకొని, ఒకవృక్షంగా పెరిగింది, ఒక పువ్వుగా పరిమళించింది. కాలక్రమాన అది ఆయన ఆలోచనలన్నింటికీ కేంద్రమూ, శాసకమూ అయింది.

కుటుంబపు పరిస్థితులనుబట్టి ఆయనకు పదమూడవయేట వివాహం జరిగింది. భార్యయైన కస్తూరిబాయిపట్ల ఆయనకు వ్యామోహం అపరిమితంగా ఉండేది. తరువాత తరువాత తన వ్యామోహానికి ఆయన చాల విచారపడ్డాడు; సిగ్గుపడ్డాడు. హిందూదేశానికి కలిగిన అనర్థకాల్లో బాల్యవివాహంకూడా ఒకటి అనే దృఢాభిప్రాయం ఈ అనుభవాన్నిబట్టే ఆయనలో బాగా నాటుకొని ఉంటుంది. ఆ కాలంలో బాల్యవివాహం న్యాయసమ్మతం మాత్రమేకాదు, హిందూమతంయొక్క ఆత్మరక్షణకు అది అమూల్యసాధనంగా పరిగణింపబడేది. పూర్వపరిచయంలేని బాలబాలికలకు వివాహసుముహూర్తం నిర్ణయం

చెయ్యడం, వివాహం చెయ్యడం ఇట్టే జరిగిపోయేవి. ఇందువల్ల సాధారణంగా వివాహం సుఖప్రదమే ఔతుందని వాదించేవారు ఇప్పటికీ ఉన్నారు. గాంధిజీ విషయంలో ఇల్లాగే పరిణమించిందికూడాను. బాల్యవివాహం చేసుకున్నానుగదా అని వయస్సు వచ్చినతర్వాత ఆయన చాలా బాధపడినప్పటికీ అటుపిమ్మట కస్తూరీబాయి జీవించినంతకాలమూ ఆయన ఆమెనుచూడగానే సమస్తకష్టాలనూ మరిచిపోయేవాడు.

గాంధిగారి కథనానుసారం ఆయనబాల్యంలో కాముకుడు, మమకారబద్ధుడు, అకారణమైన అసూయకు చిక్కినవాడూనూ. ఆ కాలపు ఆచారాన్ని అనుసరించి సంవత్సరంలో సగంభాగం కస్తూరీబాయి భర్తయింటనూ తక్కినఅర్ధసంవత్సరం పుట్టింటనూ ఉండేది. తనయింట్లో ఆమె ఉన్నకాలంలో గాంధిగారు ప్రతిరాత్రీ దాంపత్యసౌఖ్యం అనుభవించేవాడు. ఆమె నిరక్షరాస్యురాలు కాబట్టి తనకు తెలిసినదంతా ఆమెకు బోధించాలని బాలగాంధి అనుకొనేవాడు. కాని ఆయన పేర్కొన్న "కామపూర్వకమైన ప్రేమ" అనేది ఆయనకు అటువంటి అవకాశాన్నే ఇయ్యలేదు. స్థానికభాష అయిన గుజరాతిభాషలో అక్షరాలు మినహా ఆమె నేర్చుకున్న దేమీ లేదు. ఆయన ఈ విషయమై పొందిన పశ్చాత్తాపమూ, చేసుకొన్న ఆత్మవిమర్శా, ఆయన జీవితచరిత్రలో మనకు చక్కగా గోచరిస్తాయి.

పెండ్లి అయినప్పటికీ ఆయన ఉన్నతపాఠశాలలో చదువుకొంటూ ఉండేవాడు—"మన ప్రస్తుత హిందూసంఘంలో మాత్రమే విద్యావివాహాలు జెట్టాపట్టాలు వేసుకునడుస్తు

న్నాయి" అని ఆయన అన్నాడు. బడిచదువులో ఆయన యథాపూర్వకంగానే బహుప్రయాస పడేవాడు. అయితే పదు నాలగవయేడు దాటింది లగాయతూ ఆయన చదువులో రాణించినట్టు కనబడుతుంది. ఒకటో రెండో బహుమతులు కూడా సంపాదించాడు. ఈ కాలంలో ఆయన రహస్యంగా మద్యమాంసాలకు అలవాటుపడ్డ ఒక కుఱ్ఱవాడితో కలిసి, అతన్ని అనుసరించిన ఒక విషాదఘట్టం ఆయన జీవితచరిత్రలో చిత్రించబడ్డది.

ఆ కుఱ్ఱవాడు బాలగాంధికంటె పెద్దవాడు. ఆయన సోదరుడికి మిత్రుడు. 'హిందువులు మాంసాహారులైతే హిందూ దేశపు కష్టాలు తీరిపోతా'యని అనేవాడు. ఈ సందర్భంలో అతను ఈక్రింద పేర్కొన్న ఒక పద్యం ఉదాహరించేవాడు.

అతిబలాఢ్యుడైన యాంగ్లేయునరయు మా
అల్పహైందవునికి నతడు ప్రభువు
కతమదేమి యన్న నతడు మాంసాహారి
పొడవుమీఱ నైదుమూర లెదుగు.

అతను బాలగాంధి కన్న వయస్సుచేతనూ శరీరబలము చేతనూ అధికుడు కాబట్టి పరుగెత్తడంలో దూకడంలో తన బలాధిక్యాన్నీ, కండరాల బిగువునూ ప్రదర్శించి, బాలగాంధిని తనదారి పట్టించగలిగాడు. తాను బలవత్తరుడు కావాలనీ, భారతీయులు బలవత్తరులు కావాలనీ, మాంసాహారం ఒక సంస్కారంగా ప్రచారంచెయ్యాలనీ రకరకాల ఆశయాలతో బాలగాంధి మాంసం తినాలని నిశ్చయించుకొన్నాడు. మొట్ట మొదటి తరుణాన ఆ యిద్దఱుబాలురూ నదీతీరాన ఒక ఏకాంత

ప్రదేశాన్ని మాంసాహారం ఆరగించడానికి తగుస్థలంగా నిర్ణయించుకొని, మేకమాంసం కొంత అక్కడికి తెచ్చుకొన్నారు; తిన్నారు. దానివల్ల గాంధిగారికి అస్వస్థత కలిగింది. ఆరాత్రి ఆయనకు పీడకలలు వచ్చాయి. కడుపులో మేక గిలగిల కొట్టుకొంటున్నట్లు తోచింది. తరువాత ఒక సంవత్సరంవరకూ ఆ స్నేహితుడు మాంసంతో తయారై సులభంగా జీర్ణమయే, కొన్ని భక్ష్యాలు ఇస్తూఉండడమూ, బాలగాంధి వాటిని ఎట్లా తినాలో నేర్చుకొనడమూ జరిగాయి. అయితే తమకు డబ్బు చాలినంత లేనందువల్ల అటువంటి విందులు చాలా స్వల్పంగానే జరిగాయని గాంధిగారు తమ జీవితచరిత్రలో ఉటంకించారు. తరువాత ఆయన మాంసం తినడం పూర్తిగా మాని వేశారు. అయితే ఆ మానివెయ్యడం అది తప్పు అనే అభిప్రాయంతో కాదు. పవిత్రులైన తల్లిదండ్రులతో ఆయన అబద్ధాలాడవలసి వచ్చినందువల్ల మాత్రమే.

ఆ పూర్వమిత్రుడే బాలగాంధిని ఒకసారి వ్యభిచార గృహానికి తీసికొనివెళ్ళాడు. అయితే అక్కడ బాలగాంధి సహజ లజ్జాప్రవృత్తి వజ్రకవచమై ఆయనను కాపాడింది. "దేవుడు అవ్యాజకరుణతో అవినీతిపాలు గాకుండా నన్ను రక్షించాడు." అని ఆయన ఈ సందర్భం వివరిస్తూ అన్నాడు- అటుతర్వాత ఎన్నడుకూడా గాంధిగారు తన పత్ని అయిన కస్తూరీబాయికి ద్రోహం తలపెట్టనేలేదు.

ఈ మిత్రుల రహస్యప్రవర్తన సిగరెట్లు కాల్చడానికి చేసిన ప్రయత్నంతో ప్రశుతిమించింది. సిగరెట్లకోసం గాంధిజీ యింటిలోనుంచి కొన్ని డబ్బులు ఎత్తుకుపోవడమే కాకుండా,

తన సోదరుడి చేతితాయెత్తులోని బంగారపు బిళ్ళనుకూడా అపహరించడం జరిగింది. ఈసారి గాంధిజీ అంతరాత్మ ఎల్లా గ్రైతేనేమి తిరుగుబాటు చేసింది. ఆయన తన నేరాన్ని అంగీక రిస్తూ తన దుష్ప్రవర్తనకు తగుశిక్ష విధించవలసిందని ప్రార్థిస్తూ, తండ్రికి ఒక చిన్నచీటి వ్రాసి దాన్ని ఆయనకు స్వయంగా అందించాడు. ఇక ఎన్నడూ ఎల్లాంటి దొంగతనమున్నూ చెయ్యననే శపథం కూడా ఆ చిన్నలేఖలో పొందుపఱుచ బడ్డది. ఆనాఁడు తండ్రివద్ద బాధా, కార్చిన కన్నీరూ, గాంధిజీ జీవితాంతం దాకా స్మరిస్తూనే ఉన్నాడు.

అటువంటి చిన్నతనపు చేష్టలు పాశ్చాత్యదృక్పథంలో ఎన్నదగినవిగానే కనిపించవు. పవిత్ర వైష్ణవ కుటుంబంలో అవి మహాపరాధాలు. వైష్ణవుల్లో ఇతరులు మాంసాహారులు ఉన్న ప్పటికీ గాంధి కుటుంబంమీద ప్రసరించిన జైనమత ప్రభావం వల్ల గాంధిజీ యింట్లో మాంసాహారం తగనే తగదనే స్థిరమైన అభిప్రాయం నాటుకుపోయింది. సిగరెట్లు కాల్చడం అంతపెద్ద తప్పు కాకపోయినా వాటికోసం డబ్బు ఎత్తుకుపోవడం మాత్రం మహాపరాధమే.

"నా ద్విగుణ పరాభవం" అని ఆయన పేర్కొన్న చిట్టచివటి పాపం కాబా గాంధి మరణించినప్పుడు సంభవిం చింది. తండ్రి జబ్బులో బాలగాంధి ఆయనకు పాదసేవ చెయ్య డం, ఇంకేమైనా ఉపచారాలు అవసరమైతే చెయ్యడం జరు గుతూ వచ్చింది. కస్తూరీబాయి ఇంట్లోనే ఉన్నందువల్ల ఆ సమయంలోనే గాంధిజీకి కామవాంఛ కలిగింది. ఒకరాత్రి వ్యాధిగ్రస్తుడైన తండ్రిని విడిచిపెట్టి, ఆయన తన పడకగదిలోకి

వెళ్ళి, కస్తూరీబాయిని మేల్కొల్పాడు. ఆమె అప్పుడు గర్భవతికూడానూ. నాటి కామపారవశ్యానికి ఆయన పశ్చాత్తప్తుడు కావడానికి ఇదికూడా ఒక కారణం. ఆయన కస్తూరీబాయి దగ్గఱ ఉండగానే తండ్రి మరణించినట్లు చెప్పడానికి వచ్చిన నౌకరు తలుపుతట్టాడు.

కస్తూరిబాయికి కలిగినబిడ్డ మూడునాలుగురోజులకంటె ఎక్కువకాలం జీవించలేదు. అందువల్ల గాంధిజీకి కలిగిన గాఢ విచారం ఆ తరువాత ఎన్నో యేండ్లు గడచిన పిమ్మట ఆ సంఘటనను గుఱించి వ్రాసేటప్పుడు కూడా ఆయనగుండెని కదలిస్తూనే ఉంది.

1880వ సంవత్సరంవఱకూ హిందూ విద్యార్థుల్లో ఎవరో కాని సముద్రయానం చేసేవారు కాదు. అటువంటి ప్రయాణాలు చేసేటప్పుడు అన్యదేశీయులతో కలిసి ఉండవలసివస్తుందనీ, అన్యదేశపు ఆహారం తినవలసివస్తుందనీ, మతాచారాలు సరిగాసాగవనీ, కులభ్రష్టత కలుగుతుందనీ ఒక వాదం ఉండేది. ఈ నాడు ఇదంతా చాదస్తం అనవచ్చును. నవీనహైందవుడికి ఇది మధ్యయుగపు నమ్మకంగా తోచవచ్చును. కాని గాంధిజీచిన్నతనంలో ఇక్కడివారి అభిప్రాయం అలాగే ఉండేది. ఇంగ్లాండుకు వెళ్ళివచ్చిన హిందువులు మతభ్రష్టులైనట్లే హైందవ ప్రజల భావన. విదేశాలకు వెళ్ళినహైందవులు "విదేశీయులంత చెడ్డవాళ్లే." ఎందుచేతనూ అంటే వారు విదేశీయ వేషమే వేసుకున్నారు. ఆ విదేశీయ వేషం శరీరంఅంతా ఆచ్ఛాదించదు కాబట్టి అది చూడ సొంపు కాదు. విదేశీయ భోజనం చేసినవాళ్లు కావడంచేతనూ

వారు చెడ్డవాళ్ళే. ఆ నాటి దృక్పథం ఇప్పుడు మారిపోయింది. మరాయి ధరించడం అసహ్యాం అనుకొనే కాలం ఈ నాడు హిందూదేశంలో ఎవరికీ జ్ఞాపకానికి రాకపోవచ్చును. ఈ నాడు చుట్టలుకాని సిగరెట్లు కాని కాల్చడం తప్పు పని అనేవారు అంతగా లేరు. చాలామంది హైందవులు శాకాహారులైనా, మాంసాహారం ఈ నాడు నిషిద్ధమని భావించేవారు తక్కువ. కాని 1880 వ సంవత్సరం ప్రాంతంలో విదేశాలకు వెళ్ళి వచ్చిన బారిస్టర్లనీ, డాక్టర్లనీ, పత్రికలనీ మతభ్రష్టులుగా ఎంచడమూ వెలివేయడమూ సర్వసామాన్యమే.

వెలివెయ్యడం అనే పద్ధతి హిందూదేశంలో ఇప్పటికీ ఉన్నది. గాంధిజీ చిన్నతనంలో ఇది ఒక పిశాచంలాగా అతి భయంకర స్వరూపంతో ఉండేది. సవర్ణ హిందూశరీరంమీద ఏ భాగాన్నైనా అస్పృశ్యుల నీడ పడ్డంతమాత్రాన ఆ సవర్ణ హిందువు పరిశుద్ధతకోసం కొంత కర్మకాండ చెయ్యవలసి వచ్చేది. పూర్వాచారపరాయణులైన వృద్ధులు ఈ నియమాల్ని ఇప్పటికీ పాలిస్తూనేఉన్నారు. సవర్ణహిందువు అస్పృశ్యుడి వద్దనుంచి పాలు పుచ్చుకోవచ్చునుగాని, నీళ్లు పుచ్చుకో గూడదు. అంత్యజాతుల్లోకూడా ఈ విభేదం అనేది ఉన్నది. అస్పృశ్యుల్లోనే ఒక తెగవారు చేసేపని మఱి ఒక తెగవారు చెయ్యగూడదు. వృత్తుల్ని బట్టి యేర్పడిన అనేకకులాలు కొంత వఱకు పేదఱికాన్ని బట్టి, సంఖ్యాబాహుళ్యాన్ని బట్టి యేర్పడి ఉండవచ్చును. ఆ వేర్పాట్లనేవి బహువిధాలుగా వృద్ధిపొంది ఒక్కొక్క కులంలోనే అనేక శాఖలు ఏర్పడ్డాయి. అయితే ఈ విభిన్నకులాలు ప్రస్తుతం క్రమక్రమంగా తగ్గిపోతున్నాయి.

గాంధీజీ వీటికి వేటికీ భయపడలేదు. కాబాగాంధికి చిరకాలమిత్రుడై, గాంధి కుటుంబానికి సన్నిహితుడైన నవజీవ దేవు అనే బ్రాహ్మణుడు ఇంగ్లాండుకు వెళ్ళి చదువుకోవలసిందని ఉపదేశించగానే గాంధీజీ అందుకు సిద్ధపడ్డాడు. డాక్టరు కావాలని ఆయన ప్రప్రథమోద్దేశం. అయితే ఆ బ్రాహ్మణ మిత్రుడు అందుకు అంగీకరించలేదు. వైద్యవృత్తి ప్రాచీనమత సంప్రదాయానికి గిట్టనిది. పాశ్చాత్యవైద్యంలో శరీరభాగాలు యావత్తూ పరిశోధించాలి; ఛేదించాలి. అంతకంటెనూ ముఖ్యమైనఅభ్యంతరం ఏమిటంటే వైద్యవృత్తి అభ్యసించినడాక్టరు ఒక రాజ్యానికి ఎన్నటికీ ముఖ్యమంత్రి కాలేడు. కుమారగాంధి తన తాత తండ్రులవలె ఒక సంస్థానానికి ముఖ్యమంత్రికావాలని ఆ బ్రాహ్మణవృద్ధుడి అభిలాషం. అటువంటి ఉద్యోగంకావాలంటే న్యాయశాస్త్రంలో పట్టభద్రత అవసరం. గాంధికుటుంబంలోని పూర్వులు చదువుకోనివారే. కాని, సంఘమర్యాదలూ, వ్యక్తిత్వ విశిష్టతలూ తెలిసినవారు కాబట్టి మంత్రిపదవులునిర్వహించారు. బారిష్టరు కావటమనే నూతనాయుధంతో కుమారగాంధి తనపూర్వులలాగా మంత్రిత్వం సాధించవచ్చును. అప్పటికి గాంధిజీ వయస్సు పద్దెనిమిది సంవత్సరాలు మాత్రమే. ఇంకా చదువుతున్నాడు కూడాను. ఆయన సోదరులు అప్పటికి చదువులు చాలించారు. అందువల్ల ఈ చిన్నవాడు ఇంగ్లాండుకు వెళ్ళి న్యాయశాస్త్రం అభ్యసించాలని ఆ బ్రాహ్మణమిత్రుడు ఉద్దేశించాడు.

కాబట్టి గాంధిజీ అందుకు పూనుకున్నాడు. అయితే అది తేలికపని కాదు. ఆయన ప్రయాణానికి విఘ్నాలు అసం

ఖ్యంగా ఏర్పడ్డాయి. మతస్థులూ, కులస్థులూ, పినతండ్రీ తల్లీ కూడా ఈ పని తగదన్నారు. దైవభక్తిపరాయణ, నిరాడంబర అయిన తల్లి సముద్రాన్ని గురించికానీ, దూర దేశాన్ని గురించి కాని జంకుపెట్టుకోలేదు. కాని విదేశాల్లోని స్త్రీలూ, మద్యమూ, మాంసాహారమూ, మొదలయిన వానినిగురించి వినడం వల్ల, ఆమె చాల భయపడ్డది. "ఈ దుర్వ్యసనాలకి ఎంత మాత్రమూ నేను లొంగను." అని కుమారుడు దృఢప్రతిజ్ఞ చేసిన తర్వాత అతివిచారంతోనైనా ఆమె అతని ప్రయాణానికి వెంటనే అనుమతించింది. ఒకప్పుడు తనకులానికే చెందిన ఒక జైనయోగిదగ్గఱ గాంధిజీ తల్లికోరినవిధంగా శపథంచేశాడు. ఆయనతల్లి ఇక అభ్యంతరం చెప్పలేదు. ఆ శపథాన్ని అయన ఎన్నడూ ఉల్లంఘించనూ లేదు.

కాని బొంబాయికి రాగానే యీ కులాచారపద్ధతుల వల్ల ఆయన ఇంకా ఇబ్బందులకు లోనుగావలసి వచ్చింది. కొంత చర్చ జరిగినతర్వాత ఆయన కులభ్రష్టుడైనాడని తీర్మానం చేశారు. వైశ్యకులంతో అంతర్గతమైన బనియాశాఖకు సంబంధించిన "మోఢ్‌బనియా" విభాగంలో ఆయన జన్మించాడు. ఆ విభాగంలో అంతవఱకు సముద్రయానం చేసినవారెవ్వరూ లేరు. కాబట్టి ఆయనను వెలివేయవలసిందే అని కులస్థుల తీర్మానం ఆ తీర్మానాన్ని ఎంతమాత్రమూ మనోవ్యథలేకుండా ఆయన అంగీకరించాడు. అలాగే ఆయన అన్నగారు కూడా అంగీకరించాడు. గాంధిజీ మహానుభావుడైనందున కులపు కట్టుబాట్లకూ, ఆచారాలకూ అతీతుడని హిందువులు అంగీకరించినా, కులరహితుడుగానే జీవితశేషంఅంతా గడిపాడు.

తిరిగి యెన్నడూకూడా యజ్ఞోపవీతధారణం, క్షురకర్మ విధినిషేధాలూ మొదలయిన వర్ణనియమాలను పాటించలేదు. ఆయన మనస్సులో తనకు కులంలేదన్న భావమే ఉన్నది. అలా ఉండిపోవటానికే ఆయన నిశ్చయించుకొన్నాడు.

క్రీ. శ. 1888 వ సం॥రం సెప్టెంబరు 4వ తేదీన ఆయన బొంబాయిరేవులో స్టీమరు ఎక్కాడు. అప్పటికి ఆయనకు సరిగా 18 ఏండ్లు. నలుగురితో మాట్లాడటానికి సిగ్గు. కాని ప్రతివిషయమూ తెలుసుకోవాలనేఆసక్తి పెంపొందే బాల్యం. సిగ్గుతోడు తలకు ఇటుప్రక్కలా సమకోణాలుగా పైకివచ్చిన దొప్పచెవులుకూడా నలుగురికీ పరిహాసకారణాలుగా ఉండేవి. అన్నగారూ స్నేహితులూ కొనితెచ్చిన యూరపియన్‌దుస్తులను అప్పుడే ధరించాడు కూడాను. లండనులో తనకు ఆనంద దాయకంగా పరిణమించిన మెడపట్టీ (నెక్ టై) మొదట్లో నిజంగా కంఠం పట్టుకొన్నట్లున్నది. చిన్న కోటూ, ట్రౌజరూ (పొడుగులాగూ) ఎలాగో ఉన్నాయి. ఆ బూట్లుకూడా హాయి అనిపించలేదు. అయితే సుదీర్ఘప్రయాణానికి సన్నద్ధుడయ్యే ఉన్నాడు. ఎన్నో నూతన విషయాలు నేర్చుకోవాలనీ, విజయ సాధనాలు చేపట్టాలనీ ఉవ్విళ్లూరు తున్నాడు.

ఆ రోజులలో భారతదేశంలో మొదటి నాలుగు తరగతులూ గడవగానే యిప్పటివలెనే అన్నివిషయాలూ ఆంగ్లభాషలోనే బోధించేవారు. అందువల్ల ఇంగ్లండు చేరటానికిముందే గాంధిగారికి ఇంగ్లీషుభాషతో మంచి పరిచయం ఏర్పడ్డది. అయితే అది పాఠశాలాభాష మాత్రమే. అది మాతృభాషకానీ, నిత్యవ్యవహారంలో మాట్లాడవలసిన భాష

గానీ కాలేదు. అందువల్ల ధారాళంగానూ, సహజంగానూ, ఇంగ్లీషులో ఆయన ప్రసంగించలేక పోయేవాడు. ఎవరు ఏమి చెప్పినా ముఖ్యంగా స్టీమరులో ఆహారపదార్థాలు అందించే వారు పలుకరించినా ఆయనకు బాగా తెలిసేది కాదు. మద్యం ముట్టననీ, స్త్రీలను తాకననీ, మాంసం భుజించననీ చేసిన శపథాలను ఎదుటివారికి తెలియజెప్పటానికికూడా భయపడి, తన గదిలో ఒంటరిగా కూర్చుని, తాను ఇంటిదగ్గరనుంచి తెచ్చుకొన్న పదార్థాలతోనే ముఖ్యంగా ఆకలి చల్లార్చుకొనేవాడు. కత్తిగానీ, ఫోర్కు (ముండ్ల చెంచా) గానీ ఎలాపట్టుకోవాలో తెలిసేదికాదు. తోడిప్రయాణికులతో ఏమైనా మాట్లాడటానికి బిడియం అడ్డుపడేది. ఇంతేగాక సౌతాంప్టన్‌లో దిగినప్పుడు తొడిగికొందామని తనదుస్తుల్లో శ్రేష్ఠంగా కనబడ్డ తెల్లని ఉన్నిదుస్తుల్ని దాచుకొని, ప్రయాణకాలం అంతా మాసిన నల్లని దుస్తులతోనే గడిపాడు. దీనిఫలితంగా ఇంగ్లండు చేరేసరికి తటస్థించిన శిశిరఋతువుకు అననుకూలమైన దుస్తులే ధరించవలసివచ్చింది. పరిమితమైన తనసామాను అందేవఱకూ రెండురోజులపాటు ఆ దుస్తులతోనే గడపవలసివచ్చినందుకు చాలా బాధపడ్డాడు. రాత్రిపూట చాలాసేపటివఱకూ తన ఒంటరితనాన్నీ, అపరిచిత వాతావరణాన్నీ తలచుకొని వెక్కివెక్కి విలపించాడు. ఏ సమయంలో ఎలా ప్రవర్తించాలో తెలియదుగదా అనిభయపడ్డాడు. తన శపథాన్ని నిలుపుకోటం ఎలాగా అని మథనపడ్డాడు. ఇంకేమైనా హైందవవిరుద్ధమైన అపవిత్రకార్యాలు చెయ్యవలసి వస్తుందేమో అని అధైర్యపడ్డాడు.

ఆయనకు ఇంగ్లాండులో అడుగుమోపగానే ఎదురైనది భోజన సమస్య. ఏ హైందవ విద్యార్థికైనా ఇప్పుడది ఒక సమస్య కానేకాదు. ఆరోజులలోకూడా చాలామంది హిందువులకు దీనినిగూర్చి ఆలోచించవలసిన పనిలేకనేపోయింది. వారు అక్కడ ఏది లభిస్తే అదే భుజించారు; ఆ తిండికి అలవాటు పడ్డారు. కాని, మహాత్ముడు శాకాహారంతప్ప తదన్యం స్వీకరించనని ప్రతిజ్ఞ చేసిఉన్నాడుగదా! దానిని పాలించాలి; లేదా; మరణించాలి; అని ఆయన నిశ్చయించుకొన్నాడు. నానబెట్టినవిగానీ, ఉడికించినవిగానీ అయినా రుచీపచీలేని ఇంగ్లీషు శాకాహారం ఆయనకు రుచించలేదు. కూరగాయలు వండటమంటే అలాగేననీ, శాకాహారం స్వరూపస్వభావాలే అంతఅనీ ఇంగ్లీషు ప్రజల భావన. ప్రారంభంలో కొన్నివారాలనఅకూ లంకణాలు చేసినట్లు మహాత్ముడు చెప్పనేచెప్పాడు. ఉదయానవచ్చే 'ఓట్లు' జావ అంత అసహ్యంగా లేదుగానీ, తర్వాతసమయాల్లో భోజనానికి వెళ్లితే, ఏమిచెయ్యాలోకూడా ఆయనకు తోచేదికాదు. ఆయన బసచేసిన వసతిగృహంలోని హైందవవిద్యార్థులే ఒక పూటకూటియిల్లు చూపించారు. వారికి ఈ నిషేధాలు ఏవీ లేవు. మాంసంతినటం వారికి ఎబ్బెట్టు అనిపించలేదు. పైగా శాకాహారమే ఆరగిస్తానని చేసినప్రతిజ్ఞనే పట్టుకొని ప్రాకులాడటం గాంధిగారి అవివేకంఅనీ, మొండితనమనీకూడా వారు భావించారు. దీనితో ఆయన ఒక భోజనవసతి గృహంనుంచి మఱొకటీ, మఱొకటీ సందర్శించటానికి పూనుకొని, నిరాశా నైరాశ్యాలతో చాల శ్రమపడ్డాడు. ఎక్కడా కడుపునిండా తినలేకపోయాడు. చివరకు ఫారింగ్డన్ వీథిలోని శాకాహార భోజన

శాలకు చేరుకొన్నాడు. "ఇప్పటికి భగవంతుడు నాకు సాయపడ్డాడు." అనుకొన్నాడు. అక్కడభోజనంతో సంతృప్తిపడ్డాడు. "శాకాహార పాకశాస్త్రం" అనే గ్రంథం ఒకషిల్లింగుకు కొని, తీసికొనివెళ్లాడు. అది ఆమూలాగ్రంగా అనేకపర్యాయాలు పఠించాడు. ఆనువంశికమైన శాకాహారిత్వాన్నీ, మాతృదేవికి ఇచ్చినమాటనూ, నిలుపుకొనటానికి ఒక ఆధారం లభించింది; తన అభిప్రాయాలకు కొంతబలం చేకూరిందని ఆనందించాడు. తదనంతరకాలంలోనూ ఆయన సుదీర్ఘజీవితంలో అభ్యస్తమైనట్లుగానే తన ఆచరణకూ, విశ్వాసానికీ ప్రోద్బలంకల్గించే ఒక విషయాన్ని అప్పుడు కనిపెట్టగలిగాడు. కాబట్టి, ఆయనకు ఒక "ప్రమాణం" లభించింది. ఇందువల్ల తాను శాకాహారిగానే ఉండటానికి ఉపపత్తి చూపించటానికి వీలుపడ్డది.

గాంధిమహాత్ముడు యావజ్జీవితం తన అభిప్రాయాలలో విషయగౌరవం ఉన్నవైనా, లేనివైనా అన్నిటికీకూడా, ఏదో ఒకప్రమాణం కనబడేవఱకూ నిద్రపోయేవాడు కాడంటే ఆశ్చర్యంగానూ ఉంటుంది; కొంతవఱకు నవ్వులాటగానూ కన్పిస్తుంది. ఒకసారి ఆయన తన్ను చూడవచ్చిన వ్యక్తితో "నేను చెప్పవలసినప్రతివిషయమున్నూ పర్వతాలవలె అతిప్రాచీనం." అన్నాడు. పరిస్థితులూ, వాతావరణమూ బలవత్తరాలైతే తప్ప, తక్కిన అన్ని సందర్భాలలోనూ ఇది యథార్థమే. ఆయన అభిప్రాయాలు కొన్ని ప్రాచీనసిద్ధాంతాను సారాలే అయినా ఆయన కానీ, ఇతరులు కానీ వాటిప్రాచీనతను గమనించి విశ్వసించటానికి ఎంతోకాలం పట్టేది. ఇటువంటి పరిశోధనలు ఎన్నోసార్లు తటస్థించకపోయినా, అవి ఆయన జీవితంలో

గొప్పగొప్ప మార్పులకు కారణాలైనాయి. ఆయన శాకా హారిత్వము సహజమూ, వంశపరంపరాగతమూ, సర్వప్రాణి సమాదరణీయమూ అయింది. శాకాహార ప్రయోజనాలనూ, నిర్దుష్టతనూ గురించి 'పురోగాములు' అనేపేర ప్రఖ్యాతులై, నవీనమార్గానుయాయులైన కొందరు ఆంగ్లేయులు ప్రకటించిన గ్రంథాలూ, కరపత్రాలూ ఆయనకు ఎంతో ఆత్మవిశ్వాసాన్ని చేకూర్చాయి. ఈ సందర్భంలో మహాత్ముని చరిత్ర ఆదినుంచీ అవిచలిత దృక్పథమై అమోఘ సత్సంప్రదాయాలకు ఆలవాల మైందని చెప్పక తప్పదు. ఆయన చరిత్ర అటువంటిదే అయినా, ప్రతివిషయంలోనూ తాను అనుసరించేమార్గం సవ్యమైనదే అని తనకుతాను సంతృప్తిపడటానికి అనుభవశాలురైన సజ్జనుల అభిప్రాయాలను తెలిసికొంటూ ఉండేవాడు. ఈ అపార మైన వినయసంపద ఆ మహాపురుషునిలో ఆగర్భజనితమై ప్రచ్ఛన్నంగానే అభివృద్ధి అవుతూవచ్చింది; లేకపోతే మొదటినుంచీ కూడా తరుణం వచ్చినప్పుడల్లా అది అతిసహజంగా ప్రకాశించటం తటస్థించేది కాదు. ఆయన ఏ విషయమై ఆలోచించినా, ఏ క్రొత్తవిశేషం కనిపెట్టినా, అది చిరకాలంగా ఆయనకు అభిమతమూ, ఆచరణలో ఉన్నదీ మాత్రమే. పైగా, టాల్‌స్టాయ్,రస్కిన్,థోరూలుఆయన అభిప్రాయాలను సాధికారంగా సమర్థిస్తున్నట్లున్నూ స్పష్టపడేది. భారతీయాధ్యాత్మిక తత్త్వకోశమైన భగవద్గీతగానీ, క్రైస్తవుల నూతన నిబంధనగానీ ఆయన నడవడినే సమర్థించేవి.

లండనులో ఉన్నసమయంలో శాకాహారనియమం పరిపాలించుకోటానికి క్రిందూ మీదూ అవుతూ ఉండటంతో

ఆయనకు బాగా కాలక్షేపమైంది. ఆయన హైందవస్నేహితు లకు అది కేవలం అనుచితంగా తోచింది. అంతేకాక, ఆ పని దేశ కాల పాత్ర విచక్షణలేకుండా అవివేకంగా, ఆరోగ్యం చెడ గొట్టుకోవడమే — అనిపించింది కూడాను. సహజంగా మృదు చిత్తుడై ఉండటంవల్ల, సాధ్యమైనంతవఱకు తన వేషభాషలు సహచరులకు జుగుప్స కలిగించకుండా ఉండటానికీ, తన ప్రధాన లక్ష్యాలకు భంగంలేనంతవఱకూ, తన ఆర్థికశక్తికి మించిపోనంత వఱకూ ఆంగ్లేయ సంప్రదాయాలను ఆదరించటానికీ ప్రయ త్నించాడు. సాయంకాలోచిత వస్త్రాలు కొన్నాడు; నాట్య పాఠాలకు హాజరైనాడు. ఫిడేలు వాయించటం నేర్చుకోటానికి ప్రయత్నం చేశాడు. ఆయన అన్నట్లుగా "ఇంగ్లీషు పెద్ద మనిషి"లాగా వ్యవహరించడానికి శక్తివంచన లేకుండా కృషి చేశాడు. మాతృదేవతవద్ద చేసిన ప్రతిజ్ఞకు కట్టుబడి ఉన్న కారణాన పాశ్చాత్యసంఘంలో విశృంఖలంగా మెలగలేనిలోపాన్ని మహాత్ముడు ఈ విధంగా సవరించుకోటానికి మొదటి కొన్ని నెలలు పాటుపడ్డట్లు కనబడుతున్నది. చిట్టచివఱకు ఇవి అన్నీ కట్టిపెట్టి, తన ప్రధానలక్ష్యమైన బారిస్టరు పరీక్షలో విజయం సాధించవలెనని కృతనిశ్చయుడయాడు. దానితో ఈ వేషాలకు అవకాశం కనబడలేదు.

ఈ దశలోని గాంధిగారి ఛాయాచిత్రాలు (ఆయనే ప్రకటించుకొన్నవి) విజంగానే చిత్రంగా కనబడతాయి. శిర స్సుకు ఇఱువైపులా సమకోణాలుగా సాగినచెవులూ, గ్రుచ్చి వేసేట్టుండే నిశితవీక్షణాలూ, బలహీనత గోచరించేముఖమూ, బిరుసైన గళవస్త్రమూ (కాలరు) తైలసిక్తమైన జుట్టూకల

నూనూగుమీసాల హైందవబాలుడు ఆ చిత్రాలలో ప్రత్యక్ష మౌతాడు. తన ఆకారం ఎంత హాస్యాస్పదంగా ఉన్నదీ ఆయ నకు తెలియకపోలేదు. తనరూపం తలచుకొన్నప్పుడల్లా ఆయ నకే పట్టరానినవ్వు వచ్చేది. అలా నవ్వని సమయం కానీ, దానిని నిరోధించుకొన్న సమయంకానీ, ఆయన జీవితం మొత్తం మీద లేనేలేవు. మృదువూ, అమాయికతా చిహ్నితమూ అయిన ఆ నవ్వు లేకపోతే ఆయనకు ఏమీ తోచేదే కాదు. ఇక రెండురోజులకు జీవయాత్ర ముగిసిపోతుందనగా కూడా ఆయన నాతోనూ, ఇతరమిత్రులతోనూ కొన్నిఛలోక్తు లాడాడు. ఆ ఛలోక్తుల మాధుర్యం సరోజినీదేవీ, జవహర్లాల్ నెహ్రూ మొదలయినవారికి ఎన్నోమార్లు అనుభూతమైనదే. మహాత్ముని హృదయ నైర్మల్యం ఎటువంటిదో వాటివల్లనే తేటతెల్లమవు తుంది. అతి క్లిష్టపరిస్థితులలోకూడా మహాత్ముని ఛలోక్తులు ఎంత శుభ్రస్నిగ్ధాలుగా ఉండేవో, అవి హృదయభారాన్ని ఎలా మటుమాయం చేసేవో సరోజినీదేవి కథలు వివరించ గలవు.

మూడేండ్లు లండనులో ఉండటం గాంధిగారికి ఎన్నో విధాల ఉపకరించింది. ప్రాణగండాలుగా కనిపించిన విషమ పరిస్థితులు గడచిపోయినతర్వాత ఆంగ్లసమాజంలో ఆంగ్ల పద్ధతుల్లో జీవితం ఎలా ఆనందమయం చేసికొనవచ్చునో; ఆయన నేర్చుకొన్నాడు. శాకాహార నియమంకూడా ఇందులో అనూహ్యంగానే తోడ్పడింది. శాకాహారి సమాజంలో సభ్యుడై, కార్యనిర్వాహకవర్గంలో ఒకడైనాడు. ఇందువల్ల కార్యదక్షత అలవడ్డది. సభలలో ప్రసంగించడానికి సిగ్గు అడ్డు

పడినప్పటికీ, ఇతర కార్యకలాపాలకు ఆటంకం కలుగలేదు. ఒక సారి ఆయన సభలో మాట్లాడటానికి ఉంకించికూడా లజ్జా వివశుడైతే, మజ్ముదారు ఆయన వ్రాసిఉంచిన అంశాలను సభ వారికి చదివి వినిపించారు. నిరంతరసాంగత్యంవల్ల తోడి విద్యార్థులతోపాటే శాకాహారి సమాజ సభ్యులతోకూడా మైత్రి పెంపొందించుకొని, మహాత్ముడు కొంతకాలానికి అనేకులతో గాఢపరిచయం సంపాదించాడు.

దుస్తులూ, ఆహారమూ, అలవాట్ల విషయంలో మొట్ట మొదట ఆయనచేస్తూ వచ్చిన ప్రయోగాలు, లండనుకు వచ్చింది చదువుకోసమనీ, ఆ విషయంలో జరిగిన కృషి అత్యల్పమనీ ఆయన గమనించేసరికి తటాలున అంతరించాయి. బారిస్టరు తరగతిలో కూర్చుంటే చాలు; ఎక్కువగా చదువవలసిందేమీ లేదు; పరీక్షలూ సులువు; విద్యార్థి మూడేండ్ల పాటు అక్కడ ఉండి "పన్నెండు త్రైమాసికాలు" సమంగా పాటిస్తేనే బారిస్టరు పరీక్షలో ఉత్తీర్ణుడయేవాడు. అందుచేత గాంధిజీ లండన్ మెట్రిక్యులేషన్ పరీక్షకు చదవటానికి ఒక సంవత్సరం వినియోగించాడు. పరీక్షలు ఆరునెలల కొకసారి జరిగేవి. ఆయనకు మొదటి పర్యాయం అయిదుమాసాలే మిగిలినవి. లాటిన్ భాష ఆయనకు క్రొత్తది అయినందువల్ల తప్పిపోయాడు. రెండోపర్యాయం లాటిన్ విడిచిపెట్టి, వేర్వేరు విషయాలు తీసుకొని, పరీక్షలో కృతార్థుడైనాడు. శ్రమించి చదువదగిన వివిధ విషయాత్మక గ్రంథాలపఠనం పూర్తిగా అనవసరమని యితరులందరూ అభిప్రాయపడ్డారు. కాని, అందువల్ల ఆయనకు చాలా మేలే కలిగింది. పరీక్షలో మంచి

మార్కులు రావటమే కాకుండా, ఆ పరిశ్రమ ఆయన జీవితాన్ని ఆదర్శవంతంగా దిద్దుకొనటానికి ఉపయోగించింది.

ఇంతేకాకుండా భగవద్గీతా, క్రైస్తవనూతన నిబంధనా ప్రప్రథమంగా ఇంగ్లండులోనే చదివాడు. దివ్యజ్ఞాన సమాజ సభ్యులైన ఇద్దరు ఆంగ్ల సోదరులు భగవద్గీత పఠించవలసిందని గాంధిజీని ప్రోత్సహించారు. శాకాహార భోజనశాలలో పరిచితుడైన మరొక ఆంగ్లేయుడు బైబిలు ముఖ్యంగా చదువవలసిందని ప్రబోధించాడు. బైబిలులో ప్రాతనిబంధన భాగం ఆయనకు సరిగా బోధపడలేదుగానీ, నూతన నిబంధనమాత్రం చక్కగా అర్థమైంది. అంతకుముందే గీత అర్థంచేసికొనిఉండటం ఇందుకు ఎంతో ఉపకరించింది. నూతననిబంధన ఆయనకు చాలా నచ్చింది. "అది నా హృదయంలోపలికి చొచ్చుకొనిపోయింది." అన్నాడాయన.

ఇంగ్లండుకు రాకముందే, సంస్కృతంలో కానీ, గుజరాతీలో కానీ గాంధిజీ గీత చదివిఉండకపోవటం ఆశ్చర్యమే. ఎందువల్లనంటే ఆయనతండ్రిగారికి ఉభయభాషలలోనూ గీత పరిచితమైఉంటుంది. ఆ ఆంగ్లేయసోదరుల సాయంతో సర్ ఎడ్విన్‌ఆర్నాల్డు అనువదించిన గీతను పఠించాడు. ఆంగ్లానువాదా లన్నింటిలో ఇదే ఆయనకు అభిమానపాత్ర మైనది. ఆయనకది ప్రమాణ గ్రంథమైంది. అసలు దివ్యానుభవం అనేది మహాత్మునికి మొదటినుంచీ స్వానుభవసిద్ధమై ఉండాలి. లోకదృష్టికి విరుద్ధంగానూ, స్వదృష్టికి సవ్యంగానూ కనిపించే అనేక భావాలూ, అలవాట్లూ గీతాసమ్మత విషయాలే అని ఆయన గ్రహించాడు. రణరంగంలో అర్జునునికి శ్రీకృష్ణపరమాత్మ

చేసిన ఉపదేశం గాంధిజీ అభిప్రాయాలను అన్నింటినీ సమర్థిస్తున్నట్లు గోచరించింది. ఆ సూత్రాలమీదనే గాంధిజీ జీవితం అంతా నడచింది. భగవద్గీత అభిప్రాయానికి విరుద్ధంగా, ఆయన ఎన్నడూ ఏపనీకూడా చేయలేదంటే అతిశయోక్తి కాదు. స్వతస్సిద్ధమైన జ్ఞానపిపాస ఆయనలో ఉండటంచేతనూ, అదిన్నీ ఎక్కడ ఏ విషయం కనబడ్డా తత్‌క్షణం దాన్ని సమూలంగా శోధించి గుణగ్రహణం చేసేవఱకూ నిద్రించనిది కావటం చేతనూ, గీతాపరమార్థం అవ్యక్తంగా ఆయనలో ఆదినుంచీ స్పందిస్తూనే ఉండేదని ఊహించవలసి వస్తున్నది. గీత చేపట్టిన సమయానికి ఆయన వయస్సు 20 సంవత్సరాలు మాత్రమే. ఐతేనేమి? ఇంద్రియవాంఛలను అరికట్టుకొనటానికీ, జిహ్వాచాపల్యాన్ని నిరోధించటానికీ, విశేషించి ఐహికసంసర్గంనుంచి అతీతుడుకావటానికీ తీవ్రమైన కృషి ప్రారంభించాడు. ఆయనకు ప్రకృతిసిద్ధమైన సత్కార్యాచరణపరాయణత్వాన్ని భగవద్గీత నూతనవికాసంతో తేజరిల్లజేసి, జీవయాత్ర ముగిసేవఱకునూ ధర్మాధర్మనిర్ణయానికి అదే ప్రమాణమై, ఆయనను ఉన్నతాదర్శాలవైపు పురోగమింపజేసింది.

నూతన నిబంధనా, అందులోనూ ముఖ్యంగా "పర్వతాగ్రాన ధర్మోపన్యాసం" ఆయనకు పరమప్రమాణంగానే తోచేదికానీ, పుట్టుకచే హిందువు కావటంవల్ల ఈ క్రైస్తవ గ్రంథంకంటె భగవద్గీతనే ఆయన ఎక్కువగా ప్రమాణీకరించుకొనేవాడు. కాని కొంతకాలం గడిచేసరికి నూతన నిబంధనకూ భగవద్గీతకూ ఏమీ తేడాలేదనీ, అది భగవద్గీతకు వివరణం వంటిదేననీ ఆయనకు తోచింది. ఈ గ్రంథంలోని "ఎదురు

కోనకుమా అకృత్యమున్" (Resist not evil) అనే ఉత్తమ గీతం ఆయనను ఎంతో ఆకర్షించింది. ఆ గీతం చిరకాలం ఆయనకు జ్ఞాపకంలోనే ఉండేది. అది తలంపునకు వచ్చినప్పుడల్లా ఆయన ఆనందపరవశు డయేవాడు.

అయితే ఈ తాత్త్విక గ్రంథాలు కేవలం వైరాగ్య సంపాదనకోసం ఆయన చదువలేదు. మతపరమార్గాన్ని గూర్చిన విచారణ కలగటానికి అప్పటికి ఆయనకు ఇంకా ఇరవైఏండ్లైనా నిండలేదుగదా! ఆ రోజులలో చాలామంది విద్యార్థులు పాఠ్య గ్రంథాలు చదువటానికి శ్రమపడేవారే కారు. పరీక్ష ఇంకా కొద్దివారాలలో పడిందనగానే, ఆయా గ్రంథాలకు పరీక్షా దృష్టిలో విరచితాలైన ప్రశ్నలూ జవాబులూ కల పుస్తకాల్ని మాత్రం చదివి ఏదో వ్రాసేవారు. అదృష్టవశాన తెలిసిన ప్రశ్నలే వస్తే సమాధానాలు వ్రాసి కృతార్థులయేవారు. మహాత్ముడు ఇందుకు భిన్నంగా పాఠ్యగ్రంథాలు ఓపికతో చదివి, అర్థంచేసికొనేవాడు. రోమను న్యాయశాస్త్రంగుఱించి లాటిన్ భాషలో ఉన్న జస్టినియన్ గ్రంథం చదవాలని నిశ్చయించుకొన్నాడు. అందువల్ల ఆయనకు ఎప్పుడూ చాలినంత పని ఉండేది. ఇంతేకాక తన ఆహారవిహారాలకు మితవ్యయం అత్యవసరం కావటంవల్ల తల్లిదగ్గఱచేసిన ప్రతిజ్ఞను పాలించటానికి ఆయన ఎక్కువ మథనపడవలసిన అవసరం లేకుండాపోయింది. తోడి విద్యార్థుల మాదిరిగా ఇతరపుస్తకాలు ఎక్కువ చదువక పోయినప్పటికీ పాఠ్యగ్రంథాలు క్షుణ్ణంగా చదివి ఉన్న కారణంచేత చాలామంది ఆంగ్లేయ విద్యార్థులకంటె ఆయన పరీక్షలో చక్కని సమాధానాలు వ్రాశాడు.

క్రీ. శ. 1891 వ సంవత్సరం జూన్ నెల 10వ తారీఖున ఆయన పరీక్షలో కృతార్థుడై బారిస్టర్ల శ్రేణిలో చేరాడు. 11వ తారీఖున ఉన్నత న్యాయస్థానంలో పేరు నమోదుచేయించుకొని 12వ తేదీన హిందూదేశానికి తిరిగిరావటానికి స్టీమరు ఎక్కాడు.

మహాత్ముని జీవితకాలంలో ఈ సంవత్సరాలు చాలా అమూల్యమైనవి. మనోవికాసానికీ, బాహ్యాచరణకూ తగ్గ దోహదం అంతా ఈ కాలంలోనే జరిగింది. రోమను న్యాయశాస్త్రం అర్థంచేసికోనటానికి, జస్టినియన్ గ్రంథం సాకల్యంగా చదవటం ఉత్తరోత్తరాన ఆయనకు ఎంతో ఉపకరించింది. డచ్చి న్యాయశాస్త్రం రోమను న్యాయశాస్త్రపు పునాదులమీద ఏర్పడ్డదే కాబట్టి, దక్షిణాఫ్రికాకు ఆయన వెళ్ళినప్పుడు బారిస్టరు వృత్తిని ఆయన చాలా చక్కగా నిర్వహించగలిగాడు. అయితే సభాకంపంకలవాడు కావటంచేత ఏదైనా వాదంచేయవలసివస్తే చాలా బాధపడేవాడు. కాని ఆయన అనుమానించినంతగా శ్రమపడవలసిన అవసరంలేదు. వృత్తినిర్వహణకు అవసరమైన దానికంటె విశేషవిజ్ఞానం ఆయన సంపాదించాడు. భావికార్యక్రమానికి ఆవశ్యకమైన మానసిక వికాసం ఆర్జించాడు. కాని, నలుగురితో కలసిమెలసి తిరుగలేని లజ్జాళుత్వం ఆయనకు చాలా ప్రతిబంధకమైంది. అది తదనంతర కాలంలో గూడా ఆయనకు జ్ఞాపకం వచ్చేది. అయితే ఆ వయస్సులో ఆయనవలె న్యాయశాస్త్రజ్ఞానం కల న్యాయవాదు లెవరూలేరు. సకల గ్రంథాలూ ఆయనవలె ఆమూలాగ్రంగా ఇతరులు చదవలేదు.

బారిస్టరై వచ్చినతర్వాత గాంధిజీ రెండేండ్లు హిందూ దేశంలో ఉన్నాడు. ఆ రెండేండ్లూ ఆయన అభిప్రాయం ప్రకారం వ్యర్థంగానే గడచాయనాలి. ఆ కాలంలో ఆయన సాధించింది ఏమీలేదు. ఇంటికి తిరిగిరాగానే మాతృ మరణ వార్త విన్నాడు. ఆయన ఇంగ్లండులో ఉండగానే ఆమె మరణించింది. ఆ కాలంలో ఇల్లు దిద్దుకొంటూ, తమ్మునికి కావల్సిన సొమ్ము పంపుతూ ఉన్న అన్నగారు తల్లి మరణించిన విషయం మాత్రం తెలియజెయ్యలేదు. అలా తెలియజేసి ఉంటే, తండ్రి గతించినప్పటికంటె మహాత్ముని హృదయం ఎక్కువ గాయపడి ఉండేది. విచారంవల్ల తమ్ముని చదువు ఏమీ సాగదని అన్నగారు అభిప్రాయపడ్డాడు.

ఇంగ్లీషు రోమను న్యాయశాస్త్రాలలో ఎంత పాండిత్యం ఉన్నా, భారతీయ న్యాయశాస్త్రంతో ఆయనకు ఎక్కువ పరిచయం లేకపోయింది. అందువల్ల భారతీయ న్యాయ శాస్త్రం ఆయన మొదటినుంచీ పరిశీలించవలసివచ్చింది. కాబట్టి అందుకు తగిన కృషిచేస్తూ, బారిస్టరుగా నూతన జీవితాన్ని ఆరంభించాడు.

అయితే మొదటి అభియోగంలో న్యాయస్థానానికి వెళ్లినప్పుడే బారిస్టరుగా మహాత్ముడు రాణించలేకపోయాడు. ఆయన న్యాయస్థానంలో వాదితరఫు సాక్షులను అడ్డుప్రశ్నలు వెయ్యటానికి నిలబడ్డాడే కాని నోటినుంచి మాటరాలేదు. కొంతసేపు అలా నిలబడి ఏమీ తోచక కుర్చీలో కూలబడి, తన కక్షిదారు ప్రతినిధిని పిలిచి, తన వకాలతు రద్దుచేసుకోవల సిందనీ, మరొక న్యాయవాదిని ఏర్పాటు చేసికొమ్మనీ

చెప్పాడు. భారత దేశపు న్యాయస్థానంలో బారిస్టరుగా మహాత్ముడు నిలబడటం అదే మొదటిసారి, చివరిసారి కూడా అయింది.

న్యాయస్థానంలో నోరు విప్పలేని న్యాయవాది బొంబాయిలో జీవించటం సుకరం కాదు. అన్నివస్తువులూ ఎంతో డబ్బుపెట్టి కొనాలి. ఇంటిఅద్దెకూడా సామాన్యంకాదు. అటువంటి పరిస్థితులలో మహాత్ముడు అక్కడ నిలువగలగటం ఎలాగు? అందువల్ల ఆయన రాజకోటకు చేరుకొని, ఇతర న్యాయవాదులకు చేదోడుగా ఉంటూ, దరఖాస్తులు తయారు చెయ్యటం, అభియోగాలకు కావలసిన న్యాయసూత్రాలు సమకూర్చటం మొదలయిన పనులతో కాలక్షేపంచెయ్యటం మొదలుపెట్టాడు. ఇక్కడ ఆయన ఒకానొక బ్రిటిషు ఉద్యోగి దురహంకార ప్రవర్తనను గుర్తించాడు. ఆ ఉద్యోగి లండనులో ఉండగా మహాత్మునికి తెలిసినవాడే. మాటిమాటికీ, న్యాయస్థానంలో అందరికీ ఏదో కొంత ముట్టజెప్పడం, పలుకుబడిమీాద పనులు చేయించుకోవడం, లోపాయికారీ పనులు చేస్తూఉండటం, న్యాయనిర్ణయంలోకూడా అల్పరాజకీయాలుండటం, ఆయనకు ఏమాత్రమూ గిట్టలేదు. ఇంతకంటె మంచి వృత్తి దొరికితే బాగుండుననిపించి దాయనకి.

ఇంతలో అటువంటి అవకాశం ఒకటి రానేవచ్చింది. అప్పటికి భారతీయు లనేకులు దక్షిణాఫ్రికాకు వెళ్లటం, అక్కడే స్థిరపడటం జరిగింది. కొందఱు పెద్దఎత్తున రకరకాల వ్యాపారాలు నిర్వహిస్తున్నారు. అంతకంటె అధికసంఖ్యాకులు

"కంట్రాక్టు కూలీలు"గా వచ్చారు. ఈ రెండవవిషయం గాంధి జీకి తరువాత తెలిసింది.

దక్షిణాఫ్రికాకు ఆహ్వానం మహాత్ముని అన్నగారు సంపాదించి పెట్టినదే. "దాదా అబ్దుల్లా అండ్ కంపెనీ" అనే ఒక ముస్లిం వాణిజ్యసంస్థకు దక్షిణాఫ్రికా నుంచి 40 వేలపౌనులు రావాలి; కాని దక్షిణాఫ్రికా న్యాయస్థానాలలో తటస్థిస్తూవున్న కాలయాపనవల్ల, అభ్యంతరాలవల్ల ఆ సొమ్ము ఎంత కాలానికీ వాణిజ్యసంస్థకు దక్కకుండా ఉన్నది. మహాత్ముడు ఆ వాణిజ్యసంస్థ ప్రతినిధిగా దక్షిణాఫ్రికాకు వెళ్ళి, అక్కడ ఒక సంవత్సరంపాటు ఉండాలనీ, ఆ కాలంలో ఆయనకు అయేఖర్చు అంతా భరించి, నూటఅయిదు పౌనులు ఇస్తామనీ, అందుకుగాను ఆయన అక్కడి ధనం రాబట్టటానికి న్యాయస్థానం ద్వారా నడపవలసిన చర్యలు ఏవో ఆలోచించి, తగువిధంగా ప్రయత్నం చేయించాలనీ కంపెనీవారు కోరారు. మొత్తంమీద మహాత్ముడు ఆ కంపెనీలో ఒక ఉద్యోగిగా పనిచేయ్యాలన్నమాట.

యథార్థానికి అదేమీ గొప్ప అవకాశంకాదు. కానీ మహాత్మునికి హిందూదేశంలో తనకు న్యాయవాదిగా మంచి భవిష్యత్తు లేదనిపించింది. మఖ్లాకవృత్తి తనకు చేతగాదు. అందుచేత తనవారి నందరినీ విడిచిపెట్టి, వెళ్ళవలసి వచ్చినా, అందుకు అంగీకరించాడు. అప్పటికే ఆయనకు ఇరవైనాలుగుఏండ్లు మాత్రమే. దక్షిణాఫ్రికాలో తాను ఒక నూతన జీవితం ఆరంభిస్తాననీ, మహాత్ముడనిపించుకొని జాతీయ వీరుడై ఇండియాకు తిరిగివస్తాననీ, అనన్యమైన గౌరవానికి పాత్రుణ్నౌతాననీ,

ఆయన కలగనలేదు. అది ఒక అద్భుత సంఘటన. రెండు దశాబ్దాలకు తటస్థించబోయే నవ్యచరిత్రకు అది అంకురార్పణం వంటిదైంది. దక్షిణాఫ్రికాలో నడచిన అపూర్వగాథ ఒక మహాత్ముణ్ణి సృష్టించింది. ఆ మహాత్మునికీ, ఆయనతో ఉన్నవారికీ కూడా తర్వాత జరిగినదంతా తలచుకొంటే అంత ఉజ్జ్వల చరిత్ర తమమూలాననే ప్రవర్తిల్లిందంటే, అత్యాశ్చర్యం అయింది. ఎందుచేతనంటే, పరిస్థితులను అనుసరించి మనం ఏదో ఒకపని చేస్తాము. అది క్రమేణ మహాకార్యాలకు బీజమై ఎంతెంతో అద్భుతాలు చేయించవచ్చును. అంతా జరిగిన తర్వాత, ఇదంతా ఒక పూర్వాలోచనతోనే సాగిందని అనిపించవచ్చును. మహాత్ముని జీవితంలో ఈ పరిస్థితులన్నీ ఒకదాని వెంట ఒకటి నిరంతరంగా సంఘటిల్లి క్రమక్రమంగా, అవకాశం కలగగానే ఒక మహోద్యమాన్ని నడిపించాయి. ఆయా పరిస్థితులకు తగినట్లుగా తన్నుతాను మలచుకొని గాంధిజీ మహాత్ముడైనాడు.

# ద్వితీయ ప్రకరణం

## దక్షిణాఫ్రికాలో నూతన దర్శనం

1893 వ సంవత్సరంలో గాంధిజీ దక్షిణాఫ్రికాకు వెళ్లాడు. ఆనాటి ప్రభుత్వమే ఈనాటి ఐక్యప్రభుత్వంగా పరిణమించింది. ఆకాలంలో నేటాలు, ఆరెంజిఫ్రీస్టేట్, ట్రాన్స్వాల్, కేప్ కాలనీలు నాలుగూ నాలుగు ప్రత్యేక భాగాలుగా ఉండేవి. వీటిల్లో చిట్టచివరిదైన కేప్ కాలనీలోమాత్రమే ఆంగ్లేయులుఉండేవారు

ట్రాన్స్‌వాల్, ఆరెంజిఫ్రీస్టేట్లలో బోయర్ ప్రజాస్వామికా లుండేవి. నేటాలులో విభిన్న జాతులు నివసించేవారు. ఇది 1845వ సంవత్సరంలో బ్రిటిషుసామ్రాజ్యంలో చేరిపోయింది. అయినా ఆంగ్లేయవర్తకులు ఎక్కువమంది ఇక్కడ స్థిరపడలేదు. దీనికి రాజధాని డర్బన్. గాంధిజీ వ్రాతలేకాక మిగిలిన ఆధారాలను బట్టికూడా విచారిస్తే దక్షిణాఫ్రికా ఆ కాలంలో చాలా గందరగోళంగా ఉన్నట్లు తెలుస్తుంది. అనేక సాహసికులు ఈ కాలంలో బయలుదేరారు. ట్రాన్సువాల్‌లో అధ్యక్షుడుగా ఉన్న పాల్ క్రూగరూ, ఆరెంజిఫ్రీస్టేట్ అధ్యక్షుడైన యఫ్. డబ్లియు. రెయిట్జూ, గుడ్‌హోప్ అగ్రప్రాంతానికి ప్రధానిగాఉన్న సిసిల్ రోడ్సూ ఈ యుగంలోని ప్రసిద్ధ పురుషులు. చాలా మేధావీ, ఎంతో పలుకుబడికలవాడూ అయిన జాన్ హెన్రీ బ్రాండ్ ఆరెంజిఫ్రీస్టేటుకు చిరకాలంగా అధ్యక్షుడుగా ఉంటూ అప్పటికి నాలుగేళ్ళక్రిందట గతించాడు. దూరదృష్టిగల విజ్ఞులందఱూ ఈ నాలుగు ప్రాంతాలున్నూ భౌగోళికంగా ఏకఖండంగానే ఉన్నవి గాబట్టి, ఎప్పటికైనా ఒకటే ప్రభుత్వంక్రిందికి రాగలవని ఊహించారు. కాని, భాషా, జాతి విభేదతత్త్వాలు బలపడి ఉండటంచేత సంకుచిత దృష్టికే తప్ప, హేతుబద్ధమైన ఋజుదృష్టికి అవకాశం కనబడకపోయింది. బోయర్లకు ఆంగ్లేయులంటే విపరీతమైన ద్వేషం ఉన్నట్లు కనబడేది. ఐర్లండుప్రజలకు ఆంగ్లేయులపట్ల ఒకప్పుడు ఏర్పడ్డ ద్వేషం వంటిదే ఇదిన్నీ. అయితే ఇది అంతకంటె తీవ్రరూపం తాల్చింది. దక్షిణాఫ్రికా అంతా తమదేనని బోయర్లు అనుకొనేవారు. ఆంగ్లేయులు తమదేశాన్ని దోచుకొనటానికి

వచ్చారని వారి ఊహ. ఆంగ్లేయులు కేప్ కాలనీని ఆక్రమించి నప్పుడు విశేషమైన పశువుల మందలతో సహా సమస్తసామగ్రినీ తరలించుకొని మరొక ప్రాంతానికి వలసవెళ్ళారు. తిరిగి నేటాలులో ఇంగ్లీషువారు ప్రవేశించినప్పుడూ ఇలాగే చేశారు. చివరికి వీరు ట్రాన్సువాల్ ఆరెంజిఫ్రీస్టేట్లలో, పశువుల పెంపకం, వ్యవసాయం, గుత్తాలు కొని అమ్మటం మొదలయిన వృత్తులు అవలంబించారు. వీరందరూ డచ్చి గోపాలక జాతికి చెందినవారు. వైదేశికుడంటేనే గిట్టనివారు వీరు. ఈ భూభాగంలో బంగారమూ, వజ్రాలూ దొరకటం ప్రారంభమైనది లగాయతూ ప్రపంచంలోని నానా దేశాలనుంచీ జనప్రవాహాలు ఇటువైపు నిరంతరంగా సాగాయి. బోయర్లు వీరిని "విదేశీయులు" అనేవారు. ఈ విదేశీయులంటే స్థానిక ప్రజలకు ఎంతమాత్రమూ గిట్టేదికాదు. ఏదో విధంగా విదేశీయులను హింసించటం బోయర్లకు అలవాటైంది. ప్రభుత్వంలో విదేశీయులకు స్థానం లేకపోవటం అలాఉండగా వోటుహక్కు కూడా ఉండేదికాదు. ట్రాన్సువాల్ ప్రెసిడెంటు పాల్ క్రూగర్ ఈ వైదేశికులను తన రాష్ట్రంలో లేకుండా చెయ్యాలని గాఢంగా అభిలషించాడు. కాని, బంగారమూ, వజ్రాలూ అతని రాష్ట్రంలో దొరుకుతూ ఉన్నాయి కాబట్టి వైదేశికుల రాక తప్పలేదు. ఇటువంటి పరిస్థితులవల్ల ఒక్క కేప్ కాలనీలో తప్ప, తక్కిన దక్షిణాఫ్రికా అంతటా ఎప్పుడు ఏ కల్లోలం చెలరేగుతుందో అన్నట్లు ఉన్నది. ఇప్పటికి రెండేండ్లు జరిగిన తర్వాత నౌకాయుద్ధాలలో నిపుణుడైన రోడ్సు 'జేమ్సన్ దళం' అనే పటాలాన్ని సంసిద్ధపటిచాడు. ఈ పటాలం బోయర్లమీద

దెబ్బకుదెబ్బ తీయడానికి సిద్ధపడ్డది. లండన్‌లోని బ్రిటిషు ప్రభుత్వం పందొమ్మిదో శతాబ్దం మొత్తంమీద ఇటువంటి విషయాలలో తన ప్రతినిధులవలె చురుకుగా వ్యవహరించేదికాదు. కాని క్రీ. శ. 189్వ సంవత్సర ప్రాంతంలో మొత్తం దక్షిణాఫ్రికా అసూయా ద్వేషాలకు ఆలవాలమై యూరోపియన్లు కూడా శాంతియుతంగా జీవించటానికి అవకాశం లేకపోయింది. అట్టి స్థితిలో యూరోపియన్లు కానివారికి భయాందోళనలు తప్ప లేదంటే ఆశ్చర్య మేమున్నది?

ఈనాడు దక్షిణాఫ్రికాలోని జాతివిభేదతత్త్వాలు ఎలా ఉన్నదీ మనకు తెలుసు. "యూరోపియన్" అంటే స్వచ్ఛమైన శ్వేతజాతీయుడు. "స్వదేశీయుడు" అంటే ఆఫ్రికా ఖండంలో తరతరాలుగా నివసిస్తున్న అనాది జాతీయుడు. "రంగుజాతి" అంటే మిశ్రజాతి. "ఆసియను" అంటే ఆసియా ఖండంలో ఉత్పత్తిఅయిన జాతి. ఈ పదం ముఖ్యంగా భారతీయులకే వర్తించినా ఆసియాలోని ఇతర దేశాలవారుకూడా కొద్దిగా ఇక్కడికి వస్తూఉండేవారు. ఏ తెగఅయినప్పటికీ మొత్తంమీద ఈ నాలుగురకాల ప్రజలూ ఆఫ్రికావాసులే అయినారు. కాని ఈ భేదదృష్టి ఇప్పటికీ సాగుతూనేఉన్నది. అయితే గాంధిజీ ఆఫ్రికాకు వెళ్ళిన సమయానికి ఈ విషవృక్షం మంచికాపులో ఉన్నది. యూరోపియనులుకానీ ఆసియావాసులుకానీ నవీనంగా వచ్చినవారు. ఈనాడు దక్షిణాఫ్రికాలో ప్రాముఖ్యంకల రంగుజాతి అప్పటికి చాలా స్వల్పంగానే ఉన్నది.

గాంధిజీ శీలం ఇంతవఱకూ మనం గమనించకపోయినట్లయితే ఆకాలంనాటి ఆయన ఆత్మకథా, ఉత్తరాలూ, పరి

చయాలూ గమనిస్తే చాలా ఆశ్చర్యం కలుగుతుంది. ఆనాటి దక్షిణాఫ్రికా ఆంతరంగిక పరిస్థితులను ఆయన అంతగా గమనించలేదు. ఆయన చురుకైనవాడూ యువకుడూ అయి ఉండటం చేత తప్పకుండా అప్పటి పరిస్థితులను గమనించి ఉండవలసింది. కాని స్వభావసిద్ధంగా అసాధారణమైన సాహసంతో భారతీయుల కోసం భారతీయులతోనే ఆయన జీవించాడు. ఆయన దక్షిణాఫ్రికాలో ఉన్న ఇరవైసంవత్సరాలూ కేవలం హిందూ దేశంలో ఉన్న హిందువుకంటె విశేషమైన ఆధ్యాత్మిక దృక్పథంతో కాలంగడిపాడు. అసలు దక్షిణాఫ్రికాలో ఉన్నప్పుడే ఆయన సంస్కృతం బాగా అభ్యసించాడు. భగవద్గీతఅంతా కంఠస్థంచేశాడు.ఐహికసుఖాలను వర్జించాడు. మహాత్ముడున్నూ అయినాడు. దక్షిణాఫ్రికాకు వెళ్ళేటప్పుడు బిరుసైన గళ వస్త్రమూ, పొడుగైన కోటూ ధరించి మొదటితరగతిలో ప్రయాణంచేసి, నికరమైన న్యాయవాదిగా వైభవంగా జీవించాలని సంకల్పించాడు. అక్కడనుంచి తిరిగివచ్చేటప్పుడు మాతృదేశంలో పేద భారతీయుడు మాదిరిగానే జీవయాత్ర గడపాలని నిశ్చయించుకొన్నాడు.

ఐరోపావారిలోనే బయలుదేరిన అంతఃకలహాలుగానీ, వారికిన్నీ దక్షిణాఫ్రికా స్థిరనివాసులకున్నూ తటస్థిస్తూవచ్చిన పోరాటాలుగానీ ఆయనను ఏమాత్రమూ చలింపజేయలేదంటే ఆశ్చర్యమే. ఆయనలో దైవదత్తమైన ఒక మహాశక్తి ఉన్నది. ఒక ప్రత్యేకవిధిని నిర్వహించటానికి, నిర్దిష్టమైన ప్రత్యేక కార్యక్రమంతో పనిచేస్తున్న ఒక విశిష్టసాధనం మాదిరిగా ఆయన ప్రవర్తించాడు. ఆయన జీవితం అంతాకూడా అలాగే గడి

చింది. ఆఫ్రికాలో గాంధిజీ భారతీయులకోసమే నివసించాడు. వారినిగురించిమాత్రమే ఆలోచించాడు. తన దేశీయుల కష్ట సుఖాలకు కారణాలైనంతవరకే ఇతరుల వ్యవహారాలు పరిశీలించాడు. విద్వేషపూరితమైన ఆనాటి వాతావరణంలో దక్షిణాఫ్రికా వాసులందరి భవిష్యత్తూ ఎలా మారుతుంది అనే ప్రశ్న ఆయనకు పట్టలేదు. భారతీయుల భవిష్యత్తు ఏమిటి అని మాత్రమే ఆయన తర్కించుకొన్నాడు. లక్ష్యసాధనకు ఆయన చేసిన కృషి నిశ్చయంగా పరమ పవిత్రమైనది. అయితే అది దక్షిణాఫ్రికా ప్రజాబాహుళ్యానికి ఎక్కువగా ఉపకరించనే లేదు. ఇందువల్లనే ఆయన అక్కడ సాధించిన విజయం పాక్షికమూ, తాత్కాలికమూ అయినదే కానీ అంతకంటె పెద్ద మార్పులేవీ సాధించలేకపోయింది. నిజానికి ఆయన సాధించినది సామాన్యవిజయంకాదు. కాని 1914 వ సంవత్సరంలో ఆయన దక్షిణాఫ్రికా విడిచివెళ్ళిన తర్వాత దక్షిణాఫ్రికాలో భారతీయులు స్వతంత్రించి చేసిన మహాకార్యం ఏమీలేదు. వారి పూర్వస్థితికంటె ఈనాటిస్థితి ఎన్నోవిధాల మారినప్పటికీ, 1893 వ సంవత్సరంలో గాంధిజీ వారిని తొలిసారి కలిసికొన్నప్పుడు వారిదైన్యం ఎలా ఉండేదో ఇప్పుడున్నూ అలాగే ఉన్నది.

బొంబాయిలో స్టీమరెక్కేనాడు ఆయనకు ఇక్కడి విషాదపరిస్థితులు తెలియనే తెలియవు. ఆయన ఎక్కిన ఓడ పేర్వేరు రేవులలో ఆగుతూ డర్బన్ చేరేసరికి ఆరువారాలైనది. నౌకలో ప్రయాణికులు క్రిక్కిరిసిఉన్నారు. నౌకాధికారి మంచివాడు కావటంవల్ల అతని గదిలోనే గాంధిజీకి

కొంచెం చోటు చిక్కింది. ఆ అధికారి ఆయనకు చతురంగం నేర్పాడు. తోడి ప్రయాణికులున్నూ కలుపుగోలుతనంగా ఉన్నారు. డర్బన్‌లో నౌకదిగి సేట్ అబ్దుల్లాను కలిసికొనే వఱకూ ఐరోపావారు భారతీయులపట్ల ఎలా వ్యవహరిస్తున్నారో ఆయనకు తెలియలేదు. అచిరకాలంలోనే, అంటే చాలా కొద్దిరోజులలోనే, ఆయనకు ఎన్నో విషయాలు తెలిశాయి.

సేట్ అబ్దుల్లా మహమ్మదీయ వర్తకుడు. అతను శ్రీమంతుడేకాని విద్యావంతుడు కాడు. అసలు అక్షరజ్ఞానమే లేనివాడనాలి. అతనికి గాంధిజీతో ఎలా వ్యవహరించాలో తోచలేదు. గాంధిజీవంటివారు, అంటే లండన్‌లో బారిస్టరు పరీక్షకు చదివి కృతార్థులై, ఆంగ్లేయవేషంలో నేటాలుకు వచ్చిన భారతీయులు ఒక్కరూ లేరు. దక్షిణాఫ్రికాకు భారత దేశంనుంచి వచ్చిన వర్తకులు సంపన్నులే కాని యీ క్రొత్త దేశంలో వారి తెలివితేటలూ చొఱవా తప్పితే వర్తకానికి ఇతర సదుపాయాలేవీ లేకపోయాయి. ఆరోగ్యసూత్రాలనూ, గాలీ, వెల్తురూవంటివాటినీ వారు లక్ష్యంచెయ్యలేదు. ఇవి గాంధిజీకి చాలా ముఖ్యం అని మనకు తెలుసు. వీరికి ఇంగ్లీషు తెలియదు. ఏదైనా సంఘంమొత్తానికి ఆపద ముంచుకొనివస్తే అందఱూ నిర్బంధంగా ఒక చోటికి చేరుతారేకాని సాధారణంగా సహకార జీవనం ఎఱుగరు. యూరపియను దొరలు తిట్టినా, అవమానించినా, రోషపడకుండా సహించటం వారికి అలవాటైనది. వర్తకులలో ఎక్కువమంది ముస్లిములు. కొందఱు పార్సీలు, కొందఱు క్రైస్తవులూ కూడా ఉన్నారు. ముస్లిములు తాము "అరబ్బులం" అనీ, పార్సీలు "పర్షియన్లం"

అనీ చెప్పుకొనేవారు. "భారతీయులం" అంటే ఏమి దురవస్థ పట్టుతుందో అని భయపడేవారు. భారతీయుల వృత్తిగానీ, కులం గానీ, మతంగానీ విచారించకుండానే యూరపియన్లు అందఱినీ "కూలీలు" అని మాత్రమే పేర్కొనేవారు. దక్షిణాఫ్రికాలో ఒకే ఒక భారతీయపు బారిస్టరైన గాంధిజీకి కొద్దికాలంలోనే "కూలీ బారిస్టరు" అని పేరు స్థిరపడిపోయింది.

ఆయన పరిస్థితులన్నీ చాలా తొందరగానే గ్రహించు కొన్నాడు. ఒక్కొక్కటి చెవినిపడుతూఉంటే ఎంతగానో విస్మయపడుతూవచ్చాడు. సేట్ అబ్దుల్లా సమస్తమూ ఆయ నకు విశదపఱిచాడు. ఆయనలో ఒకవిధమైన పట్టుదల బయలు దేఱింది. భాగ్యవంతులయిన భారతీయవర్తకులుగానీ, వారి సంస్థలలో పనిచేసే భారతీయోద్యోగులుగానీ, కూలీలుగా ఉన్న భారతీయులతో ఎటువంటి సంబంధమూ పెట్టుకోరు; కూలీలు కూలీలే! అయిదేళ్ళపాటు కూలిపని చెయ్యటానికి ఒప్పుకొని వారు మాతృదేశంనుంచి ఇక్కడకు వచ్చారు. వారిలో ఎక్కువమంది దక్షిణభారతంనుంచి వచ్చినవారే. ఆ దక్షిణభారతీయులలోను, తమిళమో, తెలుగో మాట్లాడేవారే ఎక్కువ. ఇక వర్తకులలో ఎక్కువమంది బొత్తాహులు. వారు మాట్లాడేది ఏదో ఉత్తరభారతభాష. ఈ విభేదం ఇలాఉండగా కూలీలందఱూ అక్షరజ్ఞానంలేనివారు. అందఱూ ఏదో తక్కువ కులానికి చెందినవారే. మాతృదేశంలోనే వారికి పరువు ప్రతి ష్ఠలు లేవు. ఈ విదేశంలో ఎలా వస్తాయి ? ఇటువంటి కూలీల పరిస్థితి అంతా తెలియగానే గాంధిజీ మనస్సంతా కూలీలను గుఱించే ఆలోచించటం మొదలుపెట్టింది. కాని కొంతకాలం

పటికూ వారితో ఆయనకు ఎటువంటి సంబంధమూ పెట్టుకొన టానికే వీలులేకపోయింది. ఆయన సేట్ అబ్దుల్లా వ్యవహారం పరిష్కరించటానికి నియమితుడైనాడు గదా!

ఆ దావాకూడా సామాన్యమైనది కాదు. 40,000 పౌనులు రాబట్టాలి. దానికి ఎన్నో చిక్కు లున్నాయి. అవి అన్నీ తెలుసుకోవాలంటే వాణిజ్యపు లెక్కలన్నీ అవగాహనం చేసికోవాలి. అందుకోసం ప్రత్యేకంగా గాంధిజీ ఎంతో కృషి చెయ్యవలసివచ్చింది. స్వయంకృషితో కొంతకాలానికి ఆయన చిట్టా ఆవర్జా వగైరా లెక్కల పుస్తకాలు సరిచూడగలిగాడు. అటుతర్వాత న్యాయస్థానంతో సంబంధం లేకుండానే ఎదుటి పక్షంవారితో సంప్రతింపులు జరిపి వ్యవహారం పరిష్కరిస్తానని సేట్ అబ్దుల్లాతో అన్నాడాయన. న్యాయవాది వృత్తిలో ఉన్నంతకాలమున్నూ ఈ పద్ధతిమీదనే ఆయన మనస్సు లగ్నమై ఉండేది. ఎన్నో వ్యవహారాలు ఈ విధంగానే పరి ష్కరించటంకూడా జరిగేది. న్యాయస్థానాలకు ఎంతో సొమ్ము ధారపోయకుండా సరిపోతుంది కాబట్టేన్నీ, అసలు అబ్దుల్లా వ్యవహారం ఒకప్పుడు స్నేహితులుగా ఉండి, ముందున్నూ ఆ స్నేహసంబంధం కాపాడుకోవలసిన బంధువులమధ్య నడుస్తూ ఉన్నదే కాబట్టేన్నీ, ఈ పద్ధతి మాత్రమే ఉచితమైనదని గాంధిజీ ఉద్దేశించాడు.

డర్బనుకు వచ్చినతర్వాత మూడురోజులకు ఒకనాడు సేట్ అబ్దుల్లా, ఆయనను న్యాయస్థానానికి తీసికొనివెళ్ళాడు. అక్కడ వ్యవహారాలు ఎలా జరిగేదీ తన న్యాయవాదికి అవ గతం చెయ్యాలని అతని అభిలాష. ఆ రోజులలో గాంధిజీ

ఇంగ్లీషువారివలెనే దుస్తులు ధరించినా, వంగదేశపు 'పగ్రీ' వంటి తలపాగా ధరించేవాడు. ఈ తలపాగా ధరించినవారు ఎక్కడికి వెళ్ళినా దానిని తీసివెయ్యవలసిన పనిలేదు. ఇది భారతీయ సంప్రదాయం. అయితే ఆంగ్లేయులు ఒక ఇంటికిగానీ ప్రభుత్వ కార్యాలయానికిగానీ, మరెవ్వరిని కలిసికొనటానికిగానీ వెళ్ళినప్పుడు టోపీ తీసివెయ్యటం వారికి మర్యాద. న్యాయాధికారి తనవంక వింతగా చూస్తూ ఉన్నా, గాంధిజీ తలపాగా తీసివెయ్యకుండానే న్యాయస్థానం ప్రవేశించాడు. తర్వాత ఆ న్యాయాధికారి గాంధిజీని చూచి తలపాగ తీసివెయ్యవలసిందని చెప్పాడు. గాంధిజీ అందుకు సమ్మతించక, బయటికి వెళ్ళిపోయాడు.

ఇందువల్ల కొంత అలజడి బయలుదేరింది. భారతీయమైన తలపాగ ఎల్లప్పుడూ ధరించటానికి తనకు గల హక్కును సమర్థించుకొంటూ గాంధిజీ పత్రికలకు వ్యాసాలు వ్రాశాడు. ఆ విషయమై జరిగిన వాదోపవాదాలతో గాంధిజీపేరు నేటాలులో చాలా తొందరగా వ్యాపించింది. ఇంకొకవిధంగా అయితే ఆయనకు ఇంతవేగంగా ప్రసిద్ధి వచ్చేది కాదేమో! ఈ సందిగ్ధ పరిస్థితిలో భారతీయుడుగా తన ఆత్మగౌరవం నిలుపుకొనటానికే ఆయన ఉద్దేశించినప్పటికీ, ఇంగ్లీషు టోపీ గనుక ధరిస్తే ఏ తగాదాలూ ఉండవని భావించి ఆ విధంగా రాజీ కుదుర్చుకొందామనుకొన్నాడు. కాని సేట్ అబ్దుల్లా అందుకు అంగీకరించలేదు. గాంధిజీ అతనిని కాదనలేకపోయాడు. అప్పటినుంచీ తలపాగా ఆయన స్వాతంత్ర్యానికి ఒకవిధమైన చిహ్నమైనది. ఇంగ్లీషుటోపీ ధరించవద్దన్న సేట్ అబ్దుల్లా

గాంధిజీకి తన పట్టుదలకు గల ఇంకొక కారణం ఇలా చెప్పి బుచ్చాడు: "మీరు ఇంగ్లీషుటోపీ పెట్టుకొంటే, అచ్చంగా నౌకరు కుఱ్ఱవాడి మాదిరిగా ఉంటారు."

దావా వ్యవహారాలన్నీ తనకు పూర్తిగా బోధపడ్డాయన్న విశ్వాసం కలిగినతర్వాత ఎదుటి పక్షంవారివద్దకు వెళ్ళటానికి తాను సంసిద్ధుణ్ణి అని గాంధిజీ అబ్దుల్లాతో చెప్పి, అతని అనుమతిమీద ప్రతికక్షులనివాసస్థానమైన ప్రిటోరియాకుబయలుదేరాడు. అయితే అబ్దుల్లా కొంతకంగారు పడ్డాడు. ప్రిటోరియా ట్రాన్సువాల్ రాజధాని. నేటాల్ భారతీయులకు మంగలం వంటిదైతే, ట్రాన్సువాల్ మండుతున్న ప్రొయ్యివంటిది. అదీగాక అది దగ్గరా దాపూ కాదు. అసలు ప్రిటోరియాలో గాంధిజీ ఎక్కడ బసచెయ్యాలి?— అనేదికూడా ఒక సమస్య. అయినా మన యువకన్యాయవాది నదురూ బెదురూలేకుండా ఒకటవ తరగతి టిక్కెట్టుకొని రైలెక్కాడు.

రైలుబండి నేటాల్ రాజధాని అయిన మారిట్జుబర్గ్ చేరేసరికి గాంధిజీ ఎక్కిన పెట్టెలోపలికి ఒక ఆంగ్ల ప్రయాణికుడు వచ్చాడు. ఒకటవ తరగతి పెట్టెలో గాంధిజీ కూర్చుని ఉండటం చూచాడు. మాట్లాడకుండా వెళ్ళిపోయి, కొంతమంది రైల్వే ఉద్యోగులను వెంటబెట్టుకొని వచ్చాడు. ఆ ఉద్యోగులు గాంధిజీని అక్కడనుంచి వెళ్ళిపొమ్మన్నారు. సాధారణంగా భారతీయులందఱూ ఎక్కే తక్కువరకం పెట్టెలో ఎక్కవలసిందని ఆజ్ఞాపించారు. ఆయన అందుకు ఒప్పుకోలేదు. తత్క్షణం ఉద్యోగులు ఒక రక్షకభటుణ్ణి పిలవటం, అతను గాంధిజీని ఒకటవ తరగతి పెట్టెలోనుంచి మూటాముల్లెతో బయటకు ఈడ్చి

వెయ్యటం జరిగాయి. మరొక పెట్టిలో తాను ఎక్కనని భీష్మించిన గాంధిజీ మారిట్జుబర్గ్ రైల్వేస్టేషనులో ఎముకలు కొరికే చలిలో ఆరాత్రి అంతా గడపవలసి వచ్చింది. తెల్ల వారగానే ఆయన రైల్వే అధికారమండలికీ, సేట్ అబ్దుల్లాకూ తంతివార్తలద్వారా విషయం తెలియబఱచాడు. అబ్దుల్లా వెంటనే మారిట్జుబర్గ్‌లోని భారతీయవర్తకులను గాంధిజీ విష యమై తగు జాగ్రత్త తీసికోవలసిందని తంతిమూలకంగా అభ్యర్థించాడు. ఆ వర్తకులు గాంధిజీని సందర్శించి తమకున్నూ అటువంటి యిబ్బందులెన్నో కలుగుతూ ఉండటం చెప్పు కొన్నారు. ఆ సాయంకాలపు రైలుబండిలో గాంధిజీకి సుఖంగా నిద్రించటానికి అనువైనస్థలం ప్రత్యేకించటం జరిగింది. ఆ యేర్పాటుకు ఆయన అంగీకరించాడు. డర్బన్‌లో రైలుబండి ఎక్కేటప్పుడే ఇటువంటి యేర్పాటు ఆయన చేసికొని ఉంటే మారిట్జుబర్గ్‌లో ఈ యిబ్బంది తటస్థించేదికాదు. తన యజ మానిచేత అనవసర వ్యయం చేయించటం ఇష్టంలేక అప్పు డాయన అందుకు సమ్మతించలేదు.

మఱుసటి ఉదయానికి రైలుబండి ఛార్లెస్‌టౌన్ చేరింది. అంతటితో రైలుమార్గం అంతమైపోయింది. అక్కడ నుంచి జోహాన్సుబర్గుకు అంచెశకటంలో వెళ్ళాలి. ఇక్కడ ఇంకా ఇబ్బందులు కలిగాయి. మొదట ఆ శకటపు ఏజంటు ఆయనను బండిలో ఎక్కించుకొనటానికే ఒప్పుకోలేదు. కాని గాంధిజీ తన ప్రయాణావసరం విశదీకరించిన మీదట బండిలో చోటు ఇవ్వడానికి ఒప్పుకొన్నాడు కాని, ప్రయాణీకులంద ఱితో బాటు పెట్టెలోపల కాక, డ్రైవరు ప్రక్కనే పెట్టెకు

బయట కూర్చోవలసిందన్నాడు. మన యువన్యాయవాది తాను చెప్పుకొన్నట్లు "అవమానాన్ని బాగా దిగమ్రింగి" బండిలో ఎక్కాడు. కాని కొంతదూరం వెళ్ళినతర్వాత ఆ శకటపు ఏజంటు తాను ధూమపానం చెయ్యటానికి అనువుగా శకట చోదకుని ప్రక్కకు చేరదలచి, గాంధిజీని అక్కడనుంచి లేచి శకటంలోపలికి ఎక్కే మెట్టువద్ద కూర్చోవలసిందని ఆజ్ఞాపించాడు. గాంధిజీ ఈసారి ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకోదలచాడు. తాను కూర్చున్న చోటినుంచి కదలనన్నాడు. శకటపు ఏజంటు మండిపడి ఆయనను కొట్టటానికిబయలు దేరాడు. నోటికివచ్చినట్లు తిట్టాడుకూడాను. ఇతర ప్రయాణికులు అతనినివారించ బోయారుకానీ ఫలితంలేకపోయింది. రాత్రికి శకటంస్టాండర్టన్‌లో ఆగింది. కొంతమంది భారతీయవర్తకులు గాంధిజీని ఆదరించారు. మఱునటి ఉదయం వేఱొక శకటంలో ఇటువంటి ఘర్షణ యేమీ లేకుండానే ఆయన జోహాన్స్‌బర్గుకు ప్రయాణమై వెళ్ళాడు.

జోహాన్సుబర్గ్‌లో క్రొత్తచిక్కు వచ్చిపడ్డది. గ్రాండ్ నేషనల్ హోటలులో ఆయనకు ప్రవేశం లభించలేదు. ఆయనకై వచ్చిన భారతీయవర్తకులు పొరపాటున స్టేషనువద్ద కలుసుకోలేకపోయినా, తరువాత తటస్థపడి ఆయన కథ విని, భారతీయులెవరూకూడా ఆ దేశం హోటళ్ళలో అడుగుపెట్టడానికి వీలులేదని చెప్పారు. ఇంగ్లీషువారి పాలనలో ఉన్న నేటాలులో కంటె డచ్చివారి పాలనలో ఉన్న ట్రాన్సువాలులో భారతీయులస్థితి మఱీ అధ్వాన్నంగా ఉంటుందనికూడా చెప్పారు. భారతీయులు రైలుబండిలో మూడవతరగతిలో మాత్రమే ప్రయాణం చెయ్యాలట! ఈ నియమాన్ని ఎవరూ ఉల్లంఘించటానికి వీలులేదు.

గాంధీజీ తన భవిష్యజ్జీవితంలో మృదుమార్గాననే పట్టిన పట్టు ఎలా చెల్లించుకొంటూ వచ్చాడో అలాగే ఈ సమయంలోనూ తన పట్టుదల నిర్వహించుకొనటానికి ఉద్యుక్తుడైనాడు. ఇది కేవలం సిద్ధాంతం నిలబెట్టుకొనటానికి చేసిన పని. తనకు న్యాయమని తోచినదానిని ఆయన విడిచిపెట్టలేడుగదా! ముందుగానే లేఖామూలకంగా తన అభిప్రాయాన్ని అక్కడి రైల్వేస్టేషన్ అధికారికి తెలియజేసి, తర్వాత సకాలానికి వెళ్ళి ఒకటవ తరగతి టిక్కెట్టు కొన్నాడు. ఆ స్టేషన్ అధికారి హాలండునుంచి వచ్చిన డచ్చి జాతీయుడే. అతను గాంధీజీకి టిక్కెట్టు ఇస్తూ అటుపైన తటస్థించే చిక్కులలో తన్నుమాత్రం ఇఱికించవద్దని చెప్పాడు.

అయితే గాంధీజీకి ఆరోజు మంచిదైంది. సహృదయులైన ఇద్దఱు యూరోపియనులు ఈ ధైర్యశాలికి తోడైనారు. టిక్కెట్లకోసం రైల్వేగార్డు గాంధీజీ ఉన్న పెట్టెలోపలికి వచ్చి ఆయనను చూడగానే మూడవతరగతి పెట్టెలోపలికి వెళ్ళి పొమ్మన్నాడు. ఆ సమయంలో గాంధీజీ ఉన్న పెట్టెలో ఇంకొక్క ప్రయాణికుడు మాత్రమే ఉన్నాడు. అతను ఆంగ్లేయుడే అయినా గాంధీజీపక్షం అవలంబించి ఆయనను పెట్టెదిగి వెళ్ళనక్కఱలేదని కూర్చుండబెట్టాడు. గార్డు అతనిని చూచి నవ్వుతూ "కూలీతో కలసి ప్రయాణం చెయ్యటానికి నీకు అభ్యంతరం లేకపోతే నాకేమి బాధ?" అని వెళ్ళిపోయాడు. మఱొక సంఘటన ఏదీ తటస్థించకుండానే రైలుబండి ప్రిటోరియా చేరింది.

ప్రిటోరియాలో మన ప్రయాణికుణ్ణి కలసికొని యోగ

క్షేమాలు విచారించినవారే లేరు. మసక మసక దీపాలతో చీకటి దోబూచులాడుతున్నట్లున్న రైల్వేస్టేషనులో నిలబడి ఎక్కడికి వెళ్ళాలో, ఏమి చెయ్యాలో తోచక ఆయన తబ్బిబ్బు పడ్డాడు. ప్రయాణికులందరూ వెళ్ళిపోయిన తర్వాత ఒంటరిగా ఉన్న టిక్కెట్టు కలెక్టరును చూచి తన సమస్య ఆయనకు నివేదించాడు. ఆ రాత్రికి తాను భోజనం చెయ్యటానికీ, బస చెయ్యటానికీ వీలైన చిన్న హోటలు ఎక్కడున్నది? అనేది గాంధీజీ ప్రశ్న. టిక్కెట్టు కలెక్టరు ఆ ప్రశ్నకు సమాధానం చెప్పలేకపోయాడు.

అంతలో దైవవశాత్తు అమెరికాదేశపు నీగ్రో ప్రయాణికుడొకడు అక్కడికి వచ్చాడు. అతను గాంధీజీ ప్రశ్న విన్నాడు. తనకు తెలిసిన హోటల్ ఒకటి ఉన్నదనీ, తనతోబాటు గాంధీజీ అక్కడికి రావచ్చుననీ చెప్పాడు. ఆ హోటలు యజమాని అమెరికా దేశీయుడే. గాంధీజీ ఆ నీగ్రో వెంట "జాన్స్టన్ కుటుంబపు హోటల్"కు వెళ్ళాడు. జాన్స్టన్ గాంధీజీ బసకు ఒకగది యివ్వటానికి తనకేమీ అభ్యంతరం లేదన్నాడు. అయితే గాంధీజీ తాను బసచేసే గదిలో తప్ప భోజనశాలలో అందరితోబాటు భోజనం చెయ్యటానికి వీలు లేదని అతను ఒక చిన్న షరతు పెట్టాడు. గాంధీజీ గదిలో ప్రవేశించాడు. పరిస్థితులనుగురించి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. ఈ లోపల జాన్స్టన్ తన హోటలులో భోజనం చెయ్యటానికి వచ్చిన యూరోపియన్లతో గాంధీజీ విషయమై సంప్రతించాడు. గాంధీజీతో కలసి ఒకేగదిలో భుజించటానికి తమకేమీ అభ్యంతరంలేదని వారు అతనితో అన్నారు. అతను

వెంటనే గాంధీజీవద్దకు వచ్చి జరిగినదానికి క్షమాపణ చెప్పు కొని భోజనశాలలోపలకు తీసికొని వెళ్ళాడు.

మఱునటిరోజున సేట్ అబ్దుల్లా ప్రతినిధి ఎ. డబ్ల్యు బేకర్ గాంధిజీని కలసికొని బసయిచ్చినందుకూ, భోజనం పెట్టినందుకూ వారానికి ముప్పైఅయిదు షిల్లింగులు ఇచ్చే పద్ధతిమీాద ఒక పేదరాలి యింటిలో బస యేర్పాటుచేశాడు. భారతీయుడైన అతిథిని పెట్టుకొన్న అవమానం భరించడానికి ఆమె అంగీకరించింది.

ఎ. డబ్ల్యు. బేకరునుగుఱించి గాంధిజీవల్ల మనకు చాలా విషయాలు తెలుస్తున్నవి. అయితే ఆ విషయాలు ఏవీ కూడా బేకరు న్యాయవాది వృత్తి ఎలా సాగిందో చెప్పేవి కావు. అతను గాంధిజీకి క్రైస్తవమత దీక్ష యివ్వడానికి పూను కొన్నట్లు కనిపిస్తుంది. అతను క్రైస్తవమతాన్ని గాఢంగా విశ్వసించినవాడు. మతప్రచారం చెయ్యాలనే ఉద్దేశంతో న్యాయవాదివృత్తిని కూడా విసరించాడు. అయితే అప్పటికి మతప్రబోధంలో అతనికి పెద్దనైపుణ్యాం కలగలేదు కూడాను. ప్రిటోరియాలో సొంతఖర్చుమీాద ఒకచర్చి నిర్మించి, అందులో రోజూ మతప్రబోధం చేసేవాడు. గాంధిజీనికూడా అక్కడికి రావలసిందని ఆహ్వానించాడు. చర్చికి తఱచూ వచ్చేవారిలో కొందఱు స్త్రీలుకూడా ఉండేవారు. వారందఱూ కుమార గాంధికి త్వరలోనే పరిచితులైనారు.వీరేకాక మఱికొందరు పురు షులుకూడా అయనతో స్నేహంచేశారు. అలా స్నేహం చేసినవారందఱిలోనూ మైఖేల్ కోట్సు గాంధిజీకి ఆ రోజులలో ముఖ్యమిత్రుడైనట్లు కనబడుతుంది. ఈ మైకేల్ కోట్సు జార్జి

ఫాక్స్ స్థాపించిన 'క్వేకర్ మిత్రమండలి'లో సభ్యుడు.

అయితే గాంధిజీకి క్రైస్తవమతం స్వీకరించాలనే సంకల్పం అప్పుడుగానీ, మరి యెప్పుడైనాగానీ కలగనేలేదు. కారణం ఏమంటే క్రైస్తమతంలోని ప్రధానసిద్ధాంతంమీద ఆయనకు విశ్వాసం ఏర్పడలేదు. హిందూమతంపట్ల దృఢమైన విశ్వాసంకలవారందఱివలెనే గాంధిజీకికూడా క్రైస్తవమతాన్నే ఏకైక సత్యమతంగా విశ్వసించటం అసాధ్యమైపోయింది. గాంధిజీ వయస్సు అప్పటికే 24 సంవత్సరాలని మనం జ్ఞాపకం పెట్టుకొంటే ఆయన అప్పుడు క్రైస్తవమతం ఎందుచేత అంగీకరించలేదు అనే ప్రశ్న రాదు. మానవులందఱూ భగవంతుని కుమారులేనని ఆ వయస్సువఱకు నమ్మిన గాంధికి ఏసుమాత్రమే దైవసంభూతుడని నమ్మశక్యం కాలేదు.

అదీగాక మఱొక సమస్యకూడా ఆయనను బాధించింది. ఆత్మఅనేది అంతటా ఒకటే అని ఆయన గట్టిగానమ్మిఉన్నాడు. మఱి మనుష్యులకు మాత్రమే ఆత్మవున్నదనీ, ఇతర జంతువులకు అది లేదనీ అంటే ఆయనకు విడ్డూరంగా తోచింది. అయితే ఆయన అప్పటికి హిందూమత సిద్ధాంతాలన్నీ అవగతం చేసికొనలేదు కానీ, బాల్యంనుంచీకూడా జన్మాంతరం ఉన్నదనీ జనన మరణాలు ఒక చక్రంలాగా పరిభ్రమిస్తూ ఉంటాయనీ విశ్వాసం ఆయనలో వేళ్లు పాదుకొని ఉన్నది. అంతేగాక ఆయనకు తన మతాన్ని గుఱించి సంపూర్తిగా తెలిసినా తెలియకపోయినా, ఆ మతంమీద సంపూర్ణవిశ్వాసం కలిగినా కలగకపోయినా, దానికి ఎంతో భిన్నమైన మఱొక మతాన్ని విశ్వసించటంమాత్రం సాధ్యంకాలేదు.

క్రైస్తవమతం సర్వోత్కృష్టమన్న విశ్వాసంకల మిత్రు లందరూ తమ మతగ్రంథాలు ఆయనచేత చదివించి, తమ మతం అవలంబించవలసిందని చెప్పినకొద్దీ, తనమతం ఏమిటో చక్కగా తెలిసికోవాలన్న అభిప్రాయం ఆయనకు బలపడ్డది. స్వమతంపట్ల అభిమానం ఎక్కువైనది.

నేను అనుకొంటున్నట్లు గాంధిజీ ప్రతిభ ప్రధానంగా మతవిషయికమే అయితే, ప్రిటోరియాలో గడచిన మొదటి రోజులు ఆయన జీవితంలో దానిని అభివృద్ధి చేసికొనటానికి తోడ్పడిఉంటాయనటంలో సందేహంలేదు. ఇతర మత ప్రచా రకులతో ఆయన ముఖాముఖిగా వాదించవలసిన అవసరం ఇప్పుడే కలిగింది. లండనులో ఉండగా ఆయనను క్రైస్తవ మతంలోకి ఆకర్షించటానికి ఎవరూ ప్రయత్నించి ఉండలేదు. ఇప్పుడు ఇక్కడ ఇటువంటిది తటస్థించేసరికి ఆయన తన వైష్ణవ మత సంప్రదాయాలనూ, వాటి ఉత్కృష్టతనూ చక్కగా అవ గతం చేసికొనటానికి అవకాశం కలిగింది. మానసికశక్తిని బాగా అభివృద్ధిచేసికొని, సహేతుకంగానూ, ఆవేశరహితం గానూ వాదోపవాదాలుచేసే శక్తి యేర్పడ్డది. పాపమూ, దాని పరిహారమూ వివరించే క్రైస్తవ మతగ్రంథాలు ఆయన చదివాడు. "పాపఫలితాలనుంచి కాక పాపంనుంచే విముక్తి పొందాలి." అని వాంఛించిన గాంధిజీకి జీససుద్వారా పాప పరి హారం పొందటం సత్యసమ్మతంగా తోచలేదు. ప్లిమత్ సోదరు లలోని మతప్రచారకుడొకడు ఆయనకు తటస్థపడ్డాడు. అతను మత ప్రచారమే పరమలక్ష్యమైనవాడు. అంతేగాక తాను ఎంతపాపమైనా చెయ్యవచ్చుననీ, ఏమిచేసినా ఏసుక్రీస్తును

ప్రార్థిస్తే ఆ పాపానికంతా పరిహారం జరుగుతుందనీ అతని వాదన. అతనుకూడా క్రైస్తవ సిద్ధాంతాలన్నీ వివరించే పుస్తకాలు గాంధిజీని చదవవలసిందని యిచ్చాడు. అయితే అవి గాంధిజీని అంతగా ఆకర్షించలేకపోయాయి. "పర్వత శిఖరం మీాద సందేశం" అన్నది ఎప్పుడో గాంధిజీ చదివినదే. అది ఆయనను ఆకర్షించిన మాటకూడా వాస్తవమే. అయితే అప్పుడుగానీ, తర్వాతగానీ ఆయన క్రైస్తవమతాన్ని స్వీకరించటానికి మాత్రం అంగీకరించలేదు.

గాంధిజీ చురుకైనవాడూ కష్టపడి పనిచేసేవాడూ అయినా, ఇతర కార్యభారంవల్ల ఆయనకు ఇప్పటివఱకూ మతంవైపు దృష్టి మళ్ళించటానికీ, తాను విశ్వసించిన మతాన్ని గుఱించి పరిశోధన చెయ్యటానికీ అవకాశం కలగలేదు. చదువుకొనే రోజులలో ఆయనకు ఇందుకు తీఱిక లేకపోయింది. ఇప్పుడైతే సేట్ అబ్దుల్లా వ్యవహారంలో మఱికొందఱు న్యాయవాదులుకూడా పనిచేస్తూ ఉండటంవల్ల ఆయనకు ఎక్కువపని లేకపోయింది. ఎంతో తీఱుబడి చిక్కింది. అందుచేత ముందు క్రైస్తవమతమూ తర్వాత మహమ్మదీయమతమూ, హిందూమతమూకూడా సవిమర్శకంగా పరిశీలించినమీాదట, స్వతస్సిద్ధమైన ప్రతిభావిశేషంతో తర్కించుకొన్న గాంధిజీకి, విశ్వ శ్రేయమైన హిందూమతమే సర్వోత్కృష్టమన్న నిశ్చయం కలిగింది.

ప్రిటోరియాకు వెళ్ళేటప్పుడు కలిగిన అనుభవాలతో ట్రాన్స్‌వాల్‌లో భారతీయులకు ఏపాటి గౌరవం ఉన్నదీ ఆయనకు బాగా తెలిసివచ్చింది. కాబట్టి యిక్కడ ఉండగానే భార

తీయుల పరిస్థితిని చక్కబఱచటానికి తాను చెయ్యగలిగిన దంతా చెయ్యాలని ఆయన భావించాడు. తమ కంపెనీకి ప్రతి స్పర్థిగా ఉన్న సేట్ తియాబును కలిసికొని మాట్లాడి, అతనితో స్నేహం చేసికొన్నాడు. తియాబు గాంధిజీసౌజన్యం చూచి ముచ్చటపడ్డాడు. ఒకసారి గాంధిజీ కోరికమీద తియాబు ట్రాన్స్వాల్ రాజధానీనగరంలోని భారతీయుల నందఱినీ ఒక చోట సమావేశపఱిచాడు. స్థానిక వర్తకులలో మేటి అయిన ఒక ముస్లిము ఇంటిలో సభ జరిగింది. గాంధిజీ ఆ సభలో ఉపన్యసించాడు. అదే ఆయన మొట్టమొదటి ఉపన్యాసం.

సభలో ప్రసంగించటం అంటే సిగ్గుపడే గాంధిగారి ఆ తొలి ప్రసంగం చాలా చక్కగా సాగిందంటే ఆశ్చర్యమే. భారతీయులకు తన చల్లనైనంత సాయం చెయ్యాలని ఆయన సంకల్పం. అయితే ముందుగా వారి విధులేమిటో స్పష్టపఱిచాడు. వాణిజ్యంలో సత్యపాలన మొట్టమొదటి వ్రతంగా భావించవలసిందని సభ్యులను అర్థించాడు. వర్తకంలో సత్యానికి తావులేదని భారతీయ వర్తకులు భావించినట్లు అంతకు ముందే ఆయన తెలిసికొన్నాడు. చాలా విచారపడ్డాడు. కాబట్టి వర్తకంలోగానీ, మఱియే వృత్తిలోగానీ సత్యపాలన అవసరమై ఉండటమే కాక, సత్యమే లేకపోతే భారతీయ జాతి మొత్తానికి ఎంతప్రమాదం కలుగుతుందో ఆ ప్రసంగంలో వారికి నచ్చచెప్పాడు. ఒక్క భారతీయ వర్తకుడు వ్యాపారంలో దగాచేస్తే 'అందఱు భారతీయ వర్తకులూ వంచకులే!' అనే అపవాదం పుట్టుతుందని హెచ్చరించాడు. ఆ అపవాదం వల్ల విదేశాలలో ఉన్న భారతీయు లందఱి గతీ అధోగతే అని

కూడా విశదీకరించాడు. తర్వాత ఆరోగ్యసూత్రాలు పాటించవలసిన అక్కఱ స్పష్టీకరించాడు. మతాలు వేఱుగదా అని ఒకరికొకరు దూరంకాక, అందఱమూ భారతీయులమే, భారతీయులందఱూ ఒకే జాతి అని విశ్వసించి హిందువులూ, ముస్లిములూ, పార్సీలూ, క్రైస్తవులూ, పంజాబీలూ, మద్రాసీలూ మొదలయిన వారందఱూ ఐకమత్యంతో ప్రవర్తించవలసిందని ప్రబోధించాడు. భారతీయుల కష్టసుఖాలు విచారించి, వారి హక్కులను నిలబెట్టుకోవటానికీ, ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తూ తగిన సౌకర్యాలు సంపాదించుకోవటానికీ ఒక ఒక భారతీయ సంఘం ఏర్పడటం అవసరమని సూచించాడు.

మొదటినుండీ చిట్టచివరవరకూ ఆయన చేసిన ప్రసంగాలకు ఇది ఒక మచ్చుతునక. భారతీయులకోసం తనవల్ల కాదగినంత కృషి తాను చేస్తాననే హామీతో ఈ ప్రసంగాన్ని ముగించాడు.

గాంధిజీ ఉపన్యాసం సభ్యులలో నూతనచైతన్యం కలుగజేసింది. వెంటనే ఒక సంఘమున్నూ ఏర్పడింది. ముగ్గురు యువకులు గాంధిజీని సందర్శించి తమకు ఆంగ్లభాష నేర్పవలసిందని అడిగారు. ట్రాన్స్‌వాల్ రైల్వే నిబంధనలన్నీ సాకల్యంగా పరిశీలించినమీదట గాంధిజీ సంఘంపక్షాన రైల్వే అధికారులకు ఒకఉత్తరం వ్రాశాడు. అందులో భారతీయులు రైలుబండిలో ఏ తరగతిలోనైనా ప్రయాణం చెయ్యటానికి రైల్వే నిబంధనలు అడ్డు రావటంలేదు గనుక, వారు కొన్న టిక్కెట్టుకు తగిన తరగతిలో ప్రయాణం చెయ్యటానికి అనుమతించవలసిందని అభ్యర్థించాడు. అప్పటినుంచీ భారతీయులకు ఒకటి రెండవ

తరగతులలో ప్రయాణం చెయ్యటానికి అభ్యంతరం ఉండదనీ, 'ఉచితమైన దుస్తులు' ధరించిన భారతీయులకు ఆ తరగతుల టిక్కెట్లు అమ్మటం జరుగుతుందనీ రైల్వే అధికారులు జవాబు ఇచ్చారు. కాని ఏ దుస్తులు ఉచితమైనవో నిర్ణయించేది టిక్కెట్లు అమ్మే మనిషే !

ఆ విధంగా ప్రిటోరియాలోని కొద్దిమంది భారతీయులకు తప్ప ఇతరు లెవ్వరికీ తెలియకుండానే మహాత్మగాంధి మహోద్యమం సన్నసన్నగా ప్రారంభమైనది. ఈ కృషికి ఆయన 'ప్రజాసేవ' అని పేరుపెట్టాడు. ఇందుకు ఏ విధమైన ప్రతిఫలమూ తీసికోరాదని నిశ్చయించుకొన్నాడు; ఇటువంటిపని అంతకు ముందెన్నడూ ఆయన చేసి ఉండలేదు. కాలం గడచినకొద్దీ ఈ "ప్రజాసేవ" తనను ఏ విధంగా నడిపిస్తుందో ఆయన ముందుగానే ఊహించి ఉంటాడన్నది సందేహాస్పదమే. అయితే ఆ 1893 వ సంవత్సరంలో ప్రిటోరియాలో ఆయన పాల్గొన్న సభలో చేసిన తొలి ప్రసంగంలోనే "ప్రజాసేవ"కు బీజం వెయ్యటం జరిగింది. ఆత్మగౌరవాన్ని నిలుపుకొనటానికీ, పారతంత్ర్యంనుంచి విముక్తి పొందటానికీ భారతీయులు సత్యమే వచించటం, పరిశుభ్రత పాటించటం, ఆరోగ్యపద్ధతులకు తగినట్లు ఇండ్లు బాగుచేయుచుకొనటం, ఇంగ్లీషు నేర్చుకొనటం, తమలోని విభేదాలు మఱచిపోవటం, అత్యవసరమనీ, క్రమశిక్షకు లోబడిఉండటం ముఖ్యమనీ గాంధిజీ హెచ్చరించాడు. అటుతర్వాత 50 సంవత్సరాల దీర్ఘకాలం ఆయన చేసిన ప్రబోధంలోనూ ఇదే పరమార్థం గర్భితమై ఉన్నది. ఇది రాజకీయపు ఎత్తుగా ఆయన భావించలేదు. నిజానికి ఆయన సందే

శంలో రాజకీయపు వాసన లేనేలేదని స్పష్టపడుతూనే ఉన్నది. గాంధిజీ అన్నట్లు "భారతీయులు సామాజిక శ్రేయస్సుకోసం అనుసరించవలసినపద్ధతులు" మాత్రమే ఆ సందేశం వివరిస్తున్నది.

ట్రాన్స్‌వాల్, ఆరెంజి ఫ్రీ స్టేట్లలో నివసిస్తున్న భారతీయులకు క్రొత్తకష్టాలూ, క్రొత్తదుఃఖాలూ, క్రొత్త ఇబ్బందులూ వచ్చిపడుతున్నట్లు గాంధిజీకి ప్రతిదినమూ, ప్రతి వారమూ వార్తలు వచ్చేవి. ఫ్రీస్టేట్‌లో కొన్ని అల్పవృత్తులలో తప్ప తక్కినవాటిలో భారతీయులకు స్థానమేలేదు. ట్రాన్స్‌వాల్‌లో శాసనసభ భారతీయుల విషయంలో జాలి అనేదే చూపటంలేదు. వారికి అక్కడ వోటు హక్కులేదు. ఎక్కడో నిర్దిష్టప్రాంతాలలో తప్ప మరిఒకచోట వారు భూమి కొనటానికిగానీ, ఇండ్లు కట్టుకొనటానికిగానీ వీలులేదు. "నిజానికి ఆ నిర్దిష్టప్రాంతాలపైనా వారికి స్వామ్యం లే"దని గాంధిజీ అన్నాడు. అసలు ట్రాన్స్‌వాల్‌లో అడుగుపెట్టటానికే భారతీయులు తలకు 3 పౌనులు పన్ను చెల్లించవలసివచ్చేది. ప్రత్యేకమైన అనుమతిలేకుండా రాత్రి తొమ్మిదిగంటలు దాటినతర్వాత భారతీయ జనమూ వీధిలోకి వెళ్ళగూడదు. రాజవీధిలో నడిచేటప్పుడయినా ప్రజలందరితోబాటు ప్రక్కబాటనగాక, మృగాలతో సమానంగా రోడ్డుమీదనే నడచిపోవాలి. ఒకసారి గాంధిజీ రాజవీథిని ఇతర ప్రజలతోబాటు నడుస్తూ ఉంటే ప్రెసిడెంట్ క్రూగర్ ఇంటిసమీపంలో ఒక రక్షకభటుడు ఆయనను హఠాత్తుగా అడ్డగించాడు. అదివరకు ఆయన చాలాసార్లు అలా వెళ్లాడు కానీ ఇటువంటి అవరోధం ఎన్నడూ కలగలేదు. యథార్థానికి ఈ ప్రయాణనియమాలు రక్షకభటుల

చిత్తవృత్తులనుబట్టి మాత్రమే సాగుతున్నవి. భారతీయులు వీటిని ఎదిరించి పరిస్థితులు చక్కబరచుకొనలేక రతుకభటుల దయాదాక్షిణ్యాలమీద ఆధారపడవలసి వచ్చేది.

కాని భారతీయుల స్థితిగతులను చక్కబరచాలని గాంధిజీ ఎంత ఆరాటపడుతున్నా తాత్కాలికమైన తన కార్య భారాన్ని బట్టి కొంతకాలం ప్రజాసేవను ఆపివేయవలసివచ్చింది. సేట్ అబ్దుల్లాకున్నూ అతని బంధువైన సేట్ తియాబుకున్నూ మధ్య నడుస్తున్న వ్యవహారంలో గాంధిజీకూడా గట్టిగా పని చెయ్యవలసిన ఒత్తిడి కలిగింది. తన తరఫు ప్రతినిధి(అటార్నీ)కి వ్యవహార పరిస్థితులను విశదపఱచటంకోసమే అబ్దుల్లా గాంధి జీని నియమించాడు. అయితే ఆ ప్రతినిధి గాంధిజీ సూచన లలో కొన్నింటిని ఆమోదించాడు; కొన్నింటిని తిరస్కరిం చాడు. ఆ ప్రతినిధి తన సూచనల నన్నిటినీ సంక్షిప్తంగా బారి స్టరుకు నివేదించగా, ఆయన వాటిలో కొన్నిటినే ఆమోదిం చాడు. న్యాయశాస్త్రంలోనూ, వాణిజ్యపు లెక్కలలోనూ, భాషానువాదంలోనూ ఇందువల్ల తనకు మంచి అనుభవం కలి గిందని గాంధిజీ అన్నాడు.

ఎలాగైతేనేమి మొత్తంమీద ఉభయపక్షాలకూ కోర్టు ఫీజులూ, ఇతర వ్యయాలూ కలసివచ్చే పద్ధతి గాంధిజీ సూచిం చటంచేత ఒక ఒప్పందం జరిగింది. మిత్రుడుగా మాఱిన ప్రతి స్పర్థి సేట్ తియాబు గాంధిజీసలహాలను ఆమోదించి ఒకమధ్య వర్తి ఆదేశానుసారం నడచుకొనటానికి అంగీకరించాడు. ఆ మధ్యవర్తి ఉభయపక్షాలవాదనలూ విన్నాడు. చివరకు గాంధిజీ కక్షిదారుకే విజయం కలిగింది. అయితే సేట్ తియాబు చెల్లించ

వలసిన పైకం చాలా పెద్దమొత్తం కావటంచేత అది దఫాల వారీగా పుచ్చుకొనటానికి సేట్ అబ్దుల్లాను ఒప్పించవలసినభారం గాంధిజీమీద పడ్డది. మొత్తం అంతా ఒక్కసారి చెల్లించ వలసివస్తే తియాబు దివాలా తీయవలసిందే. అనేక సంవత్స రాల దీర్ఘకాలపు వాయిదాలలో తియాబు బాకీమొత్తం తీర్చే టట్లు ఒప్పందం కుదిరింది. ఇందుకు తియాబు సంతోషించాడు. ఏదోవిధంగా తనసొమ్ము తనకు వస్తున్నదిగదా అని అబ్దుల్లా కూడా ఆనందించాడు. అప్పటినుంచీ ఏ అభియోగాన్నైనా ఇలాగే శాంతి సాధనమార్గాలతోనే సాధించటం గాంధిజీకి ఒక అలవాటైంది. న్యాయవాదులకైతే ఇది వింతగానే కనిపిస్తుంది గానీ ఈ పద్ధతి గాంధిజీ నిపుణతకు సరిపోయింది.

ఇప్పటికి అబ్దుల్లా వ్యవహారం నిమిత్తం గాంధీజీ దక్షి ణాఫ్రికాలో ఉండవలసిన సంవత్సరకాలం ముగిసింది. అందు వల్ల ఆయన భారతదేశానికి తిరిగి వెళ్ళిపోవటానికి సిద్ధపడ్డాడు. ఆయన జీవితంలో ఆ సంవత్సరం ఎంతో విలువైనది. ప్రపంచ పరిస్థితులూ, మతతత్త్వాలూ తెలిసికొనటానికి అవకాశం అప్పుడే కలిగింది. "భగవంతుని రాజ్యం నీలోనే ఉన్నది." అన్న టాల్‌స్టాయ్ రచన ఆయన అప్పుడే చదివాడు. సనాతన క్రైస్తవ సిద్ధాంతాన్ని టాల్‌స్టాయ్ ఆ గ్రంథంలో చాలా హృద్యంగా చిత్రించాడు. మానవులు "పర్వత శిఖరంమీద వినబడ్డ సందేశం" ప్రకారమే జీవించినట్లయితే, ప్రభుత్వం, రక్షకభటులు, సైన్యం అనేవి నిరర్థకాలన్న టాల్‌స్టాయ్ వాదం గాంధిజీకి నచ్చింది. అప్పటికి గాంధిజీకి ఒక లక్ష్యం అంటూ ఏర్పడకపోయినా, టాల్‌స్టాయ్ రచన అటువంటి లక్ష్యం ఒకటి

ఆయన ఏర్పఱుచుకొనటానికి తగ్గ ప్రోత్సాహం ఇచ్చిందన టంలో సందేహంలేదు. ఆయన టాల్‌స్టాయ్‌తో ఉత్తరప్రత్యుత్త రాలు జరపటానికి 1909 వ సంవత్సరం నాటికిగాని సాహసించక పోయినా, టాల్‌స్టాయ్ ప్రభావం ఆయనమీద ప్రసరించటం దక్షిణాఫ్రికాలో గడచిన ఆ మొదటి సంవత్సరంనుంచే ప్రారంభ మైనదని చెప్పక తప్పదు. క్రైస్తవమతసంస్థ (చర్చి) మీదనూ, రాజ్యాంగంమీదనూ టాల్‌స్టాయ్ చేసినఉజ్జ్వలమూ, నిశితమూ అయిన విమర్శా, అధర్మఖండనా, క్రైస్తవులలో మాటకూ చేతకూ గల వ్యత్యాసాన్ని నిరూపిస్తూ చేసిన వ్యంగ్యరచనా పాఠకునిలో అపూర్వమైన ఆ వేదనను కలిగిస్తాయి. గ్రంథం చదవటం పూర్తి అయిన పిమ్మట టాల్‌స్టాయ్ అభిప్రా యాలను గుఱించి కొంతసంశయం కలగవచ్చును. కాని పుస్తకం చదువుతూన్నప్పుడు మాత్రం ఎంతో నమ్మకం ఏర్పడుతుంది. టాల్‌స్టాయ్ గ్రంథం చదవటం ముగించిన పాఠకునిలో "రక్షకభటశాఖ అనేది లేకుండానే దేశంలో శాంతిభద్రతలను ఎలారక్షించవచ్చును?" అనేప్రశ్న ఉద యించి తీఱుతుంది. దానినిగుఱించి అతను దీర్ఘాలోచన చెయ్య టం ప్రారంభిస్తాడు. క్రీస్తుబోధనలను అందఱు తు. చ. తప్పక ఆచరిస్తే శాంతిభద్రతలను రక్షించటానికి ఏ ప్రభుత్వశాఖ కూడా అక్కఱలేదని టాల్‌స్టాయ్ మనకు జవాబు చెప్పు తున్నాడు. అతను చెప్పిన జవాబులో వంకపెట్టటానికి వీలు లేదుగానీ, అతను అన్నట్లు జరగటం ఈ మానవసమాజంలో ఎన్నటికీ సంభవంకాదు. గాంధిమహాత్ముడుకూడా తన జీవిత కాలం అంతా "ఈ సిద్ధాంతం ఎంతవఱకు ఆచరణసాధ్యం అవు

తుంది ?" అని విచారించి చిట్టచివరకు టాల్‌స్టాయ్‌పట్ల మొట్ట మొదట కలిగిన అభిప్రాయాన్ని కొంతవరకు సవరించుకొన్నట్లు కనబడుతుంది. ఇక రెండుమూడురోజులకు కీర్తిశేషుడౌతాడనగా ఆయన నాతో ఇలా అన్నాడు: "బలప్రయోగం లేకుండా ఏ సామాన్య ప్రభుత్వంకూడా మనలేదని జ్ఞాపకం పెట్టుకోండి!"

దక్షిణాఫ్రికాలో యువక గాంధికి అనుభవపూర్వకమైన దివ్యశక్తి (అనుభవమే దివ్యశక్తి అయితే) ఇంకా వెలుగవలసి ఉన్నది. టాల్‌స్టాయ్ అభిప్రాయాలను అత్యంతాసక్తితో పరిశీ లించిన మీదట ప్రాచీనవిజ్ఞానుల రచనలు (పర్వత శిఖరం మీద సందేశమూ, భగవద్గీతా) ఆజ్ఞాపించినట్లు ప్రవర్తిస్తే మానవసమాజంలో సహజంగా కలిగే పరస్పరవైరుధ్యాలకు తాను అతీతుడుగా ఉండవచ్చునని గాంధిజీ భావించాడు. అచిర కాలంలోనే ప్రపంచపటంలోని వేర్వేఱు ప్రదేశాలను నావి కుడు గుర్తుపెట్టుకొని ప్రయాణం సాగించినట్లు, ఈగ్రంథాలలోని సిద్ధాంతాలను చక్కగా జ్ఞాపకంపెట్టుకొని తదనుగుణంగా జీవ యాత్ర సాగించాడు.

తర్వాత గాంధిజీ డర్బనుకువెళ్ళి తన ప్రయాణానికి సన్నాహాలు చేశాడు. ఆయనకు వీడ్కోలు ఇవ్వటానికి అబ్దుల్లా డర్బనులోని భారతీయుల నందఱినీ పిలిచి ఒకసమావేశం ఏర్పాటుచేశాడు. ఆ సమావేశంసమయంలో దైవికంగా గాంధిజీ దృష్టి ఒక వార్తాపత్రికమీద పడ్డది. అందులో ఒకచోట నేటాలు శాసన సభలో చర్చకు వచ్చిన "భారతీయ పౌరసత్వ శాసనం" గుఱించిన వివరాలు కొన్ని కనిపించాయి. ఆ శాస నం ప్రకారం భారతీయులకు వోటు హక్కు ఉండరాదు. ఇటు

వంటి దారుణశాసనం పూర్తిగా శాసనసభ ఆమోదాన్ని పొందినట్లు కూడా కనిపించింది. గాంధిజీ అది అంతా చదివి ఆశ్చర్యంతో తన భారతీయ మిత్రులను "మీరు ఈ విష యంలో చెయ్యగలిగింది ఏమీ లేదా?" అని ప్రశ్నించాడు. వారు చెయ్యగలిగింది ఏమీ లేనిమాట వాస్తవమే. ఆ దేశంలో తమకు ఎంత గౌరవం ఉన్నదీ వారికి తెలుసు. పెనగులాట నిష్ప్రయోజనమని వారు భావించారు. అందుచేత ఆ విష యమై వారు ఎక్కువశ్రద్ధ చూపలేదు. అప్పుడు గాంధిజీ పౌర సత్వం ప్రాముఖ్యమూ, వోటు విలువా ఎటువంటివో వారికి నచ్చజెప్పి, వోటుహక్కు లేకపోతే వారిస్థితి ముందుముందు ఎంత శోచనీయంగా మారుతుందో బోధపఱచటానికి యత్నిం చాడు. "అలా అయితే, మీరు మాతో ఉండి, ఎప్పుడు ఏమి చెయ్యాలో అది అంతా చేయించండి." అని వారు ఆయనను అభ్యర్థించారు.

వారు ఆ శాసనాన్ని ఎదిరించి పోరాడటానికి తగిన ధన బలం సమకూర్చుకోగలిగితే, తాను ఒక నెలరోజులు అక్క డనే ఉండగలనని ఆయన అన్నాడు. ఆ ప్రయత్నంలో తనకు ఏమీ ప్రతిఫలం అక్కఱలేదనికూడా చెప్పాడు. అయితే కాగితాలు అచ్చువేయటానికీ, పూర్వోత్తర సంఘటనలూ, పరిపాలనా పద్ధతులూ పరిశీలించటానికీ, న్యాయశాస్త్రజ్ఞులతో సంప్రతించటానికీ, ప్రయాణాలకూ కొంతధనంఖర్చు అవుతుందనీ, ఇందుకు ఒక్క మనిషివల్ల అన్నివనులూ జరుగవనీ, అనేకులు కలసి పనిచేయవలసి ఉంటుందనీ చెప్పాడు. అందుకు కొంత మంది స్వచ్ఛందసేవకుల అవసరంకూడా ఉంటుందనీ అన్నాడు.

ఆయన జీవితకాలంలో ఇతరోద్యమాలన్నింటిలోనూ, జరిగినట్లే యీ సందర్భంలోకూడా పిలిచినంతలోనే స్వచ్ఛంద సేవకులు ఎందఱో ఆయన దగ్గఱకు వచ్చారు. దానితో ఒక సలపాటు (అదే తర్వాత కొన్ని సంవత్సరాలుగా మాఱిం దనుకోండి) ప్రయాణం వాయిదా వేసికొని ఆయన ఉద్యమం లోకి దిగాడు. దక్షిణాఫ్రికా భారతీయ యువకులలో చాలా మంది క్రైస్తవులు. వారు హిందువులతోనూ, మహామ్మదీయుల తోనూ కలసిమెలసి ఉండరు. అది ఆయనకు తెలుసు. అయితే ఆయన వారినే స్వచ్ఛంద సేవకులుగా వరించాడు. వారు యువ కులూ, కొంచెమో గొప్పో చదువుకొన్నవారూకూడా. వారు కూడా ఆయన పిలవగానే అసంఖ్యాకులుగా వచ్చారు.

భారతీయులకు ఈ శాసన విషయాలు తెలిసేవఱ కున్నా శాసనసభలో ఈ విషయం చర్చకు పెట్టక రెండు రోజులు గడువియ్యవలసిందని స్పీకరును (శాసనసభను ప్రవర్తిం పజేసే సభాపతిని) అభ్యర్థిస్తూ తంతివార్త పంపటం మొదటిపని. వెంటనే అభ్యర్థన రూపొందించటం జరిగింది. దానికి మూడు ప్రతులు తయారైనాయి. ఒకటి శాసనసభకూ, రెండవది ముద్రణకూ పంపారు. మూడవది భారతీయ సంఘ కార్యాల యంలో భద్రపఱచారు. స్పీకరు రెండురోజులే గడువిచ్చాడు. ఈ రెండురోజుల లోపల నేటాలు భారతీయులందఱికీ ఈ శాసన స్వరూపం, దీనివల్ల కలిగే ఫలితాలూ తెలియజెయ్య వలసి ఉన్నది. గాంధిజీ స్వచ్ఛందసేవకులతో అహోరాత్రాలు శ్రమించాడు. గడువు దాటకుండానే భారతీయుల అభ్యర్థన పత్రం శాసనసభకు చేరింది. సభవారు దానిని పరిశీలించి

చర్చలు జరిపారు. ఈ లోపల పత్రికలలో ఈ విషయం ప్రకటించబడ్డది. దేశంలో అలజడి బయలుదేరింది. అయినా శాసనసభ భారతీయుల అభ్యంతరాన్ని లెక్కచెయ్యలేదు; శాసనం సభ ఆమోదాన్ని పొందింది.

చివరి నిమిషంలో అటువంటి అపజయం కలిగినా గాంధిజీ నిరుత్సాహపడలేదు. అదే ఆయనలోని విశిష్టత. ఆ అపజయం భవిష్యత్కార్యక్రమాలను చక్కగా నడపటానికి దోహదం చేసింది. డర్బనులో ఎవరిత్రోవ వారిదే అన్నట్లున్న భారతీయులు ఈ అనుభవంతో ఒకటి అయినారు. అపజయం కలిగితేనేమి? ఈ ఐకమత్యం సంభవించటం గొప్ప విషయంకాదా! నేటాలులోఉన్న భారతీయజాతివారిలో సాధ్యమైనంత అత్యధిక సంఖ్యచేత సంతకాలు చేయించిన అభ్యర్థనపత్రం ఒకటి లండనులోని వలసరాజ్యాల కార్యదర్శికి (రిప్పనుప్రభువుకు) పంపాలని వారు నిర్ణయం చేసికొన్నారు.

అయితే ఇంతవరకు పడ్డ శ్రమకంటె ఇప్పుడు ఇంకా ఎక్కువ శ్రమపడాలి. నేటాలు చాలా పెద్దరాష్ట్రం. అందులోని గ్రామాలుకూడా దూరదూరంగా ఉన్నవి. గాంధిజీ స్వచ్ఛంద సేవకులకు ఇప్పుడు ఊపిరిపీల్చుకొనటానికైనా తీరనంతపని కల్గింది. భారతీయులకు ఐకమత్యం కలగటమూ, వారిలో ఒక కార్యనిర్వహణచాతుర్యం, జాతీయతాప్రచారం ఏర్పడటమూ దక్షిణాఫ్రికాలో ఎన్నడూ కనీవినీఎరుగని విషయాలు. అయితే స్వచ్ఛందసేవకుల పర్యటన ఈ అపూర్వఫలాలను సాధించటమే కాక, భవిష్యత్తు చక్కగా నిర్మించుకొనటానికితగ్గ పరిస్థితులను కూడా సృష్టించగలిగింది. అంతవరకున్నూ తోడి భారతీయు

లకు ఎడముఖం పెడముఖంగా ఉంటున్న భారతీయ క్రైస్తవ యువకులు గాంధీజీ అడుగుజాడలలో నడవటానికి నిశ్చయించు కొని పాటుపడటం ఇందుకు ఒక నిదర్శనం. గాంధీజీ లండనులో నేర్చిన ఆంగ్లేయభాషా, ఆంగ్లేయ వేషమూ, జాతికంతా గర్వ కారణమైన బారిస్టరువృత్తీ భారతీయులను కొంతవఱకు ఆకర్షిం చాయనుకొన్నా, ముఖ్యంగా ఆయన సాధుత్వమూ, నిరంతర ప్రబోధమూ ఎంతో ఆకర్షణహేతువులైనాయని చెప్పక తప్పదు. రెండువారాలలో అభ్యర్థనపత్రంమీాద పదివేలమంది చేత సంతకాలు చేయించటం జరిగింది. ఇండియా, ఇంగ్లాండు దేశాలలోనూ, మఱి యితర దేశాలలోనూ ప్రచారంకోసం ఈ అభ్యర్థనపత్రానికి వెయ్యిప్రతులు ముద్రించటమున్నూ జరిగింది. పత్రికలతో అనుబంధం ఏర్పడింది. ఎప్పటికప్పుడు వార్తలు ప్రకటిస్తున్నారు. లండనులోని టైమ్సుపత్రికా, టైమ్సు ఆఫ్ ఇండియా అనే బొంబాయి పత్రికా భారతీయుల వోటు హక్కును సమర్థించాయి. దక్షిణాఫ్రికాలో తలయెత్తిన జాతి ద్వేషంవల్ల ఉత్పన్నాలైన సమస్యలు ఎటువంటివో ఇంగ్లాండు భారత దేశాలకు తెలిసింది ఇప్పుడే.

నిరంతరమైన యీా కార్యక్రమంలో నెలరోజులూ గిఱ్ఱున తిరిగిపోయాయి. అయితే గాంధీజీ ప్రయాణం ఉద్యమ సార్థకత్వంకోసం వాయిదా వెయ్యవలసి వచ్చింది. ఆయనపైనే నేటాలుభారతీయుల భవిష్యత్తు ఆధారపడిఉన్నది. వారికోసం ఆయన చెయ్యవలసినది యెంతైనాఉన్నది. డర్బను భారతీయులు ఆయనను విడిచిపెట్టటానికి అంగీకరించలేదు. కాని తానుచేసే ప్రజాసేవకు ప్రతిఫలం ద్రవ్యరూపంగా గానీ, మఱేరూపాన

గానీ స్వీకరించటానికి ఆయన సమ్మతించడు. అందువల్ల ఒక సంవత్సరంపాటు ఆయన న్యాయవాదవృత్తితో జీవించటానికి అనువైన యేర్పాట్లు చెయ్యాలని డర్బను భారతీయ వర్తక సంఘం నిశ్చయించింది. ఆయన కోరికకూడా అంతే. లండను బారిస్టరుహోదాకు తగినట్లు గౌరవంగా జీవించటానికీ, ఒకటవ తరగతిలో ప్రయాణం చెయ్యటానికీ, సంవత్సరానికి మూడు వందల పౌనులు కావాలి. ఈ ద్రవ్యం సులభంగానే సమకూడింది.

నేటాలులోని (సుప్రీముకోర్టు) సర్వోన్నత న్యాయస్థానం గాంధిజీని న్యాయవాదిగా ప్రవేశపెట్టుకొనటానికి ఆయన ఎన్నో శ్రమలు పడవలసి వచ్చింది. అక్కడ పనిచేసే న్యాయవాదు లందఱూ యూరోపియనులే. వారు ఆయన న్యాయస్థానంలో ప్రవేశించటానికి అంగీకరించలేదు. కాని ప్రధాన న్యాయమూర్తి వారి అభ్యంతరాలను లెక్కచేయలేదు. న్యాయశాస్త్రానికి 'రంగుజాతులు, శ్వేతజాతులు అనే భేదం లే'దని చెప్పి గాంధిజీని వెంటనే న్యాయస్థానానికి పిలిపించి ప్రమాణం చేయించాడు. అయితే గాంధిజీ తలపాగ మాత్రం తీసివెయ్యక తప్పలేదు. "గాంధిగారూ! ఇప్పుడు మీరు మీ తలపాగ తొలగించాలి" అన్నాడు న్యాయమూర్తి. న్యాయమూర్తిని గాంధిగారు ఈ విషయంలో ఇప్పుడు ప్రతిఘటించ లేదు. భారతీయాత్మగౌరవానికి చిహ్నంగా ఇంత కాలమూ తలపాగను తాను విడువలేదు. ఈ క్లిష్ట సమయాన, న్యాయస్థానంలో తాను నిలబడటమే ఉత్తరోత్తరంగా జాతిసేవకు ఉపకారకం అని గుర్తించాడు. అందుచేత తలపాగ తీసివేశాడు.

అటుతర్వాత ఉద్యమాన్ని చురుకుగా నడిపించటానికి ప్రయత్నాలు ప్రారంభించాడాయన. నేటాలు భారతీయుల పక్షాన ఒక సంఘం ఉండాలని నిశ్చయించి, మిత్రులందరితోనూ సంప్రతించి "నేటాలు ఇండియన్ కాంగ్రెస్" అనే సంఘాన్ని ఏర్పాటుచేశాడు. ఈ పేరు ఎన్నుకోటం అంతసులువైన పనికాదు. ఇండియాలో "భారత జాతీయ సంఘం" (ఇండియన్ నేషనల్ కాంగ్రెస్) అప్పటికే ఏర్పడి ఉన్నది. మార్పు అంగీకరించని సామ్రాజ్య వాదాన్ని ఎదిరించటానికి అది అప్పుడే కృషి చేస్తున్నది. ఆ కృషి అప్పటికి తీవ్రంగా సాగటం మాత్రంలేదు. ఏది యేమైనప్పటికీ భారతీయులంతా ఒకటే అన్న భావం పేరులోనే స్ఫురించాలంటే తాను ఎన్నుకొన్న పేరే సంఘానికి ఉండాలని గాంధిజీ నిశ్చయించాడు. భారత దేశంలో జాతీయతకు పర్యాయంగా "కాంగ్రెస్" అన్న శబ్దమే తీసుకొన్నారు. అందుచేత గాంధిజీ తన ఆశయాలూ "ఇండియన్ నేషనల్ కాంగ్రెస్" ఆశయాలూ అభిన్నాలు కాకపోయినా, ఎప్పుడైనా ఎవరైనా అభ్యంతరం చెప్పటానికి అవకాశం ఉన్నా ఈ సంఘానికిన్నీ ఆ పేరే ఉంచాలని అభిప్రాయ పడ్డాడు.

ఉద్యమ ప్రారంభం చాలా ఉత్సాహంగా జరిగింది. సభ్యులవద్దనుంచి చందాలూ విరాళాలూ సంపాదించటానికి ఎక్కువ శ్రమ లేకపోయింది. కాని చందాలు ఇస్తామని సంతకాలు చేసినవారంతా ఆ చందాలు ఇచ్చేటప్పుడు మాత్రం సవ్యంగా ఇచ్చేవారు కారు. బాకీ పద్దులు వసూలు చెయ్యటానికి గాంధిజీ, స్వచ్ఛందసేవకులూ చాలా శ్రమా బాధా

పడవలసివచ్చింది. ప్రజోపయోగంకోసం ఇచ్చేసొమ్ము ఎప్పుడూ నగదు రూపంలో తత్క్షణం చెల్లించాలనీ, బాకీపెట్టరాదనీ ఈ అనుభవంతో గాంధీజీ యావజ్జీవనియమం ఏర్పాటుచుకొన్నాడు. ఈ నియమంతోబాటు ఆయన ఇంకొకటికూడా నిశ్చయించుకొన్నాడు. ఎప్పుడైనా సరే అవసరమైన ధనంకంటె ఎక్కువ చేతిలో ఉండగూడదు. ఈ రెండు నియమాలనే దృఢస్తంభాల మీద అప్పుగానీ, అధిక ధనంకానీ లేకుండా నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ సౌధాన్ని ఆయన నిర్మించాడు. దానివల్ల కనీసం ఇరవై సంవత్సరాలవఱకున్నూ ఆ సంఘం చెక్కుచెదరకుండా నిలవగలిగింది. ఎవరు ఎంత స్వల్పధనం చెల్లించినా రసీదు ఇచ్చేవారు. జమ ఖర్చు లెక్కలు చాలా జాగ్రత్తగా వ్రాయటం ఉండేది. "సరిఅయిన జమఖర్చు లెక్కలు లేకపోతే సత్యాన్ని అకళంకంగా పాలించటం అసంభవం" అని గాంధీజీ అన్నాడు.

కాంగ్రెస్ సమావేశాలు సక్రమంగా జరిగేవి. ఒకొక్కప్పుడు వారాని కొక సమావేశం జరిగేది. ఎప్పుడైనా ఇందుకు భిన్నంగా జరిగినా కనీసం నెల కొకసారి తప్పక జరిగేది. సభానియమాలూ, తీర్మానాలూ మొదలయిన ఈ వ్యవహారం అంతా ఆ సభ్యులకు మొదటిలో చాలా క్రొత్తగా ఉండేది. గాంధీజీ వారికి సావధానంగా అన్నివిషయాలు బోధపఱచేవాడు. వారుకూడా ఎంతో ఆసక్తితో అవి అర్థంచేసుకొనేవారు. ఒక గ్రంథాలయమూ, ఒక వాగ్వర్ధినీసభ, విద్యావంతులయిన యువకులనందఱినీ సంఘంలో చేర్పించటానికి ఒక ప్రత్యేక ప్రచారకవర్గమూ అతిశీఘ్రకాలంలోనే యేర్పఱచటం

జరిగింది. భారతీయుల వాంఛితాలు ప్రజామోదం పొందే టట్లు చెయ్యవలసిన పనిఅంతా గాంధిజీవంతు అయింది. ఈ సమయంలో ఆయన "దక్షిణాఫ్రికాలోని ప్రతి ఆంగ్లేయునికీ ఒక విజ్ఞప్తి" అనీ, "భారతీయ పౌరసత్వమూ-ఒక విజ్ఞప్తి" అనీ రెండు రకాల కరపత్రాలు తయారుచేశాడు. ఈ రెండున్నూ ఒక్క-దక్షిణాఫ్రికాలోనేకాక, ఇంగ్లాండు హిందూ దేశాలలోగూడా చాలవఱకు ప్రచారమైనాయి. చాలామంది సానుభూతిపరులు బయలుదేరారు. ఇప్పుడు భారతీయుల సమస్య ఒక్క- దక్షిణాఫ్రికాకే సంబంధించింది కాలేదు. ఒక్క- భారతీయులేకాక, తక్కి-నవారు కూడా దీనిని గుఱించి ఆలోచించటం మొదలుపెట్టారు.

తలపెట్టిన ఉద్యమం ఇలా పరివ్యాప్తమౌతూ ఉండగా, తప్పనిసరిగా ఒక సంఘటన జరిగింది. ఇప్పుడు గాంధిజీకి దక్షిణాఫ్రికాలో కూలిపనులతో పొట్టగడపుకొంటున్న భారతీయ ప్రజలతో సాన్నిహిత్యం ఏర్పడ్డది. ఎంతో కాలంనుంచీ వీరి కష్టసుఖాలు విచారించాలని గాంధిజీ అనుకొంటూ ఉన్నప్పటికీ, ఆయన న్యాయవాదివృత్తికి సంబంధించిన ఒత్తిడిపనులతో ఇందుకు అవకాశమే చిక్క-లేదు. ఆయనకు ఎప్పుడూ వర్తకులతోనూ, ఆ వాణిజ్య సంస్థలలో పనిచేస్తూ ఉన్నవారితోనూ మాత్రమే సంబంధం ఉండేది. కాని ఆయన చేస్తున్న కృషిమాత్రం భారతీయులందఱూ, తెలుసుకొంటున్నారు.

ఒకనాడు ఒక తమిళకూలీ, నిలువునా కంపిస్తూ, దుఃఖం భరించలేక విలపిస్తూ గాంధిజీకార్యాలయంలోపలికి వచ్చాడు. అతని నోరు రక్తమయమై ఉన్నది. ముందుపండ్లు విఱిగి

పోయాయి. బారిస్టరుగాంధిని చూడగానే విస్మయంతో తల పాగ తొలగించి చేతపట్టుకొని తనకథ విన్నవించుకోనటం మొదలుపెట్టాడు. గాంధిజీకి తమిళం తెలియదు. కాని, ఆయన వద్ద ఉన్న గుమాస్తా దక్షిణభారతంనుంచి వచ్చినవాడు. అతనికి తమిళభాష తెలుసు. అందుచేత ఆ కూలీ చెప్పుతున్న విషయాలను అతను గాంధిజీకి ఆంగ్లంలోకి అనువదించి చెప్పాడు. జరిగిన విషయమేమంటే, ఆ కూలీని అతని యజమాని అయిన ఒక యూరోపియన్ కొట్టాడు. ఆ యజమాని బాగా ప్రసిద్ధి కెక్కినవాడు కూడా. గాంధిజీ వెంటనే ఆ కూలీని డాక్టరువద్దకు పంపి, తగిలినదెబ్బలను వివరించే కాగితం వ్రాయించి తెప్పించి, న్యాయస్థానంలో అభియోగం చేయించాడు. న్యాయమూర్తి ఆ యూరోపియన్ యజమానికి న్యాయస్థానానికి రావలసిందని ఆజ్ఞాపత్రం పంపించాడు.

లిఖితపూర్వకంగా ఒకరివద్ద కూలిపనులకు ఒప్పుకొన్న వారి విషయంలో ప్రభుత్వ శాసనాలు చాలా నిర్దయగా ఉండేవి. కూలివాడు తాను చేస్తూఉన్నపని విడిచిపెట్టి వెళ్ళి పోవటానికి వీలులేదు. అలా వెళ్ళినట్లయితే అతనిని ప్రభుత్వం క్రూరంగా శిక్షిస్తుంది; చెఱసాలపాలుకూడా చేస్తుంది. ఇదీ ఆ నాటి అక్కడి న్యాయం. కాబట్టి ఆ కూలిపనికిన్నీ బానిస తనానికిన్నీ ఎక్కువభేదం లేదు. బానిసతనంవలె కాక దీనికి కాలపరిమితి ఉన్నది. కాని స్వతంత్రించి యే పనిచెయ్యటానికీ వీలులేదు. దక్షిణాఫ్రికా పరిస్థితులను పరిశీలించిన గాంధిజీ ఆ యజమాని దౌర్జన్యానికి అతనిని శిక్షాపాత్రుణ్ణి చెయ్యాలని అనుకోలేదు. అతని సేవలోనుంచి యీ కూలీని

తప్పించి, వీలైతే మరెక్కడైనా చేర్పించాలని మాత్రమే ఆయన సంకల్పం. ఆ యూరోపియన్‌కూడా కొంత భయపడ్డాడు. గాంధిజీ న్యాయస్థానంలో అతని వాఙ్మూలం తీసికొన్న తర్వాత, శ్రామికవర్గం కష్టసుఖాలు విచారించే ప్రభుద్యోగివద్దకు వెళ్ళి ఆ కూలీని ఆ యజమానిదగ్గఱనుంచి తప్పించి యింకెవరి వద్దనైనా నియోగించవలసిందని అభ్యర్థించాడు. ఆ ఉద్యోగి ఆయనమాట తీసివెయ్యలేదు. పర్యవసానంగా కూలీకి మొదటి యజమానికొలువునుంచి విముక్తి లభించింది. అప్పటికి గాంధిజీకి యూరపియనులతో కొంతపరిచయం ఏర్పడి ఉండటంచేత, ఆయన సులువుగానే ఆ కూలిమనిషికి ఇంకొకరి వద్ద నౌకరి యిప్పించగలిగాడు.

ఈ కూలిమనిషి పేరు బాలసుందరం. గాంధిజీ ఈ పేరు ఎన్నడూ మఱచిపోలేదు. బాలసుందరం దెబ్బలతో బాధపడుతూ, దిక్కుతోచని అయోమయస్థితిలో గాంధిజీకార్యాలయానికి పరుగెత్తుకొనివచ్చాడు. దక్షిణభారతంనుంచి వచ్చిన పేదకూలీల మొఱ ఆలకించి తగినరక్షణ కల్పించగల స్థానం అదే అని అతను అంతకుముందే విన్నాడు. అతను ఆవిధంగా రావటం దైవికంగా గాంధిజీ ఉద్యమానికి దోహదహేతువైనది. ఈవిధంగా బాలసుందరం ఒక చరిత్రను సృష్టించటానికి మూలకారణమైనాడు. అతనికి తెలియకుండానే గాంధిజీ దివ్యసందేశ ప్రచారానికి ప్రధాన సాధనమైనాడు.

ఈ కథ అతిశీఘ్రంగా ప్రచారంలోకి వచ్చింది. చిలవలు పలవలతో అందఱూ దీనిని మాటిమాటికీ చెప్పుకొనటం మొదలుపెట్టారు. దెబ్బలుతిన్న పేదకూలీని రక్షించటానికి ఒక

పెద్దమనిషి పూనుకొన్నాడనీ, అతను చాలా గొప్పవాడనీ, దక్షిణాఫ్రికాలో బారిష్టరుగా ఉన్న భారతీయుడు అతను ఒక్కడే ననీ ఆ రాత్రికిరాత్రే కూలీలు ఇంటింటా చెప్పుకొన్నారు. ఈ కథ దక్షిణ భారతానికీ, అందులోనూ మద్రాసుకూ అతి వేగంగా ప్రాకింది. భారత దేశంనుంచి దక్షిణాఫ్రికాకు క్రొత్తగా వలస వచ్చేవారందఱికీ దక్షిణాఫ్రికాలో తమకు గాంధిజీ అనే మిత్రుడు ఉన్నాడని తెలిసింది. ఇక నేటాలులో చెప్పవలసిం దేముంది? కష్టాలకు గుఱిఅవుతూఉన్న కూలీలందఱూ గాంధిజీని సందర్శించటం మొదలుపెట్టారు. బాలసుందరం వ్యవహారంతో గాంధిజీకి దక్షిణాఫ్రికాలో విశేషమైన పలుకుబడి కలిగింది. ఉత్తరఆఫ్రికాలో ఆయనకు కలిగిన ప్రచారం దీనికి తోడైంది.

గాంధిజీ బాలసుందరం సంఘటనతో చలించిపోయాడు. ఆ కూలిమనిషి బాధకంటె అతను తలపాగా చేతితో పట్టుకొని దైన్యంతో తనదగ్గఱకు పరుగెత్తుకొనిరావటం ఆయన హృద యాన్ని కలవరపఱచింది. 'అన్యథాశరణంనాస్తి' అనే స్థితిలో ఉన్న ఎవరికైనా తాను తోడ్పడాలని ఆయన చిరకాలం క్రింద టనే భావించినది యిప్పుడు మఱికొంచెం దృఢపడింది. ప్రత్యే కంగా తలపాగ తొలగించుకొని విధేయత ప్రకటించటమనేది ఆయనను ఎంతో కదల్చివేసింది. దానికి కారణం అటువంటిసంఘ టనలు ఆయనకు ఎన్నో అనుభవంలోకి వచ్చాయి. దెబ్బతిన్న మనిషి రక్షణ యెఱుగక దీనతతో ఆయనకోసం పరుగెత్తుకొని వచ్చాడు. తలపాగ మళ్ళీ పెట్టుకోవలసిందని గాంధిజీ బాలసుంద రంతో అన్నాడు. అతను జంకుతూనే సంతోషంతో తలపాగ తిరిగి పెట్టుకొన్నాడు. గాంధిజీకి న్యాయశాస్త్రంలోగానీ కార్య

నిర్వహణంలోగానీ ప్రకటితమైన సామర్థ్యంకంటె ఇటువంటి చిన్న విషయాలలో ఆయన నిగూఢప్రభావం ఎంతైనా ఇమిడి ఉన్నది. కొద్దిరోజులలో నేటాలు మొత్తంమీద ఈ ప్రభావాన్ని గమనించని కూలిమనిషి లేడంటే అతిశయోక్తి కాదు.

నేటాల్ ఇండియన్ కాంగ్రెసు ఉద్యమాన్ని నడిపిస్తూ, న్యాయస్థానంలో న్యాయవాదిగా తన జీవికకు కావలసిన ధనం ఆర్జిస్తూ, తీతీక తక్కువగా ఉన్న కాలంలో కూడా గాంధిజీ ప్రిటోరియాలోని క్రైస్తవుల సాహచర్యంతో తనలో ప్రబుద్ధమైన మతతత్త్వ జిజ్ఞాసను సంతృప్తిపఱచుకొనటానికి యత్నించాడు. డర్బనులోని క్రైస్తవులలో ప్రధానుడూ, దక్షిణాఫ్రికా సాధారణ ప్రచారక సంఘానికి అధ్యక్షుడూ అయిన స్పెన్సరుగారు గానీ, ఆయనభార్యగానీ తనను క్రైస్తవుణ్ణిగామార్చటానికి ఎటువంటి ప్రయత్నమూ చెయ్యకపోయినా, క్రైస్తవప్రచారకులైన మిత్రులతో గాంధిజీ తఱచూ సమావేశమవుతూనే ఉన్నాడు. క్రైస్తవగ్రంథాలు ఎన్నో ఆయనకు అందుబాటులో ఉండేవి. అయినా ఆయన వెనుకటికంటె శ్రద్ధాసక్తులతో తన మతానికి సంబంధించిన గ్రంథాలను చదవటం మొదలుపెట్టాడు. ఈ కాలంలో అంటే 1893–96 సంవత్సరాల మధ్యనూ, ఇటు తర్వాతనూ కూడా గాంధిజీకి హైందవమతస్వరూపం బోధపడటానికి బొంబాయివాసి అయిన రాయచంద్రుడనే ముఖ్యమిత్రుడు ఉత్తరప్రత్యుత్తరాలద్వారా ఎంతో తోడ్పడ్డాడు. గాంధిజీ ఈ మిత్రుణ్ణి "రాయచంద్రభాయ్" (రాయచంద్ర న్నయ్య) అని పిలిచేవాడు లండన్‌నుంచి హిందూదేశానికి తిరిగివచ్చిన క్రొత్తలో మహాత్మునికి రాయచంద్రునితో పరి

చయం కలిగింది. రాయచంద్రుడు మహాత్మునికంటె రెండు మూడేండ్లు పెద్దవాడు. ఆయనకు ఒక నగలదుకాణం ఉండేది. ఆ వ్యాపారం చేస్తూనే ఆయన కవిత్వం వ్రాస్తూ, మతగ్రంథాలు పరిశీలిస్తూ ఉండేవాడు. ఆయన భక్తిసూక్తులూ, విజ్ఞానమూ, ప్రవర్తనా గాంధిజీని ఆకర్షించాయి. రాయచంద్ర మహాశయుడు హైందవ గ్రంథాలేకాక బైబిలు, ఖురాను మొదలైన పాశ్చాత్య మతగ్రంథాలనూ, ఆధునికరచనలుకూడా చదువుతూ ఉండేవాడు. పూర్వకాలపు బ్రాహ్మణులకు సహజమైన ప్రజ్ఞాప్రాభవాలు ఆయనలో నెలకొన్నాయి. ఆయన శతావధాని, ఏకసంధాగ్రాహి; ఏ భాషలోగానీ, ఏ క్రమంలోగానీ, ఎవరు ఏ మాటలన్నా ఆ మాటలన్నింటినీ అదే వరుసలో అదే నుడికారంలో ఆయన తిరిగి చెప్పగలిగేవాడు. ధారణాశక్తి అంటే ఇదే. భారతదేశంలో లిపి పుట్టక పూర్వం బ్రాహ్మణులు తమ విద్యలన్నింటినీ అనేక శతాబ్దాలతరబడి ధారణచేతనే నిలబెట్టుకోగలిగారు. క్రమం, జటా, ఘనా అనే చిత్ర ప్రక్రియలతో ధారణను పటిష్ఠం చేసికొని వేదాలను పొల్లుపోకుండా అధ్యయనంచేసి, శాస్త్రాదులనూ అలాగే జిహ్వాగ్రాలమీద నర్తింపజేశారు. అపారమైన ఆర్యవాఙ్మయం అంతా బ్రాహ్మణులకు కంఠస్థమైనది. దానిలో లవలేశమున్నా విస్మృతిపాలు కాలేదు. రాయచంద్రునితో బొంబాయిలో గోష్ఠి జరిపినదినాలలో ఆ శతావధాని ప్రతిభా వ్యుత్పత్తులకు గాంధిజీ ముగ్ధుడైనాడు. అప్పటినుండీ వారిద్దఱిమధ్యనూ గాఢమైన స్నేహసంబంధం ఏర్పడ్డది. ఇదే రానురాను గురుశిష్య సంబంధంగా పరిణమించింది. గాంధిజీ రాయచంద్రునికి పరమభక్తుడైనాడు. దక్షిణాఫ్రికాలో ఉన్నకాలంలో గాంధిజీ

లేఖామూలకంగా రాయచంద్రుని ఉపదేశాలను తెలిసికొని వాటినిబట్టి తనజిజ్ఞాసను సఫలం చేసికొనేవాడు.

రాయచంద్రుని సలహాతో గాంధిజీ హైందవ వాఙ్మయాన్ని (ఆంగ్లానువాదంలోనే) అందులోనూ ఉపనిషత్తులనూ పఠించాడు. ఇవి దివ్యజ్ఞాన సమాజంవారు ప్రచురించినవి. హైందవ వాఙ్మయం గురించి, మాక్సుముల్లరు మొదలయిన రచయితలు చేసిన రచనలు ఆయన చదివాడు గుజరాతీ భాషలో వెలువడ్డ కొన్ని మతగ్రంథాలనుగూడా పఠించాడు. ఇందువల్ల ఆయనకు తనమతం పట్ల గౌరవమూ, ఆ మతసిద్ధాంతాలను బాగా అవగతం చేసుకోవాలనే కుతూహలమూ పెరుగుతూ వచ్చాయి. ఈ సమయంలోనే ఆయన ఇస్లాము వాఙ్మయంలోని గ్రంథాలుకూడా చాలా చదివాడు. వాషింగ్టన్ ఇర్వింగ్ రచితమైన "మహమ్మదు జీవితం" ఈ గ్రంథాలలో ఒకటి. వీటికితోడు టాల్‌స్టాయ్ వ్రాస్తున్న కరపత్రాలున్నూ ఆయన చదువుతూ వచ్చాడు. వాటిలో "సందేశసారం" "కిం కర్తవ్యమ్" అనేవి రెండున్నూ, వాటి తర్వాత ఒకసంవత్సరానికి ప్రకటితమైన "కళ అనగా ఏమిటి?" అనేది ఒకటిన్నీ ఆయనకు ఉత్తమ రచనలుగా తోచాయి. అయితే టాల్‌స్టాయ్ రచనలోని పరమవైచిత్ర్యం ఎట్టిదో, జీవితనిర్వాహణంలోనూ, ఆశయ సాధనంలోనూ, రచనకూ ప్రవర్తనకూ గల వ్యత్యాసం ఎట్టిదో గాంధిజీ యావజ్జీవితమూ గుర్తించనేలేదు. గాంధిజీ అమాయికుడు. "పర్వత సందేశమే ఏకైక సిద్ధాంత"మని ఎవరన్నా అంటే ఆ అన్నవారు నిజంగా అది ఏకైక సిద్ధాంతంగానే స్వీకరించి ఆచరిస్తున్నారని ఆయన నమ్మేవాడు. అందువల్ల క్రమక్రమంగా

ఆ సిద్ధాంతాన్ని తానుకూడ ఆచరణలో పెట్టటానికే ప్రయత్నించేవాడు. ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించినవ్యక్తి స్వయంగా దానిని ఆచరించడంలేదని ఆయన ఎన్నడూ అనుకోనేవాడు కాడు. తాను చదివినదంతా అనుభవగోచరం చేసికొనటానికి యత్నించినట్లే అందఱూ యత్నిస్తారని గాంధిజీభ్రమ! దీనితో మహాత్ము లందఱూ చేసిన పొరపాటే ఆయనా చేశాడు. "నేను జీవిత విజయానికి ప్రత్యేక సామర్థ్యం ఏమీ లేని దుర్బలుణ్ణి. అయినా అందుకు నేను చెయ్యవలసినది చెయ్యగలను! కాబట్టి తక్కిన వారు మాత్రం అలా ఎందుకు చెయ్యలేరు? క్రమశిక్షణ నియమాలను పాటించటానికి అశక్తుణ్నైన నేనే ఇలా చెయ్యగలిగితే, నా కంటె ఎన్నోరెట్లు మెఱుగైన యితరు లందఱూ దీనిని ఇంకా సులువుగా నిర్వర్తించగలరు; లేదా కనీసం నా మాదిరిగానైనా చేయగలుగుతారు." ఇలా భావించటమే ఆయన చేసిన పెద్ద పొరపాటు. దక్షిణాఫ్రికాలో, హిందూదేశంలో, సర్వప్రపంచంలో ఆయనకు ఎప్పుడైనా ఏ ఉద్యమంలో అయినా అపజయం అంటూ కలిగితే దానికి కారణం ఇదే. కార్యనిర్వహణ సామర్థ్యంలో లోకులందఱూ తనకంటె అధికులని ఆయన భావించేవాడు కాబట్టి, తాను చెయ్యగలిగిందంతా లోకులు చెయ్యగలరని ఆ అమాయికుడు అభిప్రాయపడ్డాడు. ఈ పొరపాటు ఎంతైనా ప్రమాదకరమైనది. చరిత్ర ప్రసిద్ధ మహనీయ వ్యక్తులయిన సోక్రటీసూ, గౌతమ బుద్ధుడూ, ఏసుక్రీస్తూ ఏ పొరపాటులో బడి అపజయాలకు గుఱికావలసి వచ్చిందో గాంధిజీకూడా ఆ పొరపాటులోనే వడ్డాడు. ఆ మహానుభావులు అందఱూ తాము చెయ్యగలిగినంతా పరులు చెయ్యగలరనే

విశ్వసించారు. ఆ విశ్వాసం చివరకు విదళితమై పోక తప్పలేదు. వారి మార్గాన్నే అనుసరించిన గాంధిజీకి మాత్రం అంతకంటె వేరొక ఫలం ఎలా తటస్థిస్తుంది?

దక్షిణాఫ్రికాలో, మూడేండ్లుగడువు పూర్తికాగానే గాంధిజీ మళ్ళీ తన భవిష్యత్తు విషయమై ఆలోచించవలసి వచ్చింది. హిందూదేశానికి వెళ్ళిపోవచ్చును. అలా వెళ్ళితే ఇక్కడ ప్రారంభించిన ఉద్యమం ఏం కావాలి? అందువల్ల ఆయన దర్బనులోని ముస్లిము మిత్రులతో సంప్రదించాడు. వారు ఆయనను హిందూదేశానికి వెళ్ళి కుటుంబాన్ని తెచ్చు కోవలసిందనీ, వెనకటి మాదిరిగానే న్యాయవాదిగా ధనార్జన చేస్తూ, ఉద్యమాన్ని నడిపించవచ్చుననీ చెప్పారు. అప్పుడాయన తనయందు గాఢభక్తి కల స్వచ్ఛందసేవకుల కిద్దరికి తాను హిందూదేశంనుంచి తిరిగివచ్చేవరకూ నేటాల్ ఇండియన్ కాంగ్రెస్‌ను నడిపే బాధ్యత ఒప్పగించి, బొంబాయి స్టీమ రెక్కాడు.

# తృతీయ ప్రకరణం

## సత్యాగ్రహం

హిందూదేశానికి తిరిగివస్తూఉండగా గాంధిజీ నౌకలోని బ్రిటిషు ఉద్యోగస్థుల సాయంతో తమిళం ఉర్దూలను నేర్చు కొనటం మొదలుపెట్టాడు. ఈ రెండుభాషలనూ నేర్చుకోవా లని ఆయన చాలాకాలంనుంచీ అనుకొంటున్నాడు. ఇప్పటికి కార్యభారం తగ్గటంవల్ల ఆ కోరిక తీర్చుకొనటానికి అవకాశం

కలిగింది. అసలు ఆయన జీవితకాలం అంతటా ఆంగ్లేయులు ఆయనను ప్రేమిస్తూనే వచ్చారు. ఆయనతో స్నేహం చేసికో గోరారు. ఆయన ఉద్యమాలకు తోడ్పడుతూవచ్చారుకూడాను. ఆయన నడవడి వారిలో అటువంటి అభిమానాన్ని రేకెత్తింప జేసింది బ్రిటిషు ప్రజల సుదీర్ఘ చరిత్రలో గాంధిజీవలె నీతిమం తుడూ ప్రేమపాత్రుడూ అయిన ప్రతిస్పర్థి మఱియొకడు కనబడ లేదని చెప్పటంలో అతిశయోక్తిలేదు. తమిళం ఆయనకు పట్టు వడ లేదుగానీ ఎలాగో చదువుకుపోవటంమాత్రం అలవాటైంది. ఉర్దూ తేలికగానే వచ్చిందిగానీ, దానిమీదనూ సంపూర్ణమైన అధికారం కలగలేదు. తర్వాత చెఱసాలలో ఉన్నప్పుడు ఆ భాష నేర్చుకొనటానికి ఇంకా కృషిచేశాడుగానీ చెప్పుకో దగినంత పాండిత్యం లభించలేదు.

హిందూదేశం చేరినతర్వాత తనకుటుంబాన్ని దక్షిణాఫ్రి కాకు తీసికొనిపోవటానికి అవసరమైన ఏర్పాట్లు చేసికొంటూనే తనకు ఆవశ్యకాలుగాతోచిన విషయాలన్నింటిసీ తెలిసికొని జ్ఞానాభివృద్ధి చేసికొనటానికి ఆయన కృషిచేస్తూ వచ్చాడు.

దక్షిణాఫ్రికాలోని భారతీయుల స్థితిగతులనుగుఱించి కరపత్రం ప్రకటించటంతో గాంధిజీ హిందూదేశంలో తన ఉద్యమానికి బలంసంపాదించటానికి ప్రయత్నాలు మొదలు పెట్టాడు. ఆ కరపత్రం ఒక ఆకుపచ్చని అట్టలో ఉండటంవల్ల దానికి "ఆకుపచ్చ కరపత్రం" అనే పేరు వచ్చింది. ఈ కర పత్రం ప్రతులు ఇండియాలోనూ ఇంగ్లాండులోనూ కల ప్రసిద్ధ వార్తాపత్రికల కన్నింటికీ చేరాయి. అంతేకాక ఇండియన్ నేషనల్ కాంగ్రెస్‌లోనూ, అధికారుల్లోనూ, ముఖ్యులయిన

వారికందరికీ అందాయి. ఈ ఉద్యమంపట్ల కుతూహలం కలవారికి కూడా కరపత్రాలు పంచటం జరిగింది. దీనితో పెద్ద సంచలనం కలిగింది. ఉభయ దేశాలలోని వార్తాపత్రికలూ ఈ కరపత్రం గురించి సంపాదకీయాలుగూడా ప్రకటించాయి. రూటర్సు వార్తాసంస్థ లండనునగరానికి కరపత్రసారాంశం అందజేసింది. అక్కడి సంస్థ ఈ సారాంశాన్ని మరింత సంగ్రహపరచి నేటాలుకు పంపింది. దీనిఫలితంగా తరువాత గాంధీజీ ఎంతో చిక్కులపాలు కావలసి వచ్చింది.

గాంధీజీ స్వస్థానమైన రాజకోటలో ఒక వెయ్యి కరపత్రాలను స్వచ్ఛందసేవకులద్వారా పంచిపెట్టించాడు. అయితే ఇందుకు ఆయన ఉపయోగించుకొన్నది బాలురను మాత్రమే. చిన్నపిల్లలకు ఇటువంటిపని అప్పగించటం గాంధీజీ జీవితంలో ఇదే మొదటిసారి. తర్వాత ఇటువంటిపనులు అవసరమైనప్పుడల్లా ఆయన వారితోడ్పాటునే తీసికొనటం మొదలుపెట్టాడు. పిల్లలుకూడా ఇందులో ఎక్కువ ఉత్సాహంగా పాల్గొనేవారు. తాము ఏదో ఘనకార్యం చేస్తున్నట్లు పొంగిపోయేవారు.

ఈసమయంలో బొంబాయిలో ప్లేగువ్యాధి తీవ్రంగా విజృంభించింది. యథాప్రకారంగా గాంధీజీ ఇప్పుడునూ ప్రజాసేవకు నడుముకట్టాడు. ఇందువల్ల భారతీయ గృహాలలోని మరుగుదొడ్లూ, ఆరోగ్యసదుపాయాలూ ఏస్థితిలో ఉన్నాయో గ్రహించటానికి ఆయనకు అవకాశం కలిగింది. పేదల ఇండ్లూ ముఖ్యంగా అస్పృశ్యుల యిండ్లూ ఆయన పరీక్షించటం తటస్థించింది. అస్పృశ్యుల యిండ్లకు ఆయన వెళ్ళటంకూడా ఇప్పుడే మొదలయింది. అయితే భాగ్యవంతుల యిండ్లకంటె

ఈ నిజం పేదలయిండ్లే ఆరోగ్యసదుపాయాలకు ఎక్కువ వీలుగా ఉన్నట్లు ఆయనకు తోచింది. అగ్రవర్ణుల యిండ్లలోని మఱుగు దొడ్లను గుఱించి గాంధిజీ చేసిన వర్ణనలుచూస్తే చాలా ఆశ్చర్యం కలుగుతుంది. ఉత్తమకులాల హిందువులు అటువంటి ముఱికికూపాలలో నివసిస్తారంటే అసంభవం అనిపిస్తుంది. అయినా గాంధీజీ చూచినయిండ్లు అలా ఉన్నాయి. వాటిలోని దుర్గంధాన్ని ఆయన స్వయంగా ఆఘ్రాణించి మఱీ అలా వ్రాశాడు.

బొంబాయిలో ఉండగా భవిష్యత్తులో తనకు సహాయ కారులు కాగల ఫిరోజ్‌షామెహతా అనే ప్రసిద్ధ న్యాయవాది తోనూ, ఇంకా అనేక హిందూ పారసీక ముఖ్యులతోనూ ఆయన స్నేహంచేసికొన్నాడు. వీరందఱిలోనూ గాంధిజీని అత్యధికంగా ఆకర్షించిన వ్యక్తి గోఖలే. ఆయన అప్పుడు ఇండి యన్ నేషనల్ కాంగ్రెసులో ప్రముఖుడుగా ఉన్నాడు. ఆయన గాంధిజీని పుత్రవాత్సల్యంతో ఆదరించాడు. నాటి భారతీయు లలో గోఖలే అన్నివిధాలా ప్రసిద్ధుడైనవ్యక్తి. ఆయన కాంగ్రెసు సంస్థకు వేసిన పునాదీ, భారతీయుల చిత్తవృత్తులలో కలుగజేసిన ఉత్తేజమూ గాంధిజీ కాంగ్రెసు నాయకత్వం వహించినప్పుడు ఎంతో ఉపయోగపడ్డాయి. గోఖలే కృషిలేనిదే గాంధిజీ తన ఉద్యమంలో కృతకృత్యుడు కాలేకపోయేవాడంటే అతిశయోక్తి కాదు. వయస్సులో ఎంతో వ్యత్యాసం ఉన్న యీ ఇద్దఱికీన్ని కలిగిన పరిచయం అచిరకాలంలోనే చాలా దృఢపడింది. గాంధిజీ గోఖలే ప్రసక్తివచ్చినప్పుడల్లా తన "రాజకీయగురువు"

అనీ, ప్రజాసేవావిధానంలో ఆయనే తనకు మార్గదర్శి అనీ పేర్కొనేవాడు.

గాంధిజీ యీ కాలంలోనే ఒకమారు మద్రాసు పట్టణం సందర్శించాడు. బాలసుందరం కథ ఆంధ్ర తమిళ దేశాలు రెంటిలోనూ ప్రాకి ఉన్నది. మద్రాసు రాష్ట్రంనుంచి దక్షిణాఫ్రికాకు వెళ్ళిన కంట్రాక్టు కూలీలందరికీ గాంధిజీ రక్షకుడు. అయితే గాంధిజీ తమిళంలో ఉపన్యాసం ఇవ్వలేడు. కాబట్టి ఆంగ్లంలోనే దాక్షిణాత్య సభలలో ప్రసంగించేవాడు. తర్వాత దశాబ్దాల తరబడీ ఆయన దక్షిణభారతంలో ముఖ్యంగా మద్రాసురాష్ట్రంలో చేసిన ఉపన్యాసాలన్నీ ఆంగ్లంలోనే జరిగాయి. అయినా "ప్రేమకు అభేద్యమైన దుర్గం ఏమున్నది?" అని ఆయన అన్నాడు.

వంగదేశంలో పరిస్థితి మరొక విధంగా ఉన్నది. దక్షిణాఫ్రికాలోని భారతీయులకు తోడ్పడగల ప్రసిద్ధ పత్రికా సంపాదకులకోసమూ, ఇతర వర్గాలలోని ముఖ్యులకోసమూ గాంధిజీ గంటల తరబడీ కాచుకొని ఉండవలసి వచ్చింది. అసలు రహస్యం ఏమిటీ అంటే, వంగదేశీయులలో ఎవ్వరున్నూ అంతవఱకు దక్షిణాఫ్రికాకు వెళ్ళి ఉండలేదు. అందుచేత కలకత్తాలోని కార్యాలయాలు ఈ సమస్యను అంత పట్టించుకోదగ్గదిగా భావించలేదు. అయితే మొదటినుంచీ తటస్థిస్తున్నట్లే యిక్కడ కూడా గాంధిజీకి ఆంగ్లేయ సాహాయ్యంవల్లనే కొంతవఱకు చేపట్టిన పని నిర్వహించటానికి వీలుచిక్కింది. "ఇంగ్లిష్‌మన్" అనే పత్రికకు సంపాదకుడైన "సాండర్స్" అనే ఆంగ్లేయుడు ఆయనకు కార్యాలయంగా ఒక గది ఏర్పాటుచేసి, తన పత్రి

కలో ఆయన రచనలకు స్థానం ప్రత్యేకించి, ఇంకా ఆయనకు ఎప్పుడు ఏ సాయం కావలసి వచ్చినా చెయ్యటానికి సిద్ధపడ్డాడు. అయితే ఇంతలోనే దక్షిణాఫ్రికా మిత్రులు ఇచ్చిన ఆఱునెలల గడువూ ముగిసిపోవటంచేత గాంధిజీ వారి పిలుపు అందుకో గానే 1896వ సంవత్సరంలో కలకత్తా విడిచి బొంబాయికి వెళ్ళక తప్పలేదు. అక్కడ తన భార్యనూ, ఇద్దఱు కుమారు లనూ, ఒక తోబుట్టువు కుమారుణ్ణీ తీసికొని దక్షిణాఫ్రికాకు బయలు దేరాడు.

## 2

ఈ ప్రయాణంలో తన భార్యా, పిల్లలూ ఎటువంటి దుస్తులు తాల్చిందీ గాంధిజీ తన ఆత్మకథలో చెప్పాడు. భార తీయులను భారతీయులుగానే గౌరవించేటట్లు ఆంగ్లేయులకు బుద్ధి పుట్టించాలని ఆయన సంకల్పించాడు. అయితే ఆ సమ యంలోకూడా తన వస్త్రాలంకరణ విషయమై ఆయన ఏమీ ఆడంబరాలకు పోలేదు. సమస్త భారతజాతికీ తాను ప్రాతినిధ్యం వహించాలని ఆయన ఉద్దేశంకదా! భారతీయుల పోరాటానికి తాను చిహ్నంగా ప్రవర్తించాలి. ఆయన పిల్లలూ భార్యా యూరోపియనుల మాదిరిగా వేషధారణ చెయ్యలేకపోవటం వల్ల భారతదేశంలో యూరోపియను వస్త్రాలంకరణకు సన్ని హితంగా ఉన్న పార్సీ పద్ధతిలో దుస్తులు ధరించారు. అంటే పిల్లలు కోటూ, లాగూ ధరించారు. ఇక కస్తూరీబాయిమాత్రం పార్సీ కాంతవలె చీరకట్టి బూట్లు తొడిగికొన్నది. పాపం ఆమె గానీ, పిల్లలుగానీ అంతకు ముందెప్పుడూ బూట్లు తొడిగి

యెఱుగరు. అందువల్ల వారి బొటనవ్రేళ్ళు పుండ్లు పడ్డాయి. మేజోళ్ళవల్ల ఉక్కపోసి వాసనపుట్టేది. భోజనంచేసేటప్పుడు కత్తి, ముండ్లచెంచా ఉపయోగించవలసిందని కూడా గాంధిజీ వారిని ఆజ్ఞాపించాడు. పరిశుభ్రంగా ఉన్న చేతులతోనేఆహారం తీసికొనే అలవాటున్న భారతీయులకు ఈ కత్తులతో, ముండ్ల చెంచాలతో ఆహారం భుజించాలంటే, ఇప్పటికీ గిట్టనుగదా?

సేట్ అబ్దుల్లా కంపెనీకి సంబంధించిన పడవ బొంబాయి నుంచి డర్బనుకు సరాసరి బయలుదేఱింది. అయితే అంతకు పూర్వప్రయాణంలో మాదిరిగా ఆలువారాలుగాకుండా 18 రోజులలోనే ప్రయాణం ముగిసింది. కాని బొంబాయిలో కలరా ఉన్నదనే కారణాన ఈ పడవను డర్బనులో అయిదు రోజులపాటు ఆపుచెయ్యవలసి వచ్చింది. అయితే బొంబాయి నుంచి 18 రోజుల క్రిందటనే బయలుదేఱిన పడవను ఇప్పుడు ఇక్కడ అయిదురోజులపాటు ఆపటంలో వైద్యుల ఉద్దేశం ఏమిటో మనం తేలికగా ఊహించుకోవచ్చును. ఈ ఆపుదలకు కలరా అనేది ఒక మిషమాత్రమే. గాంధిజీని ఎలాగైనా డర్బనుకు చేరకుండా చెయ్యటమే వారి ఉద్దేశం.

అసలు నేటాలు ప్రభుత్వానికి ఇందులో ఎంతవఱకు జోక్యంఉన్నదో చెప్పటానికి ఆధారాలు కనబడటంలేదుగానీ, నేటాలులోని తెల్లవారు గాంధిజీ తమకు చాలా ఇబ్బందులు తెచ్చిపెడతాడనీ, అందువల్ల ఆయనను తమదేశంలో అడుగు పెట్టకుండా చెయ్యాలనీ సంకల్పించినట్లు రూఢిగా తెలుస్తున్నది.

గాంధిజీనీ, ఆయనతో బాటు నౌకలో ఉన్న వారినీ మాత్రమే కాక, వారి నౌక వెనుకనే లంగరు వేసిఉన్న మఱొక నౌక లోని వారినీ తిరిగి హిందూదేశానికి పంపించివెయ్యాలని వారి కోరిక. ఆ రెండవ నౌకలో ఉన్నవారుకూడా భారతీయులే. కలరా నెపంతో నౌకల్ని ఆపుచేసిన అయిదు రోజులలోనూ నేటాలు శ్వేతవర్ణుల ప్రతినిధులు కొందఱు నౌకలలో ప్రవేశించి, అక్కడి ప్రయాణికులతో "మీరు హిందూదేశానికి తిరిగి వెళ్ళేట్లయితే మీ మీ వస్తువులతో పోనిస్తాము. లేక పోతే అందఱినీ సముద్రంలో పడద్రోస్తాము." అని బెదరించారు. కాని గాంధిజీ అచంచల ధైర్యస్థైర్యాలతో ఈకుట్రను ఎదుర్కొన్నాడు. ప్రయాణికులందఱితోనూ ప్రశాంతంగా ఉండి ఏమిజరుగుతుందో నిరీక్షించవలసిందని చెప్పాడు.

క్రిస్మస్ రోజున ప్రయాణికులకు తెల్లవారు చివరి హెచ్చరిక చేశారు. దానిప్రకారం భారతీయులు హిందూదేశానికి తిరిగి పోనైనా పోవాలి; చావుకైనా సిద్ధపడాలి. అయితే అయిదురోజులనుంచీ గాంధిజీ మాటలు వింటూఉన్న ప్రయాణికులందఱూ ఏకకంఠంతో నేటాలురేవులో దిగటానికి తమకు హక్కు ఉన్నదనీ, వెనుకకు తిరిగి వెళ్ళేది లేదనీ చెప్పివేశారు.

రేవులో అడుగుపెట్టేసరికి గాంధిజీమీదఉన్న కసితోనే తెల్లవారు ఇలాచేశారని భారతీయులందఱికీ తెలిసివచ్చింది. నౌకలను రేవులోనికి రానియ్యకుండా ఆపటానికి న్యాయశాస్త్ర రీత్యా ఇంకేమీ అవకాశం లేనందున తెల్లవారు తమ ప్రయత్నాన్ని విరమించుకోక తప్పలేదు. ప్రయాణికులు తమతమ

సామానులతో నేటాలు భూమిమీద అడుగుపెట్టారు. అయి నప్పటికీ గాంధీజీమాత్రం జాగ్రత్తపడవలసి వచ్చింది. అబ్దుల్లా కంపెనీతాలూకు ఒక ఆంగ్లన్యాయవాది దగ్గఱనుంచి గాంధీజీకి ఒకకబురు వచ్చింది. దానిప్రకారం ఆయనగానీ ఆయన కుటుం బంగానీ చీకటిపడేవఱకున్నూ రేవులో అడుగుపెట్టగూడదు. నేటాలు శ్వేతవర్ణుల పరిస్థితి చాలా ఉద్రిక్తంగా ఉన్నది. న్యాయవాదిసలహాను గాంధీజీ ఆమోదించాడు.

తర్వాత అబ్దుల్లా తాలూకు న్యాయవాదులలో ఒక డైన లాఫ్టన్ గాంధీజీవద్దకు వచ్చాడు. కస్తూరిబాయీ ఆమెతో ఉన్న పిల్లలూ పడవదిగి ఒకబండిలో భారతీయమిత్రుడైన రుస్తుంజీ ఇంటికి చేరుకోవాలనీ, గాంధీజీమాత్రం కాలినడకనే మెల్లాగో అక్కడికి చేరాలనీ చెప్పాడు. గాంధీజీ ఇందుకుకూడా అంగీకరించాడు.

చిట్టచివరకు గాంధీజీ పడవ దిగాడు. ఆయన భార్యా పిల్లలూ నిరపాయంగా రుస్తుంజీ యింటికి చేరుకొన్నారు. లాఫ్టన్‌తో కలిసి గాంధీజీ కాలినడకను బయలుదేరాడు. కొంత దూరం వెళ్ళేసరికి కొందఱు తుంటరికుఱ్ఱవాళ్లు "గాంధీ! గాంధీ!" అంటూ కేకలు వేస్తూ బయలుదేరారు. కొద్దిసేపటిలో ఒక పెద్దగుంపు ఆయనను చుట్టుముట్టింది. లాఫ్టన్ వెంటనే ఒక రిక్షాను పిలిచాడు. నిజానికి గాంధీజీకి రిక్షాఎక్కటమే గిట్టదు. ఆ పరిస్థితులలో రిక్షా ఎక్కకుంటే అపాయం తప్పదుగదా!- అయితే ఇంతలో ఆ రిక్షామనిషి యీ గుంపు దౌర్జన్యానికి జడిసి గాంధీజీదగ్గఱకు రాకుండానే పరుగెత్తుకొనిపోయాడు. ఇక గాంధీజీ లాఫ్టన్ను పాదచారులైపోక తప్పలేదు. ఆ తుంటరిమూక

ఒక్కుమ్మడిగా ఆ మిత్రద్వయాన్ని చుట్టుముట్టి విడదీశారు. గాంధిజీమీద రాళ్లూ ఇటుకముక్కలూ కుళ్ళిన కోడిగుడ్లూ వర్షించటం మొదలుపెట్టారు. ఆయన తలపాగ చిరిగిపోయింది. శరీరంలో దెబ్బతగలని చోటులేదు. అటువంటి ఆపత్సమయంలో ఒక ఆంగ్లేయవ్యక్తి ఆయనను రక్షించింది. ఆ వ్యక్తి అలెగ్జాండరు భార్య. అలెగ్జాండరు రక్షకభటాధికారి. ఆమె గాంధిజీని ఎఱిగి ఉన్నది. ఒక దుర్బలవ్యక్తిని దుండగులు చుట్టుముట్టి హింసిస్తూ ఉంటే ఆమె చూచి సహించలేకపోయింది. తత్క్షణం అక్కడికి పరుగెత్తుకొని వెళ్లి ఆయన ప్రక్కను నిలిచి తన గొడుగుచాటున ఆయనను దాచింది. ఆ గొడుగు కేవలం నామమాత్రపు రక్షణేకాని, ఆ దారుణశిలావర్షంనుంచి గాంధిజీని ఎలా రక్షించగలదు? అయితే అలెగ్జాండరు పత్నిని ఎఱుగనివారు ఆ గుంపులో లేనేలేరు. తాము ఏమాత్రం ఉద్రేకపడ్డా ఆమెకు ప్రమాదం కలుగుతుందని వారు జంకారు. అందువల్ల చేసేదిలేక అక్కడినుంచి తిరోగమించారు. గాంధిజీకి గండం తప్పింది.

రక్షకభటాధికారి అయిన అలెగ్జాండరుకూడా సమయానికి అక్కడికి వచ్చాడు. ప్రత్యేకరక్షణతో గాంధిజీని రుస్తుంజీ యింటికి చేర్చాడు. కాని అక్కడ మళ్ళీ దుండగులు మూగారు. గాంధిజీని కడతేర్చితీరాలని ఉద్దేశించారు. ఈ సమయంలో అలెగ్జాండరు సామాన్య రక్షకభటునివేషంతో గాంధిజీని దొడ్డిగుమ్మంగుండా బయటికిపంపి, తాను ఆ గుంపు దగ్గఱకువెళ్ళి ఇలా పాడుతూ వారిని కొంతసేపు ఆకర్షించాడు:

"ముసలిగాంధినిపట్టి, రేగుచెట్టుకుకట్టి, చక్కగా ఉరి దీయుడీ."

తర్వాత రెండుమూడు రోజులపాటు గాంధిజీని రక్షక భటాలయం (పోలీసుస్టేషను)లో ప్రత్యేకరక్షణక్రింద ఉంచే యేర్పాటుజరిగింది. కాని ఆయనపైని విఱుచుకుపడ్డ తుపాను విరిసిపోగానే యీ పనివల్ల ఆయనకు మేలే జరిగిందని తేలింది. ఆయనమీద శ్వేతవర్ణులకు కలిగిన అనుమానాలన్నీ నిరాధారాలని స్పష్టమైనది. రెండు ఓడలలోనూ బయలుదేఱివచ్చిన భారతీయులనందఱినీ గాంధిజీయే ప్రోత్సహించి తీసికొనివచ్చాడని పాశ్చాత్యుల అపోహ. గాంధిజీకి ఆ భారతీయులకూ ఓడలోనే పరిచయమైనదికానీ, వారివలన ఆయన ప్రోత్సాహంతో జరిగినదికాదు. వారిలో చాలామంది వెనుకటినుంచీ దక్షిణాఫ్రికాలో ఉన్నవారే. మాతృదేశం చూడాలనే కాంక్షతో హిందూదేశానికివెళ్ళి తిరిగివస్తున్నారు. నేటాలు పరిస్థితులను గుఱించి గాంధిజీ ప్రకటించిన విషయాలను విపరీతార్థంతో రూటర్సు వార్తాసంస్థ లండనునగరానికి అందజేసింది. అదే మఱింత సంక్షిప్తంగా దక్షిణాఫ్రికాకు అందింది. అయితే గాంధిజీయే యీ అసత్యవార్తలను చాటించాడని నేటాలు తెల్లవారికి ఆయనమీద కోపంకలిగింది. ఈ అనుమానమూ, ఆగ్రహమూ అన్నీ అకారణంగా ఏర్పడ్డవే అని స్పష్టమైనతర్వాత నేటాలు శ్వేతజాతిఅంతా గాంధిజీపట్ల సుప్రసన్నమైంది. గాంధిజీకి గౌరవాదరణలు విస్తరించాయి. ఆయనకూడా పై సంఘటన తన భవిష్యత్కార్యక్రమానికి దోహదహేతువౌతుందేగాని భంగకరంకాదని విశ్వసించాడు.

# 3

పందొన్మిదో శతాబ్ది అంతానికి ఆయన జీవితపథంలో ఒక నవ్యమార్గం ఏర్పడ్డది. సహజంగా ఆయన అంతవఱకూ కామపరాయణుడుగానే ఉన్నాడు. ఆయనకు దక్షిణాఫ్రికా లోనే ఇద్దఱు కుమారులు కలిగారు. డాక్టరురాక ఆలస్యం కావటంచేత ఒక కుమారుణ్ణి ఆయనే తల్లిగర్భంనుంచి వెలువరించాడు. అయితే అప్పటికే స్త్రీ సాంగత్యంమీద మనస్సు లగ్నం చేయటం తన ఉద్యమానికి భంగకరం అని భావించటం మొదలుపెట్టాడు. హిందూమతంలో స్త్రీ సాంగత్యం లేకుండా ఉండటాన్ని బ్రహ్మచర్యం అంటారు. బ్రహ్మచర్యం అంటే భగవంతుణ్ణి తెలుసుకొనటమే. బ్రహ్మచర్యవ్రతానికి ఆత్మ సంయమనమూ, కామహేతువులైన ఆహారపదార్థాలను వర్జించటమూ ముఖ్యమైన నియమాలు. హిందువులందఱికీ బాల్యంలోనూ, వార్ధకంలోనూ ఈ వ్రతాన్ని పాలించటం అత్యావసరం అనే భావం చిరకాలంనుంచీ ఉన్నది. మానవ జీవితాన్ని బాల్య యౌవన కౌమార వార్ధకాలని నాలుగు భాగాలుగా హిందూమతం విభజిస్తున్నది. ఈ నాలుగింటిలో ప్రథమ చతుర్థ భాగాలలో బ్రహ్మచర్యం పాటించటం అత్యావసరం అని హైందవ సిద్ధాంతం. గాంధిజీకి హిందూమతాన్ని గుఱించి తగినంత విజ్ఞానంలేకపోయినా బ్రహ్మచర్య వ్రతపాలనమాత్రం అవసరమే అనే భావం ఆయన హృదయంలో మెదలటం మొదలుపెట్టింది.

ఇంతేకాక ప్రజాసేవావిషయంలో ఆయనకు గల ఆశయాలు అస్పష్టంగా లేవు. అయినా అవి చాలా నిదానంగా

ములకెత్తుతున్నాయి. 1920వ సంవత్సరంలో స్వరాజ్యోద్యమం ప్రారంభించే వరకూ "రాణిని దేవుడు రక్షించుగాక!" అని ఆయన బ్రిటిషు ప్రభుత్వంపట్ల భక్తి విశ్వాసాలతో నే న్నాడు. బోయరు యుద్ధం ప్రారంభమైనప్పుడు ఈ రాజభక్తిని ఆయన విడిచిపెట్టలేకపోయాడు. అది కొన్ని సంవత్సరాలపాటు ఆయనలో తిష్ఠవేసికొనేఉన్నది. అయితే గాంధిజీకి బోయర్ల పట్ల సానుభూతి లేకపోలేదు కాని రాజభక్తి దానిని తలదన్నింది. ఆయన హృదయంలో నిజంగా ఈ రెంటికీ సంఘర్షణ జరిగిం దనలేము. బోయర్లపట్ల ఆయనకు సహజంగాఏర్ప డిన సానుభూతి ఈసందర్భంలో ఆయనను ఏవిధంగానూ మార్చలేదు. బ్రిటిషుప్రభుత్వం కల దేశంలో పుట్టిఉండటమూ, రాజభక్తి ప్రమాణంచేసిఉండటమూ ఆయన హృదయాన్ని గట్టిగా బంధించి బ్రిటిషుప్రభుత్వంవైపు లాగికొనిపోయాయి. అందుచేత ఆయన ఆ యుద్ధకాలంలో భారతీయ వైద్యదళాన్ని సంఘటించి యుద్ధంలో గాయపడ్డ బ్రిటిషుసైనికులకు సేవచెయ్య టానికి ఏర్పాట్లుచేశాడు. స్పియన్‌కాప్ మొదలయిన అనేక రంగాలలో అగ్నివర్షం కురుస్తున్నా లక్ష్యంచెయ్యకుండా ఈ వైద్యదళంవారు వెయ్యిమందిన్నీ అమోఘమైనసేవచేసి బ్రిటిషు అధికారుల ప్రశంసలకు పాత్రులైనారు. ఈ పనివల్ల గాంధిజీకి కొంత ప్రతిష్ఠ హెచ్చింది. దక్షిణాఫ్రికా భారతీయులపట్ల సాను భూతిని సంపాదించటానికి ఇంకా అవకాశమున్నూ కలిగింది. అయితే గాంధిజీలో ఆదినుంచీ పాదుకొన్న సేవాధర్మానికి ఇదొక ప్రాసంగిక ఫలంమాత్రమేనని జ్ఞాపకంపెట్టుకోవాలి.

యథార్థానికి వ్యాధిపీడితులకు సేవచెయ్యటం అనేది

గాంధిజీకి చాలా ఇష్టమైనది. అది ఇప్పటినుంచీ ఆయనకు ముఖ్య కార్యక్రమాలలో ఒకటిగా రూపుదాల్చింది. ఆయన తనపిల్లలకు అనారోగ్యం కలిగినప్పుడే రోగిసేవచెయ్యటం అనేది ఆచరణలో పెట్టాడు. ఒక కుమారుని జననకాలంలో ఆయనే మంతరసానిగా పనిచేశాడని మనం ఇదివరకే తెలిసికొన్నాము. ఇక ఈ బోయరుయుద్ధం అంతమైనప్పటినుంచీ పేదభారతీయులు చికిత్సపొందే ఉచితవైద్యశాలలో ఆయన ప్రతిదినమూ రెండుగంటలు రోగిసేవచెయ్యాలని నియమం ఏర్పాటుచేసికొన్నాడు. యావజ్జీవితమున్నూ ఆయన మనస్సును లోగొన్న ఈ రోగిసేవాభిలాష ఈవిధంగా ఇప్పటినుంచీ క్రమక్రమంగా అభివృద్ధిపొందింది. అందుచేతనే యుద్ధసమయంలో క్షతగాత్రులకు సేవచెయ్యాలనే సంకల్పం అతిసహజంగా ఆయనను కార్యరంగంలోకి దుమికించింది. ఆయన యిటువంటివాటికి ప్రాధాన్యమిచ్చేవాడు. ఒకకుష్ఠరోగికి సేవచేసేసందర్భంలో ఆపనిపూర్తి అయ్యేవరకూ మంత్రివర్గాలనూ, మొత్తంసామ్రాజ్యాన్నీ తనకొఱకై వేచియుండేటట్లుచేసేవాడు. ఆవిధంగాచేయడానికి ఆయన సందేహించేవాడుకాడు. మహిమానిధులుగా ప్రసిద్ధికెక్కిన అవతారపురుషులందరటి మాదిరిగానే గాంధిజీలోకూడా కొన్ని మహిమలుండేవి. అయితే ఆయన మహిమలు కొన్ని ఆయన ఓర్పుతో వ్యాధిగ్రస్తులకు సేవచెయ్యటంవల్ల పుట్టినవే. హిందూదేశానికి తిరిగివచ్చినతర్వాత ఒకప్పుడు వైద్యులు మరణించిందని నిర్ధారణచేసిన బాలిక ఆయన పరిచర్యలో బ్రతికింది. ఇది యేదోమహిమ అనుకొనేవారినిఉద్దేశించి ఆయన యిలాత్రివంగా అన్నాడు : "మహిమయేమిటి? అలాఅనుకోవటం అవివేకం.

ఆ బాలికకు నేనుచేసినదల్లా విరేచనసాధకం (ఎనిమా) చెయ్యటం మాత్రమే!'' విరేచనసాధకం చెయ్యటమూ, గాయాలకు కట్లు కట్టటమూ, పట్టీలు వెయ్యటమూ, రోగిపరిస్థితిని చక్కగా ఊహించి అందుకు తగిన పరిచర్య చెయ్యటమూ తన యీ రోగిసేవాపద్ధతికి ముఖ్యమైన విషయాలుగా ఆయన భావించాడు. ఆయన యిందులో కృతకృత్యుడు కావటానికి ముఖ్యంగా ఆ మృదుప్రసంగమూ, కోమలహాస్యస్ఫూర్తి, నిరాడంబరమైన ప్రాణి వాత్సల్యమూ ముఖ్యకారణాలనటంలో సందేహం లేదు. తాను ఎంత అస్వస్థుడుగా ఉన్నా, ఎంత అశాంతితో ఉన్నా రోగులకుమాత్రం స్వస్థతా, శాంతీచేకూర్చగలిగేవాడు.

అప్పట్లో ఆయనకు నిజంగా శాంతి లేకపోయింది. బ్రహ్మచర్యం సులభసాధ్యంగా కనిపించలేదు. దానిని సాధించటానికి కొన్ని సంవత్సరాలు పట్టింది. 1901వ సంవత్సరంలో బోయరుయుద్ధం ముగిసినతర్వాత, ముందుగా ఏ విధమైన శపథాలూ చెయ్యకుండానే ఆత్మనిగ్రహంతో బ్రహ్మచర్య సాధనకు ఉపక్రమించాడు. 1906వ సంవత్సరంవఱకూ గాంధిజీ బ్రహ్మచర్యం పాటించగలనని నిస్సందేహంగా అనలేకపోయాడు. అంటే శరీరసౌఖ్యాన్ని (స్త్రీ సంయోగాన్ని) వర్జించటానికి చేసిన ప్రయత్నంలో ఆయన ఇన్నియేండ్లూ అపజయం పొందుతూనే ఉన్నాడన్నమాట. శారీరిక వాంఛలను అధిగమించి, తద్వారాగాని తన ఆశయాలను సాధించటానికి వీలు లేదని ఆయన అభిప్రాయపడిఉండటంచేత ఆయన ఆత్మ ఎప్పుడూ దైహిక బంధాలనుంచి విముక్తి సంపాదించవలసిందని ప్రబోధించటం మొదలుపెట్టింది. కాని యీ విషయంలో

బ్రహ్మచర్యసాధనవివరించే హైందవవాఙ్మయాన్ని పరిశీలించటం వల్లనే ఆయనకు ఇటువంటి నిశ్చయం కలిగినట్లు కనిపించదు. స్వతస్సిద్ధంగానే ఆయనకు బ్రహ్మచర్యంపైన అభిమానం కలిగిందనీ, అటుతర్వాతనే ఆయన ఆ గ్రంథాలను పరిశీలించాడనీ తోస్తుంది. మొదట ఆయన తన ఉద్దేశాన్ని కస్తూరిబాకు తెలిపాడు. అంతవఱకున్నూ ఆయన కాముకతవల్ల బాధపడుతూ ఉన్న ఆ యిల్లాలు తత్క్షణం భర్తఉద్దేశాన్ని సమర్థించింది. తన కాముక వాంఛలన్నీ ఆమె మీదనే కేంద్రీకృతాలయినవని ఆయన ఆమెతో తఱచూ చెప్పుతూ ఉండడంవల్లనూ, ఆమెకు ఎన్నడూ ద్రోహం తలపెట్టనివాడని ఆయనయందు ఆమెకు దృఢవిశ్వాసం ఏర్పడిఉండటంవల్లనూ, నిరాక్షేపణగా ఆయన నిశ్చయాన్ని ఆమోదించింది.

## 4

బోయరుయుద్ధం ముగిసినతర్వాత గాంధీజీ మళ్ళీ హిందూదేశానికి వచ్చాడు. ఆ పర్యాయం ఇక భారతదేశంలో స్థిరపడాలని ఆయన నిశ్చయించాడు. ఎందుచేతనంటే అంతవఱకున్నూ ఆయన మాతృదేశానికి దూరంగానే ఉండిపోయాడు. అయితే నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ వారు తాము కోరినప్పుడు తమ తోడ్పాటుకు ఆయన తిరిగివచ్చే షరతుమీద ఆయన ప్రయాణానికి అంగీకరించారు. అంతవఱకున్నూ పాల్గొన్న ప్రజాహిత కార్యక్రమాలలో ఆయన ఎటువంటి ప్రతిఫలమూ పుచ్చుకోని కారణాన దక్షిణాఫ్రికాను ఆయన విడిచిపెట్టేనాడు ఎందఱో మిత్రులు ఎన్నో బహుమతులు

ఇచ్చారు. కాని ఆయన హృదయం ఆ బహుమతులను తీసికొన టానికి అంగీకరించలేదు. వాటిలో ఎన్నో గొప్పవిలువగల వస్తువులుకూడా ఉన్నాయి. అందుచేత వాటినన్నిటినీ ఆయన ఒక నిధిలో భద్రపరచాడు. భారతీయులకు ఎప్పుడైనా అవసరమైతే, వాటిని అందుకోసం వినియోగించాలని ఆయన నిశ్చయించాడు. ఈ సందర్భంలో కస్తూరిబా ఆయన అభిప్రాయాన్ని మార్చాలని చాలా ప్రయత్నించింది. అయితే పిల్లలందరూ తండ్రి అభిప్రాయాన్నే సమర్థించారు. కాబట్టి గాంధిజీ కనకరత్నమయాలైన అమూల్య వస్తువులన్నీ భారతీయుల సహాయనిధిగా ఏర్పరచ గలిగాడు. అటుతర్వాత అత్యవసర సందర్భాలలో ఈ ఆభరణాలద్వారా సులభంగా ధనం సేకరించటానికి ఆయనకు అవకాశాలు కలిగాయి.

ఆ 1901వ సంవత్సరంలో కలకత్తాలో ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ సమావేశం జరుగుతుందని తెలిసి, అందులో తానుకూడా పాల్గొనాలని గాంధిజీ ఉద్దేశించాడు. రాజకీయ చరిత్రలో అపూర్వసృష్టి అయిన ఈ సంస్థ వెలసి అప్పటికి 16 సంవత్సరాలు మాత్రమే అయింది. దీనిని స్థాపించినవాడు ఒక ఆంగ్లేయుడే ఆయన పేరు అలాన్ అక్టావియన్ హ్యూమ్. ఈయన 1907వ సంవత్సరం వరకూ కూడా దీనికి కార్యదర్శిగా ఉన్నాడు. ఆ కాలంలో రాజ ప్రతినిధిగాఉన్న డఫ్రిన్ ప్రభువు ఈ సంస్థలో భారతీయులను ఎక్కువగా చేర్చాలని ఆవిధంగా సంస్థను బలపరచాలనీ ఉద్దేశించాడు. అందువల్ల కాంగ్రెస్ సమావేశాలలో ప్రసంగించవలసిందనీ, దానిని సక్రమంగా నడిపించవలసిందనీ వారిని ఆయన కోరుతూవచ్చాడు. అప్పటికి

ఈ కాంగ్రెస్ ఆశయాలు సాంఘిక రాజకీయాలు రెంటికీ పరిమితాలుగా ఉన్నాయి. భారతీయులలో జాతీయభావం మొలకెత్త జెయ్యాలనీ, హిందువులూ ముస్లిములూ కూడా సమరసభావంతో శాసనబద్ధమైన జాతీయోద్యమం నిర్వహించాలనీ కాంగ్రెస్ ఉద్దేశించింది. జనసామాన్యపు శ్రేయస్సుకోసం చెయ్యగలిగినదంతా చెయ్యటమూ, ప్రజావాంఛితాలను ప్రభుత్వానికి తెలియజెయ్యటమూ దాని లక్ష్యాలు. అయితే అప్పటికి భారతీయులలో చాలామంది నిరక్షరాస్యులు. సంస్థ ప్రారంభమైన తర్వాత ఆరాతీస్తే, దేశంలో నూటికి తొంభై మంది పైగా నిరక్షరాస్యులున్నట్లు తేలింది. కనుక సంస్థలో నడిమితరగతి కుటుంబాలకు చెందిన విద్యావంతులూ, న్యాయవాదులూ, వర్తకులూ మొదలయినవారు మాత్రమే సభ్యులుగా ఉన్నారు. వీరు దేశంపక్షాన ప్రభుత్వంతో ఏమి చెప్పవలసివచ్చినా, కొంత జంకుతో వ్యవహరించేవారే కానీ, నిర్భయంగా చెప్పలేకపోయేవారు. అయినప్పటికీ దేశానికి ప్రాతినిధ్యం వహించే సంస్థ మరేదన్నీ లేకపోవటంవల్ల గాంధిజీ ఇదే దేశానికి "జీవరక్తం" గా భావించాడు. కాంగ్రెస్ తనచేతులలో మున్ముందు ఎటువంటి అద్భుతసాధనంగా రూపొందుతుందో ఊహించకముందే గాంధిజీ 1901వ సంవత్సరంలో ఈ సమావేశంలో పాల్గొనాలని నిశ్చయించాడు.

దక్షిణాఫ్రికాలోని భారతీయుల ఉద్యమాన్ని బలపఱచే తీర్మానం ఇందులో ఆమోదింపజెయ్యాలని గాంధిజీ ముఖ్యంగా వాంఛించాడు. అయితే ఈ సమావేశంలో పాల్గొనేవారు ఒకరూ ఇద్దఱూ కారు. దేశం నలుమూలలనుంచీ వస్తారు. వ్యవధి

కూడా రెండుమూడు రోజులకంటె ఎక్కువలేదు. ఈ కొద్ది గడువులో తీర్మానాన్ని సర్వామోదకరంగా రూపొందించటం ఎలాగు? అదీగాక కాంగ్రెస్ సమావేశం జరిగేచోటు కూడా ఆరోగ్య సదుపాయాలదృష్టిలో ఉత్తమంగా కనబడలేదు. అందుకు ఆయన చాలా బాధపడ్డాడు. ఇతరుల అభ్యంతరం లేకపోతే మఱుగుదొడ్లన్నీ కూడా ఆయనే స్వయంగా బాగు చేసి ఉండేవాడు. అక్కడికీ తనమఱుగుదొడ్డిని మాత్రం ఆయనే బాగుచేసికొన్నాడు. స్వచ్ఛంద సేవకుడుగా చేరి, గుమాస్తా విధులు అన్నీ అతి జాగ్రత్తతో నిర్వహించాడు. అక్కడి పరి స్థితులు ఆయనకు ఎంతో ఇబ్బంది కలిగించినా, యథార్థమైన జాతీయ సమావేశంలో పాల్గొనగలుగుతున్నాననే ఉత్సా హంవల్ల ఆయన వాటిని లెక్కచేయలేదు. పాపం! ఆయన తీర్మానాన్ని సభలో చదవవలసి వచ్చేసరికి చాలా ఆలస్యం అయింది. అంతకు పూర్వం సభలో వచ్చిన తీర్మానాలన్నీ ఏకగ్రీవామోదాం పొందాయి. ఆయన చదువుతూ ఉన్న దేమిటో చాలామంది వినిపించుకోనేలేదు. అయితే మహనీయు డైన గోఖలే శ్రద్ధగా తీర్మానాన్ని పరికించి ఆమోదించటం చేత మొత్తంమీద అది సభవారి ఆమోదం పొందగలిగింది.

కాంగ్రెస్ సమావేశం ముగిసినతర్వాత గాంధిజీ ఒక నెలరోజులపాటు గోఖలేయింట అతిథిగాఉన్నాడు. ఈ అను భవాన్ని ఆయన ఎన్నడూ మఱచిపోలేదు. కలకత్తాలో ఈ నెల శుభాశుభమిశ్రమంగా గడచింది. గోఖలేద్వారా గాంధిజీ కల కత్తాలోని ప్రసిద్ధవ్యక్తులను చాలామందిని సందర్శించాడు. దక్షి ణాఫ్రికాలోని భారతీయులకు తోడ్పాటు ఇయ్యాలని వారికంద

టికీ ఆయన విజ్ఞప్తిచేశాడు. ఆనాడు ఇది తన ప్రథమకర్తవ్యంగా భావించిన గాంధిజీ తనయత్నం కొంతవఱకైనా ఫలించగలదని విశ్వసించగలిగాడు. అయితే ఒకమాఱు కాళికాలయానికి వెళ్లటం తటస్థించింది. దేవిపేర అక్కడ జరుగుతున్న జీవహింస చూచి ఆ అహింసాప్రియుడు నిలువునా నీరైనాడు. గొఱ్ఱెగానీ, మేకగానీ మనుష్యులవంటి ప్రాణులే అని ఆయనభావంకదా! రక్తతర్పణంతో చేసేపూజ ఆయనకు ఎంతమాత్రమూ గిట్టనిది కాబట్టి ఇటువంటి ఆచారాలను అరికట్టటానికి ఆయన జీవితాంతం వఱకూ కృషిచేశాడు.

ఒకసారి రంగూను చూచిరావాలనే సంకల్పం కలగటం చేత గాంధిజీ కలకత్తాలోని గోఖలే ప్రభృతులయిన మిత్రులను వీడ్కొని, ముందు బొంబాయికి చేరుకొన్నాడు. పేదభారతీయుల యిక్కట్లను తెలిసికోవాలనే కోరికతో, ఆయన యీ ప్రయాణం మూడవతరగతిలోనే చెయ్యాలని అనుకొన్నాడు. భారతీయులు ప్రయాణించే మూడవతరగతిఅప్పుడేమీ, యిప్పుడేమీ, ఒకేవిధంగా అపరిశుభ్రతకూ, అనారోగ్యానికీ ఆలవాలమై ఉన్నది. ఇక రద్దీమాట చెప్పనేఅక్కఱలేదు. అందుచేత గాంధిజీ ప్రయత్నాన్ని విరమింపజెయ్యటానికి, గోఖలే చాలా చెప్పిచూచాడుగానీ, ప్రయోజనం లేకపోయింది. గాంధిజీ చూపులకు కొద్దిపాటిమనిషే. అయినా, ఆయన చేసితీరాలనుకొన్నపనిని మాననిపట్టుదలమాత్రం అఖండమైనది. కాశితో సహా నాలుగైదుచోట్లమాత్రం దిగాలని నిశ్చయించుకొని, అనుకొన్నట్లుగా సాధారణపు రైలుబండ్లమీదనే ప్రయాణం సాగించాడు. మూడవతరగతిప్రయాణికునిమాదిరిగానే భారతీయు

వేషం ధరించటంకూడా ఆయనకు ఇదే ప్రథమం. ఒక చొక్కా, దోవతీ ధరించాడు.

ఆ ప్రయాణంలో తన్ను విస్మయపఱచిన సంఘటన లన్నింటినీ ఆయన గ్రంథస్థంచేశాడు. అప్పటినుంచీ ప్రతివర్యా యమూ ఆయన ఏ రైలు ప్రయాణంచేసినా మూడవతరగతిలోనే చేశాడు. ఇలా చెయ్యటంవల్ల మూడవతరగతిపెట్టెలోకల అసౌకర్యాలకు అసమ్మతి తెలియజెయ్యటమూ, తోడి ప్రయా ణికుల యిక్కట్లు స్వయంగా తెలిసికొనటమూ జరుగుతుందని ఆయనభావించాడు. 1918–19 సంవత్సరాలలో తీవ్రంగా జబ్బు పడ్డప్పుడు మాత్రమే గాంధిగారి యీవ్రతానికి భంగం కలిగింది. అయితే ఆయన మూడవతరగతి రైలుపెట్టెలోనే ప్రయాణం చేస్తాడని తెలిసి బ్రిటిష్ప్రభుత్వమూ, తర్వాత వచ్చిన భార తీయ ప్రభుత్వమూకూడా ఆయన ఎక్కేపెట్టెలోమాత్రం అపరిశుభ్రతలేకుండా చూస్తూవచ్చాయి. ఆయన శరీరం చాలించినతర్వాత దేశంలోని పవిత్రనదులన్నింటిలోనూ ఆయన అస్థినిమజ్జనం జరిగినప్పుడుకూడా ఆ అస్థుల్ని మూడవతరగతి పెట్టెలోనే ప్రత్యేకంగా తీసికొని వెళ్ళటం జరిగింది.

కాశీ దేవాలయాలలో ముఖ్యంగా విశ్వనాథుని(ప్రపంచ నాథుని) ఆలయంలోనూ గల కాలుష్యమూ దైవంపేర యాత్రికులవద్దనుంచి సొమ్ముగుంజటమూ చూస్తూఉంటే ఆయ నకు కలిగిన దుఃఖక్రోధాలకు అంతులేదు. దేవాలయాలకు చేరే మురికి ఇఱుకుత్రోవలూ, ఈగలుముసిరే అంగళ్లూ, అసహ్య మైన వాతావరణమూ ఆయనకు చాలాదుఃఖం కలిగించాయి. తర్వాతకూడా, అనేకపర్యాయాలు ఆయన కాశీ సందర్శనం

చేశాడు. అయితే అప్పటికి మహాత్ముడనే పేరు ఆయనకు బాగాస్థిరపడ్డది. ప్రజలు తండోపతండాలుగా ఆయనకు స్వాగత మర్యాదలు జరిపేవారు. అయినప్పటికీ కాశీపరిస్థితులు ఆయనకు ఎప్పుడూ దుఃఖకరాలుగానే ఉండేవి.

ఒకమాఱు ఆయన అస్వస్థురాలుగాఉన్న అనిబిసెంటును చూడటానికి వెళ్లాడు. అప్పటికి ఆమె కొంచెంకొంచెం కోలుకొంటూ ఉన్నది. అనిబిసెంటు అసాధారణమైన ఉజ్జ్వలవ్యక్తి. 'సోషలిజం' మొదలైనఅనేకవిశ్వాసాలద్వారా చివరకు దివ్యజ్ఞాన సమాజమును చేరుకొన్నది. అలా చెయ్యటంద్వారా ఆమె భారతీయులలో తమ వాఙ్మయాన్నీ పూర్వాచారాలనూ చక్కగా అవగతం చేసికోవాలనే ఆకాంక్షనురేకెత్తించి, భారత వర్షానికి అమోఘమైన సేవ చేసింది. హిందూదేశమంతటా ఉపన్యాసాలిస్తూ సంచారంచేసింది. పుట్టుకచేత ఆంగ్లేయవనిత అయినప్పటికీ, ఆంగ్లేయుల వలసరాజ్యంలోని ప్రజలకు చెందిన వ్యక్తిగానే ఆమె భాసించింది. ముఖ్యంగా హిందూదేశంలో ప్రాచీన సదాచారాలను పునరుద్ధరించే కార్యక్రమంలో ఆమె ప్రధానపాత్ర వహించింది. ఈ ఉద్యమంవల్లనే భారతవర్షానికీ, ఆమెకూ కీర్తియినుమడించింది. గాంధిజీ ఆనాడుగానీ తర్వాత ఎన్నడుగానీ దివ్యజ్ఞానసమాజంలో సభ్యుడుగా చేరకపోయినా, అనిబిసెంటు గుణగౌరవాన్ని గమనించి, ఆమెయందు ఎంతో భక్తివిశ్వాసాలు ప్రదర్శించేవాడు.

బొంబాయికి తిరిగివచ్చిన తర్వాత ఆయన న్యాయవాది వృత్తితో కాలక్షేపం చేద్దామనుకొన్నాడు. కాని దైవసంకల్పం మఱొక విధంగా ఉన్నది. దక్షిణాఫ్రికాలోని భారతీయులకు

ఆయన తోడ్పాటు అవసరంగా తోచి, వారు తత్క్షణం బయలు దేఱి రావలసిందని తంతివార్త పంపించారు. జోసెఫ్ ఛేంబర్లేను దక్షిణాఫ్రికాకు వస్తున్నాడనీ, గాంధిజీ వెంటనే తిరిగి రావలసిం దనీ అందులో ఉన్నది. డర్బను నగరంనుంచి బయలుదేఱేట ప్పుడు గాంధిజీ తన మిత్రులకు చేసిన వాగ్దానాన్ని అనుసరించి తత్క్షణం అక్కడికి బయలుదేఱక తప్పలేదు. ఈ పర్యాయం తనకు సహాయులుగా ఉండటం నిమిత్తం ఆయన నలుగురైదు గురు యువకులను తనతోబాటు దక్షిణాఫ్రికాకు తీసికొని వెళ్ళాడు. ఈ యువకులలో మగన్‌లాల్ గాంధి ఒకడు. ఇతను గాంధిజీ అన్నగారి కుమారులలో రెండవవాడు. దక్షిణాఫ్రి కాలో ఈ పర్యాయం జరుగనున్న పోరాటంలో ఇతను గాంధిజీకి అండదండలుగా నిలవటానికి నిశ్చయించుకొన్నాడు.

సరిగా నిర్ణీతసమయానికి గాంధిజీ డర్బను నగరం చేరు కొన్నాడు ఇండియన్ నేటాల్ కాంగ్రెస్ వాంఛితాలను లిఖిత రూపాన ఛేంబర్లేనుకు అందజేయవలసి ఉన్నది. ఛేంబర్లేను దక్షి ణాఫ్రికాకువచ్చింది.అక్కడధనసహాయం అందుకోటానికీ,వీలైతే కడచినయుద్ధంనాటి బ్రిటిషు-బోయరు విద్వేషాగ్నిని చల్లార్చ టానికీమాత్రమే! భారతీయుల స్థితిగతులు ఆయనకు పట్టలేదు. కాబట్టే వలసరాజ్యాలలోని ప్రభుత్వాలను అదుపులోపెట్టటం బ్రిటిషు ప్రభుత్వానికి సాధ్యంకాదనీ, ఆఫ్రికాలోనే ఉండదలచు కొంటే భారతీయులు అచ్చట యూరోపియనులతో సమాధాన పడకతప్పదనీ ఆయన ప్రకటించాడు.

నేటాల్‌నుంచి గాంధిజీ వెంటనే ట్రాన్సువాలుకు వెళ్ళ వలసి వచ్చింది. ఎందువల్లనంటే ఛేంబర్లేను అక్కడకు

వెళ్లనున్నాడని తెలిసింది. ట్రాన్సువాలులోని భారతీయుల పక్షాన కూడా అతనికి ఒక విజ్ఞప్తి యిటువంటిదే అందజెయ్యాలని గాంధిజీ ఉద్దేశం. నేటాలుతో పోల్చిచూస్తే ట్రాన్సువాలు భారతీయులకు మరింత దుర్భరమైన ప్రదేశం. ఎంతో పలుకుబడి ఉండి, అనేక సందర్భాలలో అత్యధికమైన లంచం చెల్లించడం సాధ్యమైతేనే కాని, భారతీయులు ట్రాన్సువాలులో అడుగుపెట్టే అవకాశం లేదు. యుద్ధకాలపు బ్రిటిషు-బోయర్ విద్వేషం మరీ తీవ్రమైపోయింది. విజేతలయిన బ్రిటిషు-వారు హిందూదేశంనుంచీ,సింహళంనుంచీ ఇంకా ఎక్కడెక్కడనుంచో క్రొత్తవారిని తీసికొనివచ్చి ప్రభుత్వోద్యోగాలలో నియమించారు. ఈ క్రొత్త ఉద్యోగస్థులు దేశానికి పూర్తిగా అపరిచితులై చాలా నిరంకుశంగా వ్యవహరించటం మొదలుపెట్టారు. గాంధిజీ తనకొకప్పుడు ప్రాణదానంచేసిన పూర్వకాలపు మిత్రుడైన పోలీసుసూపరింటెండెంటు అలెగ్జాండరు సాయంవల్ల ప్రయాణానికి అనుమతిపత్రం సంపాదించగలిగాడు. కాని ప్రిటోరియాలో క్రొత్తగా వెలసిన ఆసియాకార్యాలయం గాంధిజీకి కేవలం వ్యతిరేకంగా వ్యవహరించింది. ఆ కార్యాలయోద్యోగులలో చాలామంది హిందూదేశంనుంచి వచ్చిన ఆంగ్లేయులు. ఛేంబర్లేనును దర్శించటానికిగానీ, ఆ సందర్భంలో ఎటువంటి ప్రమేయం కల్పించుకోటానికిగానీ ఆ ఉద్యోగులు గాంధిజీకి అనుమతి ఇవ్వలేదు. పైపెచ్చు ట్రాన్సువాలులో అడుగుపెట్టటానికి కూడా అవరోధాలు కల్పించారు. అందువల్ల గాంధిజీ తాను తయారుచేసిన విజ్ఞప్తిపత్రాన్ని ట్రాన్సు

వాలులోని ఒక భారతీయ క్రైస్తవ న్యాయవాదికి పంపి, అతనిచేత ఛేంబర్లేను సమక్షాన చదివించాడు.

అయితే కొద్ది రోజుల అనుభవంతో నేటాలులోని భారతీయుల కంటె, ట్రాన్సువాలులోని భారతీయులకే తాను ఎంతో చేయూత ఇయ్యవలసిన అవసరం ఉన్నదని, ఆయనకు అవగతమైంది. అందుచేత జోహాన్సుబర్గులో న్యాయవాదిగా వ్యవహరిస్తూ, ట్రాన్సువాలు భారతీయులకు తాను చెయ్య గలిగిన ఉపకారమంతా చెయ్యాలని, ఆయన నిర్ణయించాడు. అయితే జోహాన్సుబర్గు న్యాయస్థానంలో ఆయన న్యాయ వాదిగా వ్యవహరించటానికి ఎవరివల్లనూ ఎటువంటి అవరో ధాలూ లేకపోవటం ఆయనకు ఆశ్చర్యం కలిగించింది. నిరాక్షే పంగా సర్వోన్నత న్యాయస్థానంవారు ఆయనకు అందుకు అనుమతి ప్రసాదించారు.

ట్రాన్సువాలులోని భారతీయులు ఇతర ప్రదేశాల కెక్కడికైనా వెళ్ళి తిరిగివచ్చినప్పుడు కూడా, వారికి దేశంలో అడుగుపెట్టటానికి అనుమతి సులభంగా లభించేదికాదు. ఈ విషయాన్ని భారతీయ ప్రతిష్ఠకు భంగకరం కానివిధంగా ప్రభు త్వానికి నచ్చజెప్పి భారతీయుల యిబ్బందిని తీర్చటం తన ప్రథమ కర్తవ్యంగా గాంధిజీ భావించాడు. యుద్ధసమయంలో చాలామంది భారతీయులు ట్రాన్సువాలునుంచి బయటికి వెళ్ళారు. వారు మళ్ళీ స్వగృహాలకు రాగోరినప్పుడు ప్రభుత్వా నుమతి పత్రానికి లంచం నూటేసిపౌనులవటకూ కూడా చెల్లించుకోవలసివచ్చింది. గాంధిజీ ఎంతో ఓపికతో తగిన సాక్ష్యంఅంతా సేకరించి రక్షకభటశాఖాధికారి దగ్గఱకు

వెళ్ళాడు. న్యాయవిచారణ సంఘం ఎదుట లంచాలు పుచ్చు కొన్న ఉద్యోగస్థులను విచారించటం జరిగింది. జ్యూరర్లు వారిని నిర్దోషులని విడిచిపెట్టినా, అపకీర్తిమాత్రం వదలలేదు. ఉద్యోగాలనుంచి బర్తరఫు చెయ్యటం జరిగింది. భారతీయులకు కొంతవఱకు కష్టాలనుంచి విముక్తి కలిగింది. భారతీయ రక్షకుడుగా గాంధిజీకి కలిగిన ప్రతిష్ఠ ఈ సంఘటనతో ఇంకా విస్తరించింది.

క్రమంగా గాంధిజీ పెద్దకుటుంబానికి అధిపతిగా జీవితం సాగించాడు. అప్పటికి ఆయన వయస్సు 30 సంవత్సరాల ప్రాంతమే అనే విషయం గమనించదగ్గది. హిందూదేశంనుంచి తాను తీసికొనివచ్చిన యువకులతో బాటు ట్రాన్సువాలు లోని కొందఱు యువకులను కూడా తన కార్యాలయంలో గుమాస్తాలుగా నియమించుకొని, గుమస్తాలతో బాటు ఒక చోటనే నివాసం ఏర్పఱచుకొన్నాడు. ఈ క్రొత్త యువకులలో కొందఱు ఆంగ్లేయు లున్నారు. మఱికొందఱు ఇతర పాశ్చాత్య దేశీయు లున్నారు. వీరందఱితోనూ తన పరిచయం వృద్ధిచేసికొని వీరిచిత్తవృత్తులను తాను అర్థంచేసికోవాలని ఆయన ఉవ్విళ్ళూరాడు. తాను ఎక్కడఉన్నా, ఏమిచేసినా, అతినిరాడంబరంగా ఉండటానికి యత్నించాడు. ఈయన గృహంలోఉండే అతిథులుగానీ, అభ్యాగతులుగానీ ఈ యింటి నియమాలను సంతోషపూర్వకంగా అంగీకరించి ఆచరించేవారు. గాంధిజీ ఉదయం ఆఱుగంటలకు మేల్కొనేవాడు. అయితే అదే చాలా ఆలస్యంగా మేలుకొనటమని ఆయన భావించినట్లు కనబడుతుంది. ప్రాతఃకాలంలో ఏదైనా ఆహారం

తీసికొనే పద్ధతి అనావశ్యకమని ఆయన ఒకానొక గ్రంథంవల్ల తెలుసుకొన్నాడు. ఈ కాలంలో ఆయన కేవలశాకాహారిగా ఉండటమే కాకుండా, ఆహార విషయంలో కొన్ని విధి నిషేధాలను పాటిస్తూ కొన్ని పరిశోధనలుకూడ మొదలుపెట్టాడు. జోహాన్సుబర్గులో ఉండగానే, ప్రప్రథమంగా ఆయనవండ్లూ, పప్పులతో క్షుథాగ్నిని చల్లార్చుకొనటానికి ప్రయత్నం చేశాడు. తర్వాత ఈప్రయత్నమే సంవత్సరాలతరబడి బలమైన అభ్యాసంగారూపొందింది. మత విషయాలలో ఆసక్తి క్రమంగా వృద్ధిపొందుతూ వచ్చి, ఆయన ఇక్కడ ఉన్నంతకాలమూ హైందవ మతగ్రంథాలు నిర్విరామంగా చదువుతూ వచ్చాడు.

ఆయన అనుచరవర్గంలో ఇద్దఱు పాశ్చాత్య బాలికలు అతిసమర్థతతో తమవిధులు నిర్వర్తించేవారు. వారిలో డిక్ కన్య మొట్టమొదటిది. ఈమె స్కాట్లండు దేశస్థురాలు. స్వదేశంనుంచి ఆఫ్రికాకు అప్పుడేవచ్చింది. ఒక భారతీయునివద్ద పనిచెయ్యటానికి తానుమనస్ఫూర్తిగా అంగీకరిస్తున్నట్లుగాంధిజీతో అన్నది. ఆమె ఉత్తమసేవచేసిందని గాంధిజీప్రశంసించాడుకూడా. అయితే కొంతకాలానికి ఆమె మాక్డోనాల్డు అనేయువకుణ్ణి ప్రేమించింది. గాంధిజీ వారివివాహసమయంలో తానే సంతోషపూర్వకంగా, కన్యాదాతగా వ్యవహరించాడు. తర్వాత వచ్చినది ష్లెసిన్ కన్య. ఈమెదక్షిణాఫ్రికాలో స్థిరపడ్డ జర్మన్ కుటుంబంలో జన్మించింది. తర్వాత ఉపాధ్యాయవృత్తి చేపట్టింది. ఈమె నిష్కపటస్వభావం కలది. ఎంతో చాకచక్యంతోనూ, విశ్వాసంతోనూ వర్తించేది. ఒకప్పుడు గాంధిజీతోబాటు దాదాపు ఆయన అనుచరులందఱూ కారాగారంలో నిర్బంధంపాలుకాగా, ఆమె ఒక్కతే స్వయంగా

భారతీయోద్యమం సర్వతోముఖంగా నిర్వహించింది. తన అను చరులలో ఈమెను ప్రశంసించినట్లు గాంధిజీ మరి ఎవ్వరినీ ప్రశం సించలేదు. ఆమె నెలకు పదిపౌనులజీతంకంటె ఎక్కువ పుచ్చు కొనటానికి అంగీకరించలేదు. ఒకసారి గాంధిజీ వేతనం హెచ్చించ ప్రయత్నిస్తే ఆమెకు కోపంవచ్చిందికూడానూ. 17 సంవత్సరాల యీడున ష్లెసిన్ కన్య గాంధిజీవద్దకు వచ్చింది. ఉద్యమం క్లిష్టపరి స్థితులలో ఉన్నంతకాలమూ ఆమె ఆయనవద్దనే ఉన్నది.

గాంధిజీకి "భారతీయహృదయం" (Indian Opinion) అనే వారపత్రికను ప్రచురించటం తన కర్తవ్యంగా తోచింది. ఆయన 1904 వ సంవత్సరంలో ఈ పత్రికను ప్రకటించటం ప్రారంభించాడు. భారతీయజాతికి సంబంధించిన అన్ని విషయాల మీదనూ తన అభిప్రాయాలు ఎటువంటివో ఈ పత్రికద్వారా గాంధిజీ పదేండ్లపాటు నిరాఘాటంగా వివరిస్తూ వచ్చాడు. యథార్థానికి ఆయన ఈ పత్రికకు యజమానీకాడు; సంపాద కుడూ కాడు. కాని న్యాయవాదవృత్తిమూలాన ఆయన ఆర్జిం చిన సొమ్ములో చాలాభాగం ఈ పత్రికకోసమే కర్చయ్యేది. అంతేకాక దక్షిణాఫ్రికాలోని పత్రికాపాఠకులందరికి "భారత తీయ హృదయం" సంపాదకీయం వ్రాసేది గాంధిజీయే అని తెలుసు. ఈ వార్తాపత్రిక చేతిలో ఉండటంచేతనే దక్షిణా ఫ్రికాలో తన విజయానికీ, ముఖ్యంగా 'స్వచ్ఛందంగా ఆత్మా ర్పణ' చేయడమనే సత్యాగ్రహోద్యమం సఫలం కావటానికి అవకాశాలు కలిగాయని గాంధిజీకి విశ్వాసం కలిగింది. పత్రికల లోని ఆయనరచనలకుఫలితంగా దేశంలోనిఅన్ని ప్రాంతాలనుంచీ ఆయనకు అనుదినమూ అనేక లేఖలు వస్తూఉండేవి. వాటినిబట్టి

ఆయన వ్రాసినవన్నీ దేశంలో ఎందఱో శ్రద్ధగా చదువుతూ ఉన్నట్లు స్పష్టపడ్డది. ఇది ఆయన ఉద్యమవ్యాప్తికి ఎంతో సహాయమైంది. ప్రారంభంలో ఈ పత్రిక ఆంగ్ల, హిందీ, తమిళ, గుజరాతీభాషలు నాల్గింటిలోనూ వెలువడుతూఉండేది. అయితే అటుతర్వాత ఇంగ్లీషు గుజరాతీభాషలు రెంటిలోనూ పత్రిక వెలువరిస్తే చాలునని గాంధిజీ అభిప్రాయపడ్డాడు. అందుకు కారణం ఆ రెండు భాషలు తెలిసినవారే ఎక్కువగా ఉండటం మాత్రమే. కాబట్టి ఆయన ఆదేశాన్ని అనుసరించి పత్రికా సంపాదకులు ఆ రెండుభాషలలోనే పత్రికా ప్రచురణ సాగించారు. ఈ రెండున్నూ ఆయనకు సుపరిచితాలైన భాషలు. గుజరాతీ మాతృభాషే. ఇంగ్లీషా చిరపరిచయంచేత మాతృ భాష వంటిదే అయింది. తర్వాత పదేండ్లపాటు గాంధిజీ ఉద్యమానికి "భారతీయ హృదయం" (Indian Opinion) ప్రధాన సాధనమైంది.

ప్రజాసేవలో ఆయన ముందుగా చేయవలసివచ్చిన పని పేద భారతీయులకు రక్షణ కల్పించటం. వారిలో చాలామంది లిఖితరూపాన కూలిపనులకు ఒప్పందలచేసికొన్న కూలీలు. తమకు నిలవనీడ లేకుండా వారు బానిసతనానికి గుఱికావలసి వచ్చింది. దక్షిణ అమెరికాలో నీగ్రోల మాదిరిగా ఇక్కడి యీ కూలీలు నివసించే పేటలు దుర్గంధభూయిష్ఠాలై, అనారోగ్య దేవతకు ఆటపట్టులై ఉండేవి. ఈ పేటలన్నీ జోహాన్సు బర్గు నగరానికి వెలుపలనే ఉండేవి. పురపాలకసంఘం కూలీల పేటల దుస్థితి పరికించేదే కాదు. చివరకు ఈ పేటలలోని కాలుష్యంవల్ల ప్రజాసామాన్యం అంతటికీ అపాయకర వ్యాధులు

పోకుతాయని భయపడవలసి వచ్చింది. అప్పుడు పురపాలక సంఘంవారు పేటలను విడిచిపోవలసిందని కూలీలను ఆజ్ఞాపించారు. కూలీలపేట లన్నింటినీ నిర్మూలించవలసిందని నిశ్చయించారు. ఇక భారతీయులకు జోహాన్సుబర్గులో తలదాచుకొనే చోటులేని దుస్థితి సంభవించింది.

నిరావాసులయిన భారతీయులందరికీ గాంధిజీ న్యాయవాది అయినాడు. ఆయన 70 అభియోగాలలో వాదించాడు. వాటిలో ఒక్కటిమాత్రమే బెడిసిపోయింది. భారతీయులందరూ చివరకు నిరక్షరాస్యులుకూడా ఆయన తమకు అత్యంతాప్తుడని గుర్తించారు. సోదరుడు అని అర్థంవచ్చే "భాయీ" అనే పదంతో వారు తన్ను సంబోధిస్తూ ఉంటే ఆయనకు ఎంతో ఆనందం కలిగేది. దక్షిణాఫ్రికాలో సాధారణంగా అందరూ ఆయనను ఈ పేరుతోనే పిలిచేవారు. తన్ను ఎందరు ఎంత గౌరవంతో ఏ పేర పేర్కొంటూ ఉన్నప్పటికీ, గాంధిజీకి "భాయీ" అన్న సంబోధన వింటేనే చాలా తృప్తి కలిగేది. "మహాత్ముడు" అన్న బిరుదు ఆయనకు ఎన్నడూ గిట్టలేదు. "బాపూ" (తండ్రి)అన్నది ఆయనకు వార్ధకంలో వచ్చినపేరు. ఈ పదం భాయీ పదంవలె సంతృప్తి కలిగించక పోయినా, "మహాత్మ" పదంవలె ఆయనకు అంతగా గిట్టనిది మాత్రం కాలేదు.

భారతీయుల గృహావసతులనుగూర్చిన వ్యవహారాలలో ఆయన మునిగి తేలుతూఉండగా, బొబ్బలరోగంకంటె భయంకరమైన నల్లప్లేగు లేక శ్వాసకోశాలలో ప్లేగు అనే అంటు వ్యాధి బయలుదేరింది. ఇది ముందుగా చాలామంది ఆఫ్రికా

సీగ్రోలు పనిచేసే బంగారుగనులవద్ద పుట్టింది. ఈ నీగ్రోల తోబాటు కొందఱు భారతీయులుకూడా ఇక్కడ పనిచేసేవారు. ఒకనాటి సాయంకాలం ఈ వ్యాధికి గుఱిఅయిన 21 మంది మంది భారతీయులు గనులనుంచి బయటికి వచ్చారు. కూలీల పేటలో జనసమ్మర్దం విపరీతంగా ఉంటుంది. వ్యాధిమాట విన గానే గాంధిజీ తనదగ్గఱ ఉన్న నలుగురు భారతీయ యువకులతో ఆ ప్రదేశానికి బయలుదేరాడు. ఈ అయిదుగురున్నూ నిర్మా నుష్యంగా ఉన్న ఒకయింటికి చేరి వ్యాధిగ్రస్తులైనవారినందఱినీ అక్కడికి రప్పించి డాక్టర్ విలియమ్ గాడ్ఫ్రి అనే వైద్యుని చేత చికిత్స చేయించటం మొదలుపెట్టారు. ప్లేగు ఎంత తొంద ఱగా వ్యాపిస్తున్నా రోగులనందఱినీ ఆ రాత్రికే అక్కడికి తీసికొని వచ్చారు.

మఱునటిరోజున పురపాలకసంఘంవారు గాంధిజీకి ఒక ప్రత్యేక గృహం ఏర్పాటుచేసి వ్యాధిపీడితులయిన భారతీయు లకు అది చికిత్సామందిరంగా ఏర్పాటుచేశారు. రోగులను ఇక్కడికి తరలించటం జరిగింది. ప్లేగు సోకినవారికి కొంత నిర్దిష్ట విరామంతో బ్రాందీ ఇవ్వటం ఆ కాలంలో ముఖ్య చికిత్సగా ఉండేది. అయితే గాంధిజీకి బ్రాంది యిప్పించటం గిట్టదు. దీనివల్ల రోగం తగ్గుతుందని ఆయనకు నమ్మకం లేదు. తన సలహాకు అంగీకరించిన ముగ్గురు రోగులకు ఆయన మట్టితో నీటితో చికిత్స ప్రారంభించాడు. ఈ చికిత్స అప్పటి కప్పుడు ఆయన కనిపెట్టిందే. స్వయంగా ఆ రోగులవద్ద ఉండి వ్యాధి తీవ్రరూపంలో ఉండగా తలకూ రొమ్ముకూ పల్చని బురద పట్టీవేయించి కనిపెట్టుకొని ఉన్నాడాయన. ఆ ముగ్గురి

లోనూ ఇద్దఱు జీవించారు. మూడవరోగి మాత్రం మరణిం చాడు. అయితే బ్రాందీతో చికిత్స నడచిన ఇరవైమందీ నిశ్శే షంగా మరణించారు.

మఱునటిరోజున పురపాలకసంఘంవారు ఒకదాదిని పంపిం చారు. కాని గాంధిజీ ఆమెను రోగులవద్దకు రానీయలేదు. వారిని తాకితే ఆమెకుకూడా వ్యాధి సోకుతుందని ఆయన హెచ్చరించాడు. అయితే ఇంకొకరోజున ఆమెకూడా ఆ రోగానికి చిక్కి అతిశీఘ్రకాలంలో గతించింది. గాంధిజీ కానీ, ఆయనతో ఉన్న నలుగురు భారతీయ యువకులు గానీ రోగ బాధకు గుఱికాలేదు. ఇటువంటి అద్భుతం ఆయన జీవితకాలంలో చాలా పర్యాయాలు తటస్థించింది. కలరా, కుష్ఠము మొద లైన అనేకములైన అంటువ్యాధులు చెలరేగినప్పుడు ఆయన అనేకరోగులకు దగ్గఱ ఉండి పరిచర్యలు చేశాడు. తనకు ఏ అంటువ్యాధికూడా సోకకపోవటానికి గాంధిజీ వైజ్ఞానికులకు సమ్మతమైన కారణం చూపలేకపోయాడు. అయితే అటువంటి అపాయకరపరిస్థితులలో తన ఆహారనియమమే చాలావఱకు తన్ను రక్షించిందని ఆయన నమ్మేవాడు.

చివరకు ఇద్దఱు రోగులు మిగిలారు. వీరిని జోహాన్సు బర్గుకు ఏడుమైళ్ళదూరాన ఉన్న ప్లేగు చికిత్సాలయానికి చేర్చారు. అంతటితో గాంధిజీ ఇక చెయ్యవలసిన పనిలేక పోయింది.

ఇదేసమయంలో దేశాన రోగం తీవ్రంగా ప్రబలుతూ ఉన్నప్పుడే గాంధిజీకి ఒకనూతన మిత్రుడు శాకాహారభోజన శాలలో తటస్థపడ్డాడు. ఆయనపేరు ఆల్బర్టువెస్ట్. ఈ ఆల్బర్టు

వెస్ట్ ఈ సమయంలో గాంధిజీకి తోడుగా పనిచేశాడు. ఈయనకు ఒక ముద్రాక్షరశాల ఉన్నది. డర్బనులోని భారతీయ హృదయ (Indian opinion) ముద్రాక్షరశాలను ఈ మిత్రుడు నిర్వహిస్తే బాగుండునని గాంధిజీకి తోచింది. ఆయన తన అభిప్రాయాన్ని మిత్రునికి తెలియజేయగానే ఆయన తత్క్షణం అందుకు అంగీకరించాడు. తర్వాత గాంధిజీ దక్షిణాఫ్రికాలో ఉన్నంతకాలమూ ఆల్బర్టువెస్ట్ ఆయనకు చేదోడువాదోడుగానే ఉన్నాడు.

ప్లేగు వ్యాధి మతివ్యాపించకుండా ఉండాలంటే, కూలీల పేట పూర్తిగా తగులబెట్టాలని జోహాన్సుబర్గులోని ప్రభుత్వోద్యోగులు అభిప్రాయపడ్డారు. ఆ పేటలో నివసిస్తున్న భారతీయులందఱూ అక్కడికి 13 మైళ్ళదూరాన ఉన్న గుడారాలలోపలికి తఱలివెళ్ళవలసి వచ్చింది. ఈ సందర్భంలో గాంధిజీ పురపాలక సంఘంవారికి తన సర్వశక్తులా సహకరించాడు. తాము చిరకాలంగా నివసిస్తున్న యిండ్లను అగ్నిహోత్రుని పాలుచేసి ఎక్కడో పదమూడుమైళ్ళ దూరాన కల గుడారాలకు వెళ్ళటానికి మనసొప్పకపోయినా భారతీయులు గాంధిజీ సలహాను కాదనలేకపోయారు. ఎటువంటి సంఘర్షణాలేకుండా పురపాలకసంఘంవారు తలపెట్టిన కార్యక్రమం సాగిపోయింది. నిస్సహాయులైన భారతీయులు అయోమయస్థితిలో పడ్డారు. వారిలో చాలామంది 'ఓ' అంటే 'న' రానివారు. చరాస్తులను బ్యాంకులలో భద్రపఱచుకొనటమంటే ఏమిటోవారికి తెలియదు. కనుక తమ సర్వస్వాన్ని గాంధిజీకే ఒప్పజెప్పాలని

వారు నిశ్చయించుకొన్నారు. వారు అంతవఱకు కొన్ని పెన్నీలూ కొన్ని వెండి నాణాలూ నిలవచేసికొన్నారు. చాలామంది ఈ ధనాన్ని అంతవఱకూ అక్కడక్కడ పాతిపెట్టుకొని ఉన్నారు. ఈ పూడ్చిపెట్టిన ధనం అంతా బయటికి తీసి తమ ఏకైక మిత్రుడైన గాంధిజీకి ఒప్పజెప్పవలసి వచ్చింది. ఆయన వారి అభ్యర్థనను అంగీకరించి వారు ఇచ్చినవన్నీ జాగ్రత్తచేశాడు. ఈ విధంగా ఆయన చేతికి 60,000 పౌనుల ధనం వచ్చింది. ఎవరు ఎంత చిన్న మొత్తం ఇచ్చినా, దానికి గాంధిజీ రసీదు వ్రాసి యిచ్చాడు. గాంధిజీ బ్యాంకులో భారతీయులందఱూ తమ ధనాన్ని భద్రపఱచుకొన్నారు. తర్వాత ఆయన తాత్కా-లికంగా వారు దాచుకొన్న ఈ మొత్తాలను అలాగే నిలవచేసికొంటూ ఉండవలసిందని ప్రబోధించాడు. ఈ ప్రబోధం ఫలంగా గాంధిజీ నిధి క్రమక్రమంగా వృద్ధిఅయింది. నిధివల్ల ఉండే ఉపయోగం ఏమిటో భారతీయులకు చక్కగా తెలిసి వచ్చింది. కూలీలు గుడారాలకు తఱలిపోగానే పేట యావత్తూ అగ్నిదేవునికి అర్పితమైంది.

గుడారాలకు చేరిన మొదటిరోజున కొంత చికాకుగా ఉన్నా మఱుసటిదినంనుంచీ కూలీలు స్వగృహాలలోఉన్నట్లేఉల్లాసంతో కాలక్షేపం చెయ్యగలిగారు. గాంధిజీ ప్రతిదినమూ తన సైకిలుమీద వారివద్దకు వెళ్ళి కుశల ప్రశ్నలు చేసేవాడు. పరిశుభ్రమైన వాయువు వీచే ఆ మైదానంలో వారి ఆరోగ్యం చక్కగా ఉండగలదని ఆయన సంతోషించాడు.

# 5

వెస్ట్ డర్బనుకు వచ్చిన తర్వాత గాంధిజీ అనుకొంటున్నంత చక్కగా పత్రికా వ్యవహారాలు సాగటంలేదని తెలిసికొన్నాడు. పత్రికమీద లాభం ఏమీ రావటంలేదని అతను అభిప్రాయపడ్డాడు. అయితే జమ ఖర్చు లెక్కలు నిర్దుష్టంగా తయారు కానందువల్ల తాను చెయ్యబోయే పనిలో లాభమే వస్తుందో, నష్టమే వస్తుందో అతను నిశ్చయించుకోలేక పోయాడు. ఈ విషయం తెలియగానే గాంధిజీ నేటాలుకు వెళ్ళాలని నిశ్చయించుకొన్నాడు. జోహాన్సుబర్గునుంచి డర్బనుకు చేసిన యీ ప్రయాణంలో గాంధిజీ జాన్ రస్కిన్ రచించిన "అంతిమ క్షణం వఱకు" (Unto This Last) అనే గ్రంథం చదవటం జరిగింది. ఈ గ్రంథం ఆయనను చాలా ఆకర్షించింది అత్యుత్సాహంతో దానిని చదివి, తనజీవితానికి అది మార్గదర్శకమవుతుందని ఆయనగ్రహించాడు. అప్పటినుండి ఇదిఆయనకు ఒకప్రమాణగ్రంథం అయింది. డర్బనులో రైలు దిగకముందే తాను ఇందులో చదివిన ప్రకారం ఆచరించాలని ఆయన నిశ్చయించుకొన్నాడు. ఈ గ్రంథం విషయమై గాంధిజీ ఏర్పఱచుకొన్న అభిప్రాయాలు ఎట్టివో ఆయన ఆత్మకథలోని 18వ అధ్యాయం చదివితే తేటతెల్లమౌతాయి.

ఆయన ఇలా అంటున్నాడు : "నా గాఢ విశ్వాసాలు కొన్ని రస్కిన్ రచించిన ఈ మహాగ్రంథంలో ప్రతిఫలిస్తూ ఉంటడం నేను గమనించాను. అందువల్లనే ఇది నన్ను ఎంతో ఆకర్షించింది. దీనిలోని సిద్ధాంతాల ప్రకారం నా జీవితం

చక్కదిద్దుకొన్నాను. మానవ హృదయంలోని సద్బుద్ధిని ఉద్దీపింపజేసినవాడే కవి. కవుల ప్రభావం అందరిమీదా ఒకే విధంగా ఉండదు. కారణమేమంటే అందరి ఒకే విధమైన సంస్కారం పొంది ఉండజాలరు.

"అంతిమతుణంవరకు" (Unto this last) గ్రంథంలో నాకు కన్పించిన సారాంశాలు ఇవి.

1. వ్యక్తియొక్క శ్రేయస్సు లోకశ్రేయస్సులోనే ప్రకాశిస్తుంది.

2. న్యాయవాది వృత్తికి గల విలువ ఎట్టిదో మంగలి వృత్తికి గల విలువకూడా అట్టిదే. ప్రతి వ్యక్తికూడా జీవనోపాధికి తన వృత్తివల్లనే ధనం ఆర్జించే అధికారం ఉన్నది కనుక వృత్తినిబట్టి ఎక్కువ తక్కువలు లేవు.

3. శ్రమ జీవితం అనగా రైతు, లేక చేతిపనివానిదే ప్రశంసార్హమైన జీవితం.

వీటిలో మొదటిది నాకు అనుభవగోచరమైనదే. రెండవది నాకు అప్పటికి ఇంకా సంపూర్ణంగా బోధపడలేదు. మూడవది నాకు ఎన్నడూ అనుభవంలోలేనిది. ఈ రెండవ మూడవ సిద్ధాంతాలు రెండున్నూ మొదటి సిద్ధాంతంలోనే గూఢంగా ఉన్నాయని నాకు ఈ గ్రంథం చదవగా చదవగా విస్పష్టమైంది. దానితో నాలో ఒక క్రొత్తచైతన్యం కలిగింది. ఈ సిద్ధాంతాలను ఆచరణపూర్వకంగా అర్థంచేసికోవాలని నిశ్చయించుకొన్నాను."

ఈ పుస్తకం చదవటంద్వారా గాంధిజీ హృదయంలో నూతనభావం ఒకటి ఉదయించింది. సహకారపద్ధతిమీద ఏ పనినైనా నడపించటం ఆయనకు చాలా ప్రీతికరమైనది. అయితే

రస్కిన్ గ్రంథం చదివేవఱకూ ఆయన ఆ సంకల్పం మనోగతం గానే ఉండిపోయింది. ఆ గ్రంథం చదివిన తర్వాత చిరకాలం నాటి ఆ ఆశయాన్ని ఆచరణలో పెట్టాలని ఆయన నిశ్చయించు కొన్నాడు. డర్బనులో రైలుబండి దిగి, తన ఆప్తమిత్రుడైన వెస్టును కలిసికొనగానే 'ఇండియన్ ఒపీనియన్'లో పనిచేసే వారినందఱినీ, ముద్రాక్షరశాలతో సహా, కృషియోగ్యమైన విశాలభూమియందే కుటీరాలు నిర్మించి అక్కడికి తరలించా లనీ, ప్రతివ్యక్తీ నెలకు మూడుపౌనులు నిశ్చితవేతనంమీద పని చేస్తేట్టున్నా అందఱికీకూడా నియమితమైన పరిశ్రమా, సమా నమైన జీతమూ ఉంచాలనీ నిర్ణయించాడు. కులంతోగానీ, జాతితోగానీ నిమిత్తంలేకుండా, సమానవేతనాలు ఇవ్వాలని కూడా నిశ్చయించాడు. అయితే ఈ పత్రికలో పనిచేసేవారు పన్నెండుగురున్నారు. వీరికి ఏకాభిప్రాయం కలుగలేదు. కొంత మంది డర్బనులోనే ఉన్నారు. సహకారపద్ధతిలో శ్రమించటం అనేది కొందఱికి గిట్టలేదు. ఇటువంటివారికి నూతనప్రదేశం లోనే నివసించాలనే అభిప్రాయం కలిగినప్పుడే అక్కడికి రావచ్చునని గాంధిజీ ఒక అవకాశం ఇచ్చాడు.

రెండురోజులలో గాంధిజీ ఈ వ్యవహారాన్ని కుది ర్చాడు. వెంటనే డర్బనుసమీపంలో తమ ముద్రాక్షర శాలకూ, పనివాండ్ర వసతికీ సరిపడ్డ ఖాళీస్థలం ఒకటి కావలసి ఉన్నదని పత్రికలో ప్రకటన జరిగింది. ఒకవారంలోపల డర్బ నుకు 14 మైళ్ళదూరాన కల ఫోనిక్సు రైల్వేస్టేషనువద్ద గాంధిజీ నూఱుఎకరాల పొలం కొన్నాడు. ముస్లింవర్తకులలో తనకు మిత్రులయినవారి సహకారంతో ఇందునిమిత్తం ఆయన వెయ్యి

పౌనులు వెచ్చించి స్థలం కొనగలిగాడు. బోయరు యుద్ధ కాలంలో క్షతగాత్రులకు చికిత్స చేస్తున్నప్పుడు తనతోబాటు పాల్గొన్న భారతీయ యువకుల తోడ్పాటుతో ఒక్క నెలలో గాంధిజీ ముద్రాక్షరశాలకుగాను ఒక పెద్దపాక వేయించగలిగాడు. కూలీలందఱూ స్వచ్ఛందంగా వచ్చి పనిచేయటంవల్ల కూలినిమిత్తం సొమ్ము వెచ్చించవలసిన పని లేకపోయింది. వర్తకులు పాక వెయ్యటానికి తగినసామగ్రి ఉచితంగా నేఇచ్చారు.

అప్పటినుంచీ నేటాలులో గాంధిజీ ఉద్యమాని కంతటికీ కేంద్రంగా పరిణమించిన ఫోనిక్సు కుటీరంనుంచే 'ఇండియన్ ఒపీనియన్' వెలువడుతూవచ్చింది. ఈ సహకారసంస్థలోకి తన బంధుమిత్రుల నెందఱినో ఆకర్షించాలని గాంధిజీ యత్నించాడు గానీ వారందఱూ ఇతర వ్యాపారాలలో విశేషధనం సంపాదిస్తూ ఉన్నందున ఆయన ఉపదేశం ఆలించలేదు. ఆలించినవాడల్లా ఒక మగన్‌లాల్ గాంధి మాత్రమే. అతను గాంధిజీ అన్నగారి కుమారుడనీ, గాంధిజీయందు విశేష భక్తిశ్రద్ధలు కలిగి చివరి సారి గాంధిజీ దక్షిణాఫ్రికాకు వస్తున్నప్పుడు ఆయనను అనుసరించి ఆయనకు సర్వదా కుడిభుజంగా వ్యవహరిస్తూవచ్చాడనీ వెనుకనే తెలిసికొన్నాము కదా! అతను చేతిపనులలో చక్కని నైపుణ్యంకూడా సంపాదించినవాడు.

ఫోనిక్సు కుటీరంలో తొలిసారి వెలువడిన 'ఇండియన్ ఒపీనియన్' చేతి అచ్చుతోనే బయలుపడవలసివచ్చింది. చివరి నిమిషంలో అచ్చుయంత్రం చెడిపోయి పనిచెయ్యకపోవటమే దీనికి కారణం. ఈ క్లిష్టపరిస్థితిలో గాంధిజీ ముద్రాశాలలో పనిచేస్తున్నవారిచేతనే కాక, తనకు అండగా ఉన్న స్వచ్ఛంద

సేవకులచేతగూడా పనిచేయించాడు. నలుగురేసి మనుష్యులు కలసి కొంత నిర్ణీతకాలం చేతితో పట్టి చక్రాన్ని త్రిప్పేటట్లు వంతులు ఏర్పఱచి రాత్రిఅంతా మనుష్యులచేత పనిచేయిస్తూనే ఉన్నాడు. ఈ సందర్భంలో హాఠంచేసిన యంత్రాన్నికూడా మానవులకు లొంగేట్టుచేశానని గాంధిజీ ఆనందించిఉంటాడని మనం ఊహించవచ్చును. నిజంగానే కొంతసేపు గడిచిన తర్వాత పనివారు తైలయంత్రాన్ని అలాగే విడిచి చేతితో త్రిప్పుతూనే పత్రికను ముద్రించారు.

పాకలకు చుట్టూఉన్న స్థలాన్ని మూడేసి ఎకరాల చొప్పున కొన్నిభాగాలుగా విభజించి గాంధిజీ ఒక్కొక్క వ్యక్తికి ఒక్కొక్కభాగం ఒప్పగించాడు. ఆ వ్యక్తి తన భాగానికి వచ్చిన భూమిని సేద్యంచెయ్యాలి. ఈ యేర్పాట్లు కాగానే గాంధిజీ యినుపరేకులతో కొన్నిపాకలు వేయించాడు.(యథార్థానికి ఆయనకు ఇటుకలతోగానీ మట్టి అడుసుతోగానీ నిర్మించిన పాకలే ప్రియమైనవి) ఈ యినుపరేకులపాకలమీాద ఆయనకు మోజులేదు. కాకపోతే యివి చౌకగా తయారైనాయి. ఈ నవీన కుటీరాలలో నివసిస్తున్న ప్రతిభారతీయుడూ అక్షరాలు కూర్చటం, ముద్రాయంత్రం నడిపించటం మొదలైన పనులు విధిగా నేర్చుకోవాలి అని నియమం చేశాడు గాంధిజీ. ఇందువల్ల పనివాండ్రకోసం నిరీక్షించవలసిన దురవస్థ కలుగబోదని ఆయన ఆశించాడు. అయితే అక్షరాలు కూర్చటంలో తనకంటె అసమర్థుడు లేడని ఆయనే అంగీకరిస్తూ, తన అన్నకుమారుడు మగన్‌లాల్ ఈ విషయంలో చాలా నిపుణత గడించాడని స్వీయచరిత్రలో ఉటంకించాడు.

ఫోనిక్సులో ఈ యేర్పాట్లు ముగిసిన వెంటనే గాంధీజీ జోహాన్సుబర్గుకు వెళ్ళవలసివచ్చింది. అసలు ఈ పర్యాయం దక్షిణాఫ్రికాలో ఉన్నంతకాలమూ గాంధిజీ ట్రాన్సువాలులో ఒకకాలూ, నేటాలులో ఒకకాలుగా వ్యవహరించవలసిన పరిస్థితులు కలిగాయి. సామాన్యుడు ఆ పరిస్థితులకు తట్టుకోగలిగే వాడు కాడు.

గాంధిజీకి క్రమక్రమంగా అభివృద్ధి ఔతూఉన్న భౌతిక సుఖవిముఖత యిప్పటికి ఒక స్థాయికి వచ్చింది. రస్కిన్, టాల్‌స్టాయ్, ఏసుక్రీస్తు, బుద్ధుడు, ఇతర హైందవ వాఙ్మయమూ ఆయన మనస్సుపై ఆధిపత్యం వహించినట్లే జూలూ యుద్ధ సంఘటనకూడా ఆయన చిత్తాన్ని కొంత వైరాగ్యమార్గాన ముందుకు నెట్టగలిగింది. నేటాలులో జూలూయుద్ధం ప్రజ్వరిల్లిన తత్క్షణమే తన భారతీయ సేవాదళంతో క్షతగాత్రులకు చికిత్స చెయ్యటానికి గాంధిజీ సిద్ధపడ్డాడు. వెనుక బోయరు యుద్ధంలో ఆయన చేసిన సేవను గుర్తించిన కారణాన నేటాలు రాజప్రతినిధి ఈ పర్యాయం అతిశీఘ్రంగా అందుకు అనుమతి యిచ్చాడు. నిజం చెప్పవలసివస్తే గాంధిజీకి జూలూలపట్ల నే సానుభూతి ఉన్నది. అయితే బ్రిటిషు సామ్రాజ్యం పట్లగల భక్తి విశ్వాసాలు ఆయనను లొంగదీసికొన్నాయి. ఇరవై నలుగురు భారతీయులతో సేవాదళాన్ని నిర్మించి జూలూ యుద్ధంలో తన కర్తవ్యాన్ని నిర్వహించాడు. ఈ సేవాదళం అస్వస్థులూ క్షతగాత్రులూ అయిన జూలూలకు కూడా సేవ చెయ్యటం ఆయనకు చాలా సంతోషం కలిగించింది.

జూలూ యుద్ధంవల్ల ఆయన మనస్సులో ఏర్పడ్డ దైన్యధీ

భావం (జూలూలపట్ల సానుభూతితో పాటు చెక్కు చెదరని రాజభక్తి) ఆయనను ఒక సందిగ్ధపరిస్థితికి తీసికొనివచ్చింది. అది ఆయనకు వ్యక్తిగతమైన బ్రహ్మచర్యం విషయమే. కొన్ని సంవత్సరాలనుంచీ తనకుతోచిన సాధారణమార్గాలలో స్త్రీ వాంఛను అరికట్టుకొని ఆత్మసంయమనం చేసికొనటానికి ప్రయత్నిస్తూవచ్చాడు. ఈ ప్రయత్నానికి ఆహారనియమం చాలవరకు తోడ్పడ్డది. ఇప్పుడు భవిష్యజ్జీవితం అంతటా బ్రహ్మచర్యం పాలించేటట్లు ప్రతిజ్ఞ చెయ్యగల సామర్థ్యం వచ్చిందని ఆయన అభిప్రాయపడ్డాడు. తనఅభిప్రాయాన్ని సహచరులందరికీ తెలియబరచి దానిలోని సాధకబాధకాలనుగూర్చి వారితో తర్కించాడు. వారుగూడా ఆయనవలెనే బ్రహ్మచర్యం పాలించేటట్లు శపథం చెయ్యటానికి అంగీకరించారు. (అయితే గాంధిజీ సహచరులు తమ ప్రతిజ్ఞలను సర్వత్రా పాలించలేకపోయేవారుకానీ, ఆయనమాత్రం ఏ విధమైన శపథం చేసినా దానిని ఉల్లంఘించి యెరుగడు. గాంధిజీకి ఈ ప్రతిజ్ఞ శారీరక సౌఖ్యవిసర్జన మాత్రమేకాక, మనోనైర్మల్యప్రదంగా కూడా తోచింది. కనుక ఏండ్లకొలదీ దీనిని సాధించగల సామర్థ్యంకోసం, మనోవ్యాపారం జ్ఞాతంగా ఉన్నప్పుడూ, అజ్ఞాతంగా ఉన్నప్పుడూ కూడా స్త్రీవాంఛకు లోబడని అతీంద్రియశక్తి కోసం, ఆయన కృషిచేశాడు. ఈ అమోఘప్రతిజ్ఞ చేసిన నాటికి (1906వ సంవత్సరం మధ్యభాగంలో) అయన వయస్సు 36 సంవత్సరాలు మాత్రమే. ఇప్పటినుంచీ ఒక్కొక్క సంవత్సరం గడుస్తూ ఉన్నకొద్దీ స్వార్థరహితమైన ఏ ఉద్యమంలో విజయం సాధించాలన్నా, ఆత్మోన్నత్యమూ, బంధరాహిత్యమూ

సిద్ధించాలన్నా బ్రహ్మచర్యమే వాటికి ఏకైక సాధనమని ఆయ నకు అనుభవగోచరమవుతూ వచ్చింది. వెనుకటి డోలాయ మానస్థితి యిప్పుడులేకపోయిందని చెప్పటానికి వీలులేక పోయినా, బ్రహ్మచర్యం పాలిస్తూ ఉంటే, కస్తూరిబా సాంగ త్యంలో నేను ఆయనకు ఒక నవీనత గోచరించింది. ఆయనకు భార్య పరమభక్తిగల నెచ్చెలిగానూ, తోడుగానూ కనిపిం చింది. పూర్వం ఇద్దరి నడుమనూ చెలరేగుతూండే అభిప్రాయ భేదాలూ, అంతఃకలహాలూ క్రమంగా అంతరించి పోయాయి. ఇది అంత సులసాధ్యమైన పని కాలేదుగానీ, ఈ ఆత్మపారిశుద్ధ్య మనేది తన ఐహికబంధ విముక్తికే కాక, ప్రపంచాన్నే మార్చి వేసిన సత్యాగ్రహభావమనే అపూర్వ సృష్టికి మూలకారణ మైనది.

సత్యాగ్రహం అనేది ఆయన దానికి ఆ పేరు పెట్టక ముందే ఉత్పన్నమైనది. సత్యంకోసం ఆత్మార్పణ చెయ్యటం, సంఘసేవలో స్వచ్ఛందంగా పాల్గొని సర్వశక్తులా కృషి చెయ్యటం, అక్రమమైన చట్టాలనూ అన్యాయమైనవిధానా లనూ ఎదుర్కొనటం అనేవి అనేక సంవత్సరాలనుంచీ ఆయ నకు అలవాటైపోయాయి. ఈ అలవాట్లు కాలక్రమాన మరింత బలపడుతూవచ్చాయి. ఇప్పుడు అక్షరజ్ఞానశూన్యుడైనా సంగ తులను తెలుసుకోవాలనే ఆసక్తి కల ప్రతిభారతీయునికీ ఈ ఉత్తమాశయాలను తేటతెల్లం చెయ్యవలసిన అవసరంకలిగింది.

(తన కామవాంఛను అరికట్టుకొనటం కోసం) ఆయన ఆహార విషయంలో తీవ్రమైన నియమాలను అలవఱచుకొనే కాలంలో దక్షిణాఫ్రికాలోని భారతీయజాతినీ, అందఱికంటె

ముందు తన్నాపై సత్సంకల్పాలకు అనుగుణంగా మలచు కొనటంకోసం కల ఈ ఆశయాలన్నీ ప్రతిఫలించేటట్లు ఈ కృషికి ఒక పేరు పెట్టాలని ఆయన ఆలోచించుతూండేవాడు. తన ఉద్దేశాలనూ వాటిని సాధించటానికి అమలుపఱచే ఆచ రణ విధానాన్నీ వివరిస్తూ తన 'ఇండియన్ ఒపీనియన్' పత్రి కలో ఇందుకు తగ్గ నామకరణం చేసినవారికి కొంత బహుమతి ఇస్తానని ప్రకటించాడు. గాంధిజీ అన్నకుమారుడు "సదాగ్రహ" మనే పదాన్ని సూచించి యీ బహుమతి గెలుచుకొన్నాడు. "సత్" అంటే నిజం; "ఆగ్రహం" అంటే పట్టుదల, లేక శక్తి. ఇలా ఈ రెండు సంస్కృత పదాలూ, ఈ విధంగా ఇదివఱ కెన్నడూ విశిష్టమైన అర్థంలో సమన్వితం కాలేదు.

తనకు కావలసినది ఈ పదమే అని గాంధిజీ నిశ్చయిం చాడు. అయితే సంస్కృతంతో పరిచయంలేని సామాన్య భారతీయులకు ఈ "సదాగ్రహం" అనేది సుబోధకం కాదని అనుకొన్నాడు. అందువల్ల సత్ అనేపదానికి బదులు 'సత్య' మనేది ఉపయోగించి "సత్యాగ్రహం" సృష్టించాడు. సత్యం అనేది సంస్కృతశబ్దమే అయినా అందఱికీ (భారతీయులకు) తేలికగా బోధపడే పదం. అప్పటినుంచీ యీ సత్యాగ్రహ పదమూ, దీనిభావమూ వ్యాప్తిలోకి వచ్చాయి. ఇవి భార తీయుల పారతంత్ర్యాన్ని పటాపంచలుచేసి ప్రపంచంలోని మహత్తర సామ్రాజ్యాన్ని అంతరింపజెయ్యవలసినవైనాయి. దీనికే సత్యవ్రతబలమూ, సత్యపరాయణతా, ఆత్మశక్తీ అనే వ్యాఖ్యానాలు బయలుదేరాయి. ఇవి అన్నీకూడా "అప్రతి. రోధం" (non-resistance) వంటి ఆంగ్ల వివరణాలకంటె

మేలుగా ఉన్నాయి. ఇందులోని ప్రతిభావాన్ని 'సత్యాగ్రహ' మనే దానిలోనే ఇముడ్చుకొని, తన ఉద్యమంలో ఆచరణ పూర్వకంగా అనుసరిస్తూ వచ్చాడు.

# 6

తర్వాత కొంతకాలానికి జోహాన్సుబర్గుసమీపంలో ఫోనిక్సు ఆశ్రమం మాదిరిగానే మఱొక సహకారపద్ధతి ఆశ్రమం ఆయన ఏర్పాటుచేసి, దానికి టాల్‌స్టాయ్ ఆశ్రమం అనిపేరు పెట్టాడు. ఫోనిక్సు ఆశ్రమంలోవలెనే యిక్కడకూడా ఆయన తనలో కలిగిన ఉద్దేశాల నెన్నో ఆచరణలో పెట్టటానికి కృషి చేశాడు. టాల్‌స్టాయ్ ఫోనిక్సు ఆశ్రమాలు రెండున్నూ స్త్రీ పురుషులతో పసిబిడ్డలతో కలకలలాడుతూ దినదినాభివృద్ధి అవుతూ వచ్చాయి. విద్యలోనూ, వృత్తిశిక్షణలోనూ, ఆహార నియమంలోనూ, క్రమశిక్షణలోనూ గాంధిజీ అభిప్రాయాలకు అనుగుణంగా ప్రయోగాలు సాగి, అటుతర్వాత ఆయన నిర్వహించదలచిన నిర్మాణాత్మక కార్యక్రమాన్ని ప్రారంభించటానికి తగిన దోహదం లభించింది. ఈ నాడు హిందూదేశంలో అతిశీఘ్రంగా వ్యాపిస్తున్న వృత్తిశిక్షణ సహితమైన విద్యావిధానం ఫోనిక్సు టాల్‌స్టాయ్ ఆశ్రమాలలో మొట్టమొదట తలయెత్తి అభివృద్ధిచెందుతూవచ్చింది. గాంధిజీ ముగ్గురుకుమారులూ ఇతర విద్యార్థులతోపాటు ఇక్కడ విద్యాభ్యాసం చేశారు. ఒకమాఱు ఫోనిక్సు ఆశ్రమంలో అవినీతి కార్యం ఒకటి (బహుశః కాముకమైనది) జరిగింది. ఇది తెలియగానే గాంధిజీ తన కార్యక్రమం అంతా రద్దుచేసి, ట్రాన్సువాలు

నుంచి నేటాలుకు వచ్చి, జరిగిన అకృత్యానికి పరిహారంగా తాను ఏడురోజులపాటు నిరాహారదీక్ష పూనాడు. ప్రాయశ్చిత్తమూ, ప్రార్థనా, ఆత్మసంయమనమూ ముఖ్యాశయాలైన ఇటువంటి ఉపవాసదీక్షలు ఒకసంవత్సరంకంటె మరొక సంవత్సరంలో బలపడుతూ ఈ నాటికి ఆయన చేపట్టిన ఉపవాస దీక్ష ఆయన అనుచరులనూ, మిత్రులనూ చాలా కలవర పెట్టింది. వారుకూడా ఆయనతోబాటు ఉపవసించారు. భారతీయులూ, ఆంగ్లేయులూకూడా, ఒకేవిధంగా, ఈ సమయంలో ఆయనను అనుసరించారు. గాంధిజీకి మిత్రుడూ, అనుచరుడూ అయిన హెర్మన్ కెలెన్‌బాక్ అనే జర్మనీదేశస్థుడుకూడా ఉపవాసం చేశాడు. గాంధిజీ ప్రభావమూ, విశిష్టశక్తి జాతిమత విభేదాలు లేకుండా అందరినీ లోబరచుకొని మతప్రధానమైన దృష్టిలో సాగుతూవచ్చాయి. గాంధిజీ చేసినపనికి స్పష్టమైన కారణాలు ఎవరూ చెప్పలేకపోయినా, ఆయన ఏదిచేసినా 'అంతరాత్మ' ఆదేశానికీ అనుగుణంగా మాత్రమే చేసేవాడు. అందువల్ల అది ఫలించేది.

దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహోద్యమం 1906 వ సంవత్సరం సెప్టెంబరు 11 వ తేదీన ప్రారంభమైనది. వైరాగ్యంలో ఆయనకు పరిపక్వత కలిగిన ఈ 1906 వ సంవత్సరం ఆయన జీవితంలో నూతనవికాసానికి ప్రారంభకాలమైనది. ఆ క్రిందటి నెలలోనే (జూలైలో) ట్రాన్సువాలు ప్రభుత్వం ఆ రాష్ట్రంలో నివసిస్తూఉన్న భారతీయులలో 8 సంవత్సరాల వయస్సుదాటిన వారంద ఱూతమ పేర్లు ప్రభుత్వపత్రాలలో నమోదుచేయించుకోవాలని ఒకశాసనం చేసింది వారందఱూ వ్రేలిముద్రలు

చేసి, ప్రభుత్వంవద్దనుంచి నమోదుపత్రాలు పొంది, తాము ఎక్కడికి వెళ్ళినా వాటిని వెంట దీసికొనేవెళ్లాలి. ఈ విధంగా ట్రాన్సువాలు ప్రజాసముదాయంలో భారతీయజాతి ఒక నీచ జాతిగా పరిగణించబడే ప్రమాదం వచ్చిపడ్డది. దీనికి ఎవరైనా వ్యతిరేకిస్తే వారు చెఱసాలపాలు గావాలి; లేదా దేశబహిష్కారానికి గుఱికావాలి. ఒక్కొక్కప్పుడు రెండుశిక్షలూ అనుభవించాలి కూడా.

జోహాన్సుబర్గులోని భారతీయులందఱూ ఒక నాటకశాల వద్ద పెద్ద సమావేశం ఏర్పాటుచేసికొన్నారు. కొంతసేపు ప్రసంగాలు జరిగిన తర్వాత అధ్యక్షుడు సభకు వచ్చిన వారందఱూ 'భగవత్సాక్షిగా' ఒక ప్రమాణం చెయ్యవలసి ఉంటుందని సూచించాడు. ఈ సమయాన గాంధిజీలో ఒక ఉద్రేకం కలిగింది. సహజంగా సభాకంపం వెన్నాడుతూ ఉన్నప్పటికీ ఆయన ఒక మహోపన్యాసం చేశాడు. సభలోఉన్న మూడువేలమందీ కూడా తాముచేయబోయే ప్రమాణాన్ని త్రికరణశుద్ధిగా పాటించదలచుకొంటేనే తప్ప "భగవత్సాక్షిగా" అనవద్దని హెచ్చరించాడు. కారాగారంకానీ, ఇంకేవిధమైన ఆపదగానీ, చివరకు మృత్యువుగానీ తటస్థించినా తటస్థించవచ్చుననీ, అన్నిటినీ సహించదలచుకొంటేనే ప్రమాణం చెయ్యవలసిందనీ కూడా హెచ్చరిక చేశాడు. సభాసదులందఱూ ఆయన ప్రతిశబ్దమూ జాగ్రత్తగా విని అర్థంచేసికొన్నారు.

ఈ ప్రమాణం చెయ్యటంవల్ల కలిగే అద్భుతశక్తిని గాంధిజీ గుర్తించాడు. స్వచ్ఛందంగా ఆత్మార్పణం చెయ్యటం అనే యీ సత్యాగ్రహాన్ని ప్రారంభించేముందు ఒక్కమాటు

ఇంగ్లాండుకు వెళ్ళి అక్కడి అధికారవర్గాలకు విజ్ఞప్తిచేస్తే, సత్ఫలం ఏదైనా కలుగుతుందేమో ప్రయత్నించి చూడాలని అనుకొన్నాడు. అప్పటికి వలసరాజ్యాల కార్యదర్శిగా ఉంటూ (అంతకు ముందు హిందూదేశంలో రాజప్రతినిధిగా పనిచేసిన) ఎల్జిన్ ప్రభువునూ, హిందూదేశ కార్యదర్శిగాఉన్న జాన్ మార్లేనీ, స్వయంగా సందర్శించి మాట్లాడాడు. వారు దక్షిణాఫ్రికా శాసనసభ ఉద్దేశించిన చట్టాన్ని ఆమోదించలేదు. అయితే ఆ సంవత్సరాంతానికి ట్రాన్సువాలు ప్రభుత్వం స్వపరిపాలనాధికారంకల వలసరాజ్యమైంది. అందువల్ల 1907 వ సంవత్సరం అక్టోబరు నెల 31వ తేదీన ట్రాన్సువాలు శాసనసభ నిస్సంకోచంగా తాను వెనుక తలపెట్టిన పై శాసనాన్ని ఆమోదించింది.

గాంధిజీ తలపెట్టిన సత్యాగ్రహోద్యమం అప్పటి కింకా సాగలేదు. దాని స్వరూపస్వభావాలు చాలామంది భారతీయులకు బోధపడలేదు. కాని వారికి ఒక్కటిమాత్రం తెలిసింది. ప్రభుత్వం ఎంత నిర్బంధించినప్పటికీ, తమ ఆత్మగౌరవానికి భంగకరమైన యీ శాసనానికి తల ఒగ్గరాదని వారు నిశ్చయించుకొన్నారు. అందుచేత వారిలో చాలామంది తమ పట్టుదలను ఎంతమాత్రమూ విడువకుండా నిలబడగలిగారు. అలా నిలిచిన వారిలో మొదటివాడైన గాంధిజీని ప్రభుత్వంవారు కోర్టుకు హాజరుకమ్మన్నారు. 1908వ సంవత్సరం జనవరి 11వ తారీకు నాడు గాంధిజీ న్యాయమూర్తి ఎదుట హాజరై తనకు పూర్తి శిక్ష విధించవలసిందనీ, అందుకు తాను అర్హుడననీ చెప్పుకొన్నాడు. అయితే న్యాయమూర్తి ఆయనకు రెండు నెలలు

మాత్రమే సామాన్య కారగారవాస శిక్ష విధించి, అందులో కఠినమైన పని చెయ్యవలసిన అవసరంలేదని తీర్పు చెప్పాడు. గాంధిజీ కారాగారంలో తొలిసారిగా అడుగుపెట్టాడు.

అయితే చెఱసాలలోగూడా ఆయన ఆనందంగానే కాలక్షేపంచేశాడు. అంతవఱకూ అనేక కార్యక్రమాలతో సతమతమవుతూ ఉన్న ఆయనకు ఇప్పుడు విరామం లభించింది. ప్రొద్దున భగవద్గీతా, సాయంకాలం ఖురాను, చదివేవాడు, రస్కిన్, టాల్‌స్టాయ్, బేకన్, ప్లేటోల రచనలు చదివేవాడు. తనతోబాటు చెఱసాలలో ఉన్న ఒక చీనా దేశపు క్రైస్తవునికి బైబిలుద్వారా ఆంగ్లభాష బోధించాడు. కాని ఆయన చెఱసాలలో గడపినకాలం చాలా తక్కువే. స్మట్సు సేనాని ఆయనను చూడగోరాడు. జోహాన్సుబర్గులోని రక్షకభట ముఖ్యాధికారి స్వయంగా చెఱసాలకు వచ్చి, ఖైదీ దుస్తులతో, డబ్బుగాని, సామానుగానీ ఏమీలేని గాంధిజీని తత్క్షణం ట్రాన్సువాలు ప్రధానమంత్రి అయిన స్మట్సు సేనాని వద్దకు ప్రిటోరియాకు తీసికొనివెళ్లాడు.

ట్రాన్సువాలులోని భారతీయులు స్వచ్ఛందంగానే తమ పేర్లను ప్రభుత్వ పత్రాలలో నమోదుచేయించుకొనే పరతు మీద రాజీకి రావాలని స్మట్సు సూచించాడు. అలాజరిగేటట్లయితే నిర్బంధంగా ఈ నమోదుకార్యక్రమం అమలు పఱచటం ఉండదని హామీ యిచ్చాడు. అతను గాంధిజీతో చాలా సాదరంగా మాట్లాడాడు. తనకైతే ఆ శాసనం విషయం పట్టింపు లేకున్నా, ట్రాన్సువాలులోని పాశ్చాత్యులందఱూ పట్టుపట్టటంచేత తాను వారి అభిప్రాయాన్ని ఆమోదించక

తప్పదని చెప్పాడు. స్మట్సుకుకూడా గాంధిజీపట్ల వ్యక్తిగత మైన సానుభూతి కలదని ఊహించవలసి వస్తున్నది. గాంధిజీకి కూడా అతనిమీద ఆదరభావం కలగడం సహజమే ఎలాగైతే నేమి రాజీ జరిగింది. అంతటితో గాంధిజీ కారాగార విముక్తుడని స్మట్సు అన్నాడు. మరి అంతవరకూ చెఱసాల లలో ఉన్న భారతీయుల సంగతి యేమిటని గాంధిజీ ప్రశ్నించాడు. వారినందఱినీ మఱునటిరోజు ఉదయానికి బంధవిముక్తులను చెయ్యటం జరుగుతుందని స్మట్సు జవాబు చెప్పాడు. పాపం గాంధిజీకి తిరుగు ప్రయాణానికి పైకం లేకపోయింది. స్మట్సు కార్యదర్శి వద్దనుంచి ఆయన కొంత సొమ్ము చేబదులు తీసికోవలసి వచ్చింది.

కాని, స్మట్సు గాంధిజీకి ఇచ్చిన వాగ్దానం నిలుపుకో లేదు. గాంధిజీ చాలామంది భారతీయులను స్వచ్ఛందంగా తమ పేర్లను ప్రభుత్వ పత్రాలలో నమోదు చేయించుకోవలసిందని సలహా యిచ్చిన తర్వాత స్మట్సు 'ఆసియా జాతుల చట్టాన్ని' శాసనసభ చేత ఆమోదింపజేశాడు. గాంధిజీ ఎంతో శ్రమపడి తోడి భారతీయులను ప్రభుత్వంతో రాజీపడవలసిందని అనేక విధాల నచ్చజెప్పిఉన్నాడు. పైగా తనపేరే ముందుగా నమోదు చేయించుకొంటానని పట్టుపట్టినందుకు కుపితులైన పఠానుల చేత తీవ్రంగా దెబ్బలుతిన్న గాంధిజీకి, స్మట్సు చేసిన పని గొప్ప ఆఘాతమైనది. ఆయన ఎన్నో ప్రతిఘటనలను ఎదుర్కోవలసి వచ్చింది. పైగా తనశక్తినంతా వినియోగించి గొప్ప పోరాటం సాగించవలసి వచ్చింది.

1908వ సంవత్సరం ఆగస్టునెల 16వ తేదీనాడు

జోహాన్సుబర్గు సమావేశంలో రెండు వేలమంది భారతీయులు స్వచ్ఛందంగా తమ పేర్లను నమోదుచేయించుకొని ప్రభుత్వం వద్దనుండి పొందిన తమ యోగ్యతా పత్రాలమీద కిరోసిన్ నూనెపోసి తగలబెట్టారు. ఆసియా జాతులచట్టం ప్రకారం వారందఱూ కారాగారావాస శిక్షకు గుఱికావలసివచ్చింది.

పెద్ద గుంపుగా సాగకపోయినా, స్వచ్ఛందసేవకు లనే కులు గాంధీజీ ఎన్నికప్రకారం యోగ్యతాపత్రాలు లేకుండా, నేటాలునుంచి ట్రాన్సువాలుకు ప్రయాణమైనారు. వీరిలో అప్పుడే భారత దేశంనుంచి వచ్చిన గాంధీజీ జ్యేష్ఠపుత్రుడు హరిలాల్ కూడా ఉన్నాడు. గాంధీజీకూడా శాసన ధిక్కారం చేసి 1908వ సంవత్సరం అక్టోబరు నెల 10వ తేదీనాడు నిర్బంధంపాలు అయినాడు.

ఈ ద్వితీయ కారాగారవాసంలో గాంధీజీ థోరూ ప్రభృతుల రచనలను పఠించాడు. "శాంతిపూర్వక ప్రతిఘటనం" (civil disobedience)అనే శీర్షికతో థోరూ వ్రాసిన వ్యాసాన్ని (దీనిని ఉపన్యాసమే అనవచ్చును)చదివాడు. బానిస విధానమూ మెక్సికోయుద్ధము మూలంగా 1849 వ సంవత్సరం నాటి అమెరికాప్రభుత్వంపట్ల థోరూకు ఏర్పడ్డ తిరస్కారాన్ని ఈ వ్యాసం బలపఱచేదిగా ఉన్నది కాబట్టి, దీనియందు గాంధీజీకి విశేషమైన ఆసక్తి కలిగింది. ఈ వ్యాసం చాలా ఉద్రేకపూరితంగా ఉన్నది. ఇందులోని అభిప్రాయాలు సంవత్సరాల తరబడి ఆయనకు అనుభవంలో ఉన్నవే అయినా, తన ఈ అభిప్రాయాలు మఱి ఒకరికి ఒకప్పుడు కలిగినవే అని ఆయనకు తెలియదు. ఇవే అభిప్రాయాలు రస్కిన్ టాల్‌స్టాయ్‌ల

రచనలలోగూడా కనిపిస్తున్నవని గ్రహించటంచేత ఇక అవి ప్రామాణికాలే అన్న నిశ్చయం ఆయనకు కలిగింది. ఒకప్రక్క ఇలా గ్రంథపఠనంచేస్తూనే, ఆయన చెఱసాలలోని 75 మంది భారతీయులకు వంటమనిషిగా కూడా సేవచేసేవాడు. మఱుగు దొడ్లు బాగుచెయ్యటానికి స్వచ్ఛందసేవకులు కావలసివస్తే, తానే ముందంజవేసేవాడు.

1908 వ సంవత్సరం డిసెంబరు 13 వ తేదీతో ఈ రెండవ కారాగారవాసం పరిపూర్తి అయింది. కాని చెఱసాల నుంచి విడుదలకాగానే, ఆయన తిరిగి సత్యాగ్రహం ప్రారంభించటంవల్ల మళ్లీ కొలదికాలంలోనే మూడవసారి చెఱసాలకు (1909 వ సంవత్సరం ఫిబ్రవరి నెల 25 వ తారీఖున) వెళ్ళవలసి వచ్చింది. జోహాన్సుబర్గులోని బందీలలో గ్రంథాలయంనుంచి థోరూ రచనలను ఎరువు తీసికొన్నాడు. ప్రిటోరియాలో ఉండగా ఎమర్సన్ వ్యాసాలు ఆయన చూచినట్లు కనబడుతుంది. ఎందుచేతనంటే, ఆ కాలంలో ఆయన తాను జాబులు వ్రాసినవారికి ఆ వ్యాసాలను చదవవలసిందని ప్రోత్సహించాడు. థోరూ ఎమర్సనుల రచనలు గాంధిజీని ఆకర్షించటం సహజమే. అయితే ఈ సందర్భంలో మనం గుర్తించవలసిన విశేషం ఒకటి ఉన్నది. ఆ రచయిత లిద్దఱూ భగవద్గీతనూ, ఉపనిషత్తులనూ క్షుణ్ణంగా పఠించి అందులో తాము తెల్సుకొన్న నిగ్గునే తమ రచనలో చొప్పించారు. అంటే భారతీయవిజ్ఞానమే ఉపాధి భేదంతో మళ్ళీ భారతీయులను చేరుతున్నదన్న మాట. హెన్రీ థోరూ మరణించేసరికి అతనిదగ్గఱ ఉన్న ఒకేఒక పుస్తకం భగవద్గీత. దానిని అతను వాల్డెన్‌పాండ్‌లోని తన కుటీరంలో

అంత్యకాలంవఱకూ చెంతనే ఉంచుకొన్నాడు. ప్రాచ్యసంపత్తి సర్వస్వంకంటెనూ ఆ గ్రంథమే ఉత్కృష్టమని అతని భావం. ఈ కాలంనాటికి గాంధిజీ భగవద్గీతలోని చాలా శ్లోకాలను కంఠస్థం చెయ్యగలిగాడు. నిత్యమూ ముఖక్షౌరం చేసికొనటానికి ఉపయోగించుకొనే అద్దంపైన శ్లోకం తర్వాత శ్లోకం కల కాగితం అతికించుకొంటూ కంఠస్థం చేసికొనేవాడు. అమెరికాలో అంత ప్రభావం పొందిన 'దివ్యగీత' స్మరణ ఆఫ్రికాలోని బందీల గ్రంథాలయం ధర్మాన గాంధిజీకి ప్రాప్తించటం చాలా విచిత్రమే! ఎందువల్లనంటే ఈ కాలంలోనూ ఇటు తర్వాతనూ ఆయన చాలామార్లు ఈ విషయాన్ని ప్రస్తావించేవాడు. ఈ తృతీయ కారగారవాస సమయాన స్మట్సుసేనాని మతసంబంధమైన రెండు గ్రంథాలను గాంధిజీకి పంపించాడు.

ఈ మాఱు చెఱనుండి విడుదల అయిన తర్వాత పీడిత భారతీయుల రక్షణకోసం పోరాటం సాగుతూనే ఉన్నప్పటికీ దక్షిణాఫ్రికాలోని న్యాయస్థానాలకంటె ఉత్తమాధికారంగల బ్రిటిషుప్రభుత్వంవద్ద తనవాదం వినిపించి జయం సాధించాలని, గాంధిజీ లండనుకు వెళ్లి 1909 వ సంవత్సరంలో జులై నెల మొదలుకొని నవంబరు నెలవఱకూ అక్కడనే ఉండి, తనవాదం వినిపించే అవకాశంకోసం నిర్విరామంగా అనేకులతో ప్రసంగిస్తూ, పత్రికలలో వ్యాసాలు వ్రాస్తూ ఉన్నాడు. దక్షిణాఫ్రికాలో ప్రభుత్వ సమాఖ్య ఒకటి ఏర్పడనుండటం, ఆయన లండను ప్రయాణానికి ముఖ్యకారణం. అప్పటికే బోథా, స్మట్సు కూడా లండనుకు వెళ్ళి ఉన్నారు. వారి ముఖ్యోద్దేశం దక్షిణాఫ్రికాలో ట్రాన్సువాలు శాసనసభ ఆమోదించిన

క్రూరశాసనాన్ని దేశం అంతటా అమలులో ఉంచి భారతీయులను శాశ్వతంగా అణగద్రొక్కటం మాత్రమే. ఈ సమయంలో గాంధిజీ కోరిందల్లా భారతీయరక్షణకు ఒక హామీ పొందటం. దీనినే ఆయన "వలసజాతులకు న్యాయరీత్యా, లేక సిద్ధాంతరీత్యా, సమానత్వం కల్పించటం." అన్నాడు. అలా హామీ గనుక సంపాదించగలిగి, భారతీయుల ఆత్మగౌరవానికి భంగకరమైన పరిస్థితిని తొలగించగలిగితే, తర్వాత తక్కిన సదుపాయాలన్నీ సాధ్యపడిఉండేవి.

కాని బ్రిటిషు ప్రభుత్వం కూడా ఒత్తిడి చేసినప్పటికీ, స్మట్సు అంత ముందడుగు వెయ్యటానికి అంగీకరించలేదు. భారతీయులకు వ్యతిరిక్తంగా ఏర్పడ్డ ట్రాన్సువాలు శాసనసభ తీర్మానాన్ని ఇంగ్లాండులోనివారు అనేకులు అనేక కారణాలవల్ల తిరస్కరించారు. కొందరు పాపభీతిచేతనూ, కొందరు అన్యాయం గిట్టకపోవటంచేతనూ, కొంతమంది భారత దేశంలోని బ్రిటిషు సామ్రాజ్యానికి ముప్పు సంభవింపవచ్చుననే భయంతోనూ, ఎలాగైతేనేమి అందరూ భారతీయ వ్యతిరేక విధానాన్ని ఖండిస్తున్నారు. గాంధిజీ దేశంలో పలుకుబడి గల చాలామంది ఆంగ్లేయులను తన వాదానికి సుముఖులను చేసికోగలిగాడు. స్మట్సు తప్పనిసరిగా ఆసియాజాతుల వలసచట్టాన్ని అమలులో లేకుండా చెయ్యటానికి అంగీకరించవలసివచ్చింది. భారతీయులు దక్షిణాఫ్రికాకు వలసరావటానికి అనుమతించవలసి వచ్చింది. అయితే అలా వలసవచ్చే భారతీయుల సంఖ్య చాలా పరిమితంగా ఉండాలనీ, ఆ వచ్చేవారు విద్యావంతులై ఇంగ్లీషుభాష మాట్లాడగలిగేవారై (అనగా గాంధిజీ లక్షణా

లకు సరితూగేవారు) అయిఉండాలనీ షరతుపెట్టాడు. న్యాయ రీత్యా లేక సిద్ధాంతరీత్యా సర్వజాతి సమానత్వాన్ని కల్పించటానికి మాత్రం అంగీకరించలేదు. "హీనతాచిహ్నం" అని గాంధిజీ భావించినది మాత్రం అలాగే ఉండిపోవలసివచ్చింది.

ఆ సంవత్సరాంతానికి గాంధిజీ దక్షిణాఫ్రికాకు తిరిగి వచ్చాడు. "సత్యాగ్రహం" అని సుప్రసిద్ధమైన తన పోరాటపు విధానాన్ని ఇంకా తీవ్రంగానడపించాలని నిశ్చయంచేసికొన్నాడు. ఆంగ్లంలో "శాంతిపూర్వక ప్రతిఘటనం" (civil disobedience)'సాత్విక నిరోధం'(passive resistance) అనే వాటికంటె విశేషార్థవంతమై స్వచ్ఛందమైన ఆత్మార్పణం అయిన సత్యాగ్రహాన్ని పాలించిన వారికందఱికీ సత్యాగ్రహులనే పేరు ఏర్పడ్డది. గాంధిజీ నిర్వచనానుసారం సత్యాగ్రహి దారిద్ర్యానికి జంకకూడదు. పవిత్రత త్యజించకూడదు; పూనిన దీక్ష విడువకూడదు. ఆత్మార్పణ చెయ్యగలిగిన ఆత్మ నిగ్రహాన్ని అలవఱచుకొని ఉండాలి. ఇంతా అయితే సత్యాగ్రహి చెఱసాలలో ఉండగా అతని కుటుంబ పోషణకు ఏమిచెయ్యాలి అనే సమస్య కూడా విచారణీయమైనది.

ఈ క్లిష్ట పరిస్థితులలో గాంధిజీ మిత్రుడూ సహచరుడూ అయిన (జర్మనీ యూదుజాతీయుడు) హెర్మన్ కెలెన్ బాక్ జోహాన్సుబర్గుకు 21 మైళ్ళదూరాన ఉన్న 'లాలీ' అనేచోట కొంత భూమి కొని, సత్యాగ్రహుల కోసం వినియోగించవలసిందని గాంధిజీకి సమర్పించాడు. అది బాగా నీటి వసతిగల ప్రదేశం. దాని వైశాల్యం దాదాపు వెయ్యి ఎకరాలు. అందులో నారింజ, అప్రికట్ మొదలైన ఫలవృక్షాలుకూడా

ఉన్నాయి. గాంధిజీ ఇక్కడ ఫోనిక్సు ఆశ్రమ పద్ధతుల లోనే ఒక సహకారజీవన విధానాన్ని ఏర్పఱచి దానికి టాల్‌స్టాయ్ ఆశ్రమం అని పేరుపెట్టి సకుటుంబంగా అక్కడ నివాసం ఆరభించాడు. "కారాగారంలో లేని కాలంలో సత్యాగ్రహి ఈ ఆశ్రమంలో సకుటుంబంగా జీవించవచ్చును. అతను కారాగారంలో ఉంటే అతని కుటుంబానికి ఇక్కడ రక్షణ ఉండాలి." అని గాంధిజీ భావించి, అందుకు తగ్గయేర్పాట్లు చేశాడు.

ఈ టాల్‌స్టాయ్ ఆశ్రమంలో ఉండగా గాంధిజీ నిరాడంబర జీవితవిధానం నిలకడగా సాగుతూ ఒక స్థిరస్వరూపానికి వచ్చింది. ఆవులనుగానీ, గేదెలనుగానీ (పాలువృద్ధిచేసే నిమిత్తం) హింసపెడతారని ఆయన చదివినందువల్ల, ఆవు పాలుగానీ గేదెపాలుగానీ త్రాగనని శపథం చేశాడు. పండ్లూ, వేరుసెనగకాయలూ ఆలివ్‌నూనె మాత్రమే ఆహార పదార్థాలుగా వినియోగిస్తూ తనమిత్రుడైన కెలెన్‌బక్‌తో గలసి యీ నవీనాహార పద్ధతికి అంకితుడైనాడు. కెలెన్‌బక్ ధనవంతుడైనప్పటికీ గాంధిజీయందు గల గౌరవంచేత ఆయన తోబాటు శరీరకష్టంచేసి, ఆయనవలెనే భుజించి, తెల్లవాఱు జాములందు ఆరోగ్యరక్షణకోసం గాంధిజీతోబాటు చాలా దూరం నడవటమున్నూ అలవాటు చేసికొన్నాడు.

1912 వ సంవత్సరంలో శిశిరర్తువునందు గాంధిజీ రాజకీయ గురువైన గోఖలే దక్షిణాఫ్రికాకు వచ్చినది లగాయతూ భారతీయుల హక్కులకోసం సాగుతున్న పోరాటంలో ఒక మార్పు వచ్చింది. గోఖలే అంటే హిందూదేశంలోనూ, ఇంగ్లాండు

లోనూ కూడా విశేషమైన గౌరవం ఉన్నది. కాబట్టి, దక్షిణా ఫ్రికా ప్రభుత్వంవారు ఆయనకు తమయందు సదభిప్రాయం కలిగేటట్లు చేసికోవాలని భావించారు. గోఖలే ఆఫ్రికా సంచారంలో గాంధిజీ ఆయనవెంట బయలుదేరాడు. కాని ప్రిటోరియాలో స్మట్సు బోతాలను సందర్శించేటప్పుడు మాత్రం ఆయనతో లేడు. స్మట్సు బోతాలు భారతీయులకు అంతవఱకూ గల దీనపరిస్థితి అటుతర్వాత లేకుండా చెయ్యగలమని గోఖలేకు వాగ్దానంచేశారు. గాంధిజీ గోఖలేవల్ల ఈ విశేషం విన్నాడు గానీ, ఆ వాగ్దానం ఫలిస్తుందని ఆయన నమ్మలేదు. ఇందులో ఆయన ఎంతమాత్రమూ పొరబడలేదు.

నేటాలులోని ఐరోపాజాతులవారు వ్యక్తిసుంకాన్ని ఎత్తివెయ్యటానికి అనుమతించటంలేదని ప్రకటించటంద్వారా, స్మట్సు భారతీయులమీద అంతిమయుద్ధం ప్రారంభించాడు. భారతీయులను బానిసలుగా పరిగణించటం ప్రారంభించినది నేటాలుప్రభుత్వమే. ఇప్పుడు ఈ అన్యాయాన్ని ఎదుర్కొనటానికి గాంధిజీ తత్క్షణం కుటుంబసహితంగా నేటాలులోని ఫోనిక్సు ఆశ్రమానికి బయలుదేరాడు. మిత్రులందఱూ ఆయనను అనుసరించారు. కేప్ కాలనీలోని సర్వోన్నత న్యాయస్థానంవారు భారతీయుల వివాహాలలో ఒక్క క్రైస్తవ వివాహాలనే శాస్త్రీయమైనవిగా పరిగణిస్తామన్నారు. ఇది గాంధిజీ ఉద్యమవ్యాప్తికి చాలా సహాయమైనది. ఆ న్యాయస్థానంవారి నిర్ణయాన్ని బట్టి భారతీయ గృహిణులందరూ కులటలూ, వారిబిడ్డలు అక్రమ సంతానమూ అనిపించుకోవలసిన దుర్భరపరిస్థితి కలిగింది. దీనివల్ల భారతీయులు వెనుక ఎన్నడూ ఎఱుగని క్రోధావేశానికి

వశులయినారు. భారతీయ మహిళలు అవమానం సహించలేక తమ గౌరవాన్ని రక్షించుకోనటంకోసం ఎంత త్యాగమైనా చెయ్యటానికి సిద్ధపడ్డారు. దీనితో సత్యాగ్రహం భారీఎత్తున సాగటానికి అవకాశం కలిగింది.

ట్రాన్సువాలునుంచి నేటాలుకు ఒక మహిళాదళమూ, నేటాలునుంచి ట్రాన్సువాలుకు ఒక మహిళాదళమూ ప్రభుత్వానుమతి లేకుండా ప్రయాణం సాగించాలని గాంధిజీ నిర్ణయించాడు.

ట్రాన్సువాలునుంచి బయలుదేఱిన సోదరీమణులను (గాంధిజీ స్త్రీలను అలాగే పిలిచేవాడు) నేటాలు సరిహద్దులలోని రక్షకభటులు నివారించకపోతే వారు న్యూకాజిల్‌లోని బొగ్గుగనులవద్దకు వెళ్ళి అక్కడ పనిచేస్తున్నకూలీలను సమ్మెలో పాల్గొనవలసిందని ప్రబోధించాలని నిర్ణయం జరిగింది. తర్వాత పరిస్థితి ఈ నిర్ణయానికి అనుకూలంగానే పరిణమించింది. నేటాలు రక్షకభటులు మహిళాదళాన్ని నిరోధించలేదు. ఆ సోదరీమణులు న్యూకాజిల్ బొగ్గుగనులయందు పనిచేస్తున్న అయిదు వేలమంది కూలీలచేత సమ్మె కట్టించారు. ట్రాన్సువాలు రక్షకభటులు ఆ గుంపును నిర్బంధించటం, గుంపులోనివారికి మూడు నెలలు కారాగార శిక్షపడటం జరిగాయి.

గాంధిజీ తత్క్షణం న్యూకాజిల్‌కు వెళ్ళాడు. అక్కడి కూలీలు ఆయన నాయకత్వం వరించి సమ్మె కొనసాగించటానికి సిద్ధపడ్డారు. భారతీయ వర్తకుల సహకారంతో గాంధిజీ సమ్మెదారులకు వసతి ఏర్పాటుచేసి, వారి కర్తవ్యం ఏమిటో విశదపఱిచాడు. వారందఱూ ఆయన సైనికులు. ఆయన 'ఊఁ!'

అంటే వారు చెఱసాలలలో పడటానికైనా సిద్ధులైనారు. ఆయన వారితో నిష్కపటంగా సంభాషించాడు. తన ఆదేశానుసారం నడుస్తూ ఉంటే, ముందుగా ఎదురుకోవలసిన యిక్కట్లు ఎటువంటివో సంపూర్తిగా వివరించాడు. తాను చేస్తున్న పని సవ్యమైనదే అని వారికి విశ్వాసం కలిగితేనే వారంతా తనను అనుసరించవలసిందని చెప్పాడు. సమ్మెదారులలో ఒక్కరు కూడా వెనుకంజ వేయటంలేదని గ్రహించిన తర్వాత, ఇక తన పథకం ఆచరణలో పెట్టటానికి పూనుకొన్నాడు. వారంతటూ సరిహద్దులు దాటి, ట్రాన్సువాలు ప్రవేశించి, చెఱసాలలకు వెళ్లాలని ఆయన ఆదేశించాడు.

ఇక ఈ సత్యాగ్రహ యాత్రాకాలంలో ఆయన చేసిన యేర్పాట్లు చాల జాగరూకతతోనూ, ఔచిత్యంతోనూ, విశిష్టతతోనూ సాగాయి. సత్యాగ్రహుల ఆరోగ్యానికి ఎక్కడా భంగం కలుగనివిధంగా, యాత్ర సాగించటానికి తగిన నియమాలు, ముందుగానే ఆయన ఏర్పాటు చేశాడు. ఆయన అనుచరులలో ఎవ్వరూ, ఎవరితోనూ, ఎందుకూగూడా పెనగులాడరాదు; రక్షకభటులు నిర్బంధింపవస్తే, ఎదురు తిరుగగూడదు; పాటిపోగూడదు; ఎదిరిపక్షంవారి అనుగ్రహాన్ని ఆసించగూడదు. ఈ అందటికీ భోజనసదుపాయాలు చూడటం, ఆరోగ్య నియమాలను అనుసరింపజెయ్యటం అనే రెండు బాధ్యతలూ ఆయన తనమీదనే వేసికొన్నాడు. సత్యాగ్రహ ప్రథమ లక్షణంగా ఆయన తన శాంతిసైన్యం ఎప్పుడు సత్యాగ్రహానికి బయలుదేఱేదీ ముందుగా దక్షిణాఫ్రికా ప్రభుత్వానికి తెలియజేశాడు. అటుపిమ్మట 1913వ సంవత్సరం నవంబరు

నెల 6 వ తేదీనాడు ప్రొద్దున ప్రార్థన ముగిసిన తర్వాత సత్యాగ్రహదళం పురోగమించింది.

ట్రాన్సువాలు సరిహద్దులవద్ద సత్యాగ్రహులు మొదటి సారి విశ్రమించారు. అక్కడ గాంధిజీని రక్షకభటులు నిర్బంధించారు. అయితే కెలెన్‌బాక్ వెంటనే జామీనుమీద ఆయనను విడిపించాడు. ఆ మఱుసటిరోజున మళ్ళీ గాంధిజీని రక్షకభటులు నిర్బంధించటం, జామీనుమీద విడుదలచెయ్యటం కూడా జరిగాయి. తర్వాత రెండురోజులు గడవగానే, తిరిగి గాంధిజీ నిర్బంధానికి గుఱిఅయినాడు. ఈ పర్యాయం జామీనుపై విడుదల జరుగలేదు. అయితే టాల్‌స్టాయ్ ఆశ్రమం వఱకూ గాని, ఈలోపుగా, రక్షకభటులు నిర్బంధించేవఱకూ గాని, యాత్ర సాగించవలసిందని ఆయన తన అనుచరులను ఆదేశించాడు.

న్యాయమూర్తి ఎదుట నిలబడ్డ గాంధిజీ తన నేరాన్ని అంగీకరించి, అందుకు తగ్గ కఠినతమ శిక్షను విధించవలసిందని అడిగాడు. కాని న్యాయమూర్తి గాంధిజీని దోషిగా అంగీకరించలేదు. ఏదైనా సాక్ష్యం ఉంటేనే కానీ, ఆయనను దోషిగా భావించి శిక్షించటానికి వీలులేదన్నాడు. గాంధిజీ ఆప్తమిత్రులిద్దఱు ఆయన నేరం చేసినట్టు సాక్ష్యం ఇచ్చారు. న్యాయమూర్తి చేసేదిలేక, గాంధిజీకి మూడునెలల కారాగారవాస శిక్ష విధించాడు. వెంటనే తన మిత్రులిద్దఱిమీద గాంధిజీ సాక్ష్యం ఇచ్చి, శిక్ష వేయించాడు. ముగ్గురూ కలిసి జైలుకు వెళ్లారు.

తర్వాత ఇదేవిధంగా అనేకులు రక్షకభటులవల్ల నిర్బం

ధించబడటం జరిగింది. మొత్తం సైన్యం నేటాలు సరిహద్దులను దాటిపోయినందుకు చెఱసాల పాలైంది. అంతలో నేల యీని నట్లుగా నూతనంగా స్వచ్ఛందసేవకులు బయలుదేరారు. అందఱూ న్యాయస్థానంలో శిక్షలు పరిగ్రహించటానికి సిద్ధపడ్డారు.

తగిన పర్యవేక్షణలో శాంతిసైనికదళం న్యూ కాజిల్ లోని బొగ్గుగనులకు చేరుకొన్నది. రక్షకభటులవల్ల దెబ్బలు దినవలసివచ్చినా, లంకణాలుకే చెయ్యవలసివచ్చినా వెనుదీయ లేదు. గనులలో పనిచేయటానికి అంగీకరించలేదు. ఈ దళంలో ఇంకా అనేకులు చేరారు. అతిశీఘ్రకాలంలో సమ్మెఉద్యమం దేశంలో చాలా దూరం విస్తరించింది. 50 వేలమంది బానిస (ఐరోపా జాతులవారు కూలీలను బానిసలనే అనేవారు)కూలీలు ఏ కూలిపని కూడా చెయ్యబోమని భీష్మించారు. గాంధిజీవంటి వేలకొలది భారతీయులు చెఱసాలకు వెళ్లారు.

ఆ కాలంలో హిందూదేశాన రాజప్రతినిధిగా ఉన్న హార్డింజ్ ప్రభువు ఈ విషయానికై ఒక పరిశీలక సమితిని నియమించాలని ఉద్ఘాటించాడు. లండను అధికారులు ఇందుకు అంగీకరించారు. బోతా స్మట్సులు ఇప్పుడు అపూర్వ క్లిష్ట పరిస్థితులను ఎదుర్కోవలసి వచ్చింది. కెలెన్‌బాక్ పోలక్‌ల వంటి మిత్రులతో సహా గాంధిజీని తత్క్షణం చెఱసాలనుంచి (1913వ సంవత్సరం డిసెంబరు నెల 18వ తేదీన) విడుదల చెయ్యటం అత్యవసరం అని వారు నిశ్చయించుకొన్నారు. కాని గాంధిజీ కోరినది ఇది కానేకాదు. బయట ఉన్నప్పటికంటె చెఱసాలలో ఉన్నప్పుడే నిజంగా ఇయన ఎంతో సాధించగలిగేవాడు. కారా

గారంనుంచి విడుదల కాగానే, మళ్ళీ ఉద్యమాన్ని నడిపించ టానికి ఆయనకు మంచి అవకాశం లభించింది. దానిని చక్కగా వినియోగించుకొన్నాడు. పరిశీలకసంఘ సభ్యులందఱూ భారతీయులకు ఎటువంటి హక్కులూ ఇయ్యరాదనే వారే కాబట్టి, ఆ సంఘంవల్ల లాభంలేదని ఆయన తీవ్రంగా విమర్శించాడు. 1914వ సంవత్సరంలో సంవత్సరాదినాడే భారతీయుల ననేకుల్ని సమీకరించి, అందఱినీ వెంటబెట్టుకొని, కారాగార శిక్ష పొందటంకోసం డర్బనుకు వెళ్ళనున్నానని ప్రకటించాడు.

ఈ సమయంలో దక్షిణాఫ్రికా రైలుమార్గాల నిర్మాణంలో పనిచేస్తున్న తెల్లకూలీలు సమ్మె ప్రారంభించారు. ఉభయుల లక్ష్యాలూ ఒక్కటే అని శ్వేతవర్ణులు భావించి, భారతీయులుకూడా తమకు తోడ్పడతారని అనుకొనిఉంటారు. కాని, గాంధిజీ ఇందుకు వ్యతిరేకించాడు. సత్యాగ్రహం అతి పవిత్రంగా నిర్దుష్టంగా నడవాలనీ, శత్రువులను అవమానపఱచడంగానీ, కోపోద్దీపితులను చెయ్యడంగాని పనికిరాదని తనవారి కందఱికీ తెలియజెప్పి సంవత్సరాదినాడు జరగవలసిన సత్యాగ్రహయాత్రను విరమింపజేశాడు. ఆఫ్రికాప్రభుత్వంవారు చిక్కులో ఉన్నారు; సైనికశాసనం ప్రకటించారు. ఇటిస్థితిలో గాంధిజీ వారిపట్ల ఓర్పుతో ప్రవర్తించాలని నిశ్చయించాడు.

మొదట తలపెట్టినప్రకారం సత్యాగ్రహయాత్ర సాగించకుండా, ఈ విధంగా ఓర్పుతో ప్రవర్తించడంవల్లనే ఆయన భారతీయులకు ఎక్కువ అవకాశాలు సాధించగలిగాడు. ఏమైతేనేమి, తనతో మాట్లాడటానికి ప్రిటోరియాకు రావలసిందని స్మట్సు గాంధిజీని ఆహ్వానించాడు. ఇంగ్లండునుంచీ హిందూ

దేశంనుంచీ మిత్రులు రానున్నారు; రాజప్రతినిధి భారతదేశం నుంచి భారతీయులను సమర్థించటానికి సర్ బెంజామిన్ రాబర్ట్సన్ అనే ఆయనను ప్రత్యేకాధికారాలిచ్చి పంపించాడు.

1914 వ సంవత్సరం తొలినెలలలో స్మట్సు గాంధిజీల మధ్య చాలాకాలం సంభాషణలు జరుగుతూవచ్చాయి. ఈ ఇద్దఱికీ ఎన్ని అభిప్రాయభేదాలున్నా ఒకరియందు ఒకరికి విశేషగౌరవం ఉండేదనటంలో అనుమానంలేదు. "ఇరవైవేల మంది భారతీయులను చెఱసాలలో ఉంచలేము" అని స్మట్సు అన్నాడు. నిజంగా అంతమందిని నిర్బంధించి ఉంచటానికి నాటి దక్షిణాఫ్రికా ప్రభుత్వపు కారాగారాలు చాలవు. స్మట్సుకు ఇది పెద్దసమస్య అయింది. సత్యాగ్రహం మూలంగా ఇటువంటి ఇబ్బంది కలిగినా స్మట్సుకు గాంధిజీపట్ల గౌరవం ఏర్పడినది. ఆ గౌరవమే విస్మయంగాను ప్రేమగాను పరిణామం చెందింది. చిట్టచివఱకు ఇద్దఱిమధ్యనూ ఒక ఒప్పందం కుదిరింది. 1914 వ సంవత్సరం జూన్ 30 తేదీన వారిమధ్య నడచిన ఉత్తరప్రత్యుత్తరాలలో ఈ ఒప్పందం రూపొంది, 'భారతీయ విముక్తి శాసనం'గా తయారైంది. జూలై నెలలో దక్షిణాఫ్రికా ప్రభుత్వం దీనిని ఆమోదించింది. దీనిప్రకారం భారతీయ (హిందూ, ముస్లిం, పార్సీ) జాతులలో జరిగే వివాహాలు శాస్త్రీయమేనని ప్రభుత్వం గుర్తించటం జరిగింది. కంట్రాక్టు కూలీలకు విధించే మూడుపౌనుల వ్యక్తి సుంకం రద్దయింది. శాసనం నాటికి ఈ సుంకం చెల్లించవలసిన వారెవరైనా ఉన్నా వారిదగ్గఱనుంచీ ఆ బాకీలు వసూలుచెయ్యటం కూడా ఆగిపోయింది. దక్షిణాఫ్రికాకు భారతీయుల వలస 1920 వ

సంవత్సరంతో ఆగిపోవాలనికూడా ఈ శాసనం పేర్కొన్నది. అనుమతిలేకుండా భారతీయులు ఒక రాష్ట్రంనుంచి మరొక రాష్ట్రానికి వెళ్ళటానికి అవకాశంలేకపోయినా, దక్షిణాఫ్రికాలో జన్మించిన భారతీయులు మాత్రం కేప్‌కాలనీ ప్రవేశించవచ్చునని ప్రభుత్వసమాఖ్య అంగీకరించింది.

ఇప్పటికి సత్యాగ్రహం ఒక అమోఘమైన ఆయుధమని ఋజువైంది. ఆ కాలంలో ఇది లోకానికి అతి విచిత్రంగా కనబడ్డది. భారతదేశంలోగానీ ఇంగ్లాండులోగానీ సత్యాగ్రహం అంటే ఏమిటో అప్పటికింకా బోధపడనేలేదు. ఆత్మసంయమనానికి అవసరమైన నిశితక్రమశిక్షణకూ, అహింసకూ ఆలవాలంగా గాంధిజీ సృష్టించిన ఈ ఆయుధం మానవులు ఆ నాటివఱకూ శత్రువులను ఎదుర్కొనటానికి వినియోగించిన శస్త్రాస్త్రాలన్నిటికంటెనూ అద్భుతమైనదిగా ప్రసిద్ధికెక్కింది. హిందూదేశంలోనూ, ఇంగ్లండులోనూ దీని ప్రభావం అందఱికీ విశదం కావటానికి కొన్ని సంవత్సరాలు పట్టింది.

ఇప్పటికి దక్షిణాఫ్రికాలో గాంధిజీ కర్తవ్యం పరిపూర్తి అయింది. 1914 వ సంవత్సరం జూలైనెల 14 వ తారీఖున ఆయనభార్య కస్తూరిబాతోనూ, మిత్రుడు కెలెన్‌బక్‌తోనూ ఇంగ్లాండుకు వెళ్ళటానికి ఓడ ఎక్కాడు. తన ప్రయాణానికి ముందు సోన్యా శ్లెసిన్, హెన్రీ పోలక్ అనే మిత్రులను పిలిచి, తాను చెఱసాలలో ఉండగా, తయారుచేసిన పాదరక్షలను ఇచ్చి, వాటిని స్మట్సుకు బహూకరించవలసిందని చెప్పాడు. స్మట్సు ఈ పాదరక్షలను 25 సంవత్సరాలపాటు వాడుకొన్నాడు. 1939 వ సంవత్సరం అక్టోబరు 2 వ తేదీనాడు గాంధిజీ 70 వ

జన్మదినోత్సవం జరుగనున్నప్పుడు మైత్రీచిహ్నంగా అతను వీటిని తిరిగి గాంధిజీకి పంపాడు. ఆ సమయంలో అతను ఇలా అన్నాడు: "నేను ఈ పాదరక్షలను 25 వేసవులలో ఉపయోగించాను. అయితే అట్టి మహాపురుషుడు నిర్మించిన పాదరక్షలపై అడుగుపెట్టటానికి అర్హుణ్ణి కానని నాకు తెలుసు."

# చతుర్థ ప్రకరణము

## హిందూదేశమూ, యుద్ధమూ.

తన నలభై అయిదవయేట గాంధిజీ దక్షిణాఫ్రికానుంచి చివరిసారి బయలుదేరి వచ్చాడు. అప్పటికి ఆయన వ్యక్తిత్వం పరిపూర్ణత పొందింది. ఆహారమూ, రోజుకు పనిచేయవలసిన కాలపరిమితీ, శరీరపరిశ్రమా, ధ్యానమూ, ప్రార్థనా, మౌనమూ మొదలైన ఆత్మ సంయమన నియమాలన్నీ ఆయన ఇప్పటికే బాగా అలవాటు చేసికొన్నాడు. అయితే వీటిలో కొన్ని అప్పటికింకా సుస్థిరాలు కాలేదు. వారాని కొక రోజు మౌనం పాటించటం వీటిలో ఒకటి. అయితే ఇవి అన్నీ అప్పటికే ఆయనకు అనుభవగోచరాలైనాయి. దుస్తుల విషయంలో ఒక నిర్ధారణ జరుగలేదు. బహిరంగ సమావేశాలలో భారతీయ పద్ధతినే వేషధారణ చేసినా, ఆయన అప్పటివరకూ ఆంగ్లేయులవలె కూడా దుస్తులు ధరిస్తూ వచ్చాడు. రాట్నం ఇంకా ఆయన ఉపయోగించలేదు గానీ ఉద్దేశం మాత్రం కలిగింది. హిందూదేశానికి చేరిన తర్వాత అది చేబట్టాలని అనుకొన్నాడు. హిందూదేశాన్ని సముద్ధరించటానికి తగిన

శక్తిసంపద ఆయనకు ఇప్పటికి కలిగింది. భారతీయులు తన వినూ తన నియమాలను పాలించటానికి వెంటనే సన్నద్ధులు కారని ఆయన అభిప్రాయం. కాని హిందూదేశానికి వచ్చిన కొంత కాలానికి ఆయనకు తన లక్ష్యాల ననుసరించి ఉద్యమం నడప టానికి అవకాశం కలిగింది.

సత్యం, అహింసా, బ్రహ్మచర్యమూ అనే అద్భుత విజయసాధనాలు సృష్టిలోకి వచ్చాయి. చాలాకాలంనుంచీ సత్యవ్రతపాలనకు ఆయన తీవ్రంగానే కృషిచేస్తూ వచ్చాడు. అయితే దక్షిణాఫ్రికానుంచి బయలుదేఱిన తర్వాత ఇక తన జీవితాంతంవఱకూ సత్యపరిపాలనవిషయంలో అనుసరించదగు మార్గాలను ఆయన కొంత సంస్కరించుకొని మఱింత నిష్క ళంకంగా చేసికోవాలని అభిప్రాయపడ్డాడు. హిందూమతంలో వేళ్ళు పాదుకొన్న సహనమూ, భూతదయా ప్రాతిపదికాలైన అహింస ఆయనకు పుట్టుకనుంచే అలవాటైంది. దానిని ఆయన అతిదీక్షతో పాటిస్తూ వచ్చాడు. దీనినే క్రైస్తవులు "ప్రేమ" లేక "ఔదార్యం" అన్నారు. దీనిని కేవలం అహింస అనటం సరికాదు. దీనిలో హింస అనేది లేకపోటమే కాకుండా ప్రతి ప్రాణికి సాధ్యమైనంత ఉపకారం చెయ్యాలనే భావంకూడా ఇమిడి ఉన్నది. ఇక "బ్రహ్మచర్యం" అనేది విద్యార్థులకూ, సన్యాసులకూ విధి అని హిందూమతం శాసించిందే. (మానవ జీవితాన్ని నాలుగు దశలుగా విభజించగా, మొదటిదశలోనూ, నాలుగవ దశలోనూ బ్రహ్మచర్యం విధి అని హైందవ సిద్ధాం తం. అట్టి బ్రహ్మచర్యం గాంధిజీ తన 36వ సంవత్సరం నుంచే

పాటించటం మొదలుపెట్టాడు. ఇందుకు తగ్గ మనోనిగ్రహం కోసం ఆయన పడ్డ పాట్లు ఎన్నో!

దక్షిణాఫ్రికా భారతీయులను వారి మానవస్వత్వాలను సాధించి విజయంపొందటానికి సన్నద్ధులనుచేసి ఆయన సాధించిన బాహ్య విజయానికి చాలావఱకు ఆయన ఆత్మవిజయమే కారణం. తాను పవిత్రుడైతేగాని ఇతరులకు నాయకత్వంవహించే అర్హత తనకు కలగదని ఆయన విశ్వసించాడు. "ప్రాపంచిక సుఖ పరిత్యాగం" చెయ్యకుండా ఎవడున్నా భారతీయులకు నాయకత్వం వహించలేడని అనేక పర్యాయాలు అంతకుపూర్వమే ఎందఱో ఉద్ఘాటించటం జరిగింది. గాంధీజీకి వైరాగ్యం అకస్మాత్తుగా ఉదయించిందికాదు అనీ, అది క్రమ క్రమంగా కాలూని చివఱకు ఆయన 36వ యేట మాత్రమే సుస్థిరత్వాన్ని పొందగలిగిందనీ మనకు తెలుసు. అంతవఱకూ ఆయన న్యాయవాది వృత్తిద్వారా సంపాదించిన ధనంనుంచే కుటుంబపు ఖర్చులు సరిపెట్టుకొనేవాడు. 45వ సంవత్సరం వచ్చేసరికి ఆయన ఈ విరాగతలో చాలా ముందుకు వెళ్లాడు. స్త్రీసాంగత్యాన్నీ, జిహ్వాచాపల్యాన్నీ జయించటమేకాకుండా, ధనం కూడబెట్టటం, భీమాలు చెయ్యటం, ఆస్తిసంపాదించటం వగైరా జీవిత నిర్వహణావసరమైన ధనసంచయం పట్లనే వైముఖ్యం పెంపొందించుకొన్నాడు. ఒక్క భారతజాతి ఆత్మ గౌరవాన్ని నిలబెట్టటమే తప్ప మఱే ఒక వాంఛ ఆయనకు లేక పోయింది. వైరాగ్యంలో పరిపక్వస్థితి రావటానికి ఆయన చెయ్యవలసిన సాధన దాదాపు అంతా పూర్తి అయింది. సర్వ సంగపరిత్యాగం చేసిన సన్న్యాసికి కలిగేశక్తి యెటువంటిదో

యెవరికీ నిర్ణయించరానిది. ఇక గాంధిజీ విషయంలో ఆ శక్తి సర్వాతిశాయి అయింది. ఇలా అద్భుతశక్తులు కొన్ని యిక్కడ సమ్మిళితాలైనాయి. ఇటువంటి సమ్మేళనం ఒక అపూర్వ సంఘటన అనాలి. ఆయన "నా" అనేది ఏదీ లేని యథార్థ పరివ్రాజకత్వం అవలంబించినా, ఆ గాఢవైరాగ్య మహిమచేత సామ్రాజ్యాలను శాసించి, చరిత్రగతినే చక్క దిద్దాడు. ఇలా అంటే చాలా విరుద్ధంగా కనబడవచ్చును. కాని యిందులో అసమంజసత యేమీలేదు. యథార్థంగా జరిగిందిది. ఆధునిక ప్రపంచమంతా చక్కగా చూస్తుండగానే కండ్లకుకట్టి నట్లు యిది సంభవమైనది. కాబట్టి యిక్కడ వాదోపవాదా లకు తావు లేదు.

ఆయన రూపమూ సమున్నతమైనదికాదు; స్వభావమూ పరమసాధువైనది. పీడితప్రజల దుర్గతులకు విచారపడుతూ, విషాదం ప్రతిఫలిస్తున్న నేత్రాలతో, శిరస్సుకు సమకోణాలుగా ఉన్న చెవులతో లోకానికి అతి సామాన్య వ్యక్తిగా కనిపించే వాడు. అయితే అయన శరీరదార్ఢ్యం సామాన్యమైనదికాదు. ఒకొక్కప్పుడు టాల్‌స్టాయ్ ఆశ్రమంనుంచి జోహాన్సుబర్గుకు నడచివచ్చి, ఆ రోజుననే తిరిగి అంతదూరమూ వెళ్ళేవాడు. మొత్తం రోజుకు 50 మైళ్లు నడచేవాడన్నమాట. ఇంత పరి శ్రమ చేసినా ఆయనతీసికొనే ఆహారంమాత్రం ఎప్పటివలె అతిసులభంగా జీర్ణమయే సామాన్యపదార్థం మాత్రమే. ఆహారమంటే కొన్నిపండ్లూ పప్పులే. పాలుగానీ, ఇంకేమైనా కూరగాయలుగానీ తీసికొనటం కూడా లేదు. ప్రార్థనాభాగంగా ఉపవాసం చెయ్యటమనేది అప్పటికే అలవాటైపోయింది. ఇలా

ఉపవసించేటప్పుడు ముందుగా ఏదో శపథం చెయ్యటం, దాని ప్రకారం గడువుముగిసేవఱకూ నిరాహారదీక్ష పాటించటం జరిగేవి. ఒకసారి తనఅనుచరులలో ఎవరో చేసిన అకృత్యానికి వారంరోజులు తానుఉపవసించాడు గదా! ఆయన చేసిన శపథాన్ని భంగపఱచగల దృశ్యాదృశ్యశక్తులేవీ లేవు. తర్వాత తర్వాత గడువేలేకుండా కూడా ఉపవాసాలు సాగించేవాడు. అయితే ఎప్పుడో అంతర్వాణి సందేశం వినిపించేది. అలా వినిపించినప్పుడు ఆ ఉపవాసాన్ని విరమించేవాడు. మొదట్లో ఈ సుదీర్ఘోపవాసాలు దైవప్రార్థనాత్మకాలుగానూ, ఉద్దిష్ట లక్ష్య సాధనాలుగానూ సాగుతూవచ్చాయి. అటుతర్వాత పెద్దపెద్ద ప్రభుత్వాలనుగూడా తనదారికి త్రిప్పటానికి ఆయన ఉపవాసాలుచేసి లక్ష్యంసాధించటంతో ఇవి రాజకీయమైన ఒత్తిడి తీసికొనిరాదగిన అపూర్వసాధనాలుగా పరిణమించాయి. బాహ్యజగత్తుతో సంబంధంలేకుండా ప్రత్యేకించి ఆత్మశాంతి కోసమే దక్షిణాఫ్రికాలో ఉండగా ఆయనప్రారంభించిన యీ నిరాహారదీక్షావిధానం ఆయన జీవితవిజయానికి ఎంత అవసరమైనదో మనం గుర్తించవచ్చును.

గాంధిజీ దక్షిణాఫ్రికాలో అంకురారోపణంచేసి హిందూదేశంలో మహావృక్షంగా పెంచిన యీ సత్యాగ్రహంలోని విశిష్ట లక్షణం ప్రతిస్పర్థిపట్ల గూడా విశ్వాసపాత్రంగా వ్యవహరించటం. సత్యాగ్రహి తాను ఏమి చేయబోతున్నదీ నిశ్చితంగా తన ప్రతిస్పర్థికి తెలియజేయాలి. అలా ప్రకటించిన కార్యక్రమాన్ని ఎంతమాత్రమున్ను మఱొకవిధంగా మార్పు చేయగూడదు. తాను సత్యాగ్రహం ప్రారంభించకముందు

ప్రతిస్పర్థివల్ల కలిగే కష్టనష్టాలను భరించటానికి సిద్ధపడితేనే, అందుకు సాహసించాలి గనుక, కార్యరంగంలోనికి దిగిన తరువాత, ప్రతిస్పర్థి యేమిచేసినా సహించవలసిందే. తన సత్యాగ్రహానికి ప్రతిస్పర్థి విధించవలసిన కఠినతమ శిక్షను విధించవలసిందని, స్వయంగా సత్యాగ్రహి అడగటంకూడా ఉంటుంది. ప్రతిస్పర్థితో చెప్పేది ఒకటీ, చేసేది ఒకటీగా, ఎన్నడూ వ్యవహరించకూడదు. అంటే, మోసంద్వారా అతనిని జయించాలని ప్రయత్నించరాదు. సత్యాగ్రహి ఉద్దేశాలన్నీ ప్రతిస్పర్థికి ఎప్పుడూ సమగ్రంగా తెలుస్తూ ఉండాలి. యథార్థానికి సత్యాగ్రహికి ప్రతిస్పర్థికూడా మిత్రుడే. ఒక తాత్కాలికమైన అభిప్రాయభేదం మాత్రమే వారిని కొంతకాలము ఎడంగా ఉంచుతున్నది. కాబట్టి ప్రతి సత్యాగ్రహీ ప్రతిస్పర్థి తనకు మిత్రుడే అన్న విషయాన్ని ఎన్నడూ మఱచిపోకూడదు. గాంధిజీ హిందూదేశానికి తిరిగి రాకముందే ఈ సత్యాగ్రహ లక్ష్యాలన్నీ అనుభవపూర్వకమైన అభ్యాసాలద్వారా బాగా దృఢపడుతూ వచ్చాయి. వాటి మూలాననే అనేక సందర్భాలలో గాంధిజీకి ప్రతిస్పర్థులైన కారాగృహాధికారులూ, రక్షకభటులూ, పత్రేదారులూ, కారాగార శాఖలోని వైద్యులూ, ఇంకా ఇటువంటి వారెందఱో కాలక్రమాన ఆయనకు ఆప్తమిత్రులైనారు.

## 2

దక్షిణాఫ్రికానుంచి గాంధిజీ ఇంగ్లండు చేరుకొన్ననాటికి రెండురోజులు ముందుగానే ప్రథమ ప్రపంచయుద్ధం ప్రారంభమైనది. వెంటనే ఆయన బ్రిటిషుసేనలో యుద్ధరంగాన

గాయపడ్డవారందరికి సేవచేయడంకోసం ఒక భారతీయ సేవా దళాన్ని సమీకరించటానికి బయలుదేరాడు. బ్రిటిషు వారి పాలనవల్ల కలిగే సత్ఫలాన్ని తానుకూడా అనుభవిస్తున్నానని ఆయన విశ్వసించి ఉన్నందున, ఆ ప్రభుత్వానికి తాను కొంత ఋణపడి ఉన్నానని ఆయనభావించాడు. నాడే కాక అటుపై ఐదు సంవత్సరాలకు కూడా ఆంగ్లేయుల ప్రభుత్వంపట్ల ఆయనకు గల భక్తివిశ్వాసాలు అలాగే అచంచలంగాఉన్నాయి. తానుకూడా బ్రిటిషు సామ్రాజ్యంలోని పౌరుడై ఉన్నందువల్ల, ప్రభుత్వంపట్ల భక్తివిశ్వాసాలు ఉండటం పౌరధర్మంకాబట్టి, కొన్ని ప్రత్యేక మతాలవారివలె (క్రైస్తవులలోని 'క్వేకరు' అను శాఖవలె) హింసాత్మకమైన యుద్ధములో పాల్గొనటానికి మనస్సు అంగీకరించకపోయినా, తన నియమాలకు విరుద్ధం కాకుండానే, ప్రభుత్వానికి శక్తివంచనలేకుండా తోడ్పటం తన విధి అని ఆయన అనుకొన్నాడు. నిశితంగా తర్కించినట్లయితే ఆయుధపాణులై హింసకుపూనుకొన్నవారికి సేవచేయటం ఒక విధంగా హింసచెయ్యటమే అవుతుందని ఆయన గుర్తించక పోలేదు. ఐనప్పటికీ పాపపుణ్యవిచక్షణ చేస్తూఉండే ఆయన అంతరాత్మ ఇందుకు అంగీకరించింది.

కాని కొన్నివారాలకే ఆయన జబ్బుపడ్డాడు. ఇది ఊపిరితిత్తులకుసంబంధించిన శ్లేష్మప్రకోపంగల వ్యాధిఅయింది. కొన్నాళ్లు ఆహారపు మార్పిడివల్ల దానిని నివారించుకొనటానికి యత్నించి చివరకు వైద్యునిసలహాలను అనుసరించి హిందూ దేశానికి బయలుదేరాడు. అయితే ఆయనతోపాటు ఆయన మిత్రుడైన కెలెన్ బాక్ మాత్రం బయలుదేరటానికి ప్రభు

త్వానుమతి లభించలేదు. భారత దేశ రాజప్రతినిధి అయిన హార్డింజ్ ప్రభువుకూడా అతనికి అనుమతి ఇవ్వడానికి ఇష్టపడ లేదు. ఇందుకు ప్రధానకారణం కెలెన్‌బాక్ జర్మనీ దేశస్థుడు కావటమే.

భారత దేశానికి తిరిగి రావటం గాంధిజీకి అనేకవిధాల సంభ్రమం కలిగించింది. ఆయన మనస్సు అంతా భారత దేశం పైనే ఉన్నప్పటికిన్నీ, అప్పటికి కడచిన ఇరవై సంవత్సరాలలో చాలా భాగం దేశానికి దూరంగానే ఉండి తనకాలాన్నీ, శక్తినీ, దక్షిణాఫ్రికాలోని భారతీయుల ప్రత్యేకసమస్యను పరిష్కరించటానికే వినియోగించాడు. బొంబాయి నగరవీథుల్లో ప్రజలు గుంపులుగాకూడి 1915వ సంవత్సరం జనవరి నెల 9వ తేదీన తనకు ఘనస్వాగతం ఇస్తారని ఆయన కలలోకూడా అనుకోలేదు. అంతకుముందు ఆయన స్వదేశాన్ని సందర్శించిన సమయాలలో అటువంటి సూచనలు ఏవీకూడా కనిపించలేదు. అయితే ఆయన దక్షిణాఫ్రికాలో భారతీయులను ఉద్ధరించడానికి ఉద్యమం ప్రారంభించి, సత్యాగ్రహం అనే నూతనాయుధాన్ని కనిపెట్టి, అపూర్వపద్ధతిలో దానిని వినియోగిస్తూ ఉండగా, చాలామంది ప్రజలకు ఆయన మహాత్ముడే (గొప్ప ఆత్మకలవాడు) అయినాడు.

భారత దేశంలో ఆయన శరీరం చాలించినప్పుడున్నూ, ఇంకా ఇతర సమయాలలోనున్నూ ఈ మహాత్ముడనే ప్రశస్తి ఆయనకు ఎల్లా లభించిందో తెలిసికొనటానికి, నేను చాలా ప్రయత్నించాను. కాని ఎప్పటినుంచీ ఈ మహాత్ముడనే పేరు ఆయనకు స్థిరపడ్డదో నాకు తెలియనేలేదు.

దక్షిణాఫ్రికాలో 1914వ సంవత్సరానికి పూర్వమే అనేక సంవత్స రాలనుంచీఆయన చేస్తూఉన్న కృషిని గమనిస్తూఉన్న భారత దేశపు ప్రజలే ఆ మధ్యకాలంలో ఎప్పుడో ఆయనకు మహాత్ము డనే పేరు స్థిరపఱచారు. భారత దేశంలో మహాపురుషులను ఇలా ప్రశంసించటం అసాధరణమేమీకాదు. గాంధిజీ అవతరించ టానికి పూర్వమే ఇది సంప్రదాయంగా ఉన్నది. 20వ శతా బ్దంలోనే ఇంకా కొందఱు మహాత్ములున్నారు. కాని వారిని ఈనాడు ఎవరూ స్మరించటంలేదు. గాంధిజీకి ఈ పేరు ఏర్పడ్డ తరువాత కోట్లకొద్ది ప్రజలు ఈ పేరుతోనే ఆయన్ని పిలుస్తూ వచ్చారు.ఆయన పేరులో ఇదిఒక భాగమైపోయింది. నేడేకాదు ఇకముందు ఎప్పటికీకూడా, మరి ఎవరికిన్నీ, ఈ మహాత్మ పదం వాడుకలోకిరాదని చెప్పవచ్చును.

ఈ బిరుదు ప్రజలే ఆయనకు ఇచ్చారని తెలుస్తూ ఉన్నా, ఎవరు ఎప్పుడు ఇచ్చారో నిర్ణయించడానికి ఆధారాలు కనబడవు. 19 6వ సంవత్సరంలో రవీంద్రనాథటాగూరు ఒకతంతి వార్తలో గాంధిజీని "మహాత్మా" అని సంబోధించాడు. నాటి ఆ కాగితం ఇప్పటికిన్నీ భద్రంగా ఉన్నది. అయితే అంతకు ముందు ఎప్పటినుంచో రవీంద్రుడు గాంధిజీని అలా సంబో ధించేవాడని అనుకోవలసివస్తున్నది. కాని రవీంద్రుడే ఆ బిరు దును సృష్టించాడనీ, లేక ఏ సందర్భంలోనైనా ప్రసాదించి ఉంటాడనీ చెప్పలేము. గాంధిజీ మిత్రులలోనూ, అనుచరుల లోనూ ఒకతె అయిన సరోజినీ నాయుడు 1914 వ సంవత్స రంలో గాంధిజీ ఇంకా హిందూదేశానికి తిరిగిరాక, లండనులో బ్లూమ్స్ బరీ'లోని ఒక వసతిగృహంలో ఉండగా కలిసి

కొన్నది. ఆ సమయానికే ఆయనను మహాత్ముడని పిలవటం, కొందరికి అలవాటుగా ఉండేది. సరోజినీనాయుడు ఈ విషయం నాతో చెబుతూ, అప్పటికి ఎంతకాలంనుంచీ ఆ పేరు ఆయనకు వాడుకలో ఉన్నదో; జ్ఞాపకం చేసికోలేనన్నది. శ్రీ నెహ్రూ ప్రప్రథమంగా ఆయన్ని కలిసికొన్నది 1916 సంవత్సరంలో. తమ సమావేశానికి పూర్వం కొన్ని ఏండ్లనాడే గాంధిజీ మహాత్ముడైనాడని శ్రీ నెహ్రూకు జ్ఞాపకం ఉన్నది.

దీనినిబట్టివిచారిస్తే ఆయన హిందూదేశానికి రాకముందే ప్రజలు ఆయనను మహాత్ముడని సంభావించేవారనీ, స్వదేశానికి ఆయన తిరిగివచ్చినప్పుడు ఆయనకు ఆ బిరుదు బాగా ప్రసిద్ధమైనదనీ ఊహించవచ్చును. నిజానికి ఆ బిరుదం ఆయనకు ఎంతమాత్రమూ గిట్టదు. పెద్దఆత్మలు, చిన్నఆత్మలు, అనేవి ఉంటాయని విశ్వసించటమే పొరపాటుగా ఆయన భావించేవాడు. అనేక కార్యభారాలలో తలమునిగి తాడి ప్రమాణం అవుతూఉండగా, తనపనులను చూచుకోనీయకుండా "మహాత్ముడు, మహాత్ము"డంటూ తనచుట్టూ మూగే ప్రజాసమూహాలనుచూస్తే, ఆ బిరుదంటేనే ఆయనకు అసహ్యం కలిగేది. కాని భారతవర్షంవంటి దేశంలో మహాత్ముడనిపించుకొనటం సామాన్యంగా ఎంతో ప్రయోజనకారి అవుతుంది. దీనివల్ల ఆయన తలపెట్టిన కార్యాలకు ప్రజాసహకారం విరివిగా లభించింది. ఇంత జరిగినా ప్రజలు గుమిగూడి ముందడుగు పడకుండా చేసే సమయాలలో మాత్రం ఈ పేరు తనకెందుకు వచ్చిందని ఆయన చిరాకుపడేవాడు. ఎన్నో యేండ్లపాటు ఇటువంటి సమయాలలో అతి తీక్ష్ణత పాటిస్తూ ప్రజలు తనమీద

విఱుచుకొనిపడకుండా ఉండటానికిజాగ్రత్తపడేవాడుగానీ, అందు వల్ల ఏమీ ప్రయోజనం లేకపోయేది. అనేకసంవత్సరాలు ఈ ఇబ్బందిని ఆయన సహించాడు. తానుచేసే ప్రతికార్యాన్నీ దేశ మంతా గమనిస్తూ ఉండడంకూడా ఆయనకు కష్టమే. ఈ బిరు దాన్నిగానీ, దీనికి తగ్గ లక్షణం తనలో ఉన్నదని కానీ ఆయన ఎన్నడూ అంగీకరించలేదని దృఢంగా చెప్పవచ్చును.

## 3

గాంధిజీ హిందూదేశానికి తిరిగివచ్చిన మొదటి సంవ త్సరమంతా తన రాజకీయ గురువైన గోఖలే కోరిక ననుసరించి రాజకీయాలనుంచి విరమించుకొన్నాడు. సర్వసంపన్నుడైన ఈ కొద్దిపాటి వ్యక్తివల్లనే భారతీయుల భవిష్యత్తు చక్కగా రూపొందగలదని గోఖలే విశ్వసించాడు. అయితే తన యీ శిష్యుడు చాలాకాలంనుంచీ విదేశాలలో ఉన్నవాడు కాబట్టి భారతీయుల పరిస్థితులనూ, వారి తలంపులనూ అవగాహన చేసికొనటానికి కొంతకాలం పట్టుతుందనికూడా అనుకొన్నా డాయన.

1915 వ సంవత్సరం జనవరినెల 15 వ తేదీన గాంధిజీ బొంబాయిలో దిగినవెంటనే బొంబాయిరాష్ట్రపు గవర్నరైన వెల్లింగ్టన్ ప్రభువు ఆయనను కలిసికొనటం జరిగింది. ఈ వెల్లింగ్టన్ప్రభువు తర్వాత కొంతకాలానికి భారతదేశానికి రాజప్రతినిధికూడా అయినాడు. ఈయన ఒకవిధంగా గాంధిజీ వలెనే పరమసాధువని కొందఱి అభిప్రాయం. ఈయన గాంధిజీని ఇలా తొలిసారి కలిసికొన్నప్పుడు ఆయన ప్రభుత్వ కార్యకలా

పాలలో జోక్యం కలిగించుకోదలచుకొన్నప్పుడు ముందుగా తనకు తెలియబరచవలసిందని అడిగాడు. ఆయన ఈ భావాన్ని ఇలా వ్యక్తపఱచాడు. "రండి! నన్ను చూడండి!" ఆయనకు అలా వాగ్దానం చెయ్యటానికి గాంధిజీ యెంతమాత్రమూ అభ్యంతరం చెప్పలేదు.

దక్షిణాఫ్రికాలో ఫోనిక్సు టాల్‌స్టాయ్ ఆశ్రమాలలో నివసిస్తున్నవారందఱూ గాంధిజీ ఆశయాలన్నింటినీ ఆచరణలో పెట్టారు. వారు నిజమైన సత్యాగ్రహులు. భారత దేశంలో అటువంటివారు అవసరమౌతారని గాంధిజీ భావించాడు. అందువల్ల వారిలో చాలామందిని ఆయన వంగదేశంలో రవీంద్రనాథటాగూరు స్థాపించిన "శాంతినికేతన" విద్యాలయానికి అతిథులుగా పంపించాడు. ఈ శాంతినికేతనం ఇప్పటికీన్నీ నడుస్తూనేఉన్నది. గాంధిజీ తన అడుగుజాడలలో నడిచే ఈ సత్యాగ్రహి కుటుంబం అంతా నివసించదగినచోటు ఒకటి చూడవలసి వచ్చింది. ఆయన సొంతరాష్ట్రమైన గుజరాతుకు అహమ్మదాబాదు ముఖ్యపట్టణం. అది వస్త్రపరిశ్రమకు కేంద్రం. ఆ పట్టణ పరిసరాలలోనే ఈ మహాకుటుంబానికి తగినవసతి దొరికింది.

ఆశ్రమస్థలాన్ని కొనటానికీ, అందులో కుటీరాలు నిర్మించటానికీ కావలసిన ధనాన్ని హిందూదేశంలోని గాంధిజీ మిత్రులే ప్రోగుచేశారు. ఘూర్జర సోదరులైన అహమ్మదాబాదు ధనికవర్తకులు ఆశ్రమ నిర్వహణానికి అవసరమైన ధనసాహాయ్యం చేయగలరని మహాత్ముడు విశ్వసించాడు. వారు కూడ కొంతకాలంపాటు ఆ విధంగానే సాయపడ్డారు.

అయితే అహమ్మదాబాదులో గాంధిజీ ఈ ఆశ్రమాన్ని

స్థాపించేముందు రెండు ముఖ్యసంఘటనలు తటస్థించాయి. అందులో మొదటిది శాంతినికేతన సందర్శనం. టాగూరు ఆశ్రమాన్ని సందర్శించాలనీ, అందులో ఉన్న తన ఇరవై అయిదుగురు అనుచరులనూ చూడాలనీ ఆయన శాంతినికేత నానికి వెళ్ళాడు. ఆ ఆశ్రమంలో అప్పుడు సుమారు నూట ఇరవై అయిదుగురు వంగీయ బాలకులూ, ఇరవైమంది ఉపాధ్యాయులూ ఉన్నారు. గాంధిజీ ఆశ్రమంలో, వేర్వేరు కులమతాలకు చెందిన స్త్రీలూ పురుషులూ, బాలబాలికలూ ఉండేవారు. వారిలో ఆయనను భక్తిశ్రద్ధలతో అనుసరించే ఇద్దరు ఆంగ్లేయులున్నూ ఉండేవారు. వారు విన్‌స్టన్లీ పియర్సన్, ఛార్లీ ఆండ్రూస్ అనేవారు. గాంధిజీకీ టాగురుకూ కల వ్యత్యాసాలను అనుసరించే, వీరియిద్దఱి ఆశ్రమాలకున్నూ కొంత భేదం ఉండేది. టాగూరు సుప్రసిద్ధకవి. అంతేకాక భోగవరాయణుడూ, సౌందర్యవంతుడూ, మంచివక్తా, భాగ్యశాలీ కూడానూ. ఇక గాంధిజీ సామాన్యరూపవంతుడూ, బహుకార్యమగ్నుడూ, సత్యవ్రతుడూ, వినయధనుడూ, నిర్ధనుడూనూ. శాంతినికేతనంలో కూలికోసం శ్రమించేవారితో ఆశ్రమ కార్యకలాపాలను జరిపించే పద్ధతి గాంధిజీకి సమ్మతంకాలేదు టాగూరు అనుమతిమీద మహాత్ముడు అక్కడ కావ్యవిద్యార్థులుగానీ, తత్వశాస్త్ర విద్యార్థులుకానీ ఆశ్రమంలో జరుగవలసినపనులన్నింటినీ, చివరకు అస్పృశ్యులు చెయ్యవలసినవికూడా, స్వయంగానే చేసికొనేపద్ధతిని ప్రవేశపెట్టాడు. కాని, గాంధిజీ శాంతినికేతనంనుంచి వెళ్ళిపోయిన తర్వాత, అక్కడ యథా

పూర్వంగా జీతగాంౖడతో పనిపాటలు జరుపుకోవటమే అభ్యాస మైనది.

అంతవఱకూ భారతరాజకీయాల్లో మహాత్మునికి మార్గ దర్శకుడుగా ఉన్న గోఖలే స్వర్గస్థుడు కావటంచేత మహాత్ముడు వంగదేశంనుంచి దూరంగా వెళ్ళవలసివచ్చింది. గోఖలే ఎంతో కాలం జీవించడని గాంధిజీకి అప్పటికే తెలిసిఉన్నా, ఆయన మరణవార్త వినగానే ఎంతో దుఃఖం కలిగింది. భారతదేశంలో తాను ఒంటరివాణ్ణి అయినానని ఆయన భావించాడు. నిజా నికి ఆయనపరిస్థితి అప్పుడు త్రిశంకుస్వర్గంమాదిరిగా ఉన్నది. భారతదేశంలోని రాజకీయవర్గాలన్నింటికీ ఆయనపేరు తెలుసు. దక్షిణాఫ్రికాలో ఆయన చేసిన కృషి సామాన్యప్రజలెందఱో వినే ఉన్నారు. అయితే ముఖస్థంగా ఆయనను ఎఱుగున్న వారు ఎందఱూలేరు. రైలులో మూడవతరగతిపెట్టెలో అందఱి తోబాటు ఆయనా ప్రయాణంచేసినా, క్రొత్తవారెవ్వరూ ఆయన ఫలానా అని గుర్తించేవారుకారు.ఆయనా ఏ బహిరంగ సమావేశంలోగాని, పదిమంది యెదుటగానీ మాట్లాడటమూ తటస్థించలేదు. భారతీయప్రజలు ఆయనను ఆత్మీయుడుగా గుర్తించటానికి ఇంకా ఎన్నో సంవత్సరాలు పట్టింది.

ఈ సంధిగ్ధపరిస్థితికి మూలం తాను ఏమి చెయ్యవల సిందీ ఆయన అప్పటికి నిర్ణయం చేసుకోలేకపోవటమే. ఆశ్రమం నిర్మించి, కుటుంబసంరక్షణ చేసికొంటూ, పాఠశాల నిర్వ హిస్తూ, ఆశ్రమ కార్యకలాపాలు సాగిస్తూ, రాజకీయాలపట్ల మౌనం తాల్చి, పరిసర పరిస్థితులను అవగాహన చేసికొనటం. తోనే ఆయన తృప్తిపడ్డాడు. భారతదేశంలో సత్యాగ్రహం

ప్రారంభించటానికి ఆ నాటికింకా అయిదారేండ్లయినా పట్టుతుందని తాను అనుకొన్నట్లు ఆయనే చెప్పాడు. ఆత్మశక్తిచాలా గొప్పశక్తి అని ఆయన అంతకుముందే లోకానికి తన ఆచరణ ద్వారానే చాటాడు. కాని భారతదేశానికి దానిని ఏ విధంగా వినియోగించాలో ఆయనకు తోచలేదు. రాజకీయోద్యమంలో కూడా అది ఉపయోగపడుతుందని ఆయన అప్పటికి గుర్తించలేదేమో అనిపిస్తుంది. అయితే అది ఒక గొప్పపరిశోధనే అనీ, కాలక్రమాన అది మాతృదేశోద్ధరణకు ఉపకరిస్తుందనీ ఆయనకు రూఢిగా తెలుసు.

ఆయన నెలకొల్పిన ఆశ్రమానికి మొదట "సత్యాగ్రహాశ్రమం" అని పేరుకలిగింది కానీ, దాని ఉనికి సబర్మతి అనేచోట కావటంవల్ల సబర్మతిఆశ్రమం అనేపేరే స్థిరపడ్డది. ఇది 1915 వ సంవత్సరం మేనెల 25 వ తారీఖున ప్రారంభమైంది. ఈ సబర్మతిఆశ్రమం అహమ్మదాబాదుతో గాఢ సంబంధం కలగదగినంత చేరువలోనే ఉన్నా, నిత్యజీవితంలో స్వాతంత్రంగా ఉండగలిగినంత ఎడంగానే ఉన్నది. ప్రారంభంలో ఇక్కడ ఇరవైఅయిదుగురు సత్యాగ్రహులు ఉండేవారు. వీరంతా బ్రహ్మచర్యం పాటించి, దారిద్ర్యాన్ని వరించి, ఏ రూపాన అవసరమైన సంఘుసేవనైనా చేయటానికి సిద్ధపడిన వారు. అస్పృశ్యులు చెయ్యవలసినపనులు కూడా చేయటానికిన్నీ సంసిద్ధులైనవారు. (పాకీపని తప్పనిసరిగా చేయవలసిందని గాంధిజీ ఆదేశం.) ఆశ్రమం నెలకొల్పిన అచిరకాలంలోనే ఆయన ఒక అస్పృశ్యకుటుంబాన్ని కూడా ఇందులో చేర్చుకొన్నాడు.

గాంధిజీ ఆశ్రమంలో వంటకానీ, నీళ్ళుతేవటం కానీ

ఇంకేవిధమైన పని అయినా సరే, సహకారపూర్వకంగానే జరిగేది. అస్పృశ్యజాతికి చెందిన కుటుంబాన్ని (భార్యా, భర్తా, కుమారుడూ ఆ కుటుంబంలోని వ్యక్తులు.) ఆశ్రమంలో చేర్చుకోవటం నాడు హిందూదేశంలో ఒక పెద్ద విప్లవంవంటిది. నాడే కాక, ఈ నాటికిన్నీ భారతదేశాన అస్పృశ్యులను ఎందువల్లనైనా తాకటం తటస్థిస్తే, ఆ దోషం తొలగించుకోటానికి కొంత ప్రాయశ్చిత్తం జరుపుకోటం ఆచారంగా ఉన్నది. అస్పృశ్యుల నీడసోకినా స్నానం చెయ్యవలసిందే. అస్పృశ్యులు తాకిన ఏ వస్తువైనా సవర్ణులు ఉపయోగించవలసివస్తే, దానిని శుద్ధిచెయ్యటం అవసరం. ఏ యింటిలోనైనా అస్పృశ్యులు నౌకర్లుగా పనిచేసినా, వారు కొన్ని నిర్దిష్టకార్యాలే తప్ప, తక్కినపనులు చేయటానికి వీలులేదు. వారు చేసేపనులు అగ్రజాతుల నౌకర్లెవ్వరూ చేయరు.

గాంధిజీ ఆశ్రమంలో నౌకర్లనేవారే లేరు. ఆశ్రమవాసులందరూ సమానులే. సమానమైన వేతనానికే అందరూ పనిచేసేవారు. 'ఇదే చేస్తాను; ఇది చెయ్యను' అనటానికి వీలులేదు. కొందరు కొన్ని విషయాలలో తక్కినవారికంటె మెలుకైనా, వేతనంలో తేడాలేదు. ముద్రాక్షరాల కూర్పులో గాంధిజీ అంతగా సమర్థత లేనివాడే అయినా, పనిఒత్తిడిగా ఉన్నప్పుడు తానుకూడా అందులో పాల్గొనేవాడు. ఆయన అచిరకాలంలో నూలువడకటంలో, బట్టలునేయటంలో సామర్థ్యం సంపాదించినా, తన అన్నగారి కుమారులలో రెండవవాడైన మగన్‌లాల్ ఆ రెండుపనులలోకూడా తనకంటె నేర్పరి అని ఎప్పుడూ అంగీకరిస్తూనే వచ్చాడు. (మగన్‌లాల్ ముద్రా

ఘరాల కూర్పులో కూడా ఎక్కువ నేర్పరి అని ఇదివరకే స్పష్టమైంది.)

ఆయన పెద్దబలశాలి కాకపోయినా, తోడివారికి ఆశ్చర్యం కలిగేటట్లుగా శరీరశ్రమైకసాధ్యమైన పనులు అన్నీ, చివరకు మలుగుదొడ్లలో కందకాలు త్రవ్వటం, ఆ త్రవ్విన మట్టిని దూరంగా తీసుకొనివెళ్ళటం మొదలైనవికూడా చేసేవాడు. ఈ పనులు భారతీయులదృష్టిలో చాలా నీచమైనవి. అవి అస్పృశ్యులు మాత్రమే చేయవలసినవని వారి భావం. ఆయన ఇటువంటి పనులు చెయ్యటం మొదలుపెట్టిన నాటినుంచీకూడా, ఆయన అలా చెయ్యటంలో తప్పేమీలేదనే అందరికీ తోచింది. దానికి కారణం ఏమిటంటే, వేలకొలది సంవత్సరాలనుంచిన్నీ మహాత్ములనదగినవారందరూ అతి వినేయతతో అన్నిపనులూ చేయటం భారతదేశంలో అనుభవగోచరం అవుతూ ఉండటమే. ఈ ప్రాచీన భారతసంప్రదాయాన్ని బట్టి చూస్తే, సాధువులైన మహాత్ములు జాతి కట్టుబాట్లకు పూర్తిగా అతీతులుగా ఉండేవారనీ, వారికి ఆ విధినిషేధాల పాటింపే ఉండేదికాదనీ ఊహించవచ్చును.

అయితే అస్పృశ్యులుగా పరిగణించబడేవారిని ఆశ్రమంలో ప్రవేశపెట్టటం మాత్రం లోకులకు సహించదగిన పని కాలేదు. ఆయన అస్పృశ్యులను ఆశ్రమంలో చేర్చుకొన్న క్షణంనుంచీ ఎన్నో ఇబ్బందులను ఎదుర్కోవలసివచ్చింది. సవర్ణహిందువులుకూడా ఆశ్రమంలో అస్పృశ్యులు వండిన పదార్థాలు తింటున్నారనీ, వారు తెచ్చిన నీళ్లు త్రాగుతున్నారనీ లోకం అనుకోవటం మొదలుపెట్టింది. గాంధిజీ అస్పృ

శ్యులు చేసేపనులుకూడా చేస్తున్నాడంటే, అది సవర్ణ హిందు వుల కంతగా బాధ కలిగించలేదు. ఆయన మహాత్ముడు కాబట్టి అందువల్ల ఆయన పతితుడు కాడని వారు సరిపెట్టుకొన్నారు. కాని అస్పృశ్యులతోపాటు ఆశ్రమవాసులైన సవర్ణ హిందువు లందఱూ సమానులుగా వ్యవహరించటం మాత్రం నాటి దేశీయు లెవ్వరికీ గిట్టలేదు. వారు ఈ విషయానికి చాలా బాధపడ్డారు.

తత్ఫలితంగా ఆశ్రమానికి వచ్చే ఆదాయం చాలా తగ్గి పోయింది. అందువల్ల ఆశ్రమ నిర్వహణానికి సరిపడినంత ధనం లేకపోయింది. నిజానికి అక్కడ ఎంతో పొదుపుగానే ఖర్చు జరిగేది. అదీగాక దానిని స్వయంపోషకంగా చేయటానికిన్నీ కృషి జరుగుతూఉండేది. అయితే ఆ ఆశ్రమానికి ధనసాహాయ్యం చేసే భాగ్యవంతులందఱూ సవర్ణ హిందువులు. వారు అస్పృ శ్యుల సంబంధాన్ని హర్షించలేదు. దానితో వారి కందఱికీ ఆశ్రమంపట్ల వ్యతిరేకభావం ఏర్పడింది. ఇదే దేశమంతా ప్రాకింది. సవర్ణ హిందువులందఱూ గాంధిజీపట్ల విముఖు లయినారు.

ఇటువంటి అత్యవసర పరిస్థితుల్లో ఏమి చెయ్యాలి అనేది గాంధిజీ ప్రశాంతంగా ఆలోచించి ఒకనిర్ణయానికి వచ్చాడు. తాను, తన కుటుంబంలోనివారు, అనుచరులు మొత్తం అందఱూ గ్రామానికి దూరంగా ఉన్న మాలపల్లి చేరుకొని, అక్కడనే స్థిరపడి, అస్పృశ్యుల వృత్తుల్నే అవలం బించి, తాముకూడా అస్పృశ్యులలోనివారుగానే ఉండాలని నిర్ణయించాడు. నిజంగా అలా జరిగిఉంటే భారతదేశం ఎంత దద్దరిల్లేదో ఊహించటానికి వీలులేదు. అయితే గాంధిజీప్రభావం

వెంటనే బయలువడింది. ఆయనకు ఎన్నడూ ముక్కూమొగం కూడా తెలియని ఒక మహమ్మదీయుడు ఆయనను సందర్శించి, ఒకసంవత్సరంపాటు ఆశ్రమపోషణకు సరిపడే ద్రవ్యాన్ని బహూకరించాడు. ఆ సంవత్సరం గడిచేటప్పటికి గాంధిజీపట్ల సవర్ణ హిందువులకు కల వ్యతిరేకభావం కొంత చల్లారింది. ఆయనకు అంతకుపూర్వం నిత్యమూ తోడ్పడుతూఉండే సవర్ణహిందువులు మళ్ళీ ఆశ్రమానికి విరాళాలు ఇవ్వడం ప్రారంభించారు. అయితే అస్పృశ్యుల విషయంలో మాత్రం వారికి సుముఖభావం ఎంతమాత్రమూ కలుగలేదు. కేవలం గాంధిజీపట్ల గౌరవంచేత మాత్రమే వారు ఆ విధంగా సాయపడ్డారు.

1915 వ సంవత్సరంలో గాంధిజీ ఆశ్రమానికి వచ్చిన హరిజన కుటుంబం దూదాభాయ్, (ఇతను బొంబాయిలోని అస్పృశ్యుల పాఠశాలలో ఉపాధ్యాయుడుగా పనిచేసేవాడు) అతనిభార్య దానిబెన్, వారికూతురు లక్ష్మి మాత్రమే. అటు తర్వాత ఈ "లక్ష్మి" అనే బాలికనే గాంధిజీ పెంచుకొన్నాడు.

చూడటానికి అతిసామాన్యంగా కనబడుతున్న ఈ చర్య ఆ కాలంలో అసామాన్యమే. యావద్భారతం ఈ కథ చెప్పుకొని ఉడికిపోయింది. అయితే తరతరాలనుంచీ పేరుమోసిన భారతీయ మహాపురుషులందఱూ ఈ అస్పృశ్యతను ఖండించి, అదివర్ణాశ్రమధర్మానికి వికృతరూపమనీ, అపార్థమనీ, చాటారు. పందొమ్మిదవశతాబ్దంలో రామకృష్ణునివంటి ఆధ్యాత్మిక వ్యక్తులున్నూ అస్పృశ్యతను ఖండించారు. ఇలా ఖండించినవారిలో చాలామంది బ్రాహ్మణులే. తక్కినవారైనా అందఱూ సవర్ణహిందువులే. అస్పృశ్యుణ్ణి ఇంటిలోపలికి ఆహ్వానించి సహ

పంక్తినిభోజనంచేద్దామనిఅనుకొన్నవాడుమాత్రంఒక్కడూలేడు. అంతేకాక గాంధిజీనాటికి ఏ హిందువైనా ఇతరకులానికి చెందిన హిందువుతో కలిసి భోజనం చెయ్యటానికి అంగీకరించేవాడే కాడు; ఆ అతిథి అగ్రకులస్థుడైనా సరే, అధమకులస్థుడైనాసరే! ఇద్దఱికీ సహపంక్తిభోజనం లేనేలేదు. అన్యకులస్థునితో సహపంక్తిభోజనం చెయ్యటం అనేది విన్నవాడేలేడు. సిద్ధాంతం వేఱూ ఆచరణ వేఱూ కదా! హైందవోత్తములెందఱో కుల విభేదాల పట్టింపులవల్ల కలిగే అనర్థాలను పేర్కొని, ఈ భేదాలు తగవని ఖండించారు. గాంధిజీకూడా వారివలెనే ప్రబోధించాడు. అయితే ఆయన తాను ఏమి ప్రచారం చేశాడో దానిని ఆచరణలో పెట్టాడు. కులభేదాలను మాన్పటానికి అవసరమైన విధంగా పురోగమించాడు. ఇప్పటినుంచిన్నీ ఆయన నోటివెంట ఏ మాటవచ్చినా హృదయపూర్వకంగా విశ్వసించిన విషయాన్నే ప్రబోధిస్తాడని భారతీయులు గ్రహించ గలిగారు.

## 4

1916 వ సంవత్సరం ఫిబ్రవరినెల 4 వ తేదీన కాశీలో హిందూ విశ్వవిద్యాలయ ప్రారంభోత్సవంతో గాంధిజీ మౌన దీక్షావత్సరం పరిపూర్తి అయింది. ఆ సందర్భంలో ఆయన కూడా ప్రసంగించాడు. అనిబిసెంటు అప్పటికి ఇరవైసంవత్సరాల క్రిందట స్వల్పంగా ప్రారంభించిన ఈ సంస్థ 1916 వ సంవత్సరంనాటికి పెద్దపెద్దకట్టడాలతో తేజరిల్లుతూ అభివృద్ధిలోకి వచ్చింది. ఆ విశ్వవిద్యాలయానికి ఎందఱో మహారాజులూ,

ధనికులూ గొప్పవిరాళాలు ఇచ్చారు. గాంధిజీ ప్రసంగించిన సభకు అనిబిసెంటు అధ్యక్షత వహించింది. ఆ ప్రసంగంలో ఆయన వ్యక్తి స్వాతంత్ర్యం విశదంచేసి, విశ్వాసంమీాద తనకు గల అనుభవాన్నీ, దానిని సాధించదగిన పద్ధతినీ తేటతెల్లం చేశాడు. విద్యార్థులూ, అధ్యాపకులూ, మహారాజులూ, ఇంకా అక్కడికి ఆహూతులైన పలువురు ఆంగ్లేయోద్యోగులూ ఆయన ప్రసంగంలో ఒక అపూర్వత ఉన్నదనే విషయం గమనించలేదు. దానికి కారణం ఆయనపట్ల వారికి అంతగా గౌరవం లేకపోవటమే. ఆయన ఉపన్యాసం ముగించటానికే వీలుకలుగ లేదు. "కూర్చో గాంధీ!" అనే కేకలు చెలరేగుతూ వచ్చాయి. అప్పుడు అధ్యక్షస్థానంలో ఉన్న అనిబిసెంటు గాంధిజీని ఉపన్యాసం ఆపవలసిందని ఆజ్ఞాపించింది. ఆయన ఇక తప్పనిసరిగా ఆమె శాసనాన్ని శిరసావహించాడు.

హైందవులెందఱో ఆకటితో అలమటిస్తూ, అనారోగ్యానికి గుఱిఅయిఉండి, అస్పృశ్యత విశృంఖలంగా విహరిస్తూ ఉండగా, భారతీయ మహారాజకుమారులు ఇంత ఆడంబరంగా, విశేషధనం వెచ్చించి, విశ్వవిద్యాలయ ప్రారంభోత్సవాలు చెయ్యటం తగదని ఆయన ఖండితంగా చెప్పటంవల్లనే అంత విమర్శకుపాలయాడు. సాధుత్వం, ఔచిత్యం, శాంతీ మూర్తీభవించిన మహాత్ముడు చక్కగా ఆలోచించి మాట్లాడేవాడే. ఆయన ఎప్పుడూ ప్రతివిషయమూ విమర్శించే స్వభావంకల వాడు కూడా. అయినా, ఈ సందర్భంలో పరిస్థితులను సరిగా గమనించినట్లు కనబడదు. హిందూజాతీయ విశ్వవిద్యాలయ ప్రారంభోత్సవసందర్భంలో ఇంగ్లీషువంటి విదేశభాషలోమాట్లా

డటానికి లజ్జిస్తున్నానంటూ ఆయన ఉపన్యాసం ప్రారంభిం చాడు. తర్వాత స్వరాజ్యాన్ని గూర్చి, మాటలకంటెనూ చేతలకుగల ప్రాధాన్యాన్ని గూర్చి ప్రసంగించాడు. ఈస్వరాజ్యం అనేది న్యాయవాదులూ, పత్రికారచయితలూ, భూస్వాములూ మొదలయినవారికృషివల్ల వచ్చేది కాదనీ, సామాన్యప్రజల వల్లనే రావలసి ఉన్నదనీ ఉద్ఘాటించాడు. భారతీయ రాజ కుమారులు ధరించిన అమూల్యాంకారాలను పేర్కొని ఆ అలంకారాలకోసం ధనం వెచ్చించటాన్ని నిశితంగా విమర్శిం చాడు. ఉత్సవంపేర జరిగే దుబారా ఖర్చుల్ని ఖండించాడు. భారతీయులలో ఆరోగ్యరక్షణపద్ధతులు లోపించి ఉండటమూ, పొగబండ్లలో మూడవతరగతిపెట్టెలలో ఉండే అసహ్యాపరి స్థితులూ, అగ్రజాతిహిందువులకు శ్రుతి కటువుగాతోచే ఇతర విషయాలనేకమూ కూడా విమర్శించాడు. అటువంటి సమా వేశాలలో ఆత్మీయలోపాలు విమర్శకు పాలుగావటం సహా జంగా ఎవ్వరూ సహించరు కనుక, చాలామంది ముఖ్యులు సభవిడిచి వెళ్ళిపోయారు. అధ్యక్షస్థానం అలంకరించిన ఆని బిసెంటుసతి సభను అదుపులో పెట్టలేకపోయింది. అందువల్ల ఆమె చిట్టచివరకు నాటికి సభ ముగించవలసివచ్చింది. గాంధిజీ నిర్విచారంగా సహజధోరణిలో తన పరాజయాన్ని అంగీక రించాడు.

హైందవుల లోపాలను విమర్శించటం గాంధిజీకి సహజ మైన అలవాటు. దక్షిణాఫ్రికాలో ఆయన ఇదే పద్ధతిని అను సరించాడు. హైందవులు తమ్ము తాము బాగుపరచుకోవా లంటే ఏమిచేయాలో వివరించాడు. కేవలం తమ గౌరవానికే

ప్రాధాన్యం ఇచ్చుకొనేవారిని ఎవ్వరూ గౌరవించరని హెచ్చరించాడు. ఆరోగ్యరక్షణం, విద్య, సత్ప్రవర్తన, ప్రపంచ జ్ఞానం అనే వాటి ఆవశ్యకతనుగురించి నొక్కి చెప్పటం ఆయనకు క్రొత్తకాదు. దక్షిణాఫ్రికాలో ఆయన ఉన్న ఇరవైసంవత్సరాలూ ఈలాటి ప్రబోధమేచేశాడు. దానివల్ల చాలా మంచి ఫలితాలే కలిగాయి. అయితే ఈ పద్ధతి ఆ కాలానికి హిందూదేశానికి అపరిచితంగానే ఉన్నది. హైందవసంస్కృతి గొప్పతనమూ, సంప్రదాయాల ప్రాచీనతా, ఆదర్శమహత్త్వమూ సన్నుతించే ప్రసంగాలే హైందవులకు రుచించేవి. వారి అభిరుచి యీనాటికిన్నీ అదేవిధంగా ఉన్నది. అప్పటికి 70 ఏండ్ల వయస్సులో ఉన్న అనిబిసెంటుసతి హిందూదేశం నాలుగు చెఱగులకూ పర్యటిస్తూ హైందవమతౌత్కృష్ట్యాన్ని విశదీకరించేది. విద్యాధికులై ఆంగ్ల భాషతో బాగా పరిచయంకల యువకులు చాలామంది అంతవఱకూ తమ మతమూ సంస్కృతీ ఎంత గొప్పవో తెలిసి చూచినవారు కారు, అట్టివారికి ఆంగ్ల దేశంలో పుట్టిపెరిగిన అనిబిసెంటుసతి వచ్చి హైందవుల గొప్పతనాన్ని కీర్తించటం చాలా ఆశ్చర్యాన్నీ ఔత్సుక్యాన్నీ కలిగించింది. అయితే హిందూదేశాన్ని అంతగా ప్రేమించినఆమె కూడా గాంధిజీ విమర్శనాత్మక ధోరణిని అప్పటికి ఆమోదించలేకపోయింది. ఆయన చెప్పేదిన్నీ హైందవుల బాగును వాంఛించేది అయినా ఆ ధోరణి ఆమెకు నచ్చలేదు.

కాశీ హిందూవిశ్వవిద్యాలయ ప్రారంభోత్సవ సమయాన గాంధిజీచేసిన ప్రసంగంతో సామాన్యప్రజలకు ఆయననుగూర్చి తెలిసికొనటానికి అవకాశంకలిగింది. ఈవిధంగా ప్రజానీకంతో

ఆయనకు పరిచయం ప్రారంభమైంది. ఆకాశవాణి యింకా బయలుదేఱని ఆరోజులలో కాశీలోని ఆయన ఉపన్యాసం ఒకరి వల్ల ఒకరు విని అందులోని ఏఅంశమూ విడువకుండా తోడి వారికి చెప్పుతూరావటంతో అచిరకాలంలోనే యావద్భారతానికీ శ్రుతిగోచరమైంది. పేదవలె జీవనం గడుపుతూఉన్న మహాశయుడొకడు పేదలపక్షాన ధనికులకు వ్యతిరిక్తంగా వాదిస్తున్నట్లు కనిపించింది. అయితే అంతవఱకున్నూ బ్రిటిషువారికి విరుద్ధంగా ఆయన మాట్లాడనేలేదు. కేవలం భారతీయుల్లో ఒకడై భారతదేశాన్ని గుఱించే మాట్లాడాడు. ఆయనమాటలు ఆసేతుహిమాచలమూ ప్రతిధ్వనించాయి.

ఆనాడు గాంధిజీకి అత్యావశ్యకంగా కనిపించినవి ముఖ్యంగా మూడువిషయాలు. ఎవరో ఒకరు వచ్చి ఉపన్యాసాలకు పిలిచేవారు. కొన్నికొన్ని క్లిష్టసమస్యలకు హేతువులు వివరించవలసివచ్చేది. ఆర్తులకు సాయంచెయ్యవలసి వచ్చేది. ఆశ్రమంలో ఆయన కర్తవ్యం ప్రత్యేకంగా ఉండనే ఉన్నది. ఏదోఒకటి ఎప్పుడూ వ్రాస్తూఉండటం తప్పనిసరి. ఇప్పుడే రాట్నంకోసం అన్వేషించటమున్నూ జరుగుతూ వచ్చింది. అయితే ఈ ఆవశ్యకతలన్నింటినీ ఆయన నెఱవేర్చగలిగాడు. అవకాశాలు త్రోసికొనివచ్చి నూతనశక్తిని ఉదయింపజేయటం గాంధిజీ చరిత్రలో కనిపిస్తూఉంటుంది. అలాగే యిప్పుడున్నూ యథార్థమైన గాంధీతత్త్వం ప్రకాశితమయే పరిస్థితులు కలిగాయి. 1916 వ సంవత్సరం డిసెంబరునెలలో లక్నోలో జరిగిన భారతజాతీయ మహాసభ (కాంగ్రెస్) సమావేశంలో శుక్లా అనే వ్యక్తి యిందుకు కారణమైనాడు. ఈయన చాలా

పట్టుదలగల వ్యక్తి. ఈ సమావేశంలోనే తొలిసారిగా నెహ్రూ గాంధిజీల సమావేశం సంభవమైంది. అయితే యిందువల్ల ఆ ఉభయులూ అన్యోన్యాకర్షణ పొందలేదు. తాను ఏది చెప్పినా అందుకు వ్యతిరేకమైన సమాధానం వినవొల్లని వ్యక్తి శుక్లా. ఆయన గాంధిజీని తనతో తన చాంపరాన్ జిల్లాకు రావలసిందనీ, నీలిమందు పొలాలలో పాలిసేద్యం చేసేవారి యిక్కట్లు ఎలా ఉన్నాయో గమనించవలసిందనీ అభ్యర్థించాడు. గాంధిజీకి నిజంగా వ్యవధిలేదు. అయితే శుక్లా కోరాడు. అంతేగాక గాంధిజీ తన ప్రార్థన అంగీకరించేవరకూ కాచుకొనేఉన్నాడు. ఆయన ఎక్కడికి వెళ్ళినా తోడునీడలాగా వెంటాడి, ఆశ్రమానికికూడా వెళ్ళి కొన్ని వారాలపాటు అక్కడ ఉన్నాడు.

చిట్టచివరకు గాంధిజీ చాంపరాన్ జిల్లాకు వెళ్లాడు. ఇలా వెళ్ళటానికి ఆయనకు అత్యంత సమ్మతమైన విషయంకూడా ఒకటి కారణమైంది. దక్షిణాఫ్రికాకు కూలిపనుల నిమిత్తం భారతీయులు వలసవెళ్ళటం నిషేధింపజెయ్యాలని ఆయనకు బుద్ధి పుట్టింది. ఇందుకు ప్రజల సహకారమూ, ప్రభుత్వంయొక్క ఆమోదమూ సంపాదించవలసిఉన్నది. 1917 వ సంవత్సరం మేనెల 31 వ తేదీలోపున ఇటువంటి నిర్ణయం జరగాలని ఆయన నిశ్చయించాడు. అయితే ఇది "సందర్భానుసారంగా" లేక "కాలక్రమాన" జరుగవలసిందనికూడా ఆయన ఉద్దేశించాడు. ఆయన పెట్టుకొన్న గడువులోపలనే ప్రభుత్వం కూలీల వలస విధానం రద్దుచేసింది.

చాంపరాన్ జిల్లాలో గాంధిజీ ఒక అనన్యవిధానం ఆచరణలో పెట్టి చూచాడు. అటుతర్వాత ఇది కార్యసాధనకు

తఱచూ ముఖ్యోపకరణం అవుతూవచ్చింది. బీహార్ రాజధాని పాట్నాలో ఈ నవీనోద్యమాన్ని ఆయన ప్రారంభించాడు. ఈ నగరంలో నడిమితరగతి కుటుంబాలవారూ, న్యాయవాదులూ, కాంగ్రెస్‌వాదులూ విశేషంగా ఉన్నారు. ఈ న్యాయవాదులు తఱచూ హాలికుల అభియోగాలలో పనిచేస్తూ ఉండటంవల్ల వారిపట్ల కొంత సానుభూతి సహజంగానే ఏర్పడి ఉన్నది.

మహాత్ముడు వీరిని తనతోబాటు చాంపరాన్ జిల్లా ఉత్తరభాగంలో ఈ హాలికుల అభ్యున్నతికోసం పాటుపడటానికి రావలసిందనీ కోరాడు. అయితే దీనివల్ల ఆర్థికంగా పొందే ప్రతిఫలం ఏమీ ఉండదనీ, రోజూ కొంతసేపో, లేక సంపూర్తిగానో వారివారి ఆనుకూల్యాల ననుసరించి యీ పరోపకార మహోద్యమాన్ని నిర్వహించవలసిందని అడిగాడు. ఇలా శ్రమించటానికి అంగీకరించే స్వచ్ఛందసేవకులవల్ల ఎంతైనా ఫలం ఉండగలదని ఆయన భావించాడు. ఈ స్వచ్ఛందసేవకులు అవసరమైతే చెఱసాలకు పోవటానికైనా సంసిద్ధులై ఉండాలి. కార్యరంగంలో దూకటానికి ముందే సాధకబాధకాలన్నీ ఆలోచించుకొని వారు ముందంజ వేయాలి. ఇది అప్పటికి దేశానికి నూతనంగా కనిపించింది. అయినా కొద్దికాలంలోనే గాంధిజీకి కావలసినంతమంది అనుచరులు లభించారు.

దీనితరువాత చేయవలసినపని ప్రతిపక్షంవారికి (ఇక్కడ ప్రతిపక్షం అంటే భూస్వాములూ జిల్లా ప్రభుత్వపు కమీషనరూ) తాము కూలీల బాధలేమిటో తెలిసికొనటానికి ప్రయత్నిస్తున్నామని తెలియబఱచటం. అలా తెలియబఱచినమీదట తనకు వచ్చిన సమాధానాన్నిబట్టి వారు తనపట్ల సుముఖులుగా

లేరనీ, తనకు కారాగారవాసంకూడాసంభవించవచ్చుననీ గాంధిజీ అనుకొన్నాడు. తన్ను కలిసికొంటున్న నీలిమందు కూలీల అగచాట్లు విని, లిఖితపూర్వకమైన వారి విన్నపాలు స్వీకరిస్తూ ఉద్దిష్టకార్యక్రమం సాగించాడు.

పరిస్థితి చాలా విచిత్రంగా మారిపోయింది. చాంపరాన్ జిల్లాలో ఉండటానికి గాంధిజీకి హక్కే లేదని నీలిమందు భూస్వాములవాదం. "ఆయన ప్రభుత్వోద్యోగీ కాడు. ఆ స్తిపాస్తులున్నవాడూ కాడు. ఆ జిల్లాలో ఆయనకు స్థానమే లేదు." అని వారిభావం. అయితే గాంధిజీని కలిసికొని మాట్లాడినంత మాత్రంలో కూలీలను శిక్షించట మెల్లాగు? వారుచేసిన తప్పేమిటి? ఆ పరిస్థితిలో ఏమి చేయవలసిందీ తోచక స్థానిక న్యాయాధికారి చాంపరాన్ జిల్లావదలి వెళ్ళవలసిందని గాంధిజీని ఆజ్ఞాపించాడు. మహాత్ముడు సవినయంగా అందుకు నిరాకరించాడు. దానిమీదట న్యాయాధికారి ఆయనను తనసమక్షానికి పిలిపించాడు. గాంధిజీ దృక్పథం ఆయనకు ఆశ్చర్యం కలిగించింది. మహాత్ముడు తాను నేరంచేశానని అంగీకరించి ఆ నేరానికి తగు శిక్ష విధించవలసిందని కోరాడు. ఎప్పుడైనా ఆయనపద్ధతి ఇంతే అయింది. న్యాయాధికారి తీర్పు వాయిదా వేశాడు. ఈ లోపల భారతప్రభుత్వం సందర్భమంతా ఆకళింపుచేసికొని యేమి చేయాలో తోచక అసలా అభియోగాన్నే రద్దుచేసికోవాలని నిర్ణయించింది.

తర్వాత గాంధిజీ యథాపూర్వంగా కూలీల విజ్ఞప్తులు స్వీకరిస్తూ పురోగమించాడు. వాటిలో వేలకొలదీ అనవసరమైనవే. అయినా ఆ బీదకూలీలు నిత్యోపద్రవాపాలకూ అనుదిన

హింసలకూ గురిఅవుతున్నారని ఆయన గ్రహించాడు. వారికి "భయవిముక్తి" కలిగించటం అవసరమని ఉద్ఘాటించాడు. వారికి ఒక యథార్థమిత్రుడు అవసరమని భావించి, వారి కష్టనిష్ఠురాలన్నీ చెప్పుకోవలసిందని ప్రోత్సహించి ఎంతో ఓపికతో ప్రతివ్యక్తిగాథనూ విన్నాడు. పాట్నానుంచి నిత్యమూ అయిదు గురినుంచి ఏడుగురివరకూ స్వచ్ఛందసేవకులు బయలుదేరి కాలనియమం లేకుండా కూలీల విజ్ఞప్తులు స్వీకరించటం జరుగుతూ వచ్చింది.

ఈకాలంలో గాంధిజీ యథాప్రకారంగా ఆహారవిధానం పట్లనూ ఆరోగ్యసదుపాయాలపట్లనూ కూడా శ్రద్ధతీసికొన్నాడు. పాట్నానుంచి ఆయననుఅనుసరించివచ్చిన స్వచ్ఛంద సేవకులలో సంపన్నులుకూడా ఉన్నారు. వారిలో కొందరు న్యాయవాదులు. వారికి వంటమనుష్యులూ, ఇతరసేవకులూ ఉన్నారు. అందుచేత వారి భోజనవిధానాలు ప్రత్యేకంగా ఉండేవి. వారికి గాంధిజీపద్ధతులు ఎన్నడూ అనుభవగోచరమైనవి కావు. అందరూ ఒకభోజనశాలలోనే కేవలం శాకాహారమే తీసికొనేటట్లు చేయటానికి గాంధిజీకి కొంతకాలం పట్టింది.

ఇంతేకాక, నీలిమందు కూలీల నివాసాలు అనారోగ్య నిలయాలై ఏ అంటురోగమైనా అతిసులభంగా వ్యాపించటానికి అనువుగా ఉన్నాయి. మరుగుదొడ్లు బాగుచేయటమూ, కడగటమూ, ఊడ్వటమూ మొదలయినపనులు గాంధిజీ ప్రారంభించాడు. ఈ కార్యక్రమం ముందుగా ఒక ఆరుగ్రామాలలో సక్రమంగా సాగించాలనీ అటుతర్వాత జిల్లా అంత ఈ పద్ధతిలో బాగుచేయాలనీ ఆయన ఉద్దేశించాడు. ఈ పని చేయటంకోసం

దేశంలోని ఇతరస్థలాలనుంచి స్వచ్ఛందసేవకులను ఆహ్వానించాడు. సాధారణంగా ఈ పని అస్పృశ్యులు చేస్తూఉండవలసింది. ఈ ఆఋచోట్లలోనూ గ్రామపాఠశాలలుకూడా ఆయన స్థాపించాడు. అటుతర్వాత తక్కిన గ్రామాలలోకూడా ఈ విధంగా పాఠశాలలు ఏర్పాటు చేయాలనుకొన్నాడు. ఈ పాఠశాలలు ఎక్కువకాలం సాగకపోయినా ఇందువల్ల కొంతమేలు జరుగగలదని ఆయన ఉద్దేశం.

గాంధిజీ యిలా నిర్విరామంగా కృషిచేస్తూఉండగా అపరాధ పరిశోధకశాఖవారు ఆయనను వెన్నంటే ఉండి, ఆయన చర్యలను ఎప్పటికప్పుడు గుర్తిస్తూఉన్నారు. పీరు ఆయన ఎప్పుడు ఎక్కడకు వెళ్ళినా వెంటనే ఉండి, ముప్పైసంవత్సరాలపాటు ఆయన చేసినపనులన్నింటినీ గమనిస్తూవచ్చారు. ఆయన వారితో ఎటువంటి సంకోచమూలేకుండా మర్యాదాపూర్వకంగా వ్యవహరిస్తూ వచ్చాడు. చిట్టచివరకు కొందఱు ఆయనకు భక్తివిశ్వాసాలు గల మిత్రులుగా మారిపోయారు.

గాంధిజీ చాంపరాను యాత్ర అఖిలభారతదృష్టిని ఆకర్షించింది. దీనితో ప్రభుత్వం కలవరపాటు పొందింది. ఆయన ఆ జిల్లా ఎన్నడు వదలిపెట్టుతాడని ప్రశ్న బయలుదేరింది. నీలిమందు పొలాలలో పనిచేసేకూలీల అగచాట్లు యథాతథంగా గుర్తించటమూ, వారికి తగుసాయం అవసరమని అంగీకరించి అందుకు తగ్గ చర్యలు తీసుకోవటం జరిగిననాడు తాను తన పర్యటన విరమించగలనని ఆయనసమాధానం చెప్పాడు. అప్పుడు ప్రభుత్వం, గాంధిజీకూడా సభ్యుడుగా ఒక పరిశీలకసంఘాన్ని నియమించింది. ఆ సంఘం నివేదికమూలాన భూమిలో 3/20 వ వంతు

భూస్వామి లాభంకోసం నీలిమందు ఉత్పత్తికి కేటాయించాలనే శాసనం రద్దయింది.

చాంపరాన్‌లో కలిగిన అనుభవంవల్ల అక్కడి సత్యాగ్రహోద్యమంలో చాలావఱకు గాంధిజీ పరిశ్రమే ప్రధానమైనా హిందూదేశంలో సత్యాగ్రహోద్యమానికి అది ప్రథమవిజయం అని చెప్పవచ్చును. మానవాభ్యున్నతికే ప్రాధాన్యం ఇచ్చే ఆశయం అప్పటికే ఆయనలో పరిపూర్ణమైంది. సత్యం, ఆత్మనిగ్రహం, అహింస అనే వాటిచేతనే ఆయన ఆ ఆశయాన్ని ఫలింపజేశాడు. అయితే ఆనాడు ఆయనను అనుసరించినవారికి ఆ మూడు ఆయుధాలూ అప్పుడు ఉపయోగంలో పెట్టుకొన్నవే అయినా చక్కగా తెలిసిరాలేదు. ఆయన ప్రతిదినమూ కొన్నిగంటలపాటు వాటి స్వరూపస్వభావాలూ, వాటి అవసరమూ తోడివారికి వివరిస్తూ ఉండవలసివచ్చింది. కొందఱు స్వచ్ఛందసేవకులు పేదరైతులు ధనం ఇస్తే స్వీకరించాలని కోరారు. అయితే గాంధిజీ అందుకు అంగీకరించలేదు. ధనం ఏమాత్రం అవసరం వచ్చినా పాట్నాలోని భాగ్యవంతులవద్దనుంచి బహుమతిరూపాన రావలసిందే. సత్యపాలన విషయమైన తీవ్రనియమం మఱొక యిబ్బంది అయింది. ఎందుచేతనంటే యితరదేశాలలోవలెనే భారతదేశంలో కొంత విని ఉంటే కొంత ఊహించుకొనటం సర్వసాధారణమైన విషయం. అందువల్ల ఏదైనా నిజంగా జరిగిన విషయమే అయినా తిరిగి చెప్పటంలో కొంతఆకర్షణను కోల్పోతుంది. గాంధిజీ సత్యపాలనలో గల కఠోరనియమం ఇతరులకు ఆచరణసాధ్యంకాని అద్భుతంగా కనిపిస్తుంది. . కొన్నిసంవత్సరాలు గడచేసరికి ప్రజలకు

అది ఒక వింతకథ అనిపిస్తుంది. ఈ బహుసంవత్సరాలలోనూ ఆయన కార్యసాధనాని కంతటికీ మొదటినుంచి తుదివఱకూ చేసేకృషి కంతటికీ సత్యమే కేంద్రమైంది. సాధనం ఎప్పుడూ ఫలితంతో సమన్వితం కావాలి. దుష్టసాధనవల్ల సత్ఫలితం ఎన్నడూ చేకూరదు. అందుచేత సత్యం అనేది ఎప్పుడూ పాటించవలసిందే. దానినుంచి ఏమాత్రం వైదొలగినా సత్యాగ్రహ పవిత్రతకే భంగం కలుగుతుంది. ఆయనను అనుసరించిన నడిమితరగతి భారతీయులకు ఈ విషయాలు బోధించటం చాలా కష్టమే అయింది. ఎందువల్లనంటే వారు వ్యక్తిగత జీవితాలలో, సత్యపాలనవిషయంలో అంతగా శ్రద్ధచూపక, అవకాశాన్నిబట్టి ప్రవర్తిస్తూవచ్చారు. ఒక్కొక్కప్పుడు తెలియకుండానే అసత్యమాడటానికిన్నీ అలవాటుపడ్డారు. మఱి అటువంటివారు ఆ కఠోరనియమాలను పాలించటానికి సిద్ధపడ్డారంటే సత్యమహిమ వారికి తెలియనీ తెలియకపోనీ; గాంధిజీ ప్రభావమే దానికి కారణం.

# 5

యథార్థానికి చాంపరాన్ జిల్లా భారతదేశంలో సత్యాగ్రహ ప్రవేశానికి నాంది అయింది. ఆ దేసమయంలో గాంధిజీ ఉపవాసం చెయ్యటంవల్ల ఆయనలోని మఱి ఒక విశిష్టత విస్పష్టమైంది.

గాంధిజీ కార్యనిర్వహణవిధానంలో బహువిధ చర్చలకు కారణమైంది ఉపవాసపద్ధతి. అనేక దేశాలలోని ఎందఱో వ్యక్తులకు ఇది ఒక ప్రత్యేకమైన ఆయుధంగా కన్పించింది.

దానివల్ల పరులెవ్వరికీ కాక ఒక్క గాంధీజీకే హింసకలిగినా దానిశక్తి మాత్రం చాలా హింసాకరం అని తోచింది. ఆయన ప్రత్యర్థులు ఈ ఉపవాసం ఒక పెద్దకుట్ర అని అన్నసందర్భాలు కూడా ఉన్నాయి.

ఆయన ఎన్నడు ఉపవసించినా సాధారణంగా సత్ఫలితాలే కలిగాయనటం యథార్థం. కొన్నికొన్ని సమయాలలో ఈ ఉపవాసాలవల్ల ఎవరూ ఊహించనంతటి అత్యద్భుత ఫలితాలున్నూ కలిగాయనడంకూడా సత్యమే.

ఉపవాసంవల్ల కలిగే ఫలితాలు ఇవేకాక మఱికొన్ని వాస్తవవిషయాలు ముఖ్యంగా గుర్తించవలసినవి ఉన్నాయి. ఈ అన్నింటిలోనూ ముఖ్యమైనదీ మొట్టమొదటిదీ ఉపవాసం అనేది ఒకవిధమైన ప్రార్థన అనటమే. గాంధీజీ మనస్సు దీనివల్ల ప్రశాంతమయేది. ఇది ఆయనకు బహుధా అనుభవగోచరమైనది; రెండవది దీనిని తనకొకశిక్షగా ఆయన అంగీకరించాడు అనేది. ఆ శిక్ష మఱిఒకరికి వ్యాపింపజేయటానికి ఆయన సమ్మతించలేదు. ఆయనఅనేకపర్యాయాలు దైవప్రార్థనచేస్తూఉపవసించటం మూడవది. ఇలా ఉపవసించటం ఏదైనా కార్యసాధన కోసంగానీ, తన అనుచరులు పొరపాట్లు చేస్తే అందుకు పశ్చాత్తాపం తెలియజెయ్యటంకోసంగానీ జరిగేది. లోకానికి ఆ మూలకారణం తెలియవచ్చే లోపలనే ఆయన ఉపవాసం ప్రారంభించేవాడు. అంతర్వాణి ఆదేశంతో ఉపవాసం ప్రారంభించటం, ముగించటం అనేది చిట్టచివరిది.

మానవజాతికి విందుభోజనం ఎటువంటిదో గాంధీజీకి ఉపవాసం అంత సహజమైపోయిందనటం నిస్సందేహం. ఆయన

జీవితం అంతటిలోనూ తఱచూ ఉపవసించేవాడు. అటువంటి ఉపవాసాలు చెయ్యగలశక్తి ఆయనకు సహజంగానే లభించింది. దీర్ఘోపవాసాలవల్ల కొంత శ్రమకలిగినా, సాధారణంగా ఉపవాసం ఆయన శరీరానికీ మనస్సుకూ విశ్రాంతిప్రదమే అయేది. చాలామటుకు ఉపవాసాలవల్ల ఆయనలో ఒకానొక నూతన శక్తి ఉదయించటం యథార్థమే అని తోస్తుంది. స్వల్పకాల పరిమితిగల ఉపవాసంచేత శరీరానికి లాఘవమూ, మనస్సుకు ప్రసన్నతా లభించగలవనేవిషయం ఎవరికైనా ప్రత్యేక ప్రయత్నంగానీశిక్షణగానీ అవసరంలేకుండానే అనుభవంతోనే తెలిసి వస్తుంది. గాంధిజీ విశిష్టత యేమిటంటే ఎంత దీర్ఘోపవాసం చేసినా దానివల్ల ఆయనకు శారీరకంగా శాశ్వతమైన బాధ యేమీ కలిగేదికాదు.

ఇంతేకాక, ఆయనచేసిన ఏ ఉపవాసమైనా సాధారణంగా శాంతికోసం ప్రార్థనచెయ్యటమే అయేది. ఇక శాంతి అంటే, అది ఒకేవిధాన రావలసింది కాదు. మతాలూ, జాతులూ, కులాలమధ్య ఉదయించవలసింది గానీ, హింసను ఖండించవలసిన సందర్భాలలో సాధించదగిందిగానీ అయిఉండేది. కొన్నిసందర్భాలలో గాంధిజీ తన అనుచరులు ఏమైనా హింసాత్మకచర్య చేసినా ఉపవసించటం జరిగేది. ఇట్టి ఉపవాసాలను కూడా శాంతికోసంచేసే ప్రార్థనలుగానే పరిగణించవచ్చు. 1917 వ సంవత్సరంలో దేశంమొత్తాన వ్యాపారమంతా స్తంభించిన పరిస్థితులు ఎలా చక్కదిద్దాలా అని ప్రభుత్వం ఆందోళనపడ్డది. ఈ ఉపవాసాలలో గల శక్తి యేమిటో అప్పుడు తేటతెల్లమయింది. 1917 వ సంవత్సరమే భారత

దేశంలో గాంధిజీ ఉపవాసం ప్రారంభించిన సంవత్సరం. అప్పటికే ఆయనలో పరిపూర్ణత సిద్ధించింది. ప్రార్థనారూపంలో ఉపవాసం నిర్వహించటం, అది ఆయనకు కార్యసాధనలో విడువరాని ఉపకరణం కావటం ఎప్పటినుంచో అభ్యాసమైంది.

అహమ్మదాబాదు యంత్రాలయాలలో పనిచేసే కార్మికులు తన సలహాకోసం రాగా, వారి విషయంలో తనకుగల బాధ్యతను సంపూర్తిగా నిర్వర్తించటంకోసం ఆయన ఉపవాసం ప్రారంభించాడు. వీరు ఆయనకు ఆత్మీయులు. వీరితో ఆయన గుజరాతీభాషలోనే మాట్లాడాడు. ఆ యంత్రాలయాల యజమానులుకూడా ఆయనకు స్నేహితులే. వారిలో చాలామంది ఆయన ఆశ్రమనిర్వహణకు ఎంతో ధనసాహాయ్యం చేసినవారు కూడా. ఉభయపక్షాలతోనూ మాట్లాడినమీదట కార్మికుల కోర్కెలు న్యాయసమ్మతాలే అనీ, అయినా యజమానులు ఆ కోర్కెలను తీర్చటానికి ఇష్టపడటంలేదనీ ఆయన గ్రహించాడు. అందువల్ల ఆయన కూలీలను సమ్మెచేయండని ప్రోత్సహించాడు. అయితే సమ్మెలో ఎక్కడా హింసఅనేది జరుగరాదని హెచ్చరించాడు. వారి ఆహారాదికాలకు కావలసిన ధనం యంత్రాలయానికి వెలుపలనుంచి తెచ్చుకోవలసిందే కానీ, హింసాత్మకమైన ఏ పనివల్లనూ తెచ్చుకోరాదని నొక్కిచెప్పాడు.

కార్మికులు గాంధిజీ సమక్షంలో సమ్మె అహింసాయుతంగా సాగిస్తామని శపథం చేశారు. అనుదినమూ నగరంనుంచి నదిదాటి ఆశ్రమానికి వచ్చి నాటిసమ్మె అహింసాయుతంగానే జరుపుతామని ప్రతిజ్ఞచేసేవారు. ఇలా వారు చేస్తూఉండ

టంతో ఆయనకు వారిబాధ్యతఅంతా తనదే అనేభావం కలిగింది. కాని కాలక్రమాన రోషం హెచ్చటం, సమ్మె భంగపఱపవచ్చినవారిపై తిరుగబడడం సంభవించి హింసాత్మకచర్యలు జరిగాయి. మహాత్ముడీ విపరీత పరిణామానికి చలించిపోయాడు. కార్మికులందఱూ కలిసివచ్చి అహింసనేపాటిస్తామని శపథంచేసే వఱకూ ఉపవాసంచెయ్యాలని నిశ్చయించుకొన్నాడు. అయితే ఈ ఉపవాసం మూడురోజులతోనే ముగిసింది. అంతలో యజమానులూ కార్మికులూ సమావేశమై మధ్యవర్తులద్వారా వ్యవహారాలు పరిష్కరించుకొనటంవల్ల సమ్మె ఆగిపోయింది.

అహమ్మదాబాదు ఉపవాసం కేవలం బెదరింపులాగా కనిపించినందువల్ల కొంతమంది గాంధిజీ అనుచరులకు కూడా బాధ కలిగింది. అయితే బెదరింపనేది ఉయన ఉద్దేశించింది కాదు. ఆయన తత్త్వం పూర్తిగా అవగాహన కానివారికి ఆయన ఉద్దేశాలు తెలుసుకోవటం కష్టం. ఉపవాసంవల్ల సమ్మె పరిష్కృతమైనప్పటికీ ఆయన అసలు ఉపవసించటంలోని పరమార్థం తన నాయకత్వం అంగీకరించిన కార్మికులు అహింసాపాలనానికి కట్టుపడిఉండాలనిభగవంతుణ్ణిప్రార్థించటంమాత్రమే. గాంధిజీ ఉపవాసాల ప్రత్యేకతలను గమనించటానికి ఇటువంటి విచక్షణ అవసరం. ఇటుతర్వాత నడచిన భారతచరిత్రలోనూ ఈ ఉపవాసాల ప్రాబల్యం ఎంతో ఉన్నది.

"నన్ను ప్రేమించినవారిని సంస్కరించటానికే నేను ఉపవసించాను" అని గాంధిజీ అన్నాడు. ఇక్కడ కార్మికులను అహింసాదీక్షకు కట్టుపడి ఉండేటట్లు చేయడమే ఆయనలక్ష్యం.

దీనివల్ల సమ్మె పరిష్కృతం కావటం ఆయన లక్ష్యంకాదు. అది యాదృచ్ఛికంగా కలిగిన ఫలం మాత్రమే.

బ్రిటిషుసామ్రాజ్యంపట్ల విశ్వాసిమైన పౌరుడుగా గాంధిజీ చరిత్ర యిక స్వల్పకాలంలోనే ముగియనున్నది. 1918 వ సంవత్సరం వేసగిలో బ్రిటిషుప్రభుత్వపుసేనలో భారతీయయువకులను చేర్చటంతో ఇది అంతమైంది. చిన్న తనంనుంచీ ఆయనకు ఏర్పడిఉన్న రాజభక్తివల్ల జరిగిన అంతిమ కృత్యం అదే.

అయితే ఆయనచేసిన ఈ పనివల్ల ఆయనమిత్రులూ, అభిమానులుకూడా విస్మితులై చాలా అసంతృప్తులైనారు. ఎన్నోపర్యాయాలు ఈ విషయమై ఆయన తన అభిప్రాయాన్ని వివరించినా దానిని అర్థంచేసికొన్నవారు లేరు. బోయరు యుద్ధంలోనూ, జూలూయుద్ధంలో మాదిరిగానే 1914 వ సంవత్సరంలోనూ క్షతగాత్రులకు సేవచేయటానికి భారతీయస్వచ్ఛంద సేవకదళాన్ని నిర్మించటానికిఆయనకృషిచేశాడు. ఆయనఅహింసా దీక్షకేబద్ధుడైనప్పటికీ బ్రిటిషుప్రభుత్వపు రక్షణలో తాను జీవిస్తున్నట్లు భావించటంచేత ప్రభుత్వానికి తనవల్ల కాదగినసాయం అంతా చేయవలసిందే అని ఆయన విశ్వసించాడు. అందుచేత తాను ఎంతవఱకు చేయగలననుకొన్నాడో అంతవఱకూ చేసి సామ్రాజ్యభాగంగా భారతదేశానికి స్వపరిపాలన లభించగల దని అనుకొన్నాడు. తర్వాత యుద్ధంలో టర్కీ ఓడిపోవటంచేత ధ్వంసమైన ముస్లిం కాలిఫాప్రభుత్వాన్ని నిలబెట్టటానికి ఏదైనా ఏర్పాటు చేయవలసిందని రాజప్రతినిధి అయిన చెల్మ్సుఫర్డు ప్రభువును అర్థించాడు. కాని తాను ప్రభుత్వానికి చేసిన

సేవకు ప్రతిఫలంగా ఈ పని చేయవలసిందని మాత్రం ఆయన ఎన్నడూ ఎవరినీ కోరలేదు. అలా కోరటం ఆయన ఆంత రాత్మకు గిట్టనిపని. తర్వాత అఖిలభారతానికీ ప్రకటితమైన ఒకలేఖలో తన ఉద్దేశాలేమిటో వివరించాడు. అందులో రాజ ప్రతినిధిని ఉద్దేశించి "ఆశాభంగం అంటే భ్రాంతిభంగం" అని మాత్రమే అన్నాడు.

తర్వాత తన మాతృభూమిఅయిన గుజరాతు దేశంలో ఖైద్దాజిల్లాలో గ్రామగ్రామానికీ పర్యటించి ప్రభుత్వసైన్యంలో భారతయువకులను చేర్పించటానికి కృషిచేశాడు. పంటలు చెడి పోవటంవల్ల పన్నులు కట్టలేనిదోషానికి బీదరైతుల ఆస్తులు అమ్మివేయటం జరిగే ఈ జిల్లాలో ఒకప్పుడు ఆయన ఆ పేదల సాయంకోసం కొంతకాలం సత్యాగ్రహంచేసిఉన్నాడు. ఆయన సత్యాగ్రహస్వరూపస్వభావాలు ప్రజలకు అర్థంకాక ప్రతి దినమూ గంటలతరబడి ప్రబోధం చేయవలసివచ్చినా, మొత్తం మీద ఆయాగ్రామస్థులవల్ల ఆయనకు చక్కని సాహాయ్య సంపత్తి లభించింది. చివరకు అందులో కొంత విజయం కలి గింది. ధనికులయిన రైతులు పన్ను చెల్లిస్తే పేదరైతులకు శిస్తు తగ్గించటానికి ప్రభుత్వం అంగీకరించింది.

ఖైద్దాజిల్లాలోజరిపిన సత్యాగ్రహంవల్ల గాంధిజీకి సంపూ ర్ణమైన తృప్తికలుగలేదు. బొంబాయిలోని సత్యాగ్రహాభిమాను లైన ధనికులు ఇచ్చినధనంలో చాలాభాగం ఇందుకోసం వెచ్చిం చటంజరిగింది. ఇంకా ముద్రాతుర శాలల్లో కొంతపైకం చెల్లించవలసివచ్చింది. ఇటువంటి ఫలితం ఆయనకు చాలాకష్టం

కలిగించింది. అయితే ఉద్యమకాలంలో ప్రజలు మనస్ఫూర్తిగా తోడ్పడినందుకు మాత్రం ఆయన చాలా సంతోషించాడు.

ఇప్పుడు యుద్ధంలోకి మనుష్యులను పంపటంకోసం గ్రామాలవెంట బయలుదేఱగా వాతావరణం యావత్తూ తనకు వ్యతిరేకంగా మారిందని మహాత్ముడు గ్రహించాడు. వెనుకటి గౌరవం ఎక్కడా కనబడలేదు. "అహింసమాట యేమిటి? మమ్మల్ని ఆయుధాలు పరిగ్రహించవలసిందని మీరెలా చెప్ప గలుగుతున్నారు? ఈ ప్రభుత్వం మనభారతదేశానికి ఎప్పు డైనా ఏమైనా మేలుచేసిందా?" అన్న ప్రశ్నలు గ్రామగ్రామానా ఆయనపై అగ్నివర్షంలాగా కురిశాయి. అంతకుపూర్వం అవే ప్రశ్నలు ఆయననోటినుంచి వినిఉండకపోతే వారు ఆయన చిత్త శుద్ధిని అలా శంకించేవారు కారు. ఈ భారం నెత్తిమీద వేసి కొనకపూర్వం ఇవే ప్రశ్నలు ఆయన వారిని అడిగి ఉన్నాడు. ప్రజలకు తన అభిప్రాయం ఎలా నచ్చజెప్పాలో తోచక ద్విగు ణీకృతభారంతో ఇప్పుడాయన క్రుంగిపోయాడు. దీనితో ఆయన రక్తవిరేచనాలకు గురిఅయినాడు. హిందూదేశంలో తొలి సారి ఆయన జబ్బుపడటం ఇప్పుడే.

అయితే వైద్యులు చెప్పినట్లు వినేరోగికాడు మహా త్ముడు. వైద్యులు నిర్దేశించిన ఏ చికిత్సగానీ, ఏ మందులుగానీ ఆయన అంగీకరించలేదు. ఊరకే ఉపవాసాలు చేశాడు. వేరు సెనగకాయలూ, పండ్లూ తప్ప మఱే ఆహారమూ తీసికొన టానికి నిరాకరించాడు. ఆహారలోపంవల్ల శరీరం క్షీణిస్తూ వచ్చింది. గుడ్లు ఏ రూపంలోనైనా తినటానికి అంగీకరించాడు కాడాయన. పోనీ పాలయినా త్రాగవలసిందంటే తన ఆశయా

నికి అదీ విరుద్ధమే అన్నాడు. వైద్యులకు ఏమీ తోచలేదు. చిట్టచివరకు సాధ్వి కస్తూరీబా ఆయనతో ఇలా అన్నది : "మీరు ఆవుపాలుగానీ, గేదెపాలుగానీ త్రాగమన్నారుగానీ మేకపాలు నిషేధించుకోలేదుగా !"

(ఇక రెండురోజులకు జీవయాత్ర అంతమౌతుందనగా ఆయన ఆ నాటిదృశ్యాన్ని నాకు కన్నులకట్టేటట్లు వర్ణించి చెప్పాడు. "ఇప్పుడుకూడా ఆమె నాకు కనబడుతుంది" అన్నాడాయన. ప్రాణరక్షణ చేసికోవాలంటే ఇదే మార్గమని ఆయనకు నచ్చజెప్పగలిగింది ఆమె మాత్రమే.)

ఆయన మేకపాలు త్రాగటానికి అంగీకరించాడు. దానితో గండం గడచింది. తాను చేసికొన్న నియమాన్ని అక్షరాలా ఆచరించటంలేదే అని మనస్సులో బాధపడుతున్నప్పటికీ అప్పటినుంచీ ఆయన మేకపాలు త్రాగుతూవచ్చాడు. మేకపాలు త్రాగటం అనే విషయమై ఆయనకు కొంత అనుమానం కలిగినా 1912 వ సంవత్సరంలో ఆయన చేసికొన్న నియమంలో అది చేరలేదు కాబట్టి దానిని గ్రహించటానికి ఆయన అంగీకరించాడని నాకు తోస్తుంది. శరీరం నిలుపుకోవాలనే మనోదౌర్బల్యమే చివరివఱకూ ఆయన మేకపాలు త్రాగటానికి కారణమైంది. అదే త్రాగకపోతే ఆయన అంతకాలం జీవించేవాడు కాదనటంలో సందేహంలేదు.

ఆయన అనారోగ్యంగా ఉన్నప్పుడే జర్మనీ లొంగిపోయింది కనుక యుద్ధంలోకి మనుష్యులను ప్రోగుచేసి పంపనక్కఱలేదని రాజప్రతినిధి ఆయనకు కబురుచేశాడు. ఈ కబురువల్ల ఆయనకు దుస్సహంగా కనిపించిన ఒకభారంనుండి విముక్తి

కలిగింది. దానితో ఆలస్యంగానైనా ఆయన క్రమంగా కోలుకో గలిగాడు. అయితే ఆ రక్తవిరేచనాలమూలాన ఆయన కొన్ని నెలలపాటు బలహీనంగాఉండి, సాంఘిక కార్యకలాపాలలో వేటిలోనూ పాల్గొనలేకపోయాడు. ఒక్క ఆశ్రమవ్యవహారాలు చూడటంమాత్రం తప్పలేదు.

యుద్ధం ముగిసినవెంటనే వచ్చిన శీతకాలంలో రౌలటు కమిటీ నివేదిక బహిరంగమై గాంధిజీ దానిని చదవటం తటస్థించింది. బ్రిటిషుప్రభుత్వంపట్ల భారతీయుల వ్యతిరేకత ఎలా ఉన్నదో తెలిసికొని ఆ విషయంలో ఏమి చేయవలసిందీ నిర్ణయించటానికి ఈ రౌలటు కమిటీని ప్రభుత్వం నియమించింది. యుద్ధసమయంలోమాదిరిగానే శాంతికాలంలోకూడా వాక్స్వాతంత్ర్యం, పత్రికాస్వాతంత్ర్యం శాసనసభాప్రవేశం లేకుండా ప్రజలను అణచిఉంచాలని ఆ నివేదికలో కమిటీ ప్రభుత్వానికి సూచనలు చేసింది.

గాంధిజీ అప్పటికింకా పూర్తిగాకోలుకోనందున రౌలటు నివేదిక చదివి బాధపడ్డాడే కానీ, తాను ఏమిచేయాలో నిశ్చయించుకోలేకపోయాడు. యుద్ధకాలంలో భారతీయులు ప్రభుత్వానికి చేసిన సేవకుగాను శాంతికాలంలో ఇటువంటి బహుమతి పొందవలసివస్తే ఇక వారికి స్వపరిపాలన లభించగలదనే ఆశకు అవకాశ మెక్కడున్నది? భారతీయనాయకులు ఎంత వ్యతిరేకిస్తున్నా రౌలటునివేదికలోసూచించబడ్డ సూత్రాల కనుగుణంగాఅతిత్వరితంగా 1919 వ సంవత్సరంలోప్రభుత్వంశాసనం చేయదలచింది. శాసనసభలోఉన్న వారుచాలామందిఆంగ్లేయులే, ఇక ఆ శాసనం ఆమోదంపొందటంలో ఆశ్చర్యమేమున్నది?

గాంధిజీ తన బలహీనతను లెక్కచేయకుండా వెళ్ళి ఢిల్లీ శాసన సభలో జరుగుతున్న వాదోపవాదాలు స్వయంగావిన్నాడు. రౌలటుచట్టం అనే పేర ఆకమిటీసూచనలు శాసనబద్ధాలైనాయి. దీనినేగాంధిజీ "న్యాయశాస్త్ర మర్యాదాత్మకమైన ప్రహసనం" అన్నాడు.

భారత దేశంలోనూ ప్రపంచంలోనూ కూడా గాంధిజీరాజకీయ జీవితం ప్రారంభంకావటానికి ఇదే మూలకారణమైంది. అంత వఱకూ ఆయన రాజకీయాల్లో ప్రత్యక్షంగా ఎన్నడూ పాల్గొన లేదు. దక్షిణాఫ్రికాలోనూ, భారత దేశంలోనూ ఆయన నిర్వ హించిన ఉద్యమాలలో రాజకీయమైన ఫలితం కొంతకనిపించి నప్పటికీ ఆయన చేసిందంతా ప్రజల సాంఘికపరిస్థితులు చక్కదిద్ద టానికీ ఉత్తమజీవితం నడపటానికితగువిధంగా సంస్కరించటానికీ, తన మనస్సును మత సిద్ధాంతానుగుణంగా శిక్షించుకోటానికీ మాత్రమే. ఇక ఇప్పుడు తన సత్యాగ్రహ సిద్ధాంతాలను హిందూదేశంలో పెద్దఎత్తున అమలు జరపటానికి సమయం వచ్చిందని ఆయన భావించాడు. కాబట్టి తాను తర్వాత జీవి తంలో ఎన్నడూ వెనుకంజవేయని రాజకీయపథంలో ఇప్పుడే అడుగుపెట్టాడు. అందుచేత తన ఉద్యమాన్ని ప్రారంభించ టానికి తగు వాతావరణం కల్పించుకొనటానికి భారత దేశ మంతటా పర్యటించాడు. ఆయన ఉద్యమసిద్ధాంతాలు నచ్చ జెప్పటం సామాన్యమైన పనికాదు. అది నాటికెంత కష్టంగా తోచిందో నేటికీ అలాగే తోస్తుంది. సామాన్య మానవులలో నుంచి ఒక మహత్తరమైన తపశ్శక్తిని అపేక్షించినట్లు ఆఉద్యమం కనిపిస్తుంది. అయితే ఆయన అది అసాధ్యం అనుకోకుండా

అందుకోసం ప్రయత్నించాడు. భౌతికంగా చాలా బలహీనుడై ఉన్నందువల్ల ఆయనకు ఆ పర్యటనం చాలా కష్టమే అయింది. ఆయన ఉపన్యాసాలు ఎవరైనా సభలలో చదువవలసివచ్చింది. ఏమైనా సత్యాగ్రహోద్యమ ప్రారంభానికి తగువాతావరణం కొంతవఱకు ఆయన సృష్టించగలిగాడు. అహింసాత్మకమైన ప్రతిఘటన జరపటానికి దేశీయులలో కొంత ఉత్సాహం కలిగించగలిగాడు.

చిట్టచివరకు రౌలటుచట్టంమీద సంతకంచేయటానికి రాజప్రతినిధి నిరాకరిస్తాడని ఆయన ఆశించాడు. ఈ విషయమై రాజప్రతినిధికి వ్యక్తిగతంగానూ, బహిరంగంగానూ, ఉత్తరాలు వ్రాశాడు. పత్రికాముఖానా, ఇంకా ఉచితమనితోచిన అన్ని విధాలా ఆయనకు తన అభ్యర్థన తెలియజేశాడు. అయితే అది అంతా చెవిటికి సంకూదటమే అయింది. 1919వ సంవత్సరం మార్చినెల 18వ తారీఖున రౌలటుచట్టంమీద రాజప్రతినిధి సంతకంచెయ్యటం జరిగింది.

ఆ సమయంలో బ్రిటిషు ప్రభుత్వానికి తాముచేసే పనివల్ల ముందేమి జరుగుతుందో తెలియదనటంలో సందేహం లేదు. అలాగే గాంధిజీకిన్నీ తన నిశ్చయాలు ఎంతవఱకు తీసి కొని వెళ్ళగలవో తెలియదనడమున్నూ నిస్సందేహమే. అంతవఱకూ చక్రవర్తిపట్ల భక్తివిశ్వాసములు కల ఆయన ఒక్కసారిగా తిరుగుబాటుదారైనాడు. రౌలటుచట్టంమీద రాజప్రతినిధి సంతకంచేసినక్షణంనుంచీ ఆయన విప్లవకారుడైనాడు. అయితే ఆయన ఆ సంగతి మఱికొంతకాలందాకా కూడా గుర్తించలేదు. శాసనసభలలో భారతీయులకు ప్రాతినిధ్యం

లేకుండా చెయ్యటం విశ్వాసఘాతుకకృత్యం అని, ఆయన భావించాడు. యుద్ధకాలంలో భారతీయులపట్ల ప్రభుత్వం పలికిన చల్లని మాటలన్నీ అర్థరహితాలే. లేకపోతే ఇటువంటి చట్టం ఎలావస్తుంది? బ్రిటిషురాజ్యంపట్ల తాను శత్రుత్వం వహిస్తున్నానని ఆయన గుర్తించలేదు కానీ, అతిశీఘ్రకాలంలోనే ఆ పరిస్థితికి చేరుకోదగినట్లు పురోగమిస్తున్నాడు. ఆయన అప్పుడు ఉన్న పరిస్థితిలో ఎవడూ ఎక్కువకాలం ఉండలేదు. ఇది రాజద్రోహం అనిజంకి వెనుకకైనామళ్ళిపోవాలి. లేక దేశశ్రేయస్సుకోసం ఇది చేయకతప్పదని ఇంకా ముందుకు రావాలి. 1919వ సంవత్సరం అంతా రోజులుగడుస్తున్నకొద్దీ ఆశలుపెంచుకుంటూ పనిచేయటమే జరిగింది. బ్రిటిషువారి పూర్వక్యం కొనసాగి అమృతసర్‌లో హింసలు జరగటంచేత ఒకటిరెండు సంవత్సరాలలో భారతదేశం యావత్తూ ప్రభుత్వంతో పెనగులాడవలసి వచ్చేస్థితికి ఇప్పటినుంచీ దోహదం జరుగుతూవచ్చింది.

# పంచమ ప్రకరణం

## వి ప్ల వం లో

రౌలటుశాసనం ప్రభుత్వామోదం పొందేసరికి గాంధిజీ మద్రాసులో ఉన్నాడు. తర్వాత కొన్నిదశాబ్దాలపాటు ఉద్యమంలో ఆయనకు కుడిభుజంగా పనిచేసిన రాజగోపాలాచారి ఆయనకు ఆతిథ్యం ఇచ్చాడు. (ఈ రాజగోపాలాచారికే తర్వాత రాజాజీ అనీ ప్రసిద్ధికలిగింది. సత్యాగ్రహచరిత్రలో పత్రికలవారు ఈయనను సంక్షిప్తంగా సి. ఆర్. అని పేర్కొ

న్నారు.) రాజప్రతినిధి చట్టాన్ని ఆమోదించి సంతకం పెట్టినట్లు తెలిసిన ప్రాతఃకాలాన గాంధిజీ రాజాజీతో మాట్లాడుతూ ఇలా అన్నాడు: "రాత్రి నాకు ఒక కలవచ్చింది. దేశమంతటినీ కూడా ఈ సందర్భంలో హరతాళ్ చెయ్యవలసిందని మనం ప్రబోధించాలని స్ఫురించింది."

హరతాళ్ అంటే అంగళ్లు కట్టివేసి, దుఃఖం ప్రకటిస్తూ దైవప్రార్థనతో గడపవలసిన దినం. ఒక్కొక్కప్పుడు ఉపవాసమున్నూ జరపవచ్చును. గాంధిజీ మతంలో ఉపవాసమూ దైవప్రార్థనా చెయ్యవలసినరోజది. (అమెరికాలో విప్లవం కూడా ఇదేవిధంగా ప్రారంభంకావటం గమనించవలసిన విషయం. 1774వ సంవత్సరం జూను ఒకటవ తేదీని వర్జీనియాలో థామస్ జెఫర్సనూ అతని స్నేహితులూ, "ఉపవాస ప్రార్థనా దినంగా" ప్రకటించారు) ఇలా ప్రారంభించినట్లయితే తాను నడపబోయే సత్యాగ్రహోద్యమంలో పాల్గొనగల ఆత్మశక్తి ప్రజలకు చేకూరగలదని గాంధిజీ విశ్వసించాడు. బ్రిటిషు ప్రభుత్వానికి ఇందువల్ల ఎంత ఆర్థిక బాధకలుగుతుందో ఆయన లక్ష్యపెట్టనట్లు కనిపిస్తుంది. ఎందుచేతనంటే దేశంమొత్తాన ఈఉద్యమం సాగించాలని ఆయన భావించలేదు. మద్రాసు, బొంబాయి బీహారు, సింధురాష్ట్రాలలో మాత్రం తన ఉద్యమం సాగితే చాలునని అభిప్రాయపడ్డాడు.

మొట్టమొదట మార్చినెల 30వ తేదీనే హరతాళ్ జరపాలని ఆయన అనుకొన్నాడు కానీ, వ్యవధి తక్కువగా ఉన్నదని దానిని ఏప్రిల్ 6వ తేదీకి మార్చాడు.

హరతాళ్ ఫలితాలు అందటికన్నీ చివరకు గాంధిజీ

కిన్నీ ఆశ్చర్యం కలిగించాయి. ఎక్కడో కొన్నిచోట్ల తప్ప యావద్భారతమూ హరతాళ్ దినం పాటించింది. మహానగరాలలో ఏ ఒక్కడున్నూ పనిపాటలకు పోలేదు. బ్యాంకులు స్తంభించాయి. ఓడలలో సామాను చేర్చేవారుగానీ, లోపలి సామాను తీరానికి తెచ్చేవారుగానీ లేకపోయారు. ప్రజల రాకపోకలూ, తపాలా ఆఫీసు కార్యక్రమాలూ నిలిచిపోయాయి. సమగ్రమైన ప్రతిఘటన జరుగుతున్నదని అందరికీ విదితమైంది. బ్రిటిష్ ఉద్యోగస్థులు తికమకపడ్డారు. నూతనశక్తి యేదో తమను ఎదుర్కొంటున్నదని గుర్తించారు. దానిని అణచివేయుటానికి వారు సర్వవిధాలా యత్నించి కొంతవఱకు కృతకృత్యులైనా, నవీనమైన ఆ ప్రతిఘటనకు వారు తబ్బిబ్బుపడిఉంటారనటంలో సందేహంలేదు.

హరతాళ్ చెయ్యాలనే ఉద్దేశం పల్లెల్లోనూ, పట్టణాలలోనూకూడా ప్రజాసమూహాన్ని ఏకీభవింపజేసింది. ఆ రోజున అంటే ఏప్రిల్ 6వ తేదీన గాంధిజీ బొంబాయిలో ఉన్నాడు. శ్రీమతి సరోజినీదేవి ఆయనా ఒక సభలో ప్రసంగించారు. ప్రభుత్వం నిషేధించిన రెండు పుస్తకాల ప్రతులను వారు కలసి తిరిగి విక్రయించారు. వాటిలో ఒకటి గాంధిజీ వ్రాసిన 'హిందూస్వరాజ్' అనేది. రెండవది రస్కిన్ రచించిన 'చివరివఱకూ' అనే గ్రంథానికి ఆయనచేసిన అనువాదం. అయితే ప్రభుత్వం ఇక్కడకొంతవివేకంతో వ్యవహరించింది. ఏ ఒక్కరినీ నిర్బంధించలేదు. ఆ రెండుపుస్తకాలూ వెనుకనిషేధించబడినవాటికి రూపాంతరంతో పునర్ముద్రింపబడినవి. నిషేధించినవాటిలో అవి

చేరలేదు. వేలకొలది స్వచ్ఛందసేవకులు ఆ పుస్తకాలను విక్రయించారు. ఒక్కరూ నిర్బంధానికి గురికాలేదు.

హరతాళ్ జరుపవలసిందని గాంధిజీ ప్రజలకు చేసిన విజ్ఞప్తి ఆయన పెట్టుకొన్న హద్దులు దాటిపోయింది. ఉద్రిక్తులయిన ప్రజలు ఒక్క 6 వ తేదీతో హరతాళ్ ముగించలేదు. దేశం అంతా కల్లోలితమైంది. ప్రజలు హింసలకు గురికావటం, కొందఱు మరణించటం అనివార్యమైంది. అతి సాధువైన మహాత్ముడు తీవ్రంగా ప్రసంగించాడు; అధికఫలాన్ని ఉద్దేశించాడు. ఆ ఉద్రిక్తవాతావరణంలోనే ఆయన ఢిల్లీ పంజాబులకు ప్రయాణంచేస్తూఉండగా బండిలోనే ప్రభుత్వోద్యోగులు ఆయనను నిర్బంధించి, తిరిగి బొంబాయికి తీసుకొనిపోయినారు. ఆ వార్త కార్చిచ్చులాగా దేశమంతా వ్యాపించి అలజడికలిగించింది నగరాలలో ప్రజలు గుమిగూడటం మొదలుపెట్టారు. బొంబాయిలో ఎన్నోచోట్ల గుంపులుగూడినప్రజలుఅశ్వారూఢులైవచ్చినరక్షకభటులవల్ల తీవ్రహింసలకుగురిఅయినారు. అహమ్మదాబాదులో గాంధిజీని కన్నతండ్రిగా ప్రేమిస్తున్న కార్మికులు రోషావేశంతో హింసాత్మకచర్యలకు పూనుకొనటం జరిగింది. తత్ఫలితంగా ఒకప్రభుత్వ రక్షకభటుడు మరణించాడు. ఈ వార్త గాంధిజీకి ఎంతైనా బాధ కలిగించింది. అదే సంఘటన మరెక్కడైనా కలిగితే ఆయన అంతగా బాధపడేవాడు కాదు. కారణం ఏమిటంటే అహమ్మదాబాదు కార్మికులు సత్యాగ్రహతత్త్వాన్ని చక్కగా అర్థంచేసికొన్నారని గాంధిజీ విశ్వాసం. ఆ విశ్వాసానికి భంగం కలిగేసరికి ఆయనకు చెప్పలేనంత విచారం కలిగింది. "నా

శరీరంలోనుంచి దూసుకొనిపోయిన తుపాకి గుండైనా అంత వేదన కలిగించేది కాదు." అన్నాడాయన.

ఈ కాలంలో ఎన్నో చోట్ల ఎన్నో సందర్భాలలో ఆయన ఉద్రిక్తులైన తన అనుచరులను మందలిస్తూ, వారు సత్యానికీ అహింసకూ కట్టుబడిఉండకపోతే వారికి వ్యతిరేకంగా తాను సత్యాగ్రహం చేయవలసివస్తుందని హెచ్చరించాడు. వారు కొంతమంది ఆంగ్లేయులను గాయపఱచటం విని "ఇంగ్లీషువారు నా సోదరులే" అని ప్రకటించాడు. అహమ్మదాబాదులో చేసిన ఉపన్యాసంలో ఆయన ఇలా ప్రకటించాడు: "మనం కట్టడాలు తగులబెట్టాము; బలవంతంగా ఆయుధాలు లాగుకొన్నాము; ధనం అపహరించాము; రైళ్లు ఆపివేశాము; తంతితీగలు త్రెంచివేశాము; అమాయికప్రజలను వధించాము; అంగళ్లూ, ఇళ్లూ దోపిడిచేశాము."

ఈ ఫలితం అంతటినీబట్టి సత్యాగ్రహానికి తగినసమయం ఇంకా రాలేదని ఆయన నిశ్చయించాడు. వెంటనే ఉద్యమం ఆపవలసిందని ఆజ్ఞాపించాడు. జరిగిన అకృత్యానికి ప్రాయశ్చిత్తంగా తాను మూడురోజులు ఉపవసిస్తాననీ, తన అభిప్రాయంతో ఏకీభవించినవారు ఒకరోజు ఉపవసించవలసిందనీ అనుచరులతో అన్నాడు. అంతవఱకున్నా ఆయన సిద్ధాంతాలు ప్రజలకు బోధపడలేదు. వారు వాటిని బోధపఱచుకొని, సత్యాగ్రహాన్ని హింసగాకాక, పవిత్రమైన ఆత్మార్పణంగా వినియోగించుకోగలిగేవఱకూ ఆయన ఆ ఉద్యమంలో ముందడుగు వేయరాదని నిశ్చయించుకొన్నాడు. ఆ ఉద్రిక్తసమయంలో

గాంధిజీ సత్యాగ్రహోద్యమాన్ని విరమించాలన్నాడంటే ఆయన అనుచరులకు అంతకన్న బాధ కలిగించేవిషయం మరొకటి ఉండ దనిపించింది. హిందువులూ, ముస్లిములూ అనే భేదంలేకుండా భారతీయులందరికీ 'ఆ కొద్దిపాటిమనిషిలో అంతపట్టుదల ఉన్న దనీ, తాను అన్నది అక్షరాలా జరిపితీరుతాడనీ, ఆయన సంకల్పం వజ్రకఠినమనీ, భూలోకంలోని ఏ శక్తికూడా ఆయన సిద్ధాంతాలకు వ్యతిరిక్తంగా ఆయనను నడపించలేదనీ' గుర్తించ టానికి చాలాకాలం పట్టింది.

అమృత్‌సర్‌లో హింస ఏప్రిల్ 13 వ తేదీన జరిగింది. అంతకుముందుగానే సత్యాగ్రహ విరమణచేయాలని గాంధిజీ చెప్పవచ్చినప్పటికీ ఏప్రిల్ 18 వ తారీఖునుంచే ఉద్యమ విరమణ జరిగింది. ఆయన నిరాహారదీక్షతో దైవప్రార్థన జర పాలని నిశ్చయించటమూ అమృతసర్‌లో హింస జరగటమూ ఒకేరోజున తటస్థించాయి. మద్రాసులో మహాత్మునికికలవచ్చింది లగాయతూ అనేక విషాదసంఘటనలు జరుగుతూవచ్చాయి.

మహాత్మునికి కలిగిన దుఃఖం ఎటువంటిదో ఊహించుకో వలసిందేకాని మాటలలో చెప్పటానికి వీలులేదు. బ్రిటిషుప్రభు త్వం తనకాఠిన్యాన్ని సడలించుకొని రౌలటుచట్టాన్ని రద్దుచేసి, ప్రజల కష్టాల్ని విచారించటానికి సిద్ధపడేటట్లుగా భారతీయులు సత్యాగ్రహోద్యమం నిర్వహించి, అందుకోసం ఆత్మార్పణం చేస్తారనే ఉదారాశయంతో ఆయన ఈ ఉద్యమాన్ని ప్రారంభిం చాడు. అయితే ఫలితం దీనికి వ్యతిరిక్తమైంది. ఆయనమను ష్యులే రెచ్చిపోయి ఎంతో విధ్వంసానికీ హింసకూ కారకు

లైనారు. ఆయన ఎంత ఓర్పుతో తన సిద్ధాంతాలను విశదీకరించినా, ఆయనతత్త్వం ప్రజలకు బోధపడలేదు. బొంబాయిలో ఒక భారతీయసమూహం స్వయంగా వెళ్ళి ప్రభుత్వ నిర్బంధానికి సిద్ధపడడానికి బదులుగా, కారాగారాన్ని ముట్టడించి, అందులో సాధారణదౌర్జన్యపునేరాలకు నిర్బంధితులైఉన్న బందీలను విడిపించటానికి ప్రయత్నంచేసింది. ఇది కేవలం ఆయన వారికి చెప్పినపనికి వ్యతిరేకం.

అమృతసర్ గందరగోళాలు ఆయనప్రతిజ్ఞను మరింత భారం చేశాయి. ఇంతకంటెనూ బాధాకరమైనదేమిటంటే ఆయన తన ఆశ్రమంనుంచి కదలటానికి వీలులేకపోవటం. మహాత్ముడు ప్రజలకు చేసిన విజ్ఞప్తివల్లనే భారతదేశంలో ఇంత తుపాను బయలుదేఱిందని భారతప్రభుత్వం నిశ్చయించింది. అందుచేత ఆయన అడుగుపెట్టినచోటనల్లా శాంతికి భంగం కలుగుతుందని చెప్పి, ఆయన ఎక్కడికీ కదలరాదని శాసించింది. ఇదికూడా ఆయునమనస్సుకు ఎంతో వేదన కలిగించింది. శాంతికోసమే జీవితాన్ని అంకితంచేసిన మహాత్మునివల్ల ప్రజాజీవితంలో అశాంతి కలుగుతుందనీ, దేశశాంతిభద్రతలకు ఆయన శత్రువనీ అంటే అంతకంటె ఆయనను బాధించగలిగిందేమున్నది ?

ఏది యేమైనాసరే మహాత్ముడు అమృతసర్‌కు వెళ్లాలనుకొన్నాడు. కాని ఆయన ఆ నిశ్చయానికి వచ్చింది ఆ సంవత్సరం అక్టోబరునెలలో. తర్వాత కొన్నాళ్ళకు అందుకు ప్రభుత్వానుమతి లభించింది.

# 2

పంజాబు రాష్ట్రానికి రాజధానీ, సిక్కులకు పుణ్య క్షేత్రమూ అయిన అమృతసర్‌లో 1919 వ సంవత్సరం ఏప్రిల్ 13 వ తేదీన భారత దేశంలో ఎన్నటికీ మఱపురాని సంఘటనలు జరిగాయి. మార్చి 30 వ తేదీన జరిగిన మొదటి హరతాళ్ లోనూ, ఏప్రిల్ 6 వ తేదీన జరిగిన రెండవ హరతాళ్‌లోనూ అధిక జనసమ్మర్దం కల ఆ మహానగరంలో హిందూమహమ్మదీయులలో అపూర్వమైన అన్యోన్య సౌహార్దం ప్రకటితమైంది. ఆ గుమిగూడిన పెద్దగుంపులను చూచి భయపడి పంజాబు ప్రభుత్వం ఆ కాంగ్రెసునాయకులలో ఒక హిందువుకూ, ముస్లిముకూ ప్రవాసశిక్షవిధించి, తాను నిరోధించదలచుకొన్న దానిని విజృంభించేట్టు చేసింది. కోపోద్రిక్తులైన ప్రజలు ఆవేశం ఆపుకోలేకపోయారు. ధనాఢ్యులైన ముగ్గురు ఆంగ్లేయుల్ని చంపివేశారు. తక్కినవారిని అనేకవిధాల దుర్భాషలాడారు. బ్రిగేడియర్ జనరల్ రెజినాల్డ్ ఇ. హెచ్. డయ్యరును ఏప్రిల్ 11 వ తేదీన ప్రభుత్వం అక్కడి అల్లరులను ఆపటానికి పంపింది. 12 వ తేదీన అతను నగరంలో ఎక్కడా జనం గుమిగూడరాదని శాసించాడు. ఆ ఆజ్ఞ అనేకస్థలాలలో ప్రజలకు వినిపించటం జరిగింది. అయితే ఆ ఆజ్ఞలోని షరతులు సంపూర్ణంగా ప్రజలకందటికి తెలియజెప్పటం జరిగినట్లు నిదర్శనాలు లేవు. ఏమైతేనేమి? ఏప్రిల్ 13వ తేదీ సాయంకాలం నాలుగుగంటలన్నరకు జలియన్‌వాలాబాగ్‌లో బహిరంగసభ ప్రారంభమైంది. ఈ చోటు నగరానికి సరిగా కేంద్రంలోఉన్న ఒకవిశాల మైదానం.

బాగ్ అంటే తోట అయినప్పటికీ ఈ జలియన్‌వాలాబాగ్‌లో తోటలక్షణం ఒక్కటికూడా లేదు. దానిచుట్టూ కట్టడా లున్నాయి. నేల అంతా చెట్టూ చేమా లేక జాలూఅప్పలతో నిండిఉన్నది. బ్రిటిషుఉద్యోగుల అంచనాప్రకారం బాగ్ ఒక చివరనుంచి నడిమివఱకూ ఆవరించిఉన్న ప్రజలసంఖ్య పదివేలకు పైనా ఇరవైవేలకు లోపలా ఉండిఉంటుంది. జనరల్ డయ్యరు ఆ జనసమూహానికి ఎదురుగా ఉన్న ఒక దిబ్బమీదికి సాయుధు లైన ఇరవైఅయిదుగురు గూర్ఖాలతో ఇరవైఅయిదుగురు బలూ చీలతో వచ్చాడు. గూర్ఖాలను ఒకవైపూ, బలూచీలను ఒక వైపూ ఉంచుకొన్న డయ్యరు ఏ విధమైన హెచ్చరికా చెయ్య కుండానే, సభ చాలించిపోవలసిందనికూడా ఆజ్ఞాపించకుండానే పదినిమిషాలపాటు నిరాయుధులైన ఆ ప్రజలమీద నిరంతరమైన అగ్నివర్షం కురిపించాడు. జలియన్‌వాలాబాగ్‌నుంచి బయటికి వెళ్ళేదారులు చాలా స్వల్పమూ, ఇఱుకూ కావటంచేత గుంపు తప్పుకొని పోవటానికి తగుసమయం లేకపోయింది. బ్రిటిషు ఉద్యోగుల కథనం ప్రకారమే 379 మంది ప్రజలు మరణిం చారు; 1137 మంది గాయపడ్డారు; సైనికులుచేసిన కాల్పులు 1650 కావటంవల్ల ఏ తుపాకిగుండున్నూ నిరర్థకంకాక, ఒక్కొ క్కటి ఒక్కొక్క మనిషికి తాకిందని తెలుస్తున్నది.

ఇంతేకాక డయ్యరు, ఏప్రిల్ 10వ తేదీన గుంపుదాడివల్ల గాయపడ్డ ఒక ఆంగ్లేయపాఠశాలా ప్రధానోపాధ్యాయిని నివసి స్తున్న వీథిలో ప్రజలెవ్వరూ నడవరాదనీ, అటు వెళ్ళవలసివచ్చిన వారు నేలమీద ప్రాకుతూనే వెళ్ళాలనీ శాసించాడు. ఇది ప్రత్యే కంగా ఆ వీథివెంటనే వెళ్ళి ఇళ్ళకు చేరుకోవలసిన భారతీయ

కుటుంబాలకు వర్తించింది. ఆ వీథి ప్రవేశించిన భారతీయుడెవ డైనా సరే! వాహనంమీద పోతూఉన్నా, అది దిగి, ఆ వీథి పొడుగునా ప్రాకి వెళ్ళవలసిందే. గొడుగు వేసికొన్న భారతీయుడు దానిని అక్కడ ముడిచివేసి ప్రాకుతూపోవాలి. ఆ జిల్లాలన్నింటి లోనూ ఎదురైన ఆంగ్లేయునికి భారతీయుడు నమస్కరించి మరీ ముందుకుసాగాలి. ఆ పాఠశాలోపాధ్యాయునికి దెబ్బలు తగిలిన స్థలంలో ఒక స్తంభంపాతి, పై ఆజ్ఞలను ఉల్లంఘించిన భారతీయుణ్ణి కొఅడాతో కొట్టటానికిన్నీ ఏర్పాటు జరిగింది.

తాను చేసిన ఈ క్రూరచర్యలూ, కఠినశాసనాలూ విప్లవకారుల్ని నిరుత్సాహపఱచి, ప్రభుత్వంపట్ల జనసామా న్యానికి భయభక్తులు కలిగించాలనిచేసిన వేనని జకరల్ డయ్యారు సమర్థించుకొన్నాడు. ఈ విషయమై విచారించిన బ్రిటిషు అధికారుల నివేదిక ఇలా అంటున్నది. "ఆయన ఆవిధంగా చెయ్యటంవల్ల ప్రజలను అణచివెయ్యటంలో కృతకృత్యుడైనా డని నిస్సంశయంగా చెప్పవచ్చును. అయితే అలా అణచి వెయ్యటంవల్ల ప్రజలలో ఆయన వాంఛించిన పరివర్తనానికి కేవలం విరుద్ధమే సంభవించింది." డయ్యారు తత్క్షణం తన ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి, ఇంగ్లాండుకు దయచేయవలసి వచ్చింది. హిందూదేశంలో ప్రజలు ఆయనను ఎంత తీవ్రంగా విమర్శించారో, ఇంగ్లండులోనూ ప్రజలు ఆయనను అంత తీవ్రంగా విమర్శించారు. అయితే అక్కడమాత్రం జాతివిద్వేష జనితమైన క్రోధావేశంతో విమర్శజరుగలేదు. ఆ నాడు లండ నులో ఎడ్విను మాంటేగ్ హిందూదేశప్రభుత్వానికి కార్య దర్శిగా ఉండేవాడు. అప్పటి ఆ ప్రభుత్వం "భారతీయుణ్ణి వీథి

వెంట ప్రాకి వెళ్ళవలసిందన్న డయ్యరు శాసనం నాగరక ప్రభుత్వంలోని ఏ వ్యక్తికైనా మనోవేదన కలిగించేదే!" అని ఉద్ఘాటించింది.

ఆనాటి భారతజాతీయోద్యమాన్ని తత్కాలానుగుణంగా పరిశీలించినట్లయితే అమృతసర్‌లో జరిగిన హింస ఎంతో విషాదకరమైందని తోచకమానదు. అయితే అదే చరిత్రలో ఒక ముఖ్యమైనమార్పు తీసికొనివచ్చిందని కూడా అంగీకరించక తప్పదు. బ్రిటిషు ప్రభుత్వంపట్ల భక్తివిశ్వాసాలు కల భారతీయులుకూడా ఇక ఆ ప్రభుత్వంవల్ల కలిగే మేలు లేనే లేదనే నిర్ణయానికి వచ్చారు. దుఃఖవివశుడైన మహాత్ముడు అతి శీఘ్రంగా రాజకీయాల్లో పురోగమించటానికిన్నీ ఆ సంఘటనే కారణమైంది. అది తటస్థించకపోయినట్లైతే ఆయన మార్గం మరొకవిధంగా ఉండేది. నిజానికి సజ్జనులయిన ఎందరో ఆంగ్లేయులకున్నూ ఆ విషాదసంఘటన ఎంతో వేదన కలిగించింది. తాము భారతదేశంపట్ల అపరాధం చేసినవారమైనామని వారు విచారించారు. హిందూదేశీయుల భవిష్యత్తు చక్కబఱచటానికి తాము ఏదో ఒకటి చేయాలని భావించారు. ఎడ్విన్ మాంటేగు, రాజప్రతినిధి అయిన చెల్మ్స్‌ఫర్డూ అలాభావించిన వారిలో ముఖ్యులు. తత్ఫలితంగా ఆ 1919వ సంవత్సరంలోనే భారతీయులకు ప్రభుత్వంలో భాగం కలిగేటట్లు రాజ్యాంగాన్ని సవరించటానికి మాంటేగు చెల్మ్స్‌ఫర్డ్ సంస్కరణ ఆవిర్భవించింది.

అయితే అమృతసర్‌లో జరిగిన క్రూరహింస అటు తర్వాత ఇరవైసంవత్సరాలపాటు భారతీయులెవ్వరూ బ్రిటిషు

ప్రభుత్వంపట్ల అనురక్తులు కాజాలని పరిస్థితి తెచ్చిపెట్టింది. ఆంగ్లేయులను ఎన్నటికీ విశ్వసించ నేరాదనే భావం ప్రబలి పోయింది. సంప్రతింపులకు అవకాశం లేకపోయింది. ఉభయుల మధ్యా శత్రుభావమూ ప్రతీకారవాంఛా విస్తరించాయి. కేవలం ఒక్క ఉన్నతోద్యోగి తొందరపడి ఒక నిశ్చయానికివచ్చి చేసిన పనివల్ల చరిత్రగతి మరొకవిధంగా మారటం సాధారణ విషయంకాదు జనరల్ డయ్యర్ (హిందూదేశంలోనేపుట్టినా, ఖరిమ్ టోరీ పాఠశాలలో చదివి, తన 19వ సంవత్సరంలోనే సైనికోద్యోగంలో ప్రవేశించాడు.) తన ప్రత్యేకవర్గంలో పెరిగి అదేవాతావరణంలో సుశిక్షితుడైనాడు. కాని యిలాజరగటం వల్లనే అతని నడవడి ప్రతిభారతీయుడూ బ్రిటిషుప్రభుత్వాన్ని పూర్తిగా ద్వేషించటానికి కారణమైంది.

## 3

వేసవి అంతా గాంధిమహాత్ముడు అమృతసర్‌కు వెళ్ళటానికి వీలులేకపోయింది. చివరకు చెల్మ్సఫర్డు ప్రభువు ఆయనకు "అక్టోబరునెల 17 వ తేదీ దాటినతర్వాత ఎప్పుడైనాసరే ఎక్కడికైనా వెళ్ళటానికి స్వేచ్ఛయివ్వబడిం"దని తంతివార్త పంపాడు. (దీనినిబట్టి యింతకుముందే మాంటేగు చెల్మ్సఫర్డు సంస్కరణలు లండనులో ఆమోదం పొందాయనీ గాంధిజీకి ఇలా అనుమతి యివ్వడం దాని ఫలితమే అనీ భావించవచ్చు.) మహాత్ముడు ఎక్కడకు వెళ్ళినా శోకవివశులైన ప్రజలు గుంపులు గుంపులుగా ఆయనచుట్టూ మూగుతూవచ్చారు. వీరు అటుతర్వాత ఆయనను ఎన్నడూ విడువలేనంతగా సన్ని

హితులయినారు. ముస్లిములు అధికసంఖ్యలో ఉన్న లాహోరు నగరంలో ప్రజలు ఆయనపట్ల చూపిన అనురాగం ఎన్నటికీ మఱవరానిది, జలియన్‌వాలా హింసలనుగుఱించి వాస్తవవిష యాలు తెలిసికొనటానికి ఆయన అమృతసర్‌లో కొంతకాలం ఉన్నాడు. జవహర్లాల్ తండ్రి మోతీలాల్ నెహ్రూ ఈ సమా చారం సేకరించే విషయంలో గాంధిజీతో కలిసి పనిచేశాడు. ఆయన కాంగ్రెసులో గొప్ప గౌరవం గడించిన నాయకుడే కాక, ప్రథమశ్రేణికి చెందిన సుప్రసిద్ధ న్యాయవాదికూడా. ఈయనతోబాటు ఇంకా కాంగ్రెసువారు ఎందఱో సమాచారం ప్రోగుచేయటానికి కృషిచేసినా, సమగ్రనివేదికను రూపొందించే భారం మహాత్మునికే ఒప్పజెప్పారు.

గాంధిజీ అప్పటివఱకూ పంజాబు చూచి యెఱుగడు. తనకు హిందూదేశంలోని తక్కినప్రాంతాలలోకంటె అక్కడ ఎంత అద్భుతమైన స్వాగతం లభిస్తుందో ముందుగా ఆయన ఊహించుకోనట్లే కనబడుతుంది. ఏప్రిల్ నెలలో బొంబాయి నుంచి పంజాబుకు బయలుదేఱి రక్షకభటులు తన్ను అడ్డగించి ప్రశ్నించినప్పుడు ఆయన "అక్కడ నన్ను ఎఱిగినవారెవ్వరూ లేరు." అనే అన్నాడు. వేలకొలది పంజాబీలు తమ యిక్కట్లు విన్నవించుకొనటానికి ఆయనముందు గుమిగూడారు. వారు చెప్పుకొన్నవాటిలో కొన్ని అతిశయోక్తులూ, నిరాధారాలూ అనేభావం ఆయనలో కలిగినప్పటికీ, సహజమైనఓర్పుతో ఎవరు ఎంతచెప్పినా శ్రద్ధగా వింటూవచ్చాడు. అధికారపూర్వకంగా బ్రిటిషు ఉద్యోగస్థులు ఈ సందర్భంలో సేకరించిన సమాచారం కంటె గాంధిజీ ఏ విధమైన అధికారమూ లేకుండా సేకరించిన

సహూచారం ఎంతో సాక్ష్యబలంతో కూడిఉన్నది. దీనికి కారణం బ్రిటిషు ఉద్యోగులకు ఆ కార్యంలో సాయపడటానికి ఏ భారతీయుడూ సమ్మతించకపోవటమే. గాంధీజీ నివేదికలోని అంశాలే యథార్థాలో ప్రభుత్వనివేదికలోనిఅంశాలే సత్యాలో ఇప్పుడు మనం నిర్ణయించలేము. ముఖ్యంగా నిహతులూ, క్షతగాత్రులూ అయినవారిసంఖ్యలను నిర్ణయించటంలో ఈ రెండు నివేదికలకూ తేడావచ్చింది. అయితే ఈ విచారణవల్ల గాంధీజీ జీవితంలో ఒక ముఖ్యమైన మార్పు వచ్చింది. వెనుకటికంటె ఇప్పుడు ఆయన రాజకీయాలకు చాలా సన్నిహితుడైనాడు. ఈ విచారణ జరిపిన తర్వాత ఆ సంవత్సరములో జరిగిన కాంగ్రెసు వార్షికసమావేశంలోగానీ, కాలిఫావిషయమై తటస్థించిన హిందూమహమ్మదీయుల సంప్రతింపులలోగానీ పాల్గొనకుండా ఉండలేకపోయాడు. మద్రాసులో వచ్చిన స్వప్నంతో ఆయన ప్రారంభించిన కార్యక్రమం యథార్థానికి ఆయన వాంఛించినా,వాంఛించకపోయినాయిలా భారతరాజకీయాలలో కేంద్రస్థానానికి ఆయనను నడపించింది.

భారతదేశంలోని మహమ్మదీయులకు ప్రాణపదమైన ఇస్లాముకాలిఫాసమస్యతో ఈ పురోగమనం అతిశీఘ్రంగా సాగింది. అసలు గాంధీజీ యావజ్జీవితమున్నూ సహజంగా విశ్వకల్యాణంకోరే వ్యక్తి కాబట్టి మహమ్మదీయులకు ఆప్తమిత్రుడుగా ఉంటూవచ్చాడు. ఒకసారి ఆయన యింకా హిందూదేశానికి తిరిగిరాకముందు దక్షిణాఫ్రికాలో తన సత్యాగ్రహానికి అంతిమపరీక్ష హిందూముస్లిము సౌహార్దం సాధించటంలోనేఉన్నదని చెప్పాడు. అప్పుడు ఆవిధంగా ఉభయజాతులకూ

ఐక్యం సాధించటానికి అవకాశం వచ్చింది. దానిని ఆయన త్రోసివేయలేకపోయాడు. 1919వ సంవత్సరం నవంబర్‌లో ముస్లిము పెద్దల ఆహ్వానంమీద ఢిల్లీలో జరిగే ముస్లిము సమావేశానికి వెళ్లాడు. ముస్లిములు మహాత్మునితోడ్పాటు తమకు అత్యావశ్యకమని భావించటంచేత తమ సమావేశంలో ఆమోదం పొందవలసిన తీర్మానాలలో గోసంరక్షణకూడా ఒకటిగా చేర్చారు. కాని యిది అంతఃకరణశుద్ధిగాచేసే తీర్మానం కాదని భావించటంచేత మహాత్ముడీ ప్రతిపాదనను నిరాకరించాడు. గోవధమానటంద్వారా హిందూ సంప్రదాయాలను మహమ్మదీయులు గౌరవించదలచుకొంటే అలాచేయవచ్చును. దానికీ ఖిలాపత్తు సమస్యకూ సంబంధంలేదు. హిందువులుమ్నా ఖిలాపత్తు విషయంలో మహమ్మదీయులను సమర్థించదలచుకొంటే సమర్థించవచ్చునుగానీ, గోహత్యానిషేధాన్ని అందుకు పణంగాపెట్టుకోగూడదని, మహాత్ముడు ఉద్దేశించాడు.

మహాత్ముడు ఉపన్యాసాలు జరుగుతూ ఉన్నంతసేపూ ఉపన్యాస వేదికదగ్గఱనేకూర్చుండి చర్చలన్నీ సావధానంగా విన్నాడు. టర్కీవిషయంలో అతికాఠిన్యం ప్రదర్శిస్తున్నందుకు భారత మహమ్మదీయులు బ్రిటిషుప్రభుత్వధోరణిని ఖండించారు. మనసులో జరిగే మథన అంతా బయటికి ఏదో ఒకవిధాన ప్రకటించితీరాలని సభ్యులు భావించారు. టర్కీవిషయంలో విధించబడ్డ షరతులు ప్రాచీన ముస్లిమురాజ్యానికి అవమానకరాలనీ, ముస్లిములోకానికి కేంద్రమైన కాలిఫాప్రభుత్వాన్ని విధ్వంసంచేసేవనీ అందఱూ నిశ్చయించారు.

గాంధిజీ ఉపన్యసించవలసిన తరుణం వచ్చేసరికి ఆయన

ఒక్క సత్యాగ్రహమే ముస్లిముల ఆశయాలను సాధించటానికి పనికివస్తుందని ప్రబోధించాడు. అయితే ఆ సత్యాగ్రహంఅనేది ముస్లిములోకానికి అంతవఱకూ పరిచితమైనది కాకపోవటం చేతనూ, బోధపఱచుకొనటానికిన్నీ సుసాధ్యమైనది కానందు వల్లనూ ఆయన వారికి బాగా నచ్చజెప్పలేకపోయాడు. మహమ్మదీయసంప్రదాయంలోగానీ, నిత్యజీవితంలోగానీ సత్యాగ్రహం అనేది అంతవఱకు లేనేలేదు. అది హిందువులలోనే చాలామందికి కష్టసాధ్యమైనది. పైగా ఆ పదమున్నూ సాంస్కృతికం కాబట్టి ఇంగ్లీషుమాట్లాడే ముస్లిములకు ఎంతమాత్రమూ బోధపడ్డదికాదు. తర్వాత కొన్నాళ్ళకు ఈ సత్యాగ్రహానికి గాంధిజీ నాన్-కో ఆపరేషన్ (సహాయనిరాకరణం) అనే ఆంగ్ల పదం సరిగా వర్తిస్తుందని భావించి, దానినే వాడుతూవచ్చాడు.

ముస్లిములు ప్రతిపాదించినట్లుగా ఆంగ్లవస్త్ర బహిష్కారం ఒక్కటే కార్యసాధకంగా కనిపించలేదు. అన్నిరంగాలలోనూ ప్రభుత్వంతో సహాయనిరాకరణం చేయటమే అవసరమని గాంధిజీ చెప్పాడు. బ్రిటిషుప్రభుత్వం ఇచ్చే ఉద్యోగాలనూ, బిరుదులనూ నిరాకరించాలనీ, ప్రభుత్వపు పాఠశాలలనూ, న్యాయస్థానాలనూ బహిష్కరించాలనీ ఉద్బోధించాడు. ఎంతో స్వార్థత్యాగానికీ, నష్టానికీకూడా సిద్ధపడి ముస్లిములు మొత్తం బ్రిటిషుప్రభుత్వ యంత్రాన్ని స్తంభింపజేయాలనీ, భూమిపన్ను వగైరా ప్రభుత్వానికి చెల్లించే సుంకాలను వేటినీ చెల్లించకపోవటం అందుకు సాధనమనీ ప్రబోధించాడు. అయితే వారు అనుకొంటున్నట్లు టర్కీపట్ల బ్రిటిషువారి శాంతినియమాలు కఠినంగా ఉంటేనే తప్ప అంత

తీవ్రమైన చర్య తీసికోరాదనీ, నిజంగా బ్రిటిషుప్రభుత్వం కఠినంగానే ప్రవర్తిస్తే సత్యాగ్రహమే అందుకు తగిన మందనీకూడా ఉద్ఘాటించాడు.

ఆయన అన్నమాటా, ఆ భావమూ తర్వాత కొన్ని సంవత్సరాలపాటు భారతీయ ప్రజాజీవితంమీద అత్యద్భుత ప్రభావాన్ని కలిగించాయి. ఇంత జరిగినా ఆ సమావేశం ముగిసిన ఒక నెలరోజులలో గాంధిజీ బ్రిటిషుప్రభుత్వంపట్ల అనుకూల్యాన్నే ప్రదర్శించేటట్లు ఒక నూతనపరీక్ష ఆసన్నమైంది.

ఈ పరిస్థితికి మూలం మాంటేగు చెల్మ్స్ఫర్డ్ సంస్కరణలే. భారత దేశరాజ్యాంగంలో ఇవి ప్రథమసంస్కరణలు. అమృతసర్ కాంగ్రెస్‌లో కాంగ్రెసు వార్షికసమావేశం జరగటానికి ఒకరోజు ముందుగా ఈ సంస్కరణలు ప్రజాకోటికి విశదీకరించటం జరిగింది. తక్కిన భారతీయనాయకుల కందటికీ ఆ రాజ్యాంగ సంస్కరణలు తృప్తి కలిగించటలేదు. "ఇవి నాకుకూడా అంతగా రుచించటంలేదు." అని గాంధిజీకూడా అన్నాడు. అయితే విశ్వాసంతో ఆ ప్రతిపాదనలను ఆమోదించటమే తెలివిగలపని అనీ, వాటివల్ల కలిగే ప్రయోజనం ఏమిటో అనుభవపూర్వకంగా గ్రహించటమే ముందు చేయవలసినదనీ ఆయన భావించాడు.

ఈ సమయానికి గాంధిజీకి ప్రజలలో పలుకుబడి ఎంతో హెచ్చింది. ఆయన తోడ్పాటులేకుండా జాతీయసంస్థ (నేషనల్ కాంగ్రెస్) పురోగమించటం అసాధ్యమని కాంగ్రెసులోని న్యాయవాదులూ, ఇతర విద్యాధికులూ అభిప్రాయపడ్డారు. అయితే మాంటేగు చెల్మ్స్ఫర్డు సంస్కరణలపట్ల తనకు

కలిగిన అభిప్రాయంతో కాంగ్రెస్ సభ్యులెవ్వరూ ఏకీభవించరని గ్రహించేసరికి, అందువిషయమై వాదోపవాదాలు లేవదీయకుండా తన ఆశ్రమానికి తాను వెళ్ళిపోవటమే సముచితమని ఆయన భావించాడు. అయితే కాంగ్రెసువారు ఆయనను అలా వెళ్ళనీయలేదు. ఆయన పరోక్షంలో కాంగ్రెసు ఏమి తీర్మానించినా అది సామాన్యభారతీయులందరికీ అర్థరహితంగానే తోస్తుందని వారు భయపడ్డారు. ఆయనలేని సభలో ఆమోదితమైన తీర్మానం 'ఆయనకు సమ్మతం కానిదే' అని విశదమవుతుందనీ, అందువల్ల ప్రజలతోడ్పాటు తమకు లభించదనీ వారి భయం. మళ్ళీనాటకం ప్రారంభమైంది. గాంధిజీ తన అభిప్రాయాన్ని సూటిగా చెప్పాడు. తర్వాతజరిగిన చర్చలలో ఆయన మౌనమే అవలంబించినా మొత్తంమీద ఆయన ప్రభావం కొంతవరకు తోడివారిమీద ప్రసరించింది. తన అభిప్రాయాలతో సంపూర్తిగా ఏకీభవించని వారితో కాలక్షేపంచెయ్యటం ఆయనకు సమ్మతం కాకపోయినా సభముగిసేవరకూ ఉన్నాడు. ఎడ్విన్ మాంటేగును అభినందిస్తూ సంస్కరణలను మాత్రం తిరస్కరిస్తూ, అసమర్థతకారణంగా చెల్మ్స్‌ఫర్డు ప్రభువును పదవినుంచి విరమింపజెయ్యాలని బ్రిటిషుప్రభుత్వాన్ని కోరుతూ కాంగ్రెస్ తీర్మానించింది. (డయ్యరు చర్యలను రాజప్రతినిధి సమర్థించాడు) గాంధిజీ ఆశయాలు ఏమాత్రంవ్యక్తమైనా, అవి భారతీయ యువకుల ఆవేశానికి కేవలం నిరోధకాలుగా కనిపించినా, వాటిని ఎవరూ తిరస్కరించలేని వాతావరణం కలిగింది. కాబట్టి కాంగ్రెస్ ఆ సభలోచేసిన తక్కిన తీర్మానాలన్నీ గాంధిజీ సలహాలకు అనుగుణంగానే జరిగాయి.

ఏమైనా అచిరకాలంలోనే గాంధిజీకి బ్రిటిషువారి చిత్త శుద్ధిపట్ల విశ్వాసం నశించింది. లండను ప్రభుత్వవర్గంలో ఎడ్విన్ మాంటేగుకుతప్ప తక్కినవారికెవ్వరికీ కాలిఫాల ప్రభుత్వం రద్దుకావటం భారతమహమ్మదీయులలో ఎటువంటి భావం కలిగించిందో అర్థం కాలేదు. టర్కీతో సంధికి నిర్దాక్షిణ్యమైన షరతులు విధించబడ్డాయి. జనరల్ డయ్యరుకు భారతదేశం నుంచి యింకా నెలనెలా ఉద్యోగవిరమణానంతర సహాయవేతనం వెళ్ళుతూనే ఉన్నదనీ, అమృతసర్ హింసలతర్వాతకూడా ఇంగ్లాండులో ఆయన సాహాయ్యార్థం పెద్ద నిధి బహూకరించటం జరిగిందనీ తెలియటంవల్ల భారతీయులందఱూ క్రోధోద్రిక్తులైనారు. ఇవిన్నీ, ఇంకా అనేక సంఘటనలున్నా, రౌలటు చట్టం అమలులోనే ఉండటమున్నా 1920వ సంవత్సరంఏప్రిల్ నెలలో గాంధిజీ స్వపరిపాలనావాదిసంఘం (Homerule league) వాదాన్ని ఆమోదించటానికి ప్రోద్బలకాలయినాయి. నాటి ప్రభుత్వంపట్ల ఆయన అప్పటికీ విపరీత విప్లవభావం ప్రకటించకపోయినా కొంతవఱకైనా ప్రతికూలుడు కావటానికి ఇదే ప్రథమ నిదర్శనం. అంతకుముందెన్నడూ లేనంతగా ఆయన రాజకీయాలలో పురోగమించాడు. భారతజాతీయ సంస్థ (Indian National Congress) లో స్వపరిపాలనావాదులుకూడా కలిశారు. దానితో భారతరాజకీయపక్షం సుసంఘటితమైంది. అయితే గాంధిజీ ఆమోదమే స్వపరిపాలనావాదులకు ఎంతో ఉత్సాహం కలిగించి వారు కాంగ్రెసుతో సహకరించటానికి కారణమైంది.

సహాయనిరాకరణం కార్యరూపం తాల్చటానికి ఇవ్వాడు

తరుణం వచ్చింది. ఖిలాఫత్తు ఉద్యమానికి అదే పరమసాధన మని గాంధిజీ చెప్పాడు. హిందువులతోడ్పాటు తమకు ఉంటుం దని గాంధిజీమాటవల్లనే ముస్లిములకు విశ్వాసం కలిగింది. “శ్రీవారి ప్రభుత్వానికి ఎటువంటి తోడ్పాటూ చేయవల”దని తాను భారతదేశంలోని ముస్లిములకూ హిందువులకూ ఉప దేశించినానని గాంధిజీ రాజప్రతినిధికి లేఖవ్రాశాడు. “అవివేక పథాలన్నింటా అధమాధమం.” అని సహాయనిరాకరణోద్య మాన్నిగురించి ఆ రాజప్రతినిధి అభిప్రాయం వెళ్ళబుచ్చాడు. జూలై 31 వ తారీఖున భారతదేశం అంతా నిరాహారదీక్షతో దైవప్రార్థన చేయాలని గాంధిజీ ఆజ్ఞాపించేశాడు. ఆగస్టు 1 వ తేదీన సహాయనిరాకరణోద్యమం మొదలు కావలసిఉన్నది. అయితే ఉద్యమం ప్రారంభంఅయినతర్వాత అందులో అవివేక చర్యఏమీ లేదనిస్పష్టపడ్డది. హైందవులూ,ముస్లిములూపరస్పర సహకారంతో ప్రజలలో చిత్తశుద్ధి ఘటించటానికి ప్రయత్నిం చారు; ఆంగ్లదేశంనుంచి వచ్చేవస్త్రాలను ఆంగ్లేయులిచ్చే ఉద్యో గాలనూ పరిత్యజించాలని ప్రబోధించారు. గాంధిజీ స్వయంగా దేశంలో పర్యటన ప్రారంభించి స్వపరిపాలనాసందేశాన్ని ప్రజ లకు తెలియజెప్పటం మొదలుపెట్టాడు. సహాయనిరాకరణం ప్రారంభించినంతలోనే 1920 వ సంవత్సరం సెప్టెంబరునెలలో తటస్థించిన ప్రత్యేకపు కాంగ్రెసు సమావేశంలో ఆయనకు ఎంతో ప్రాముఖ్యం లభించింది. సహాయనిరాకరణం జరపటా నికి ఆ సభవారు ఆమోదించారు. తర్వాత డిసెంబరునెలలో నాగపూరులో జరిగిన కాంగ్రెస్ వార్షికసమావేశంలో తిరిగి దానిని బలపఱచటం జరిగింది. ఆ సమావేశంలో గాంధిజీ

కాంగ్రెసుకు ఒక నియమావళిని సూచించాడు. దాని ప్రకారం గ్రామాలూ జిల్లాలూ నగరాలవారీగా కాంగ్రెసుసంఘాలు నిర్మించటమున్నూ అఖిలభారతసంఘంలో 350 మంది సభ్యులూ కార్యాచరణసంఘంలో 15 మంది సభ్యులూ ఉండటమున్నూ అవసరమని నిర్ణయించటం జరిగింది. ఈ పద్ధతిప్రకారం కాంగ్రెసుసిద్ధాంతాలు ఆచరణసాధ్యాలు అయే అవకాశం కలిగింది. ఈ విధంగా బ్రిటిషువారివల్ల కేవలం నిమితరగతికి చెందిన న్యాయవాదులూ విద్యాధికులతో ఏర్పాటైన కాంగ్రెస్ సంస్థ భారత దేశంలోని జనసామాన్యం అంతటి లోనూ వేళ్ళు పాదుకోగలిగిన నూతనసంస్థగా రూపొందింది.

1920 వ సంవత్సరం కడపటిభాగంలోనూ, 1921 వ సంవత్సరంలో చాలావరకున్నూ గాంధిజీచేసిన దేశపర్యటనవల్ల ఆయన రైలుప్రయాణంతో చేరదగిన ప్రతిప్రదేశమూ సందర్శించటం జరిగింది. కొన్నికొన్ని జిల్లాలలో రైలుమార్గంలేని చోట్లున్నూ సందర్శించాడాయన. ఎక్కడకు వెళ్ళినా విదేశ వస్త్రాలను బహిష్కరించవలసిందని ప్రజలకు విజ్ఞప్తిచేశాడు. పెద్దపెట్టున విదేశవస్త్రాలను దహించివేయటం ఆయనే ప్రారంభం చేశాడు. కొన్నికొన్ని సమయాలలో మనుష్యులు కౌపీనం మాత్రం ధరించి విదేశవస్త్రాలన్నింటినీ తెచ్చి మంటలలో పడవేశారు. విదేశవస్త్రాలు, పోగుపడ్డచోట మహాత్ముడు తనలక్ష్యం ప్రజలకు వివరించి స్వయంగానే ఆ వస్త్రరాశికి అగ్ని ముట్టించేవాడు. భారత దేశం అంతటా విదేశవస్త్రదహనం ఒక ప్రత్యేకమైన ఉద్యమంలాగా సాగింది. ధనికకుటుంబాల లోని కాంతలు ఇంగ్లాండునుంచి తెప్పించుకొన్న అమూల్య

వస్త్రాలను అగ్ని పాలుచేయటానికి ఒకరినొకరు ప్రోత్సహించు కొని నిర్విచారంగా మహాత్ముని ఆదేశాన్ని ఆచరణలో పెట్టారు. స్త్రీలూ, పురుషులూ కూడా రాట్నంమీద నూలుతీయటం మొదలుపెట్టారు. అదే యివ్వాడు దేశభక్తులందరికీ ముఖ్యకర్తవ్యంగా పెంపొందింది. ఇంటిలో అందఱున్నూ రాట్నంమీద నూలుతీయవలసిందని మహాత్ముడు విజ్ఞప్తిచేశాడు. అందఱున్నూ స్వదేశవస్త్రాలే ధరించటం కర్తవ్యమనికూడా ఉద్బోధించాడు.

అప్పటినుంచే ఆయన ఖద్దరు కట్టడం ప్రారంభించాడు. ఆ దుస్తులుమాత్రం వాతావరణాన్నిబట్టి మాఱదగినవిగా ఉండేవి. ఒక తెల్లనిటోపీ (ఇదే తర్వాత తర్వాత "గాంధి టోపీ" అని ప్రసిద్ధిలోకి వచ్చింది.) ఒక దోవతీ, లేదా వంట్లామూ, లాల్చీ ఆయనకు ముఖ్యమైన దుస్తులు. 1921వ సంవత్సరం సెప్టెంబరు నెలనుంచిగానీ దరిద్రనారాయణోచితమైన వేషం అంటే అంగవస్త్రాలు మాత్రమే ధరించటం ప్రారంభించ లేదు. అటుతర్వాత ఎప్పటికీ అవే ఆయన దుస్తులు. చలి కాలంలోమాత్రం స్వదేశపు దుప్పటి లేక సేలువు కప్పు కొనేవాడు.

ఈకాలంలో చందాలు వసూలుచెయ్యటం భారీయెత్తున సాగింది. త్యాగావేశమనేది దేశమంతటా వ్యాపించింది. తర్వాత మహాత్ముడెప్పుడే ఉద్యమం ప్రారంభించినా ఆ ఆవేశం ప్రజలలో వెల్లుబుకుతూ వచ్చింది. దేశస్వాతంత్ర్యంకోసం ప్రజలుచేయవలసిన వాటిలో ఇదే ప్రప్రథమం, మహోన్నతం అని మహాత్ముడు అభిప్రాయపడ్డాడు. కొన్ని నెలలపాటుసాగిన

యీ విదేశవస్త్రదహనోద్యమంలో దేశంలో ఎక్కడాకూడా హింస అనేది తలయెత్తకపోవటం గమనించదగింది.

ఈ కాలంలో చాలా భాగం మహాత్ముడు ప్రఖ్యాత ముస్లిము నాయకసోదరులలో చిన్నవాడైన మహమ్మదాలీతో కలసి దేశపర్యటనం చేయటానికే వినియోగించాడు. హిందూ ముస్లిం ఐకమత్యానికి ఇది అత్యున్నత చిహ్నం అయింది. అయితే 1921వ సంవత్సరం సెప్టెంబరు నెలలో ఈ నాయకులిద్దరూ కలిసే పర్యటిస్తున్నా మహమ్మదాలీని ప్రభుత్వం నిర్బంధించిందికానీ, మహాత్ముణ్ణి నిర్బంధించలేదు. ముస్లిములను బ్రిటిషువారి సేనలో చేరవద్దని చెప్పటమే మహమ్మదాలీ చేసిన ద్రోహం. తర్వాత కొద్దికాలానికి అదే నేరంమీద అతనిఅన్నగారినికూడా ప్రభుత్వం నిర్బంధించింది. తనకు తోడునీడగా ఉంటున్న ముస్లిం నాయకుణ్ణి ప్రభుత్వం నిర్బంధించినందుకు మహాత్ముడు ఎంతో విచారించాడు. ఆ సంవత్సరం అక్టోబరు నెల 5వ తేదీన జరిగిన కాంగ్రెస్ కార్యనిర్వాహకవర్గ సమావేశంలో ఆలీ సోదరులుచేసిన నేరంలో పాలు పంచుకొని ప్రతిభారతీయుడున్నూ అతను సైనికుడుగానీ, సామాన్య పౌరుడేకానీ ప్రభుత్వోద్యోగానికి రాజీనామా ఇయ్యవలసిందని విజ్ఞప్తి చేస్తూ ఒక తీర్మానం చెయ్యవలసిందని తోడి సభ్యులతో చెప్పాడు.

గాంధిజీ దరిద్రనారాయణవేషాన్ని వరించింది ఈ సందర్భంలోనే.

ఈ సంవత్సరాంతంలో బ్రిటిషు యువరాజు భారత దేశాన్ని సందర్శించటం జరిగింది. అయితే దీనికి భారతప్రభు

త్వం ప్రోత్సాహం ఉందో లేదో చెప్పలేము. ఆ సమయాన యూరపు అమెరికాలలో యువరాజు పర్యటనం చాలా జయప్రదంగా కనిపించటంచేత లండనులోని అధికారవర్గాలవారే యిందుకు ఏర్పాట్లుచేసి ఉండవచ్చును. ఆయన రాకతో భారతదేశంలోని విప్లవ ఝంఝూమారుతం సద్దుమణిగిపోతుందని వారు ఆశించిఉండవచ్చు. కాని వారి ఆశకు కేవలం వ్యతిరిక్తమైన ఫలమే కలిగింది. కొన్నికొన్ని నగరాలలో ఆయన పురసందర్శనానికి బయలుదేఱినప్పుడు వీథి అంతా నిర్మానుష్యంగా కనిపించింది. కొన్నికొన్నిచోట్ల అసమ్మతి ప్రదర్శనాలున్నూ జరిగాయి. భారతీయులు బ్రిటిషు ప్రభుత్వంపట్ల సుముఖులుగా లేరని యిందువల్ల స్పష్టమైంది. అయితే దురదృష్టవశాన యువరాజు రాక భారతీయులలో క్రోధావేశానికి కారణమై కొన్నిచోట్ల దౌర్జన్యచర్యలు జరిగాయి. బొంబాయిలో కొందఱు భారతీయులు యువరాజుకు స్వాగతం చెప్పటానికి బయలుదేరారు. ఇది జాతీయవాదులకు క్రోధం కలిగించింది. దానితో దౌర్జన్యచర్యలు జరిగాయి. మహాత్మునికి ఈ వృత్తాంతం చాలా విషాదకరమైంది. వెంటనే ఆయన ఉపవాసం ప్రారంభించి దైవప్రార్థనచేయటం మొదలుపెట్టాడు. హింసాత్మక చర్యలు ఆగేవఱకున్నూ ఆహారం ముట్టనని శపథం చేశాడు. దీనివల్ల ఆయన అయిదురోజులపాటు ఉపవసించవలసివచ్చింది.

అయితే అటువంటి ఉద్రిక్తపరిస్థితులలో బ్రిటిషు ప్రభుత్వం మహాత్ముణ్ణి ఎందుకు నిర్బంధించలేదు అనేది నాటికీ నేటికీ ప్రశ్నగానే ఉన్నది. ఆయన ఆదేశానుసారం నడచినం

దుకే కదా అనేకులు అప్పుడు ప్రభుత్వనిర్బంధానికి గుఱిఅయినారు? మఱి అంతటికీ మూలకారణమైన గాంధిజీని ప్రభుత్వం ఎందుకు ఉపేక్షించినట్లు? ఆ 1921 వ సంవత్సరం అంతమయ్యేసరికి గాంధిజీ అభ్యర్థనను పాటించినందుకుగాను ఇరవైవేల మంది భారతీయులు చెఱసాలలపాలైనారు. ఆ మఱుసటిసంవత్సరం మఱి పదివేలమంది అదేనేరానికి అదేశిక్షకు గుఱి అయ్యారు.

ఇందుకు సమాధానం చాలా తేలికగా చెప్పవచ్చును. అది పలుమార్లు పలువురు చెప్పిందేకూడా! "ఆ ఉద్రిక్తపరిస్థితులలోనే మహాత్ముణ్ణి నిర్బంధిస్తే పరిస్థితులు మఱీ విషమిస్తాయని ప్రభుత్వం భయపడింది." అని అంటున్నారు. ఇది కొంతవఱకు సముచితంగా కనబడుతున్నా అసలుకారణం వేఱే ఉన్నది. మహాత్ముని స్వేచ్ఛకు (అది ఆయనకు బాధాకరంగానే తోచినా) కారణం అప్పటి రాజప్రతినిధి రీడింగుప్రభువు ధోరణే అని ఇప్పుడు తెలియవస్తున్నది. రీడింగుప్రభువు అసాధారణవ్యక్తి. ఆయన కేవలం స్వయంకృషివల్లనే అటువంటి ఉన్నతపదవికి రాగలిగాడు. (ఒకనౌకలో సామాన్యవార్తాహారుడైన బాలుడుగా ఆయన జీవనసంగ్రామంలో ఉఱికాడు. తర్వాత న్యాయశాస్త్రం చదవటానికి పూర్వం కొంతకాలం పండ్లవర్తకంచేశాడు.) 1921 వ సంవత్సరం ఏప్రిల్ నెలలో రాజప్రతినిధిగా భారతదేశానికి రాగానే ఆయన మహాత్ముణ్ణికలుసుకొని మాట్లాడాలనుకొన్నాడు కూడా. ఆ ఉద్యమ తీవ్రతలో వారు ఉభయులూ కలిసికొని మాట్లాడటం ఆ యిద్దఱి అంతరంగిక మిత్రులకూ ఎంతమాత్రం సమ్మతం కాకపోయినా

ఆయన ముందంజవేసి మహాత్మునితో ముచ్చటించాడు. వారి సంభాషణ వివరాలన్నీ ఇటీవల 1945 వ సంవత్సరంలో భారతీయ స్వరాజ్యోద్యమసందర్భంలో ఆయన వ్రాసినలేఖలతో సహా ఆయనకుమారుడు ప్రకటించిన జీవితచరిత్రలో సుస్పష్టంగా కనబడుతున్నాయి.

రీడింగ్ గాంధిజీలు ఈ సందర్భంలో మొత్తం ఆరుసార్లు కలసికొని ముచ్చటించారు. మహాత్ముడు సత్యాహింసలవిషయమై తనలతత్వాన్నీ, రాజప్రతినిధిపట్ల తనకుగల గౌరవాన్నీ ఈ సంభాషణలలో వ్యక్తంచేయటానికి ప్రయత్నించాడు. ప్రారంభంలో రాజప్రతినిధి చాలా విస్మితుడైనాడు. భారత దేశంగురించి ఎంతో తెలిసినవారనిపించుకొన్న ఆయనమిత్రులు ఇంగ్లాండునుంచిఆయనబయలు దేఱనున్నప్పుడు "భారత దేశంలో అతిచతురుడూ దుష్కార్యపరాయణుడూ అయిన బాపూ అనే వ్యక్తితో నీకు పరిచయం కలుగుతుంది జాగ్రత్త!"అని హెచ్చరించారు. అయితే బాపూలో ఆ లక్షణా లేమీా కాన్పించలేదు. పైపెచ్చు బాపూ ఋజువర్తనా, మర్యాదా ఆయనకు బాగా తెలిసివచ్చాయి. ముఖ్యంగా ఆయనపవిత్రత ఎంతోనచ్చింది. అందువల్ల వెంటనే "గాంధిజీ నైతికసిద్ధాంతాలుగానీ, మత దృక్పథంగానీ మహోన్నతాలు." అని ఆ రాజప్రతినిధి ప్రకటించాడు. అయితే రాజకీయాలలో వాటిని మహాత్ముడు ఎలా వినియోగించగలుగుతున్నాడో ఆయనకు అర్థంకాలేదు. మహాత్ముడు అతిసాధారణమైన ధోరణిలోనే ఆయనకు బోధపఱిచాడు. భారతీయులు ముందుముందు ఆత్మపారిశుద్ధ్యం సాధించాలనీ, అది సత్యమూ, అహింసా, ప్రేమా అనేవాటివల్ల తప్ప

సాధ్యంకాదనీ, అలా సాధించిన ఆత్మపారిశుద్ధ్యంవల్ల వారు ఆంగ్లేయుల అధికారం(శ్వేతజాతి ఆధిపత్యం)నుంచి విముక్తి అవలీలగా సంపాదించుకోగలరనీ చెప్పాడు. (అయితే "శ్వేతజాతి ఆధిపత్యం" అనేది మహాత్ముడు చెప్పినమాట కాదనీ, దానిని రీడింగుప్రభువు అలాభావించాడనీ నా అభిప్రాయం.)

మహాత్ముని సమాధానం రీడింగుప్రభువును విస్మితుణ్ణి చేసినట్లు కనిపిస్తుంది. ఏమైనప్పటికీ ఆయనకు మహాత్మునిపట్ల అసాధారణగౌరవం కలిగింది. గాంధిజీసాన్నిధ్యంలో,అదివఱకూ అటుతర్వాతగూడా అనేకులకు అనుభవగోచరమైనట్లే, ఆయనకున్నూ అలౌకికమైన ఒకపవిత్రత గోచరించిఉంటుంది. ఆదివ్య ప్రభావంముందు సాధారణ సంకోచాలన్నీ పటాపంచలై ఉంటాయి. ఇది సత్యమైనా కాకపోయినా గాంధిజీని నిర్బంధించే విషయం ఆయనకు కొన్నినెలలవఱకూ ఎంతమాత్రమున్నూ సమ్మతం కాలేదనడం యథార్థం. లండనులోని ప్రభుత్వాధికారులూ, హిందూదేశంలోని వివిధరాష్ట్రాల గవర్నరులూ మహాత్ముణ్ణి నిర్బంధించవలసిందే అంటున్నా ఆయన ఒక్కడే దానిని ప్రతిఘటించాడు.

1920, 21 సంవత్సరాలలో మహాత్ముని నడవడికి ఒక్క బ్రిటిషువారే విస్మితులు కాలేదు. సహనశక్తి తక్కువై సాయుధవిప్లవం జరపాలనుకొంటున్న కొందఱు భారతీయులున్నూ ఆయన ఉద్యమాన్ని అర్థంచేసుకోలేకపోయారు. గాంధిజీ తమతో ఎన్నటికీ ఏకీభవించడని తెలియడంచేత వారు తమసంకల్పాన్ని కార్యరూపానికి తీసికొనిరాలేకపోయారు. ఆయన ఆమోదముంటేగానీ ప్రజాసామాన్యం ఏ పనికిన్నీ

ఉన్ముఖం కాదు. ఈ విధంగా ఇటు భారతజాతీయవాదులూ, అటు బ్రిటిషువారూ ఆ పరిస్థితిని ఎలాచక్కదిద్దాలో తెలియక కింక ర్తవ్యతా మూఢులైనారు.

ఒక్క గాంధిజీ తప్ప ఇతరనాయకులందఱూ చెఱసాలలకు చేరుకొనేవఱకూ ప్రభుత్వ నిర్బంధాలు సాగాయి. 1921వ సంవత్సరం చివర జరిగిన కాంగ్రెసు వార్షిసమావేశంలో గాంధిజీని కాంగ్రెసుకు సర్వాధికారిగా ఎన్నుకొనటంకంటె మఱొకటి చేయవలసినవని కనబడలేదు.

ఇప్పటికి పరిస్థితినంతా అదుపులో పెట్టటానికి మహాత్మునికి అవకాశం కలిగింది. లక్షలకొలది ప్రజలకు ఆయన మాట వేదశాసనంగా ఉన్నది. ఒక్క భారత దేశమేకాక, ప్రపంచంలో ఎన్నో దేశాలు ఆయన అటుతర్వాత ఏమిచేస్తాడో అని నిరీక్షిస్తూ వచ్చాయి. అతివాదులైన దేశభక్తులు సయహానిరాకరణ పరిధులు దాటి దేశంమొత్తంమీద పెద్దపెట్టున శాసనధిక్కారోద్యమం సాగించటానికి అనుమతించవలసిందనీ, విప్లవానికి అది పూర్తిగా తరుణమనీ ఆయనతో చెప్పుతూ వచ్చారు. హింసాత్మకంగా ఉద్యమం నడపాలని ఆయనసమక్షంలో వాదించటానికి ఎవరికీ గుండెలులేవు. (ఈ సమయంలో విదేశీయాలైన దుస్తులతో అయన సన్నిధికివెళ్ళటానికిన్నీ సాధారణంగా ఎవరూ సాహసించేవారు కారు.) దేశంలోని 30 కోట్ల మంది ప్రజలూ శాసనధిక్కారానికి సిద్ధపడితే అప్పుడు అహింస యెంతమాత్రం సాగదనీ, అప్పుడు తమ సంకల్పానికి తగినట్లు దేశస్వాతంత్ర్యం సంపాదించవచ్చుననీ వంగీయులూ తదితరులూ అయిన అతివాదులు అభిప్రాయపడ్డారనటంలో సందేహంలేదు.

చిట్టచివరకు ఎంతో ఆత్మనిగ్రహంవల్లనూ, సంతత ధ్యానంవల్లనూ మహాత్మునికి ఒక క్రొత్తఊహ తోచింది. తానే నాయకత్వం వహించి, తన ఆదేశాలకు కట్టుపడి ఉండే పరిమితమైన అనుచరవర్గంతో ఒక్క జిల్లాలో ఒక్క చోట మాత్రమే శాసనధిక్కారోద్యమం నడపించాలని నిశ్చయించు కొన్నాడు. అయితే ఈ ఉద్యమం సంపూర్ణమైన ఆత్మార్పణే ప్రధాన లక్షణంగా కల సత్యాగ్రహాన్ని అక్షరాలా అమలు జరపాలని ఆయన ఉద్దేశించలేదు. భారతీయులు ప్రభుత్వ యంత్రాన్ని స్తంభింపజెయ్యటానికి వీలుగా అహింసాత్మకమైన సహాయనిరాకరణం జరిపితే చాలునని మాత్రమే అభిప్రాయ పడ్డాడు.

ప్రప్రథమంగా ఉద్యమప్రారంభానికి మహాత్ముడు బార్డోలీ అనే చిన్న జిల్లాను ఎన్నుకొన్నాడు. ఆ జిల్లాలో మొత్తం ఎనభైవేడు వేల జనాభాకంటె ఎక్కువలేదు. పైగా అక్కడ గ్రామాలే ఎక్కువ. అందువల్ల ప్రజలు హింసాత్మక చర్యలకు సిద్ధపడే అవకాశం ఉండదు. నగరాలలోకంటె గ్రామా లలో ఉండే ప్రజలు కొంచెం సాత్వికులుగా ఉంటారుగదా! అది కేవలం చిన్న జిల్లా అయినప్పటికీ ఆ ప్రాంతంలో బ్రిటిషు ప్రభుత్వం స్తంభించిందంటే మొత్తం దేశంలో అటుతర్వాత కలుగబోయే పరిస్థితికి అది నాంది అవుతుంది. ప్రభుత్వానికి అది ఒక తీవ్రమైన హెచ్చరిక కాకపోదు. మహాత్మునిదృష్టిలో అప్పటికి అంతకంటెపెద్దఎత్తున ప్రభుత్వాన్ని స్తంభింపజెయ్యటం అనవసరమనిపించింది. ఆ హెచ్చరికతోనే ప్రభుత్వానికి వివే కం కలగవచ్చునని తోచింది. అసలు స్వాభావికంగా ఆయన

అతిజాగ్రత్తగానూ, అంతా శుభాంతమే అవుతుందనే నమ్మకంతోనూకూడా వ్యవహరించే వ్యక్తి. ఇతరుల పథకాలన్నింటికంటెనూ బార్డోలీలోమాత్రమే సత్యాగ్రహం సాగించటమనే తన పథకమే ఎన్నోవిధాల ఉత్తమంగా ఆయనకు తోచింది.

కనుక 1922 వ సంవత్సరం ఫిబ్రవరినెల ఒకటవతారీఖున గాంధిజీ తాను చేసికొన్న నిశ్చయాన్ని మృదుధోరణిలో వివరిస్తూ రాజప్రతినిధి అయిన రీడింగ్ప్రభువుకు ఒక లేఖ వ్రాశాడు. అఖిలభారతజాతీయమహాసభ (కాంగ్రెస్)కూడా ఆ సంవత్సరమే నవంబరునెలనుంచీ దేశమంతటా శాసనధిక్కారోద్యమం జరపాలని నిశ్చయించింది. ఇది మహాత్మునికి ఎంతైనా అసంతృప్తి కలిగించింది. తన అనుమతిలేకుండా ఏమీ చెయ్యమనే కాంగ్రెస్సభ్యులచేత ప్రమాణం చేయించుకొన్నాడు. ఆ పరిస్థితులలో మొత్తం భారతదేశంలో శాంతిభద్రతలను రక్షించే శక్తి సబర్మతీ ఆశ్రమంలోని ఆ చిన్న కొద్దిపాటిమనిషి అయిన గాంధిజీకే ఉన్నదికానీ అనంతసేనా సమన్వితమైన బ్రిటిషుప్రభుత్వానికి లేదు.

తర్వాత ఆయన బార్డోలీకి వెళ్ళి తనపథకం కార్యరూపంలో పెట్టటానికి సన్నాహాలు ప్రారంభించాడు. యథాపూర్వంగానే ప్రజలందరికీ తన ఉద్దేశం చెప్పి, ఆ ఉద్యమం ఫలప్రదం కావాలంటే అహింస తప్పనిసరిగా పాటించాలనీ పోలీసుచర్య తటస్థిస్తే దానిని ఎవరూకూడా ప్రతిఘటించరాదనీ ప్రబోధించాడు. ఏ పవిత్రకార్యమైనా ప్రారంభించినప్పుడు దైవప్రార్థనవల్లనూ,ఆస్తికబుద్ధివల్లనూ ఎంత ఉత్తమఫలితంచేకూరుతుందో నచ్చచెప్పి వాటి ప్రాముఖ్యాన్ని అందరికీ తేటతెల్లం చేశాడు.

ఆయన ఇటువంటి కార్యదీక్షతో నిర్విరామంగా పనిచేస్తూఉండగా ఫిబ్రవరి నెల 8 వ తేదీన ఆయనకు ఒక విషాద కరమైనవార్త తెలిసింది. ఆసంఘటన సంయుక్తరాష్ట్రంలోని చౌరీచౌరాజిల్లాలో సంభవించింది. దీని వివరాలు గాంధిజీ ప్రకటిస్తూ వచ్చిన యువభారతం (Young India) అనే వారపత్రికలో ఫిబ్రవరి 16 వ తేదీన ప్రకటించబడ్డాయి. రక్షకభటుల ఆటంకంలేకుండా ఒక ఊరేగింపు బయలుదేరింది. కాని కొంత దూరంవెళ్ళేసరికి కొంతమంది రక్షకభటులు ఊరేగింపులోని వారిమీద దాడిచేశారు. దెబ్బలుతింటూఉన్న ప్రజలు సాయం కోసం కేకలువేశారు. ప్రజలు తిరగబడ్డారు. రక్షకభటులు తుపాకులు పేల్చారు. వారివద్ద ఉన్నకొద్దిపాటి మందుగుండు సామగ్రి అంతమైపోయింది. అందువల్ల వారు తమ ప్రాణాలు రక్షించుకొనటానికి చేరువలో ఉన్న ఠాణాలో చొరబడ్డారు. ప్రజలు ఠాణాకు నిప్పుపెట్టటంవల్ల దానిలో చిక్కుకొన్న రక్షకభటులకు బయటికిరాక తప్పలేదు. అలా వస్తూఉండగా ప్రజలు వారిని చిత్రవధచేసి మంటలలోకి విసరివేశారు.” అని గాంధిజీయే వ్రాశాడు.

ప్రజలు చూపిన యీ ఆవేశము ఆయనకు ఎంతో విచారం కలిగించింది. అందువల్ల 1919వ సంవత్సరంలో మాదిరిగానే ఆయన ఉద్యమాన్ని తత్క్షణం ఆపటానికి నిశ్చయించుకొన్నాడు. ఒక్క బార్డోలీ జిల్లాలోనేకాక, దేశంలో ఎక్కడాకూడా శాసన ప్రతిఘటనం జరపరాదని ప్రజలకు విజ్ఞప్తిచేశాడు. చౌరీచౌరాలో జరిగిన దౌర్జన్యానికి ప్రాయశ్చిత్తంగా అయిదురోజులపాటు నిరాహారదీక్ష పూనాడు.

దానితో ఇటు భారత దేశమూ అటు బ్రిటను దేశమూ కూడా విస్మయసముద్రంలో మునిగాయి. రక్తపాతం అనేది లేకుండా కేవల శాంతిసమన్వితంగా విప్లవంజరపటానికీ, అదిన్నీ దైవ ప్రార్థనాసమన్వితంగా సాగించటానికీ ఒక మానవమాత్రుడికి ఎలా సాధ్యమౌతుందో ఎవరికీ తోచలేదు ఎవరేమనుకొన్నా గాంధిజీ మార్గమే అంత. ప్రజలు ఆయన ఆదేశాన్ని శిరసావహించారు. మఱి యెవరేమి చెప్పినా వారు వినిపించుకోరు. తన అభిప్రాయాన్ని ప్రతిఘటించిన భారతీయులతో గాంధిజీ ఇలా అన్నాడు. "ఆకస్మికంగా ఒక మహోద్యమాన్ని మధ్యలో ఆపివేయటం రాజకీయదృష్టిలో అనర్థకంగానూ, అవివేకంగానూ కనిపించవచ్చునుగానీ, తాత్త్వికదృష్టిలో ఇది ఎంతో అర్థవంతమైనదే."

ఇంతవఱకున్నూ లండనులోని అధికారవర్గాలూ, భారతదేశంలోని ప్రభుత్వోన్నతాధికారులూ ఇస్తున్న సలహాలను అంగీకరించక గాంధిజీని నిర్బంధించటానికి విముఖుడుగాఉన్న రీడింగ్ ప్రభువు గత్యంతరం తోచక ఆయనను నిర్బంధించటానికి ఆజ్ఞయివ్వాలని నిశ్చయించుకొన్నాడు. ఆ రాజప్రతినిధి తన కుమారునికి వ్రాసిన లేఖలలో గాంధిజీ ఏదైనా "విపరీతచర్య"కు దిగితే ఆయనను తాను నిర్బంధించగలనని వ్రాశాడు. ప్రజాస్వామికంపట్ల విశ్వాసం కల ఆ ప్రభువుకు వట్టిసోటిమాటలకు గాను ఒక వ్యక్తిని నిర్బంధించటం ఎంతమాత్రం సమ్మతంగా లేదు. ఆ ఫిబ్రవరినెలలో గాంధిజీచేసిన ఒకే ఒక విపరీతచర్య యేమంటే చౌరీచౌరాలో జరిగిన హింసాకాండకు ప్రాయశ్చిత్తంగా తత్పూర్వం నడుపుతూఉన్న ఉద్యమాన్ని శాంతికోసం

ఆపివేయటమే. అయినా పెద్దపెద్ద రాష్ట్రాలకు పాలకులుగా ఉన్న లాయిడ్, విల్లింగ్టన్, రొనాల్డ్ షే వంటివారు ఆయనను నిర్బంధించవలసిందే అని పట్టుపట్టారు. ఇక కాదనలేక 1922వ సంవత్సరం మార్చి ఒకటవ తారీకున మహాత్ముణ్ణి నిర్బంధించటానికి రీడింగ్ ప్రభువు ఆజ్ఞ యిచ్చాడు. దాని ప్రకారం మార్చి 10వ తేదీన రాత్రి పదిన్నరగంటలకు మహాత్ముడు నిర్బంధంపాలైనాడు.

అయితే చాలాకాలంనుంచీకూడా తన్ను ఏ క్షణాన అయినా ప్రభుత్వం నిర్బంధించవచ్చునని మహాత్ముడు అనుకొంటూనే ఉన్నాడు. ఇక ఏపటిరోజున తనకు ప్రభుత్వనిర్బంధం ప్రాప్తిస్తుం దనగా ఆయన ప్రజలకు ఒక విజ్ఞప్తిచేశాడు. తనకు కూడా ప్రభుత్వనిర్బంధం కలగటం తటస్థించినా ప్రజలు ఎవ్వరూకూడా శాంతిని విడనాడవద్దని అందులో హెచ్చరించాడు. అసలు అంతవఱకూ ప్రభుత్వం తన్ను నిర్బంధించక పోయినందువల్ల ఆయనకు ఎంతో విచారం కలగటమున్నూ సంభవమే. "సాధారణ మనుష్యుడు"వలె నిర్బంధానికి గురి కావటం అనేది మహాత్ముడు "గౌరవభంగం"గా భావిస్తాడని బ్రిటిషు ప్రభుత్వం పొరబడి ఉంటుంది. ఆలస్యంగానే అయినా ఆయనను నిర్బంధించటం జరుగుతుందని సత్యాగ్రహం ప్రారంభించేటప్పుడే ఆయన ఊహించుకొని ఉన్నాడు. ఆ పని జరగక పోతే తన ఉద్యమం సఫలం కాదనికూడా ఆయన భావించాడు. తాను ప్రజలకు దూరంగా ఎక్కడో బందీగా ఉండటం ఆయనకు మనోవేదన కలిగిస్తుందని ప్రభుత్వం భావించింది. అంతే కానీ మొత్తం భారతదేశంలో శాంతి అనేది మహాత్మునిమాట

వల్లనే నిలుస్తున్నది గానీ తమ అధికారంవల్ల కాదనే సత్యం ప్రభుత్వంలో ఎవరూ (చివరకు రీడింగ్ ప్రభువుకూడా) గుర్తించనట్లే కనబడుతుంది.

మార్చి 19వ తారీకున అహమ్మదాబాదులో గాంధిజీని ప్రభుత్వం న్యాయస్థానంలో విచారించటం జరిగింది. ఆయనా, ఆయన పత్రికను ముద్రిస్తున్న యస్.జి. బాంకరూ యువభారత (Young India) వారపత్రికలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా మూడు వ్యాసాలు వ్రాసినందుకూ ప్రకటించినందుకూ శిక్షార్హులౌతున్నారని ప్రభుత్వవాదం. ఆ వ్యాసాలు ప్రభుత్వం పట్ల ప్రతిఘటన ప్రోత్సహిస్తున్నమాట నిజమే. నాటిలో మొదటివ్యాసంలోనే "ప్రభుత్వంపట్ల ప్రతిఘటనమే కాంగ్రెసు లక్ష్యం" అనిస్పష్టంగా ఉన్నది. ప్రభుత్వోద్యోగం చెయ్యటమే ఏ భారతీయసైనికుడికిగానీ భారతీయ పౌరుడికీగానీ పాపం చెయ్యటం ఔతుందని ఆ వ్యాసం ఉద్ఘాటిస్తున్నది. రెండవ వ్యాసం విప్లవపూరితం. ఇది ఒకయుద్ధంగా భావించవలసిందని అందులో ప్రభుత్వాన్ని హెచ్చరించటం ఉన్నది. మూడవ వ్యాసంలో ఆ యుద్ధం అలా చివరవఱకూ సాగుతూనే ఉంటుందనీ, దానికి ఎంతకాలంపట్టినా లెక్క చేసేదే లేదనీ ఉన్నది.

గాంధిజీ నిర్బంధానికి కారణాలుగా కనిపిస్తున్న ఈ మూడు వ్యాసాలలో మొట్టమొదటిది అప్పటికి ఏడునెలల క్రిందనే ప్రచురితమైనది. "మఱి ఆ వ్యాసం ప్రకటితమైనప్పుడే ప్రభుత్వం ఆయనను ఎందుచేత నిర్బంధించలేదు?" అనేది నాటికీ నేటికీచాలామందికి ఆశ్చర్యకరం అయినవిషయం. గాంధిజీ తన్ను ప్రభుత్వం నిర్బంధించాలని కోరుతూ ఉండటంచేతనే ప్రభుత్వం

ఆయననునిర్బంధించలేదని ఎవరైనా భ్రాంతిపడవచ్చును. అసలు యథార్థం దీనికి కేవలం వ్యతిరేకంగానే ఉన్నది. గాంధిజీకి అటువంటి కోరిక ఉన్నదని ప్రభుత్వం గ్రహించినట్లే కనబడదు. ఎంతో వివేకశాలి అయిన రీడింగ్ ప్రభువుకూడా ఆ సత్యం గ్రహించలేదు. గాంధిజీ పద్ధతులు ఆనాటి ప్రజలకు అతినూతనాలుగా కన్పించాయి. ఆయన సమకాలికులకెవ్వరికీ అప్పటి కవి బోధపడనేలేదు.

గాంధిజీ విచారణ జరుగుతూఉండగా న్యాయస్థానం చుట్టూ పెద్దసైనికదళం ప్రదర్శనకూడా జరిగింది. ప్రజలు మహాత్ముని అభిమతం గ్రహించి తదనుకూలంగా మెలగుతూ ఉన్నప్పుడు అక్కడ ఇలా సైనికబలప్రదర్శనం జరవటం నిరర్థకమే కాని వేఱుకాదు. ఆ రోజున భారతదేశందృష్టి (ప్రప్రథమంగా ప్రపంచదృష్టికూడా) గాంధిజీపైనే కేంద్రీకృతమయింది. గాంధిజీ తాను ప్రభుత్వవాదం ప్రకారం దోషినే అని అంగీకరించాడు. అంతేకాక తాను ప్రభుత్వానికి ప్రతికూలుణ్ణే అనీ, ఈ అభియోగానికి ఎంతో పూర్వంనుంచీకూడా ఆ ప్రతికూలత ప్రకటిస్తూనే వచ్చాననీ నిర్భయంగా చెప్పాడు. ఆ ప్రభుత్వాన్నీ దానిచేత కల్పించబడ్డ న్యాయశాస్త్రాన్నీ ఆమోదిస్తున్నట్లయితే అందుకు తగిన కఠినతమశిక్షను తనకు విధించవలసిందని కూడా న్యాయాధికారిని అభ్యర్థించాడు.

తత్పూర్వంవరకూ బ్రిటిషుప్రభుత్వంపట్ల భక్తివిశ్వాసాలు కలవాణ్ణి అని చెప్పుకొన్న మహాత్ముడు అప్పుడు ప్రభుత్వాన్ని ప్రతిఘటిస్తున్నానని చెప్పటంవల్ల అత్యద్భుతఫలితం కలిగింది. ఆయన ప్రవర్తన ఆ 1922 వ సంవత్సరం నాటికేన్నీ

అందఱికీ ఆశ్చర్యకరమే అయింది. సామాన్యప్రజలందఱూ "ఆయన తనచర్యను తాను సమర్థించుకోనన్నా సమర్థించు కొంటాడు; లేదా, తన్ను క్షమించవలసిందని ప్రభుత్వాన్ని ప్రార్థిస్తాడు."అనే అనుకొన్నారుగానీ మఱొకవిధంగా ఊహించ లేదు. అయితే మొదటినుంచీ ఆయనతత్త్వాన్ని అర్థంచేసు కొంటూ ఉన్నవారికి మాత్రం అది ఆయనవద్దనే కాదనీ తన్ను తానే విమర్శించుకొని తేలిన నిర్ణయంప్రకారం అధిక శిక్ష కోసం న్యాయమూర్తిని అభ్యర్థిస్తాడనీ తోచకపోలేదు.

న్యాయమూర్తి సి. యస్. బ్రూమ్‌ఫీల్డు ఎంతో విషణ్ణు డైనాడు. ఆయనకర్తవ్యం తేలికైనది కాదు. "ఈ నాటివఱకూ నా విచారణలోపడ్డవారందఱికంటెనూ మీరు అతీతులుగా ఉన్నారనే విషయం నేను గుర్తించకపోవటం అసంభవం." అని ఆ న్యాయమూర్తి అన్నాడు. గాంధిజీనిగుఱించి చెబుతూ "ఆయన లక్షలకొలదిప్రజలదృష్టిలో ఉత్తమ దేశభక్తుడూ, మహానాయకుడూ." అన్నాడు. "రాజకీయాలలో మీతో ఏకీ భవించనివారుకూడా మిమ్మల్ని ఉత్తమలక్ష్యాలు కల మహాపురు షులుగానూ, ఉదారప్రవర్తనగల యోగీశ్వరులుగానూ భావి స్తారు." అని కూడా బ్రూమ్‌ఫీల్డు మహాత్ముణ్ణి ప్రశంసించాడు.

ఏమైతేనేమి ? మహాత్మునికి ఆఱుసంవత్సరాలు సాధా రణ కారాగారవాసశిక్ష విధించటం జరిగింది. "ఇటుతర్వాత దేశపరిస్థితులలో ఏమైనా మార్పులువచ్చి ప్రభుత్వం ఈ శిక్షా పరిమితిని తగ్గించి, మిమ్మల్ని విడుదలచేస్తే అందుకు నా కంటె ఎక్కువగా సంతోషపడేవారుండరు."అన్నాడు ఆన్యాయమూర్తి.

'ఇంత తేలికశిక్ష ఏ న్యాయమూర్తీకూడా విధించడు.'

అన్నాడు గాంధిజీ. బ్రూమ్‌ఫీల్డు మనోవ్యథ గమనించిన గాంధిజీ ఎంతో విషణ్ణుడైనాడని ఆయనమాటలవల్ల ఎవరైనా ఊహించ గలరు. విచారణకాలంలో న్యాయమూర్తి తనపట్ల ప్రదర్శిం చిన గౌరవాన్ని ఆయన ఎంతో ప్రశంసించాడు. ప్రేక్షకులం దఱూ మోకరిల్లి విలపిస్తూఉంటే మహాత్ముడు చెఱసాలకు బయలుదేరాడు.

ఆ సమయంలో కారాగారవాసం మహాత్మునికి ఎంతో ప్రియమైనదీ అత్యంతావశ్యకమైనదీగా తోచిందని మఱొకసారి చెప్పటం అవసరం. తాను తనకోసం చేయగోరనిపనిని చెయ్య వలసిందని ఆయన ఎవ్వరినీ ఎన్నడూ కోరలేదు. అనేక సంవత్స రాలవఱకూ అది ఒక ప్రధాన నియమంగా సాగింది. చెఱసాలలో ఉన్నప్పుడుకూడా అదేనియమం నిరాఘాటంగా సాగింది. మఱుగుదొడ్లలో గోతులు త్రవ్వటానికిగానీ, మాసినబట్టలు ఉదకటానికిగానీ ఆయన ఇతరుల సాయం అపేక్షించలేదు. ఆ పనులలో తనకు సాయం చెయ్యవద్దని ఇతరులకు ఎన్నిపర్యా యాలు చెప్పవలసివచ్చినా ఆయన విసిగికొనటంకూడా ఎఱు గడు. తాను చెఱసాలకు బయటఉండగా తన అనుచరులు వేలకొలది చెఱసాలలో మగ్గుతూఉండటం ఆయన అంతరా త్మకు ఏదో అన్యాయం జరుగుతున్నట్లే తోచింది. అందువల్ల ఆయనకు అమితదుఃఖం కలిగింది. ఆయనను నిర్బంధించకుండా ఉంటేనే బ్రిటిషుప్రభుత్వం చాలా తెలివితేటలతో వ్యవహరించి నట్లు ఉండేది. తోడివారందఱూ బాధపడుతున్నప్పుడు తనకు ఆ బాధలేకపోవటమే పెద్దబాధగా తోచి ఆయన విశేషంగా ఏ పనీ చెయ్యలేకపోయేవాడేమో! ఏమైనా దూరానఉండి మనము ఈ

విషయం ఇదమిత్థమని నిర్ణయించలేము. అయితే ఈ సందర్భంలో బ్రిటిషుప్రభుత్వం వివేకంతో వ్యవహరించలేదని చెప్పకతప్పదు. అందువల్ల (మహాత్ముడన్నట్లు) "ప్రభుత్వం ఊహించిన సత్ఫలితమేదీ కలుగలేదు." 1922 వ సంవత్సరం మార్చినెల 22 వ తేదీనుండి 1924 వ సంవత్సరం జనవరి 12 వ తేదీవరకూ మహాత్ముడు ఎఱ్ఱవాడ చెఱసాలలో ఉన్నాడు. ఈ కాలం ఆయనకు ఎంతో తృప్తికరంగా గడచింది. చెఱసాల నుంచి ఆయన వ్రాసిన ఉత్తరాలలో తాను "పక్షివలె స్వేచ్ఛగా" ఉన్నానని వ్రాశాడు. చెఱసాల బయటఉన్నప్పుడు ప్రజాసమస్యాపరిష్కార యత్నాలతో ఆయనకు తీఱికఅన్నదే ఉండేదికాదు. ఏకాంతంగా ఉండి స్వతస్సిద్ధంగా తనకు ప్రియమైన దైవప్రార్థనాదికాలతో కాలక్షేపంచేస్తే బాగాఉంటుందని ఆయనకు స్ఫురిస్తూఉండేది. ఆయనసంకల్పం ఇక్కడ ఫలించింది. బ్రిటిషు ఉద్యోగస్థులు ఆయనవిషయంలో చాలా మర్యాదగా ప్రవర్తించారు. ఆయనకు రాట్నంమీద నూలు తీయాలనే సంకల్పం కలిగిందని తెలియగానే తాము ఏర్పఱచుకొనిఉన్న కారాగార నియమాలనుకూడా ఉల్లంఘించి చెఱసాలలోపలికి రాట్నం పంపే ఏర్పాటుచేశారు. ఆయన తనకోసమని వాంఛించిన ప్రత్యేకసౌకర్యం ఇది ఒక్కటిమాత్రమే. తనకు ప్రత్యేకసౌకర్యాలు కల్పిస్తామని ప్రభుత్వం అన్నా ఆయన అందుకు అంగీకరించలేదు. ఆ సందర్భంలో ఆయన చెఱసాల గవర్నరుకు ఒక లేఖవ్రాస్తూ తనతోడివారికెవ్వరికీ లేని ఆహారసదుపాయాలు తనకూ అక్కఱలేదని స్పష్టపఱచాడు.

రోజుకు నాలుగుగంటలు ఆయన రాట్నంతో కాలం

గడిపేవాడు. అది ఆయనకు ఆనందకరంగా ఉండేది. చెఱసాలకు బయట ఉన్నకాలంలో ఆయనకు రాట్నంమీద నూలుతీయ టానికి రోజుకు ఒక గంటకన్న ఎక్కువఅవకాశం ఉండేదికాదు. హిందూమతస్థులకూ బౌద్ధమతస్థులకూ కూడా రాట్నం ఒక ప్రియమైన అద్భుతమైన లక్ష్యం. ఇక గాంధిజీ విషయంలో అది అంతకంటె అమితప్రాధాన్యం కలదిగా కనబడుతుంది. "పేద దైన భారతదేశానికి ఆర్థిక బాధానివారణచేయటానికి ప్రధాన సాధనం రాట్నమే!" అని ఆయన అభిప్రాయం. ఈ ఒక్క కార ణంచేతనే కాక ఇంకా ఎన్నో అవ్యక్తకారణాలవల్లకూడా ఆయన రాట్నంమీద నూలుతీయటం విషయంలో అధికమైన ఆసక్తి చూపేవాడు. నూలు మృదువుగా చెయ్యటమూ, దారం తీయటమూ (చెఱసాలలోకి వచ్చేటప్పుడే నూలు మృదువు పఱచటం ఆయన నేర్చుకొన్నాడు.) ఆయన చక్కగా అభ్యాసంచేశాడు. అయితే ఆయనకు మొదటినుంచి చివరి వఱకూ రాట్నంమీదనే అనురాగం.

పగటిలో (తెల్లవాఱుజాము నాలుగుగంటలు మొదలు రాత్రి ఎనిమిది గంటలవఱకూ) విరామకాలం అంతా పుస్తక పఠనం, లేఖలు వ్రాయటం, భగవద్ధ్యానంతోనూ గడచేది. యథాప్రకారం ఆయన నిత్యకృత్యాలలో భగవద్గీతాపఠనానికి విశేషప్రాధాన్యం ఉండేది. అయితే గీతతోబాటు కొరానూ, క్రైస్తవసారస్వతంకూడా చదివేవాడు. ఈవిధమైన చక్కని కాలక్షేపానికి విఘాతంగా అకస్మాత్తుగా ఆయనకు అజీర్ణవ్యాధి ఒకటి వచ్చి పడింది.

బ్రిటిషువారికి కింకర్తవ్యతావిమూఢత భరించరాని

దయింది. ఆయన చెఱసాలలోనే మరణించాలా? అని వారు నిశ్చయించలేకపోయారు. లేక శస్త్రచికిత్స చేయించి దానివల్ల ఏదైనా విపరీతఫలం కలిగితే ఎదుర్కొవటానికిన్నీ సాహసించ లేకపోయారు.

ఆ తొందఱపాటులో వారు ఆయనను పూనాలోని సాసూన్ ఆసుపత్రికి పంపించారు. అక్కడ మహాత్ముడు సాక్షులుగా వచ్చిన ఇద్దఱు భారతీయమిత్రుల సమక్షంలో, ఆమోద పత్రంమీాద సంతకం చేస్తూ జీర్ణకోశంలోని వ్యాధికి శస్త్ర చికిత్సచేయించుకొనటానికి తాను ఆమోదిస్తున్నాననీ, ఆచికిత్స జరిగినతర్వాత తనకు ప్రాణాపాయంసంభవించినా భారతీయులు ఎవరూ ఎటువంటి అలజడీ లేవదీయరాదనీ చెప్పి వేశాడు. ఆయన ఆరోగ్యం విషయమై భారతదేశం అంతా ఎంతో ఆందోళనపడుతున్నందువల్ల ఇటువంటి జాగ్రత్తతీసికొనటం అవసరమైంది.

అకస్మాత్తుగా విద్యుచ్ఛక్తి ఆగిపోగా, కిరసనాయిలు లాంతర్లముందే అతికష్టంతో శస్త్రచికిత్స జరిగింది. ఏమైనా ఆ శస్త్రచికిత్స జయప్రదమే అయింది. ఒక నిపుణుడైన బ్రిటిషువైద్యుడు శస్త్రచికిత్స చేశాడు. భారతదేశ ప్రభుత్వం (లండను అధికారవర్గంకూడా) గాంధిజీ చాలాకాలం కారాగార వాసం అనుభవించాడని భావించి ఇక ఆయనను విడుదల చేయాలని నిశ్చయించినందువల్ల ఫిబ్రవరి అయిదవతేదీన ఆయనకు కారాగారవిముక్తి కలిగింది. ప్రజలు ఆనందంతో ఉప్పొంగుతూఉండగా ఆయన బొంబాయి సామీాప్యంలోని

జుహూతీరంవద్ద ఉన్న ఒక సంపన్న మిత్రుని ఇంటికి అతిథిగా వెళ్ళాడు.

రెండేండ్లపాటు గాంధిజీ చెఱసాలలో ఉండటంవల్ల అంతకుపూర్వం ఆయనచేసిన కృషికి చాలా దెబ్బ తగిలింది. కాంగ్రెస్ పక్షంలో సి. ఆర్. దాసు మోతీలాల్ నెహ్రూల పలుకుబడి హెచ్చింది. వారు రాష్ట్రప్రభుత్వాలతో సంబంధం కలిగించుకొనాలని కోరేవారు. అందువల్ల వెనుకపెట్టుకొన్న నిషేధాలన్నీ అంతరించినట్లే అయింది. న్యాయవాదులు తిరిగి న్యాయస్థానాలకు వెళ్ళటం సాగించారు; విద్యార్థులూ కళాశాల లకు వెళ్ళుతూఉన్నారు. సహాయనిరాకరణం అనేదే లేదు. గాంధిజీ స్వయంగానే నివారించటంచేత శాసనప్రతిఘటనోద్య మం అసలే కనబడకుండాపోయింది. అన్నింటికంటెనూ గాంధిజీ కంటికి దుర్భరంగా కనిపించింది హిందూముస్లిముల సఖ్యం విచ్ఛిన్నం కావటం. మతకలహాలూ, దొమ్మీలూ, హత్యలూ సాగాయి.

జాతీయవాదులలో చీలిక తీసికొనిరావటం ఇష్టం లేనందువల్ల గాంధిజీ రాజకీయాలు ఇతరులకు వదలివేసి తన దృష్టి "నిర్మాణాత్మక కార్యక్రమం" మీద కేంద్రీకరించ టానికి నిశ్చయించుకొన్నాడు. అనేక సంవత్సరాలుగా ఆయన ఈ "నిర్మాణాత్మక కార్యక్రమాలు" నిర్వహిస్తూనే ఉన్నాడు. అయితే చిత్రమేమిటంటే ఆయన నోటివెంట ఏమాటవచ్చినా, లేక ఏ పనిచేసినా అందువల్ల రాజకీయాలలో కొంత పరివర్తన వస్తూవచ్చింది. దానికి కారణం ప్రజలందరిదృష్టీ ఆయనవైపే తిరిగి ఉండటం. ప్రజలకు అయనకంటె ఉపదేష్టఅనేవాడు

ఎవడూ కనబడలేదు. ఆయన నిర్మాణాత్మకకృషి కూడా రాజకీయ ఫలితాలతోనే సమన్వితమైంది. రాట్నంకానీ, అస్పృశ్యులకై ఆయన చేసినకృషి కానీ యిందుకు ఉదాహరణాలుగా తీసికోవచ్చును. ఈ కాలంలోగానీ, యిటు తర్వాతగానీ ఆయన ఎప్పుడూ బ్రిటిషువారికి తాను శత్రువునని చెప్పలేదు. అసలా భావం ఆయనలో ఎన్నడూ కలుగనేలేదు. స్వరాజ్యపు తాళపుచెవి భారతీయులచేతిలోనే ఉన్నదికానీ, బ్రిటిషువారిచేతిలో లేదని ఆయన అభిప్రాయం. పారిశుద్ధ్యం లభిస్తేనే దేశం స్వతంత్రమౌతుందిగానీ, అదిలేనినాడు స్వాతంత్ర్యం రానేరాదు.

భారత దేశాన్ని సంస్కరించాలంటే మొట్టమొదట చేయవలసినపని హిందూముస్లిముజాతులకు స్నేహంసమకూర్చటమే. శరీరంలో కొంచెం బలంచేకూరగానే గాంధిజీ తనవారపత్రికకు యథాప్రకారం సంపాదకత్వం వహించాడు. "సిద్ధాంతపత్రిక" (Views paper) అని ఆయన పేర్కొన్న ఆ "యువభారత" (Young India) వారపత్రికలోనూ, "నవజీవన" అనే గుజరాతీ మాసపత్రికలోనూ సంపాదకీయాలు వ్రాయటం మొదలుపెట్టాడు. ఈ రెండుపత్రికలకూ విశేషప్రచారం ఉండేది. కాని వాటిలోకూడా దేశంలోని అన్నిప్రాంతాలవారికీ నాడూనేడూ కూడా సమానంగా సుపరిచితమైన ఆంగ్లభాషలో వెలువడుతూ ఉన్న యువభారత పత్రికను ఎక్కువమంది ఆసక్తితో చదువుతూ ఉండేవారు. ఈ పత్రికలో గాంధిజీ మాటిమాటికీ హిందూముస్లిముల మైత్రియొక్క అవసరాన్ని ఉద్ఘాటిస్తూ వచ్చాడు. మతద్వేషాన్ని చాలా నిశితంగా విమర్శించాడు.

1924 వ సంవత్సరపు వేసగిలో ఈ ఉభయజాతుల మధ్యనూ విద్వేషం తీవ్రరూపంతాల్చింది. ప్రజలు సులభంగా రెచ్చిపోవటానికి అవకాశాలుగల మహానగరాలలో హింసాత్మకచర్యలు జరగటమేకాకుండా, కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గంలో సభ్యులయినవారుకూడా హింసాత్మకచర్యలకు ఒడిగట్టే పరిస్థితులు కలిగాయి. అసలు ఆ సభ్యులకున్నూ అహింసపట్ల నమ్మకంలేదు. అయితే మహాత్ముని ఆదేశంప్రకారం రెండేండ్లపాటు వారు అహింసనే యెందుకు పాటించారంటే దానివల్ల ఏవో కొన్ని సత్ఫలితాలు కలుగుతున్నట్లు కనిపించటంచేత అలా ఆగిఉన్నారుగానీ నిజంగా వారికి అహింసపట్ల విశ్వాసం కలిగి కాదు. ఆ సంవత్సరం జూనునెలలో జరిగిన కాంగ్రెసు కార్యవర్గసమావేశానికి వెళ్ళినప్పుడు గాంధిజీ బహిరంగంగానే దుఃఖించాడు. ఆయన అలా దుఃఖించటానికి కారణం తోడి సభ్యుల చిత్తశుద్ధి యెటువంటిదో తెలిసిరావటమే. వారు తన సిద్ధాంతంపట్ల విశ్వాసంలేకున్నా ఉన్నట్లుగా నటించటం ఆయనను అంతగా బాధించింది.

1924 వ సంవత్సరం సెప్టెంబరు 18 వ తారీఖున గాంధిజీ దేశానికి కలిగిన ఉపద్రవానికి చికిత్సగా హిందూముస్లిము సఖ్యం ప్రధానాశయంగా 21 రోజు ఉపవసించాలని నిశ్చయించుకొన్నాడు.

ఆయన శరీరపరిస్థితినిబట్టి ఆలోచిస్తే అది చాలా ప్రమాదకరమే. అయినా దేశంలో శాంతిని సంఘటించాలంటే అంతకంటె మరొకసాధనం కనిపించలేదు. చెఱసాల నుంచి విడుదల అయినది లగాయతూ ఆయన ఏమి చెప్పినా,

ఏమి వ్రాసినా ఆ ఉభయజాతులమధ్యనూ స్నేహంకావాలనే. అయినా పరిస్థితులు రానురాను విషమించిపోయాయి. ఆ పరిస్థితులలో ఇక తాను ఏమిచెప్పినా ప్రజలు వినిపించుకొనే స్థితిలో లేరని ఆయనకు తోచింది. అటువంటిభావం తర్వాత అనేకపర్యాయాలుకూడా ఆయన మనస్సులో దృఢపడుతూ వచ్చింది. లక్షలకొలది ప్రజలు ఆయనను చూడటానికి వచ్చేవారు. రైలు బయలుదేరిపోతుండగా ఆయనకు సాగిలబడి నమస్కరించేవారు. ఆయన పాదధూళిసోకినా తాము ధన్యులమౌతామని విశ్వసించేవారు. ఇంత భక్తిఉన్నా ఆయన ఏమి చెప్తాడో విందామని మాత్రం ఎవరికీ తోచేదికాదు. ఆయనే అన్నట్లు ఆ "దర్శనాకాంక్ష" అంతవిపరీతమై, ప్రజాసమూహం, ఆ మహాయోగి లేక ఆ మహానాయకుడు తమవంకచూస్తేనే చాలుననే వెఱ్ఱితనంతో ఆయన తలపెట్టినపనిని సక్రమంగా సాగనిచ్చేదికాదు. మహాత్మునివంక గౌరవప్రేమలతో విస్మితులై చూచేవారెందఱో ఉండేవారుగానీ ఆయనమాటలు వినిపించుకొనేవారు లేరనటంలో అసత్యంలేదు. నేను కన్నారా చూచాను. తొలిరోజులలో చుట్టూమూగిన గుంపులలోని వారికందఱికీ ఆయనమాటలు వినటం అశక్యంగా ఉండేది. ఆయన కంఠస్వరమూ దుర్బలంగా ఉండేది. శబ్దవిస్తరణ యంత్రాలూ ఉండేవికావు. ఇరవైఅయిదువేలమంది ప్రజలు గుమిగూడి ఉన్నప్పుడు వారికి ఆయనను ఒక్కసారి చూడటమైతే సాధ్యమౌతుందిగానీ, ఆయనమాటలు వినటం ఎలాగు? అదీకాక నేటికంటె ఆనాడు ప్రజలు ఎక్కువమంది నిరక్షరాస్యులుకూడానూ.

1924వ సంవత్సరంలో ఆ దీర్ఘోపవాసం చేయబూను తున్నట్లు ఆయన ప్రకటించే సమయంలో ఈ పరిస్థితులన్నీ తల పోసి యిలా సంతాపం వెలిబుచ్చాడు. "నేను చెప్పినమాట కానీ, వ్రాసినవ్రాతగానీ యేదీకూడా ఈ ఉభయజాతులకూ సాన్నిహిత్యం కలిగించలేదు. కనుక నాకు నేనే శిక్ష విధించు కొని యీ నాటినుంచీ యిఱవై ఒక్క రోజు అంటే అక్టోబరు 6వ తేదీవఱకూ ఉపవాసం చేయాలని నిశ్చయించుకొన్నాను. ఒక్క నీరుమాత్రం ఉప్పుతోగానీ, ఉప్పులేకుండాగానీ త్రాగ టానికి అంగీకరిస్తున్నాను. దానివల్ల జరిగినదానికి ప్రాయశ్చి త్తమూ అవుతుంది; భగవద్ధ్యానమూ అవుతుంది. ఆస్తిక్యానికీ మానవత్వానికీ అవమానకరంగా ఉన్న ఈ మతకలహాన్ని నివారించటానికి రావలసిందని ఆంగ్లేయులతోసహా అన్నిమతాల లోని పెద్దలనూ నేను ఆహ్వానిస్తున్నాను. భగవంతుని అధికా రాన్నే లోకం లెక్కపెట్టనట్లు కనిపిస్తున్నది. ఆయనను తిరిగి మన హృదయాలలో ప్రతిష్ఠించుకొందాము."

భారతీయ ప్రజాసామాన్యంమీాదా,అంతకంటె ఈమత్తు తక్కువగా తన సమకాలికులమీాదా ప్రసరించిన గాంధిజీ ప్రభా వానికి హేతువులు అనేకాలు ఉన్నాయి. అవిన్నీ ఒకదానితో మఱొకటి ముడిపెట్టుకొని ఉన్నాయి. అయితే ఆ అన్నిటి లోనూ ఉన్నతమైనది లోకానికి ఆదర్శప్రాయమైన నడవడి. ఆయన వ్యక్తిత్వం సుస్పష్టంచేసే కొన్నికొన్ని పనులు (ఈ ఉపవాసమూ, చిట్టచివరి ఉప్పు సత్యాగ్రహమూ వంటివి) సత్యాన్ని ప్రదర్శించటం ఎలాగో తెలిసిన అద్భుతమైన ఔన్నత్యముద్రతో అంకితాలైనాయి. ఈ ఇరవైఒక్క రోజు

ఉపవాసంలో బెదరింపు అనేది లేదు. అది ఆ కాలంలో ఒక వెలుగుబాటను చూపించేది అయింది. మొత్తం ఆయన జీవిత కాలం అంతటిలోనూ అది అత్యంత తీవ్రంగా నడచింది. అయి నప్పటికీ అది అతిపామరుడైన గ్రామవాసికికూడా శాంతినిమిత్తమైన ఆత్మార్పణయొక్క సత్యస్వరూపాన్ని బోధపఱచేది అయింది. అది కేవలం సత్యమే ప్రాదిపదికంగా జరగటమూ, ప్రతివ్యక్తికిన్నీ ఆ సత్యత్వం భావగోచరం కావటమూవల్ల దాని ఫలితం సద్యోజనితమూ అద్భుతమూకూడా ఐనది. ఉప వాసం ముగియటానికి ఎంతో ముందునుంచే హిందువులూ ముస్లిములూకూడా అనేక లక్షలమంది దైవప్రార్థనచేస్తూ, విలపిస్తూ శాంతిని నిలబెట్టటానికి బద్ధకంకణులైనారు.

1921వ సంవత్సరపు ఉద్యమంలో మహాత్మునికి కుడి భుజంగా పనిచేసిన మహమ్మదాలీకి ఢిల్లీలో ఒక ఇల్లు ఉన్నది. అక్కడ క్షతగాత్రులైన ముస్లిములెందఱో తలదాచుకొన్నారు. కొంతమంది ముస్లిమువైద్యులు వారికి చికిత్సలు చేశారు. మహాత్ముడు తన ఆత్మపరీక్షకు అదే అనువైనచోటుగా ఎన్ను కొన్నాడు. ఉపవాసం ప్రారంభించేముందు చేసే చివరి భోజ నమూ, అది విరమించగానే చేసే మొదటి భోజనమూ ముస్లి ముల చేతినుంచే రావాలని నిశ్చయించుకొన్నాడు. (హిందూ మతంలో భోజనపు ఏర్పాటువిషయంలో ప్రత్యేక నియమాలు ఉన్నాయి. కులమత విచక్షణ తప్పనిసరిగా పాటించాలి.) గాంధిజీ ముఖ్యమిత్రుడూ, క్రైస్తవ మతప్రచారకుడూ అయిన ఛార్లెస్ ఫ్రీర్ ఆండ్రూస్ (చార్లీ) ఉపవాసకాలంలో గాంధిజీకి పరిచర్యలు చేయటానికి వచ్చాడు. ఉపవాసారంభంలోనూ,

తద్విరమణలోనూ కూడా ప్రార్థనలూ, భగవన్నుతిగేయాలూ హిందూ క్రైస్తవ మహమ్మదీయమతాలు మూడింటికీ అను గుణంగా జరిగాయి. ప్రతిఅంశంలోనూ ఆ ప్రదర్శనం(దానిని ప్రదర్శనమే అనవలసివస్తే)లో మతసమైక్యం అంటే ఏమిటో ప్రపంచమంతటికీ బోధపడునట్లుగానూ, దానిని సాధించడం సాధ్యమే అన్నట్లుగానూ, ఈవిధంగాచేస్తే అది అందటికీ ఆచరణ సాధ్యమే అని తోచేటట్లుగానూ మహాత్ముని సత్యనిష్ఠ సుప్రకాశితమైనది.

అయితే మహాత్ముని ఈ దీర్ఘోపవాసంవల్ల యథార్థ చారిత్రిక వేదికమీద మతసమైక్యం కాలేదనే చెప్పాలి. ఉపవాసంవల్ల అద్భుతఫలితాలైతే కలిగాయి. అయితే అవి అన్నీ గాంధిజీప్రాణం ఎలాగైనా రక్షించుకోవాలన్న ప్రజాందోళన వల్ల కలిగినవే. ఈ సమయంలో మహాత్ముడే లేకపోతే మన జీవితం ఎలా ఉంటుందో అని ప్రతివ్యక్తీకూడా డోలాందోళిత చిత్తుడైనాడు. (మహాత్ముడు ఆ విధంగా ఆత్మహింసకు సిద్ధపడ్డ కాలంలో ఆయనను చూచినవారికందటికీకూడా పక్షవాతానికి దగ్గఱిచుట్టమైన వ్యాధి ఏదో సోకినట్లయింది.) ఆయన ప్రాణానికి ముప్పువాటిల్లుతుందేమో అనే భయమే తాత్కాలికంగా ఉభయమతాలవారికీ ఐకమత్యం కలిగించింది. కాని యథార్థమే చెప్పవలసివస్తే హిందూ మహమ్మదీయులమధ్య ఉండే శత్రుభావం ఏ కొంచెమున్నూ తగ్గలేదనక తప్పదు. తర్వాత కొన్ని సంవత్సరాలలో అది ఇంకా పెఱిగింది కూడా.

ఏది యేమైనా ఆయనచేసిన ఆ దీర్ఘోపవాసం ఆ మూడు వారాలపాటూ ప్రపంచాన్ని ఊహాగానాలతో విస్మితమయే

ట్లు చేసింది. ఆ సంఘటన స్మృతికి తెచ్చుకొంటే ఇప్పటి కిన్నీ ఎవరికైనా ఒకవిధమైన ఉద్వేగం కలగకుండా ఉండదు. ప్రపంచంలో అటువంటి సంఘటన కానీ, అంతటి అచంచల పావిత్ర్యంకానీ చాలా అరుదుగా తప్ప గోచరించేవికావు. యుద్ధసమయంలో కానీ, శాంతికాలంలోగానీ ఆ బలహీన వ్యక్తి సముచితోత్సాహంతోనూ, నిరంతరప్రసన్నతతోనూ తలచూ అటువంటి దుర్వాహభారాన్ని నెత్తికెత్తుకొంటూనే వచ్చాడు. ఆయన నాతో అన్నట్లుగా తనకు ఎన్నడూ సమ్మతం కాని "ఆత్మహత్య" అనే ప్రమాదానికి గురికాకుండా ఆ మూడు వారాలవఱకూ ఉపవాసం సాగించవచ్చుననే ధైర్యం ఆయన మనస్సులో ఉన్నట్లు కనబడుతుంది. మనకు పరిచితాలైన అన్ని సందర్భాలలోనూ పరమసత్యంగా కనిపించే "అంతర్వాణి" నుంచే ఆయనకు ఆ ధైర్యం లభించింది.

సరిగా మొదట అనుకొన్నట్లుగానే అక్టోబరు నెల 6 వ తేదీ బుధవారం మధ్యాహ్నంలో ఆయన ఉపవాసం విరమిం చాడు. తనకు ఆప్తవైద్యుడుగా ఉన్న ముస్లిముభిషక్కు చేతి నుంచి ఒకగ్లాసెడు నారింజరసం తీసికొని ఉపవాసం విరమించ టానికి పూర్వం ఆయన కొద్దికాలం భగవత్ప్రార్థన జరపవల సిందని చుట్టూ ఉన్నవారిని అడిగాడు. కొరాను ప్రారంభం లోని పద్యాలను, ఇమామ్ పఠించాడు. "అద్భుతమైన సిలువ చిహ్నాన్ని నేను పరిశీలించినప్పుడు" (When I Survey the wondrous Cross) అనే గేయాన్ని ఆంగ్లభాషలో ఛార్లీ ఆండ్రూస్ గానంచేశాడు. సంస్కృతంలో ఉపనిషత్తులను వినోబాభావే చదివాడు. తర్వాత మహాత్మునికి అభిమాన

పాత్రమైన వైష్ణవగీతం గానం చేయటం జరిగింది. భారతజాతీయ మహాసభ(కాంగ్రెస్)లో సభ్యులైన నాయకులెందఱో ఆ సమయానికి అక్కడికి వచ్చారు. వారందఱూ ఆయనశయ్యకు చేరువగా నేలమీద కూర్చున్నారు. స్వాతంత్ర్యంకోసం ఆత్మార్పణ చెయ్యటానికి సంసిద్ధులుకావలసిందని అక్కడ ఉన్నవారందఱినీ దుర్బలస్వరంతో సంక్షిప్తంగా ప్రబోధించి అటుపిమ్మట ఆయన నారింజరసం స్వీకరించాడు.

# 5

ఇప్పటినుంచీ 1930 వ సంవత్సరంలో తీవ్రంగా పెనగులాట సాగి, చరమస్థాయి అందుకొన్న ఉప్పుసత్యాగ్రహం వఱకూ కొన్ని సంవత్సరాలపాటు గాంధిజీ పూర్తిగా నిర్మాణాత్మక కృషికీ, అందులోనూ ముఖ్యంగా రాట్నానికీ తన్ను అంకితంచేసికొన్నాడు. ఆయన మాటలలో "మోక్షసాధనం" అయిన రాట్నం ప్రజలందఱికీ మళ్లీ నిత్యోపయోగ్యం కావాలనే ఆయన ఆశాలత చిగిర్చి, పూచి, ఫలించటంకూడా మొదలుపెట్టింది. అంతకంతకు రాట్నాన్ని చేపట్టే భారతీయుల సంఖ్య వర్ధిల్లుతూవచ్చింది. దానితో దేశంలో ఎక్కడ చూచినా రాట్నాలే అయినాయి. ఖద్దరుబట్టలు కట్టటం పీడని ఆచారమైంది. 1925వ సంవత్సరంలో కృషి మఱింతపురోగమింపజేయటానికై అఖిలభారత తంతుకారులసంఘం నిర్మించబడ్డది. భారతదేశాన్ని విదేశీ వస్త్రాలను సంకల్పాన్ని ప్రజలకు నచ్చజెప్పటంకోసం గాంధిజీ ప్రతిరాష్ట్రంలోనూ పర్యటించాడు. అయితే లోగడ మనం గమనించినట్లుగా ఆయన ఉప

న్యాసాలు విన్నవారికి ఆ విషయం మనస్సుకు పట్టలేదు. కాని రాజకీయాలను స్మరించకుండా ఉన్నప్పటికీ వాటిలో పాల్గొన్న నాటిమాదిరిగానే ఆయన నైతిక ప్రాభవం అత్యున్నతంగానే ఉన్నది. ఆయన నిరాకరించిన విషయమేదైనాసరే, ఆయన ఎక్కడఉన్నా, ఏమిచేస్తున్నాకూడా ఆయన నిరాకృతి ఎలాగో దేశానికి తెలుస్తూరావటంచేత, భారతరాజకీయాలలో దానికి మనుగడ ఉండేదికాదు.

అందుచేతనే ఆయన రాజకీయాలపట్ల కేవలం పరాఙ్ముఖుడై రాట్నం విషయమైకానీ, గ్రామస్థుల విషయమైకానీ నిర్విరామంగా పనిచేస్తూఉన్నా, రాజకీయంగా ఆయనకుగల పలుకుబడి యెంతమాత్రమూ తగ్గేదికాదు. పాశ్చాత్యులన్నట్లు ఆయన ఎన్నడూ "ప్రాభవరహితుడూ" కాలేదు; "అధికారం చేపట్టినవాడూ" కాలేదు. భారతదేశంలో ఆయనే ప్రభుశక్తి అయినాడు. దీనిని ఎవ్వరూ ఎన్నటికీ కాదనలేరు.

"మహాత్మగాంధి జీవితం" అనే తన గ్రంథంలో లూయీఫిషర్ పేర్కొన్నట్లు గాంధిజీ జీవితంలో ఈ 1924వ సంవత్సరంనుంచి 28వసంవత్సరంవఱకూ జరిగినకాలం ముఖ్యంగా గమనించదగ్గది. ఎందుచేతనంటే ఈ కాలంలో ఆయన ఆంగ్లేయులకుగానీ, బ్రిటిషుప్రభుత్వానికిగానీ వ్యతిరేకంగా ఒక్క మాట అనలేదు; ఒక్కవాక్యం వ్రాయలేదు. అయితే, ఎన్నో తావులలో ఉపన్యాసాలూ ఇచ్చాడు; ఎంతో రచనాచేశాడు. "అంతస్స్వరాజ్యం" విషయంపైనే ఆయన యీ అయిదు సంవత్సరాలూ తనదృష్టి కేంద్రీకరించాడు. అంటే సంస్కరణ వల్లనూ, అనంతమైన ప్రబోధంవల్లనూ స్వచ్ఛమైన సత్యా

గ్రహానికి సన్నద్ధంకాదగినట్లు భారతదేశాన్ని తీర్చిదిద్దటమే ఆశయంగా పెట్టుకొన్నాడు. ఏనాటికైనా స్వచ్ఛమైన సత్యాగ్రహం చేయవలసివస్తుందనీ, దానివల్లనే దేశానికి స్వాతంత్ర్యం రాగలదనీ ఆయన విశ్వాసం. ఆయన తలపెట్టిన యీ సన్నాహంలో బ్రిటిషువారి ప్రసక్తిగానీ, విదేశప్రభుత్వాన్ని తొలగించటం అనే సమస్యగానీ ఉదయించనేలేదు. అది కేవలం భారతీయులను ఆత్మశక్తి సంపన్నులుగాచేసి, సత్యశౌచ సమన్వితులై నూలువడకటం, బట్టలునేయటం నేర్చుకొని, ఈశ్వర కళానుభూతితో ఋజువర్తనులుగా మెలగేటట్లు చేయటంకోసమే ఉద్దేశించబడింది. భారతీయులందఱూ స్వరాజ్యసంపాదనకు అర్హులైననాడుమాత్రమే బ్రిటిషువారి ప్రసక్తి.

ఆయనలో ఏవో అలౌకికమహిమలుండేవని లోకం చెప్పుకొనటం మనం గమనించాలి. ఆయన మాత్రం ఈప్రసక్తి వచ్చినప్పుడు పరిహాసంతో నిరాకరించేవాడు. ఒకమాఱు ఆయనతో కలసి రైలుపెట్టెలో ప్రయాణంచేస్తున్న వ్యక్తి దైవికంగా నేలమీాద పడిపోయాడు కానీ, అంతలోనే చేయి ఆనుకొని లేచి నవ్వుతూ పెట్టెలోకి ఎక్కాడు. తనకు అపాయం కలుగకపోవటానికి కారణం మహాత్ముని సాన్నిధ్యమే అని అతను అన్నాడు. "అలాగే అయితే అసలు నువ్వు పడేవాడవే కావు." అని మహాత్ముడు అతనికి సమాధానం ఇచ్చాడు. వంగదేశంలో ఒక నిఱుపేదకు పక్షవాతం వచ్చింది. అతను మహాత్ముని ఛాయాచిత్రం ఒకటి గొలుసులో బిగించి మెడలో ధరించి కొన్ని సంవత్సరాలపాటు మహాత్మునినామం జపించాడు. అందువల్ల తనకు వ్యాధి నెమ్మదించిందని అతను మహా

త్మనితోనే అన్నాడు. అప్పుడాయన అతనికి ఇలా నిశితంగా సమాధానం ఇచ్చాడు. "నిన్ను వ్యాధివిముక్తుణ్ణి చేసింది భగవంతుడే కాని గాంధికాదు. నీ మెడలోనుంచి నా ఛాయా చిత్రం తొలగించు. అదే నా కోరిక."

భారత దేశం అంతటా మహాత్ముణ్ణిగురించి ఇటువంటి విశ్వాసాలు ఎక్కువగా ప్రబలిపోయాయి. కాని ఆయనమాత్రం తనలో మహిమ లున్నాయని యెన్నడూ అనుకొన్నట్లే కన బడదు. తనతో సంబంధం కల అనేకులతో వ్యవహరించినట్లే ఆయన ఈ విషయంలో అనేక పర్యాయాలు సహజమైన నిరా డంబరతతోనే తన కామహిమలేవీ లేవనీ చెప్పేవాడు. ఎదటి వారు ఎంత నమ్మకంగా చెప్పినా ఆయనకుమాత్రం నమ్మకం కలిగేది కాదు.

ఆయన చెఱసాలనుంచి బయటికి రాగానే తాను భారతజాతీయ సంస్థనుంచీ, రాజకీయాలనుంచీ విరమించుకో దలచినట్లు చెప్పాడు. దేశం నలువైపులనుంచీ ఒక్కుమ్మడిగా కలిగిన నిరోధం ఆయన ప్రయత్నాన్ని కొంతకాలం నిరోధం చింది. జరిగిందేమిటంటే 1925వ సంవత్సరపు కాంగ్రెసుకు అధ్యక్షత వహించివలసిందని ఆయనను చాలామంది అర్థిం చారు. కాంగ్రెస్ వారందఱూ స్వదేశవస్త్రాలే ధరించి, కాంగ్రెస్ సిద్ధాంతాలలో అది ఒకటిగా అంగీకరించి, ఆవస్త్రాలు ధరించనివారి నెవ్వరినీ అందులో సభ్యులుగా చేర్చుకోని షరతుమీదనైతే తాను వారి కోరికప్రకారం నడవగలనని ఆయన వారికి జవాబు చెప్పాడు. ఎక్కడ ఎప్పుడు తీఱిక లభించినా కాంగ్రెసులోని ప్రతిసభ్యుడూ రోజుకు ఒక గంట

నూలుతీయవలసిందే. ఆనాడు కాంగ్రెసు వారిలోనే రాజకీయాల విషయమై అభిప్రాయభేదాలు ఎక్కువైనాయి. గాంధిజీతోడ్పాటు లేకపోతే కాంగ్రెసు ఏమీచేయలేని స్థితికి వచ్చింది. అధ్యక్షుడుగా ఉంటే గాంధిజీ వారిలో ఐకమత్యాన్ని నిలబెట్టగలడని వారందఱూ ఖద్దరు కట్టటానికి అంగీకరించారు. కనుక 19౩౬వ సంవత్సరంనుంచీ కాంగ్రెసు సంస్థలో పనిచేసే భారత జాతీయవాదు లందఱూ ఖద్దరు కట్టటం ముఖ్యలక్షణమైంది.

1925వ సంవత్సరం అంత్యంలో ఒకమాఱు బహిరంగ ప్రకటన లేకుండానే గాంధిజీ నిరాహారదీక్ష అవలంబించాడు. అది ఏడురోజులపాటు సాగింది. దానివల్ల భారతదేశంలో ఎంతో ఆందోళన బయలుదేఱింది. దానికి తాను ఎందుకొఱకు జవాబు చెప్పాలో గాంధిజీకి అర్థంకాలేదు.

యంగ్ ఇండియా పత్రికలో ఆయన ఇలా వ్రాశాడు. "నా ఉపవాసాలను గుఱించి ప్రజలు పట్టించుకోగూడదు. వారు వాటినిగుఱించి ఆందోళన పడవలసిన పనిలేదు. ఉపవాసాలనేవి నా జీవితంలో ఒకభాగం. అందువల్లనైతే ఎంతచక్కగా పని చేయగలనో, ఉపవాసాలు లేకపోతే అంతచక్కగా పనిచేయగును! బాహ్యప్రపంచంలో మెలగటానికి కన్నులు ఎంత అవసరమో, అంతర్జగత్తులో మెలగటానికి నాకుఉపవాసాలు అంత అవసరం!" మఱొకమాఱు ఈవిషయంమీదనే ఇలావ్రాశాడు: 'ప్రజలకు ఈఉపవాసంతో ఏమీ సంబంధం లేదు. అయితే నేను ప్రజలసొత్తు అనేమాట వినబడుతున్నది. ఆ మాటనిజమే కావచ్చును. కాని ప్రజలు నన్ను తమసొత్తుగా భావించేటప్పుడు నా లోపాలతోబాటే నన్ను వారు పరిగ్రహించాలి. నేను

సత్యాన్వేషిని. నా పరిశోధనాయాత్రలు అత్యున్నత హిమాలయాధిరోహణయాత్రలవలెనే అతిముఖ్యమైనవి."

1926వ సంవత్సరంలో కాంగ్రెసు అధ్యక్షపదవీకాలం ముగిసేసమయాన అది రాజకీయాలపట్ల మౌనం వహించవలసిన కాలమని ఆయన ప్రకటించాడు. తక్కిన విషయాలలో అయితే మౌనం అగత్యంలేదుకానీ, రాజకీయాలను గురించిమాత్రం ఆ సంవత్సరం గడచేవరకూ తాను ఏమీ మాట్లాడనని శపథం చేశాడు. ఆ కాలమంతా తన ఆశ్రమంలోగానీ, ఆ పరిసరాలలోగానీ మాత్రమే ఉంటానన్నాడు. (అహమ్మదాబాదు పొలిమేరలు దాటేదిలేదన్నమాట) ఆయన తనువుకూ, ఆత్మకూ కూడా విశ్రాంతిఅవసరమైందనటంలో సందేహంలేదు. బహుశః ఆయన శరీరం విశ్రాంతి నభిలషించవచ్చు, లేదా అంతర్వాణి ఆయనను శాసించిఉండవచ్చు. అయితే ఆ సంవత్సరమున్నూ ఆయన ఎంతమాత్రమూ అలసుడుగా కాలం గడపలేదు. నిరంతరంగా సాగిన ఆయన ఉత్తరప్రత్యుత్తరాలు అనేక విషయాలలో ఆయనకు తీరుబడే లేకుండాచేశాయి. మహాత్ముని ఆలోచనలన్నీ అనేకపర్యాయాలు పునర్ముద్రణ పొందసాగిన యువభారతంలోని వ్యాసాలవల్ల దేశమంతటికీ తెలుస్తూనే వచ్చాయి.

ఆ సంవత్సరకాలంలో యువభారత పత్రికకు స్త్రీపురుష సంబంధమైె వచ్చిన ప్రశ్నలన్నింటికీ మహాత్ముడు సముచిత సమాధానాలు ఇస్తూవచ్చాడు. భారతదేశంలో శిశుజననాన్ని పరిమితం చెయ్యటం అవసరమనేవిషయం ఆయనగుర్తించాడు. అయితే అది స్త్రీపురుషుల ఆత్మనిగ్రహంవల్లనే సాధించవలసి

ఉంటుందని అభిప్రాయపడ్డాడు. సుదీర్ఘమైన బ్రహ్మచర్యవ్రతం గడపి వివాహంచేసికొనటమూ, సాత్త్వికాహారనియమమూ, ప్రత్యేకించి శాకాహారనియమాన్ని నిశితంగా పాటించటమూ, యోగాభ్యాసమూ, భగవద్ధ్యానపరాయణతా కామనిగ్రహానికి సాధనాలని పదేపదే ఉల్లేఖించాడు. అస్పృశ్యతాది దురాచారాలను ఖండించినట్లే బాల్యవివాహాలనుకూడా తీవ్రంగా ఖండించాడు. (హిందూమత నియమానుసారం పునర్వివాహం చేసికొనరాని) బాల్యవితంతువుల ఉనికి ఆయనకు చాలా బాధ కలిగించింది. బ్రిటిషువారి లెక్కల ప్రకారం 1921 వ సంవత్సరంలో భారతదేశంలో 16 సంవత్సరాలలోపు వయస్సుగల వితంతువులసంఖ్య 329,076 అనీ, వారిలో అయిదేండ్లకు తక్కువ వయస్సుకలవారిసంఖ్య 11,892 అనీ, 5–10 సంవత్సరాల నడుమ యీడువారు 85037 మంది అనీ విశదపరచాడు. తన ఆశ్రమంలో ఉన్న బాలికలకు ఇరవైఒకటవయేడు వచ్చిన తర్వాతనే వివాహానికి అనుమతించేవాడు. పురుషులకు ఇరవైఅయిదవసంవత్సరం వచ్చినతర్వాత వివాహం ఉచితమవుతుందని పత్రికలో వ్రాశాడు. ఆస్తికసిద్ధాంతాలకు విరుద్ధమైన కృత్రిమసాధనాలద్వారాగాక పై సాధనాలవల్లనే సంతాన సంఖ్యను తగ్గించటం సముచితమని ఆయన ఆశించాడు.

ఇర్విన్‌ప్రభువు (ఈయనే అటుపిమ్మట హాలిఫాక్సు ప్రభువైనాడు) 1926 వ సంవత్సరం ఏప్రిల్ ఒకటవతేదీన భారతదేశానికి రాజప్రతినిధిగా వచ్చాడు. ఈ విషయంగాంధిజీ తన యువభారత పత్రికలో పేర్కొనలేదు. తాను వచ్చిన సంవత్సరమున ఉన్న రాజప్రతినిధి మహాత్ముని కోసం కబురంపాడు. అది 1927

త్సరం అక్టోబరు నెల. అప్పటికి రాజకీయాలవల్ల మహాత్ముని మౌనసంవత్సరం గడచిపోయింది. అందువల్ల ఆయన మళ్ళీ దేశపర్యటనం ప్రారంభించాడు. అయితే ఆ సంవత్సరం అనారోగ్యకారణంగా చాలాకాలం బాధపడుతున్నాడు. రాజప్రతినిధి దగ్గరనుంచి కబురువచ్చినందువల్ల ఢిల్లీకి వెళ్ళాడు. అక్కడ ఆయనకు ఒకవార్త తెలిసింది. భారతదేశపరిస్థితులను విచారించి తగు సంస్కరణలను సూచించటంకోసం పార్లమెంటుచే నియమించబడ్డ ఒక పరిశీలకసంఘానికి అధ్యక్షుడుగా సర్ జాన్ సైమన్ త్వరలో రానున్నాడని ఒకపత్రిక ప్రకటించింది. గాంధిజీ మౌనంగా ఆ పత్రిక స్వీకరించి యెటువంటివ్యాఖ్యానం చేయకుండా ఢిల్లీ నుంచి బయలుదేరాడు.

సైమనుసంఘానికి ఆదినుంచీ పరిస్థితి అయోమయంగానే కనబడింది. ఆ సంఘంలో భారతీయులు లేకపోవటమూ, సంఘసభ్యులు ఒక్క బ్రిటిషు పార్లమెంటుకే జవాబు చెప్పవలసినవారు కావటమూ ఇందుకు కారణాలు. ఆ సంఘానికి సృష్టికర్త అప్పటికి భారతదేశప్రభుత్వానికి కార్యదర్శిగా ఉన్న బర్కెన్ హెడ్ ప్రభువు. ఆయన వక్తృతాచాతుర్యం ఆయనకు న్యాయస్థానాలలో ప్రసిద్ధి తీసికొనివచ్చింది. కాని, యిప్పుడు ఎదుర్కొనవలసిన పరిస్థితులు ఆయనశక్తికి మించిపోయాయి. 1929 వ సంవత్సరం, సామాన్యశాసనసభ్యుల సభలో ఆయన ఇలా అన్నాడు: "ఒకతరంలోగానీ, రెండుతరాలలోగానీ, చివరకు వందసంవత్సరాలకైనా సరే, భారతీయులు సైనిక నావికదళాలనూ, ఇతరోద్యోగిక శాఖలనూ అదుపులో పెట్టుకోగలుగుతారనీ, మన దేశంలోని అధికారవర్గంతో సంబంధంలేకుండా

ఒక్క భారతదేశప్రభుత్వానికే బాధ్యుడుగా వ్యవహరించగల రాజప్రతినిధిని తెచ్చుకోగలరనీ, ఈ సభలో ఉన్నవారిలో ఏ ఒక్కడైనా ఆశించగలడా ?"

భారతదేశంలోని అన్ని రాజకీయపక్షాలూ తదితర వర్గాలూకూడా సైమనుసంఘాన్ని బహిష్కరించాయి. "సైమనూ! తిరిగిపో!" అని ప్రజలు ఎలుగెత్తి కేకలు వేస్తూఉండగా 1928 వ సంవత్సరం ఫిబ్రవరి రెండవతేదీన ఆ సంఘం భారతదేశంలో అడుగుపెట్టింది. ఆ సంఘం పరిశీలన జరుపుతూఉన్నంతకాలమూ వైరుధ్యమే చుట్టుముట్టింది అది తయారుచేసిన నివేదిక యథార్థ విషయాలతో నిండినదే అయినా అటువంటిది ఎన్నడూ ఎవరూ కూడా ప్రకటించినట్టిది కాదు. గతచరిత్రను పరిశీలించడంకోసం దానిని ఇప్పుడుకూడా ఉపయోగించుకోటం ఉన్నది కానీ రాజకీయ పత్రంగా దానికి విలువ లేనేలేదు.

1928 వ సంవత్సరం ఫిబ్రవరి 28 వ తేదీన గాంధిమహాత్ముడు ఆఫ్రికాలో తాను ఉపయోగించి విరమించిన పథకాన్ని మళ్లీ ఆచరణలోకి తీసికొనరావటానికి సన్నద్ధుడైనాడు. బొంబాయిరాష్ట్రంలోని బార్డోలీజిల్లాలో మాత్రమే యథాపూర్వంగా శాసనధిక్కారోద్యమం ప్రారంభించాడు. బార్డోలీ జిల్లాలోని రైతులమీద ప్రభుత్వం నూటికి 22వంతులు ఎక్కువగా పన్ను విధించింది. వారు ఆ పన్ను చెల్లించలేకపోయారు. అందువల్ల ఈ పర్యాయం సర్దార్ పటేల్ నాయకత్వాన జాగ్రత్తగా తగు సన్నాహాలన్నీ చేసికొని చివరివరకూ పోరాడాలనే నిశ్చయంతో సత్యాగ్రహం ప్రారంభమైంది.

ఈ కాలంలో గాంధిజీ తన ఆశ్రమంలోనే ఉండి సత్యా

గ్రహులకు తగు సలహాలుఇస్తూ వచ్చాడు. వల్లభాయిపటేలు అప్పటికి పన్నెండు సంవత్సరాలనుంచీ గాంధిజీకి సహాచరుడుగా ఉంటూఉన్నవాడు; బొంబాయి న్యాయస్థానాలలో సుప్రసిద్ధుడైన న్యాయవాది. ఈ పోరాటంలో శాంతిసైనికులకు ఆయన సర్వసేనాధిపతి. ఆ పోరాటం 1928వ సంవత్సరం ఫిబ్రవరి 28వ తేదీనుంచి ఆగస్టు 6వ తేదీవఱకూ సాగింది. బార్డోలీలోని 87 వేలమంది రైతులు ప్రభుత్వానికి పన్ను చెల్లించమని భీష్మించారు. ప్రభుత్వం ఆగ్రహావివశమైంది. పశువులనూ, బండ్లనూ ఇతరాస్తులన్నిటినీ జప్తుచేసి ఎండలో రైతులను చెఱసాలలలో నిర్బంధించింది. కాని పరిస్థితి అదుపులోకి రాలేదు. భూమి కూడా రైతుల అధీనంనుంచి తప్పించి, క్రొత్తరైతులకు అమ్మివేయటం జరుగుతుందని ప్రభుత్వంవారు బెదరించి చూచారు. ఏమైనా రైతులు చలించలేదు. ఇక చేయవలసిందేమున్నది? సత్యాగ్రహులు ఎక్కడా ఎవ్వరూ తొందఱపడి హింసకు దిగలేదు. గాంధిజీ ఉపదేశాలను తు. చ. తప్పకుండా పాటించారు. రైతులు సజీవులైఉండి పోరాటం కొనసాగించటంకోసం దేశం నలుమూలలనుంచీ బార్డోలీలో ధనవర్షం కురిసింది. విదేశాలలో నివసిస్తున్న ధనిక భారతీయులు లక్షలకొలది రూపాయలు బార్డోలీకి పంపించారు. ఇలా మూడు నెలల పదిహేను రోజులపాటు పెనగులాట సాగగా జూనునెల 12వ తేదీన బార్డోలీరైతులపట్ల సానుభూతిసూచకంగా భారతదేశం అంతటా హరతాళ్ జరుపవలసిందని గాంధిజీ ప్రజలకు విజ్ఞప్తిచేశాడు. వెనుకటిమాదిరిగానే మళ్ళీ ఒకసారి దేశమంతా స్తంభించింది. ఆ రోజున వృత్తికర్మం నిర్వహించినవాడు లేడు. రాకపోకలూ,

అంగళ్ళలో కొనటాలు అమ్మటాలు లేకపోయాయి. ఏది యేమైనా సరే అనే దృఢనిశ్చయంతో అత్యంతనియమబద్ధంగానూ, క్రమశిక్షణతోనూ బ్రిటిషుప్రభుత్వానికి తీవ్రమైన హెచ్చరికగా ఈ ప్రతిఘటన సాగింది.

ఆగష్టు 6వ తేదీన ప్రభుత్వం లొంగివచ్చింది. నూటికి ఇరవైరెండు వంతులుగా పెంచిన పన్ను యథాపూర్వంగా తగ్గించివేసింది. రైతులనందరినీ కారాగారంనుంచి విడుదల చేసింది. ఎవరిభూమి వారికి స్వాధీనంచేసింది. జప్తుచేసిన పశుధనంక్రిందనూ, ఇతర చరాస్తులక్రిందనూ నష్టపరిహారం ఇయ్యటానికి అంగీకరించింది.

మహాత్ముడు తలచుకొన్నప్పుడల్లా ఎంతటి మహావిజయాలనైనా పరంపరాబద్ధంగా సాధించగలడనటానికి ఈబార్డోలీ విజయం ఒక దృష్టాంతమైంది. ఇటుతర్వాతచేయువలసిందేమిటో తెలిసికోవాలని దేశమంతా కుతూహలపడింది. సంపూర్ణ స్వాతంత్ర్యం గురించిన ముచ్చట సర్వసాధారణమైనది. స్వపరిపాలన అని అర్థంఇచ్చే ఈ స్వరాజ్యపదం యువకులకు అవ్యక్తంగా తోచేది.

అప్పుడే రాజకీయజీవితం ప్రారంభించి, వంగదేశంలో ప్రజాభిమానం చూరగొంటున్న సుభాష్‌చంద్రబోసు విపక్షులతో కత్తికత్తిగా పోరాడటమే దేశభక్తుల కర్తవ్యమని విశ్వసించేవాడు. బోసుమాదిరిగా యుద్ధప్రియుడు కాకపోయినా జవహర్లాల్ నెహ్రూకూడా ఆరోజులలో రాజకీయాలలో చాలా పురోగమించి, జాతీయోద్యమానికి స్వాతంత్ర్యమే పరమలక్ష్యమని గాఢంగా విశ్వసించేవాడు.

గాంధిజీకి ఈ వీరావేశం ఎంతమాత్రం గిట్టలేదు. దీని వల్ల హింస అనివార్యమౌతుంది; అలా జరిగితే తన నైతిక సిద్ధాంతాలకూ, ఆస్తిక విశ్వాసాలకూ భంగం కలగటమేకాక, భారత దేశానికి కలిగే ఉపద్రవం ఇంతా అంతా కాదు; అని గ్రహించాడు. 1928వ సంవత్సరం డిసెంబరునెలలో కలకత్తా మహానగరంలో జరిగిన కాంగ్రెసు వార్షికసమావేశానికి వెళ్ళి, హితవు ఉపదేశించే ధోరణిలో ఆ యువకుల పౌరుషాగ్నిని కొంచెం శాంతింపజేయటానికి సర్వశక్తులా కృషిచేశాడు. స్వాతంత్ర్యం ఎలా సిద్ధిస్తుందో తెలియకుండానే దానినిగూర్చి ప్రసంగించడం నిరుపయోగమని ఆయనకు తోచింది. (బోసు సంకల్పించిన) స్వాతంత్ర్యయుద్ధం అనే భావాన్నే ఆయన ఎన్నడూ ఆమోదించలేకపోయాడు. కలకత్తాలో ఆ యువకుల ఆవేశాన్ని చల్లబఱచటం అసాధ్యమనిపించేసరికి రెండేండ్లు మాత్రం ఓర్పువట్టవలసిందని వారితో రాజీపడటానికి ప్రయత్నించాడు. అక్కడికీ వారు సమ్మతించనందున గడువును ఒక్క సంవత్సరానికే పరిమితంచేశాడు. వారు కనుక ఒక్కసంవత్సరం పాటు వేచిఉంటే తాను వారితో ఏకీభవిస్తానన్నాడు. అంటే 1929వ సంవత్సరం అంత్యానికి గనుక భారతదేశం స్వరాజ్యం గడించలేకపోతే సంపూర్ణస్వాతంత్ర్యంకోసం కాంగ్రెసులో ప్రతిపాదించబోయే తీర్మానాన్ని తాను బలపఱచగలనని వారికి వాగ్దానంచేశాడు. దీనితో ఆ యువకులు తృప్తిపడవలసివచ్చింది.

తర్వాత ఆ సంవత్సరంలో ఇక కొద్దినెలలలో సంభవించనున్న లోకోత్తర సత్యాగ్రహోద్యమానికి ప్రజలను సన్నద్ధపఱచటంకోసం గాంధిజీ దేశపర్యటనం ప్రారంభించాడు. ఆ పర్య

టనంలో ఆయన రాజకీయాలనుగురించిఅంతగా ప్రసంగించలేదు. అందుకుబదులుగా సమ్మె చేయవలసిన అవసరమేవస్తే సత్యా హింసలుపాటించే విషయమై ఎలా ప్రవర్తించాలిఅన్నప్రశ్నతో తన సిద్ధాంతాలను తేటతెల్లంగా వివరించటానికి ప్రయత్నిం చాడు. ఇంతలో ఇంగ్లండు దేశంలో ఎన్నికలు జరిగి రామ్సే మాక్డొనాల్డు ప్రధానమంత్రిగానూ, వెడ్జువుడ్ బెన్ భారత ప్రభుత్వ కార్యాలయనిర్వాహకుడుగానూ, సంశ్లిష్టప్రభుత్వం ఏర్పడటం తటస్థించింది. భారతదేశానికి భవిష్యత్తు కొంచెం అనుకూలం కావచ్చుననేసూచనలుకలిపించాయి. ఇర్విన్ప్రభువు లండన్ వెళ్ళివచ్చి అధినివేశపతిపత్తి లక్ష్యంగా రాజ్యాంగరీత్యా భారతదేశం పురోగమించేవిషయమైబ్రిటను ప్రతినిధులూభారత దేశ ప్రతినిధులూ సమావేశమై సంప్రతించుకొనటానికి సకల పక్షసమావేశం (Round Table Conference) ఏర్పాటు కా నున్నదని ప్రకటించాడు. దీనితో లండనునగరంలో ఒకతుపాను బయలుదేరింది. సంఖ్యాబలంలేకుండా పరిపాలన సాగిస్తున్న కార్మికప్రతినిధిపక్షం టోరీల గర్జనలను తట్టుకోలేని దుర్బల స్థితిలో ఉన్నది. తత్ఫలితంగా రాజప్రతినిధి నిస్సహాయుడైనాడు. మహాత్ముడూ, ఇతరనాయకులూ డిసెంబరు 23వ తేదీన ఆయ నను సందర్శించారు. అప్పుడాయన తానేవిధమైన హామీలూ ఇయ్యలేననీ, ఆ సమావేశంలో ఏమి నిర్ణయాలు జరుగవచ్చునో తాను ఊహించలేననీ చెప్పక తప్పలేదు.

చివరకు ఆ సమావేశం ప్రయోజనం అలాగే అయింది. గాంధిజీకి మరొకమార్గం లేకపోయింది. ఆ సంవత్సరపు కాంగ్రెస్ సమావేశంలో పాల్గొనటానికి లాహోరునగరానికి

వెళ్ళినప్పుడు బ్రిటిషువారి నిర్బంధంనుంచి సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలని తీర్మానించటానికి ఆమోదించాడు. నాటికి సరిగా నలభైసంవత్సరాల వయస్సుకల జవహర్లాల్ నెహ్రూ ఆ లాహోరు కాంగ్రెసు సమావేశానికి అధ్యక్షత వహించాడు. 1930 వ సంవత్సరం జనవరి 26 వ తేదీన కాంగ్రెసుచేసిన ఆ తీర్మానంప్రకారంభారతసంపూర్ణ స్వాతంత్ర్యప్రకటనను రూపొందించటానికి మహాత్ముడు తన ఆశ్రమానికి తిరిగి వెళ్లాడు.

# షష్ఠమ ప్రకరణం

## జయోన్ముఖమైన ఉప్పుసత్యాగ్రహం

సంపూర్ణస్వాతంత్ర్యం కావాలని ప్రకటన జరిగింది మొదలుకొని మహాత్ముడు వినూత్నమైన జైత్రయాత్ర ప్రారంభిస్తాడని ప్రపంచమంతా గ్రహించిందికానీ అది యేరూపంలో బయలుదేఱుతుందో యే ఒక్కరికీ తోచలేదు. అసలు కొంత కాలంవఱకూ గాంధిజీకికూడా ఏమీా తోచనట్లే కనిపిస్తుంది. ఆయన యేమిచేసినప్పటికీ ఒక్క ఆంగ్లేయుడికికూడా హాని వాటిల్లని అహింసాపద్ధతిలో ఉండాలి. అదిన్నీ ఎప్పుడు ఏ విధంగా జరుగబోయేదీ ప్రతిస్పర్ధికి ముందుగా తెలియజేయాలి. అలా తెలిపిన ప్రకారమే సంపూర్ణమైన క్రమశిక్షణతో దేశ మంతటా అన్నిప్రాంతాలలోనూ ఒకేవిధంగా సాగాలి. ఇప్ప టికి ఆయన సిద్ధాంతాలు ఇవి అని స్పష్టపడ్డాయి.

ఆయన ఆశయాలు చక్కగా అవగతంచేసికొని ప్రజలకు నచ్చజెప్పగల సహచరులు కొందఱు ఏర్పడ్డారు. వీరిలో ఆయనతోబాటు ఆశ్రమంలో నివసించేవారేకాక, రాజకీయాలలో ఆయనను అనుసరించేవారుకూడా కలసిఉన్నారు. అయితే సత్యాగ్రహానికి ఏరూపం ఇవ్వాలనేది ఒక సమస్యఅయింది. గాంధిజీ న్యాయశాస్త్రాలను పఠించి చూడటం మొదలుపెట్టాడు. ఆ సంవత్సరం తొలిరోజులలో రవీంద్రనాథఠాకూరు మహాత్ముణ్ణి సందర్శించటానికివచ్చి, ఇక ఏమిజరగాలి ? అని ప్రశ్నించాడు. అప్పుడు మహాత్ముడా మహాకవితో తనకు అంతటా అంధకారమే కాని వెలుగు కనిపించటంలేదని చెప్పాడు మార్గమేదీకూడా ఆయనకు తోచలేదు.

అయితే ఆ అనోమయపరిస్థితి ఎంతోకాలం నిలబడలేదు. ఫిబ్రవరినెలనుంచీ యువభారతపత్రికలో ఆయన వ్యాసాలు చదివేవారికి ఉప్పు తయారుచేయటం విషయమై ఉన్న ప్రభుత్వశాసనాలమీదికి ఆయన ఆలోచనలు కేంద్రీకృతాలౌతున్నట్లు తోచింది. భారతదేశంలో ఉప్పు తయారుచేయటం కేవలం బ్రిటిషువారి అదుపులోనే ఉంటూఉండేది. మఱి ఎవడున్నా ఉప్పు తయారుచేయటానికి వీలులేదు; ప్రభుత్వం దగ్గఱనుంచితప్ప వేఱె కొనటానికీ వీలులేదు. ఉప్పు చట్టాలున్నా వాటిలోని కౌటిల్యమున్నా విదేశీయుల పరిపాలనా విధానానికీ, వారి ప్రాబల్యానికీ తగిన నిదర్శనాలని విమర్శాత్మకాలైన వ్యాసాలు రెండు యువభారత పత్రికలో ప్రకటితాలయినాయి. గాంధిజీ పద్ధతులతో పరిచయంకలవాడెవడైనా సరే ఆయన యిప్పుడు సత్యాగ్రహం చెయ్యటానికి ఈ ఉప్పు

చట్టాల వివరణతో ప్రభుత్వపు నిరంకుశత్వం లోకానికి తేట తెల్లంచేసి తనన్మూలకంగా తన ఉద్యమాన్ని సాగించబోతాడని ఊహించగలడు. అటుతర్వాత 1930 వ సంవత్సరం మార్చి నెల రెండవ తేదీన రాజప్రతినిధికి ఆయన ఒక చరిత్రాత్మకమైన లేఖ వ్రాశాడు. దానిలోని తొలివాక్యమే ఆ లేఖ వ్రాయవలసిన కారణం విశదీకరిస్తున్నది.

"ప్రియమిత్రమా!

శాసనధిక్కారోద్యమం ప్రారంభించటానికీ, ఇన్ని సంవత్సరాలనుంచీ చేపట్టటానికి వెఱుస్తూఉన్న బాధ్యతను స్వీకరించటానికీ, ముందుగా నేను మిమ్మల్ని కలిసికొని ఒకమార్గం అన్వేషించటానికి కుతూహలపడుతున్నాను."

ఈలేఖ ఆయన ప్రధానసిద్ధాంతాన్ని తేటతెల్లం చేస్తున్నది. ("నేను ఏ ప్రాణినీకూడా, అందులోనూ మనుష్యుణ్ణి, బుద్ధిపూర్వకంగానొప్పించలేను.") అయితే అటుతర్వాత భారత దేశాన్ని కొల్లగొట్టే బ్రిటిషుప్రభుత్వవిధానాన్ని నిశితంగా విమర్శించటం సాగుతుంది. రాజప్రతినిధిమోప్రల తాను "మోకరిల్లి" ఆ విషయాలను విచారించి మంచిచెడ్డలు ఆలోచించవలసిందని ప్రార్థిస్తున్నానంటాడాయన. ఇక ఏవిధమైనచర్చా సాధ్యంకాదంటే "ఈనెల 11 వ రోజున ఆశ్రమంలోనుంచి నాతో రాదగిన సహచరులను వెంటబెట్టుకొని ఉప్పు చట్టాల లోని అంశాలను ధిక్కరించటానికి పురోగమించవలసి వస్తుంది. అప్పుడు నన్ను నిర్బంధించటంద్వారా నా పథకాన్ని భంగపఱచటం మీకు సులభమార్గంగా గోచరిస్తుందని నాకు తెలుసు. అయితే ఒక క్రమశిక్షణప్రకారం నా కర్తవ్యం పూర్తిచేయ

టానికి దశసహస్రాలకొలదీ సన్నద్ధులౌతారని నేను ఆశిస్తున్నాను."

ఇర్విన్ ప్రభువు అతిక్లిష్టసమస్యను ఎదుర్కొనవలసి వచ్చింది. ఇక ఇక్కడనుంచి లండనుకూ, లండనునుంచి యిక్కడకూ నడచే నిస్తంత్రీవార్తలమీదనే ఆయన ఆధారపడ్డాడన టంలో మనకు సందేహం అక్కరలేదు. రామ్సేమాగ్డొనాల్డ్ సంక్లిష్టప్రభుత్వం కార్మికపక్ష సభ్యులలో హెచ్చుమంది భారత దేశానికి స్వాతంత్ర్యంగానీ కనీసం అధినివేశప్రతిపత్తిగానీ యివ్వడానికి సుముఖులుగా ఉన్నారనే వాస్తవవిషయం గమ నించవలసి వచ్చింది. ప్రపంచంలోని అధికభాగం "ఇక ఏమి జరుగబోతుందో ?" అని అతికుతూహలంతో నిరీక్షిస్తున్నది. గాంధిజీని నిర్బంధించటమా? మానటమా? అనేది అసాధారణ యోగ్యతాశాలిఅయిన ఇర్విన్ప్రభువుకు ప్రధానసమస్య ఐంది. లండనునుంచి ఆయనకు ఏమని ఆజ్ఞలు వచ్చాయో తెలియదు. నిశ్చయంగా ఆ తరుణంలో గాంధిజీని నిర్బంధించటం చాలా అపాయకరం. ఆయన చెఱసాలకే వెళ్ళితే తర్వాత జరుగ బోయే ఉద్యమం ఎంతక్రూరంగా రూపొందుతుందో ఊహించ టానికి వీలులేదు. అహింసకు హామీ ఇయ్యగలిగేది ఆయన ఒక్కడే. అయినప్పటికిన్నీ-మరి-ఆయనను నిర్బంధించకపోవటం ఒక పెద్ద విధ్వంసానికి తావుఇవ్వటమే అవుతుందిగదా! ఏవిధంగాచూచినా యీ విషయంలో ఇర్విన్ప్రభువు విజయో పేతంగా బయటబడటం దుష్కరంగానే కనిపించింది.

తర్వాత కొన్నిసంవత్సరాలకు ఇర్విన్ప్రభువు (అప్ప టికి హాలిఫాక్సుప్రభువు) ఆ కొద్దిపాటి(చిన్న) మనిషి.

(గాంధిజీ)పట్ల వ్యక్తిగతంగా తనకుగల గౌరవభావం ఎన్నటికీ చెక్కుచెదరనిదని నాతో అన్నాడు. ఆ "సామాన్య మానవ మూర్తి" ఎన్నడున్నూ ఆడినమాట తప్పలేదనికూడా ఆయన ప్రశంసించాడు. ఇంతేకాక హాలిఫాక్సుప్రభువు పాపభీతిగలవాడు. అది జగత్ప్రసిద్ధం. ఇక గాంధిజీని చూచినవారు ఆయన కేవలం ఒక విశిష్టపుణ్యమూర్తి అని గ్రహించలేకపోరు. అప్పుడు హాలిఫాక్సుప్రభువుకు హృదయంలో జరిగిన మథన, ఎంతో బాధ కలిగించిఉండాలి. గాంధిజీని నిర్బంధించకతప్పదనే నిశ్చయానికి వచ్చికూడా, దానిని అణచివేసికొనటానికే ఆయన తన శక్తికొలదీ ప్రయత్నించాడు. అందువల్లనే ఆ సమస్య పరిష్కృత మవుతుందని ఆయన భావించినట్లుగాకూడా కనబడుతుంది. గాంధిజీ లేఖవలన ఉత్పన్నమైన తీవ్రపరిస్థితిలో ఆ రాజప్రతినిధి మార్గాంతరాన వ్యవహరిద్దామని నిశ్చయించుకొన్నాడు. తన కార్యదర్శిచేత గాంధిజీకి ఒక సమాధానం వ్రాయించాడు. అందులో "చట్టానికి విరుద్ధంగానూ, ప్రజాశాంతికి భంగకరంగానూ స్పష్టంగా శిక్షార్హంగా కనిపించే మార్గంలో" గాంధిజీ ప్రవర్తించాలనుకొంటున్నట్లు తెలియుటంచేత రాజప్రతినిధి చాలా విచారిస్తున్నట్లు మాత్రమే ఉన్నది.

ఆ సమయంలో అతివిస్మయంతో ప్రపంచమంతా తన నోటివెంట వచ్చే పలుకుకోసం చెవులు దోరగిలబెట్టుకొని ఉండగా, గాంధిజీ ఇంకా సంయమనంవహించి, భగవత్ప్రార్థన చేస్తూ ధ్యానసమాధిలో ఉన్నాడు. తాను చేయబోయేది ఉప్పు చట్టాలను ఉల్లంఘించటమే అని ఆయన అప్పటికే స్పష్టం చేశాడుగానీ, ఆ ఉల్లంఘనం ఎలా ప్రారంభమౌతుందో ఎవరికీ-

చివరికి భారతదేశంలోని వారికి కూడా తెలియలేదు. గాంధిజీ జీవితమంతటాకూడా ఆయనకు సహజమైన తత్త్వపరిశీలనమే ఎటువంటి క్లిష్టపరిస్థితులలోనైనా చక్కగా ప్రకాశించి ఆ సుదినం వచ్చేవఱకున్నూ ఆత్మనిశ్చయానుసారం వ్యవహరించగల శక్తిని ప్రసాదించింది. ఆ రోజున అంటే 1920 వ సంవత్సరం మార్చి నెల 12 వ తారీఖున ఆయనా, మఱి 78 మంది ఆశ్రమవాసులూ అహమ్మదాబాదు పొలిమేరలనుంచి సముద్రతీరాన రెండువందల మైళ్ళదూరానఉన్న దండి అనేచోటికి పాదచారులై ప్రయాణం మొదలుపెట్టారు. మహాత్ముడు రాజప్రతినిధికి కర్తవ్యం నిర్ణయించుకొనటానికి ఇంకొకరోజు అవకాశమిచ్చాడన్న మాట. ప్రయాణం ప్రారంభమైంది 12 వ తేదీన మాత్రమే.

ఈ సమయంలో సబర్మతి ప్రపంచం అన్నిభాగాలనుంచీ వచ్చిపడ్డ పత్రికావిలేఖరులతోనూ, మహాత్ముడు ఏమిచేయ బోతున్నదీ తెలిసికోటానికే నిరీక్షిస్తున్న భారతీయజనసందోహం తోనూ కిటకిటలాడిపోయింది. ఉప్పు సత్యాగ్రహంవల్ల ప్రపంచవ్యాప్తంగా అవిశ్వాససమ్మిళితంగా కలిగినకుతూహలం క్రమంగా ఒక ఉద్రిక్తవాతావరణాన్ని కల్పించింది. కన్నులు మిఱుమిట్లుగొల్పేటట్లు తమయెదుట ప్రజ్వరిల్లే ఆ మహాజ్యోతిని చూస్తూకూడా ఈ ఇరవయ్యోశతాబ్దపు ప్రజలు అది అంతా యథార్థమే అని విశ్వసించలేకపోయారు.

12 వ తేదీ ఉదయాన ఆశ్రమంలో ప్రార్థనలూ భజనలూ జరిగాయి. తర్వాత మహాత్ముడు, స్త్రీపురుషులు మొత్తం 78 మంది భక్తులూ తన్ను అనుసరించగా, ఒకరినొకరు అతిక్రమిస్తూ తనవెంటనే బయలుదేఱిన అనంత ప్రజాసముదా

యంతోకూడా ఆశ్రమంనుంచి బయలుదేరాడు. కొంతసేపు పాదరక్షలు లేకుండానూ, కొంతవరకు పాదుకలు తొడుగు కొనీ నడక సాగించాడు. ఆయన అలసినట్లయితే వాహనం కావలసివస్తుందని భక్తులు ఒకగుఱ్ఱాన్నికూడా ప్రయాణం పూర్తిఅయేవరకూ తీసికొనివెళ్లారు. అయితే ఆయన దానిని అధిష్ఠించనేలేదు. "భగవంతునిపేర మనం ప్రయాణిస్తున్నాము" అన్నాడాయన.

అప్పుడు యావద్భారతంలోనూ కలిగిన ఆవేశం అసామాన్యమైనది. ఆ ప్రయాణం ఇరవైనాలుగురోజులు పట్టింది. అంగవస్త్రధారి అయి యాత్ర ప్రారంభించిన ఆ సామాన్య వృద్ధమూర్తి ప్రపంచప్రజానీకపు దృష్టులన్నింటికీ కేంద్రస్థానమైనాడు. ప్రయాణం ముగిసేసరికి ప్రపంచాని కంతటికీ అంతకంటె ముచ్చటించదగిన విషయం మఱిఒకటి లేకపోయింది. ఆ యిరవైనాలుగురోజులున్నూ భారతభవిష్యత్తును తత్పూర్వం మానవలోకం దృష్టిని ఎన్నడూ ఆకర్షించనంత నిశితతమకిరణ రూపానికి తీసికొని వచ్చాయి.

భగవత్కార్యంగా భావించిన ఏ పనిని నిర్వహించినప్పుడైనా సంభవమైనట్లే అప్పుడున్నూ ప్రయాణం ముగించేసరికి గాంధిజీ ఆరోగ్యంగానూ ఉత్సాహంగానూ ఉన్నాడు. ఆయన భక్తులు కొందఱు ప్రయాణశ్రమతో ఎంతైనా బాధపడ్డారు గానీ ఆయనకు బాధ అనేది ఏ సమయంలోనూ తోచలేదు. అటువంటి యాత్రలో రోజుకు పన్నెండుమైళ్ళు ప్రయాణిస్తే ఎక్కువ అనీ అలా కనుక సాగితే శ్రమఉండదనీ గాంధిజీ అనుకొన్నాడు. మార్గమధ్యంలో కనిపించిన ప్రతిగ్రామంలోనూ

కొంతసేపు ఆ గ్రామస్థులతో సంభాషించటానికి ఆగేవాడు. ఒక మహత్తరపరీక్ష ఆసన్నమైనదనీ, వారు పవిత్రజీవనులై ఉండాలనీ, సత్యమే చెప్పాలనీ, ఖద్దరుబట్టలే కట్టాలనీ, స్నానం మానరాదనీ, మద్యపానం విసర్జించాలనీ, హిందూమతానికి అపఖ్యాతి తెచ్చే (బాల్యవివాహాలవంటి) ఆచారాలు పరిత్యజించాలనీ, హెచ్చరిక వినబరుస్తూనే ఉప్పుచట్టాలను ఉల్లంఘించాలనీ ప్రబోధించాడు.

మహాత్ముడికి ప్రజలతత్త్వం తెలిసివచ్చినట్లే ప్రజలకు మహాత్ముని తత్త్వమున్నూ బోధపడింది. ఆయన ఏమిచేయబోతున్నాడో వారికి తెలియలేదుగానీ, అదే తమకు హెచ్చరిక ఔతుందని వారు గ్రహించారు. ఏ సిద్ధాంతాన్ని గురించి అయినా వ్రాసినదానికంటెనూ, చెప్పినదానికంటెనూ దానికి లక్ష్యమైన ఆచరణ జరపటంలో ఎంతో శక్తి ఉన్నది. గాంధిజీ వైశిష్ట్యం ఇదే. ఆయనజీవితం అంతటాకూడా ప్రజలకు ఏ ప్రబోధం చెయ్యవలసివచ్చినా ఆచరణద్వారా చూపి చేశాడే కానీ, మాటలతో చెప్పి మానలేదు.

ప్రతిగ్రామంలోని ప్రజలూ ఆయన పాదధూళి భద్రపఱచుకొనటంకోసం బాట ఊడ్చారు. ఆయన మార్గంలో పచ్చని ఆకులుగల కొమ్మలు నాటారు. ఇంటిముఖం పట్టటానికి ముందు ముందుగ్రామంవఱకూ ఆయనను అనుసరించారు. అద్భుతమైన యీ నవీనోద్యమశక్తినిచూచి ప్రభుత్వం తత్తఱపడి ఏమీ తోచక దిగాలుపడింది. ప్రజలు గుంపులుగుంపులుగా వచ్చి కలుస్తూఉండగా యాత్రికులు అంతకంతకూ అధికోత్సాహంతో పురోగమించారు.

1930 వ సంవత్సరం ఏప్రిల్ 5 వ తేదీన అనుచరులందరితో కలసి ఆ రాత్రిఅంతా గాంధిజీ దైవప్రార్థనతో గడిపాడు. తెల్లవారుతూఉండగానే అందఱూసముద్రాన్ని సమీపించారు. మహాత్ముడు సముద్రంలో మునిగి తీరంనుంచి కొంచెం ఉప్పుతీసికొన్నాడు. అది ఒక్కపిడికెడుమాత్రమే. కాని అంతేచాలు. దానితో ఆయన చట్టాన్ని ఉల్లంఘించాడు; ప్రభుత్వాన్ని ధిక్కరించాడు.

జీవితావసరవస్తువు లన్నింటిలో ఉప్పు అందఱికీ అతి ముఖ్యంగా కావలసింది. అటువంటిది విదేశప్రభుత్వంవల్ల దేశీయులెవరికీ హక్కులేనిదయింది. అది ప్రతి కృషీవలునికీ కూడా సుపరిచితమైనదీ, భగవత్ప్రసాదితమూకూడా. అటువంటిదానిని ప్రజలదగ్గఱనుంచి విదేశప్రభుత్వం దొంగిలించివేసింది. ఉప్పుచట్టంలో ప్రతిధ్వనించే తాత్పర్యంలో ఇంతా, ఇంతకంటె ఎక్కువాకూడా ద్యోతకమయింది.

ఇక కావలసిందేమున్నది ? క్రమశిక్షణతో అమలుజరిగిన ఉప్పుదండయాత్ర సత్యాగ్రహంమొత్తానికి ఉన్నతలక్షణమైంది. ఆ ప్రదర్శన ఎవ్వరినీ హింసించలేదు. అచ్చంగా అహింసాత్మకమైంది. ఒక్కప్రభుత్వశాసనానికి మాత్రం విరుద్ధమైంది. గాంధిజీ మొదటనే ఊహించినట్లు, ఆయన అనుకొన్న ఫలితాలకున్నూ అనుగుణంగా ప్రభుత్వం ఇక చర్య తీసికోక తప్పలేదు.

అయితే ప్రభుత్వం వెంటనే మహాత్ముణ్ణి నిర్బంధించలేదు. దండిసముద్రతీరంనుంచి హెచ్చరిక రాగానే దేశమంతటా ఉద్యమం ప్రజ్వరిల్లింది. ప్రతివ్యక్తీ ఉప్పు తయారుచేయటం,

అమ్మటంకానీ, అలా అమ్మకానికివచ్చిన ఉప్పును కొనటం కానీ జరిగింది. ఉప్పుచట్టాన్ని ఉల్లంఘించటానికి ఏదో ఒకటి అందరూ చేశారు. అప్పుడు ప్రభుత్వం దేశంలో ఒకమూల నుంచి చట్టం ఉల్లంఘించినవారిని నిర్బంధించటం మొదలు పెట్టింది. అయితే చెఱసాలలకు వెళ్ళేవారు వెళ్ళుతూఉంటే, క్రొత్తగా వచ్చినవారు వారికర్తవ్యాన్ని నిర్వహిస్తూవచ్చారు. మొత్తం జనాభా అంతా చట్టాన్ని ఉల్లంఘించటంచేత రక్షక భటులుగానీ, సైన్యంగానీ ఆ పరిస్థితిని అదుపులో పెట్టటానికి వీలులేకపోయింది. దేశంలోని చెఱసాలలు చాలలేదు. చట్టం ఉల్లంఘించినవారు అసంఖ్యాకంగా బయటనేఉన్నారు. ఎక్కడో తప్ప దేశం అంతటాకూడా ఉద్యమం అహింసాబద్ధంగానే సాగింది. రక్షకభటులూ సైనికులూ ఒక్కొక్కప్పుడు క్రూరంగా వ్యవహరించారుగానీ, గాంధిజీ ప్రబోధాన్ని చక్కగా అర్థం చేసికొన్న ప్రజలు ఆత్మరక్షణకైనా పెనగులాడలేదు.

ఆతర్వాత కొన్ని వారాలవఱకూ గాంధిజీ తన 78 మంది అనుచరులతో దండీశిబిరంలోనే ఉన్నాడు. ఆయన మళ్ళీ ఉప్పు తయారుచేయలేదు; తీసికొనిరానూ లేదు. భారతదేశపు సముద్రతీరమంతటా ఆయనకోసం ప్రజానీకం ఉప్పు తయారు చేస్తోందికాబట్టి, ఆయనకు స్వయంగా పనిచేయవలసిన అవసరం లేకపోయింది. చట్టానికి విరుద్ధంగా ఉప్పు అమ్మకాన్ని కాంగ్రెసుపక్షం కొనసాగించింది. అది శాసనవిరుద్ధమైనా బహిరంగంగానే సాగుతున్నది. అదిన్నీ దేశమంతటా భారీఎత్తున ప్రారంభమైంది. ఉప్పు అమ్మకంవల్ల వచ్చిన సొమ్ము కాంగ్రెసు నిధిలో జమ అవుతున్నది. సముద్రతీరంనుంచి గాంధిజీ తెచ్చిన

పిడికెడు ఉప్పుకూ ఊహించరానంత ఖరీదు వచ్చింది. దానివల్ల 1600 రూపాయలు వచ్చాయి. అది అనాటి విలువప్రకారం 750 షిల్లింగులు. నగరాలన్నిటా శాసనవిరుద్ధంగా ఉప్పు అమ్మకం జరిగేచోట్లనూ, విదేశవస్త్రాలు బహిష్కరించ వల సిందని ప్రబోధాలు చేసేచోట్లనూ ప్రజలు గుమిగూడటం మొదలుపెట్టారు. ప్రభుత్వం ఒకప్రక్క శాసనోల్లంఘనకారుల్ని నిర్బంధిస్తూనే ఉన్నది. ఉప్పుచట్టం ధిక్కరించినందుకుగాను ఆ ఒక్క నెలలోనూ 60000 మందికిపైగా చెఱసాలలకు వెళ్లారు. భారతీయ పత్రికలలో ప్రభుత్వానుమతిలేకుండా ఏవార్తనూ ఏ వ్యాసాన్నీ ప్రకటించరాదనే నిర్బంధం బయలుదేరింది. ఇక కాంగ్రెసు పత్రికల ప్రకటనకే అవకాశం లేకపోయింది. ఒకరి తర్వాత ఒకరుగా నాయకులు కృష్ణజన్మస్థానానికి యాత్ర మొదలుపెట్టారు. అలహాబాదులో నెహ్రూ, మదరాసులో రాజగోపాలాచారీ, పాట్నాలో రాజెన్‌బాబూ, ఢిల్లీలో దేవదాసు గాంధీ నిర్బంధితులైనారు. మేనెల 4 వ తారీకు రాత్రి 12 గంటల 45 నిమిషాలకు అంటే 5 వ తేదీననే గాంధీజీని కూడా ప్రభుత్వం నిర్బంధించింది.

ఈ నిర్బంధం చాలా విచిత్రంగా జరిగింది. చిరకాలంగా నిరుపయోగంగాఉన్న 1827 వ సంవత్సరపు చట్టాన్ని త్రుప్పు దులిపి బయటికిదీసి, గాంధీజీ నిర్బంధానికి దానిని బ్రహ్మాస్త్రంగా వినియోగించుకొన్నారు ప్రభుత్వంవారు. వారు పంపిన ఆజ్ఞాపత్రం (వారంటు)లో. "ప్రభుత్వ సంకల్పానుసారం" మోహనదాసు కరంచందుగాంధిని నిర్బంధించి చెఱసాలకు పంప వలసిందని మాత్రమే ఉన్నది. నేరం ఆరోపించటంకానీ, విచా

రణకానీ లేవు. ఆయనను ఎఱవాడ కేంద్ర కారాగారానికి తీసుకొనిపోయారు. అక్కడ ఆయన రాట్నంతోనూ, లేఖలు వ్రాయటంతోనూ, గ్రంథపఠనంతోనూ హాయిగా కాలక్షేపం చేస్తున్నాడు.

ఉప్పు దండయాత్ర కొనసాగుతూనే ఉన్నది. ధారాశనం ఉప్పుకొటారుల మీదకు దాడి సాగించాలని మహాత్మునికి సంకల్పం కలిగింది. దానిని ఆయన రాజప్రతినిధికి తెలియజేశాడు. ఈ దాడికి సరోజినీనాయుడు నాయకత్వం వహించింది. గాంధేయ చరిత్ర అంతటా ఈమె అద్భుతజ్యోతిగా ప్రకాశించింది. భారతీయులు ఈమెను ఎన్నటికీ మఱచిపోలేరు. ధారాశనం మీద జరిగిన దాడిని వెబ్ మిల్లర్ అనే అమెరికా దేశపు పత్రికా ప్రతినిధి ప్రత్యక్షంగా చూచాడు. ఆనాడు తాను చూచినదంతా అప్పటికప్పుడే గ్రంథస్థం చేశాడు. తడవకొక దళం చొప్పున నిర్ణీతపద్ధతిని పురోగమిస్తూ మొత్తం 2500 మంది స్వచ్ఛందసేవకులు దాడిలో పాల్గొన్నారు. దిట్టమైన తీగెకంచె ముందు ఉక్కుపొన్నుల లాఠీలతో రక్షకభటులు వారికి స్వాగతమర్యాదలు జరిపారు. ఆ ఉదయం ప్రార్థన ముగిసిన తర్వాత సరోజినీనాయుడు స్వచ్ఛందసేవకులతో ఆనాడు వారికి రక్షకభటులవల్ల దెబ్బలు తగులుతాయనీ అయినా వారు ప్రతిఘటించగూడదనీ చెప్పింది. "దెబ్బ తప్పుకొనటానికి మీరు చేయికూడా ఎత్తరాదు."

వెబ్ మిల్లరు ఇలా ("మహాత్మగాంధి జీవితం" అనే రచనలో లూయీఫిషర్ ఉటంకించినట్లు) వ్రాశాడు : "వింశతుల కొలదీ (ఇఱువై ఇఱువైమంది) దేశీయ రక్షకభటులు తమకు

ఎదురువస్తున్న స్వచ్ఛందసేవకుల మీాదపడి లాఠీల ఉక్కు-మొన లతో వారి తలలమీాద ప్రహారాలు కురిపించారు. స్వచ్ఛంద సేవకులు ఒక్క-రుకూడా దెబ్బలు అపుకొనటానికి చేయైనా ఎత్త లేదు. పదిగోలీల ఆటలో గోలీల మాదిరిగా వారు దొఅలి పోయారు. నేను నిలిచిఉన్న చోటికే రక్షణలేని తలలమీాద తీవ్రంగా తగులుతూఉన్న దెబ్బలు వినిపించాయి. ముందుకు వెళ్ళటానికి కాచుకొనిఉన్నవారు తమవారికి తగులుతున్న ప్రతి ప్రహారానికీ జాలితో నిట్టూరుస్తున్నారు. దెబ్బలు తగిలినవారు గిలగిలకొట్టుకొంటూ స్పృహతప్పిపోతున్నారు; రక్తసిక్తాలైన తలలతో విఱిగినబుజాలతో మెలికలు తిరుగుతున్నారు. వంతుల ప్రకారం రక్షకభటులను సమీాపిస్తున్న దేశభక్తులు శ్రేణీబద్ధులై తమకుకూడా దెబ్బలు తగిలేవఱకున్నూ నిశ్శబ్దంగా సాగిపోతూనే ఉన్నారు."

తర్వాత అతను ఇలా అంటాడు: "క్రింద కూర్చున్న వారిని రక్షకభటులు నిర్దాక్షిణ్యంగా పొత్తికడుపుమీాదనూ ఇంకా అధోభాగానా కూడా తన్నటం మొదలుపెట్టారు. (తర్వాత) గంట గంటకూ క్షతగాత్రవాహకులు కదలలేకుండా పడిపోయి నెత్తురోడుతున్నవారి శరీరాలను మోసికొనిపోతు న్నారు."

తర్వాత అనేకదినాలవఱకూ ఇటువంటి విషాదదృశ్యాలు ప్రత్యక్షమాతూనే వచ్చాయి. ప్రతిసమయంలోనూ కూడా క్రౌర్యం హింస అనేవి రక్షకభటులే ప్రదర్శించారు కానీ, గాంధిజీ అనుచరు డొక్కడైనా ఆత్మరక్షణకోసం ఈ షత్తు ప్రయత్నంకూడా చేయలేదు.

ధారాశనంలో సరోజినీనాయుడు ప్రశంసార్హంగా తన కర్తవ్యాన్ని నిర్వహించింది. ప్రభుత్వంవారు ఆమెను తొలిరోజే నిర్బంధించారు. జూను 30 వ తేదీన మోతీలాల్ నెహ్రూను నిర్బంధించారు. (వారు ఆలస్యంచేస్తున్నందుకు అంతవఱకూ ఆయన చాలా ఆందోళనపడి ఉండవచ్చును. భారత దేశంలోని ప్రతి దేశభక్తుడూ కృష్ణజన్మస్థానానికి వెళ్ళాలని తహతహపడే రోజులవి.)

ప్రభుత్వాని కిప్పుడు విషమసమస్య యెదురైంది. కార్యాలయాలలో పనిచేసే భారతీయోద్యోగులెందఱో రాజీనామా లిచ్చి వెళ్ళిపోవటంచేత ఎక్కడపని అక్కడ ఆగిపోయింది. నీటి తీరువవల్ల వచ్చేఆదాయం అంతకంతకు అతిశీఘ్రంగా క్షీణించి పోతున్నది. చెఱసాలలన్నీ భర్తీ అయినాయి. (అప్పటికి రాజకీయ నిర్బంధితులు లక్షమంది అయినారు.) రక్షకభటులు విసిగి పోయారు. ఈ క్లిష్టసమస్యకు పరిష్కృతి గాంధిజీవల్లనే కాని జరగనట్లు స్పష్టమైంది. గాంధిజీ ఎఱ్ఱవాడ చెఱసాలకు వచ్చి నప్పుడే తనతోడి కాంగ్రెసు కార్యవర్గసభ్యులతో సంప్రతిస్తేనే కానీ ప్రభుత్వంతో ఏమీ చర్చించబోనని చెప్పివేశాడు. అప్పుడు ప్రభుత్వం ఒకప్రత్యేకప్రుైలులో కాంగ్రెసుపక్షంలో ముఖ్యులైనవారినందఱినీ మహాత్మునితో మాట్లాడటంకోసం ఎఱ్ఱవాడ చెఱసాలకు పంపించింది. నెహ్రూలు ఇద్దఱూ సయ్యదు మహమ్మదూ అలా ఎఱ్ఱవాడ చెఱసాలకు వచ్చారు. సరోజనీ నాయుడూ సర్దారు పటేలూ అక్కడే ఉన్నారు. వారి సంభాషణల పర్యవసానంగా, ప్రభుత్వంతో ఏ విధంగానూ సంధిచేసు

కొనటానికి వీలులేనట్లు ఆ నాయకులకూ ప్రభుత్వానికీ మధ్య ఒక అగాధం ఏర్పడ్డదని స్పష్టమైంది.

ఇది ఇలా ఉండగా 1930వ సంవత్సరం నవంబరు నెలలో లండనునగరంలో భారత దేశపరిస్థితులు పరిశీలించడానికిసర్వపక్ష సమావేశం (Round TableConference) జరుగవలసిఉంది. ఐతే అందులో పాల్గొనాలని అనుకొంటున్నదీ, అలా చేయటానికి అవకాశం కల వ్యక్తి ఒక్క-మహమ్మదాలీ జిన్నా మాత్రమే. తక్కిన భారతీయనాయకులెవ్వరూ అందులో పాల్గొనే అవ కాశంకాని అభిలాషకానీ లేనివారు కనుక, ఆ సమావేశం నిరుప యోగమని తేలిపోయింది. ఇక ప్రభుత్వం లొంగక తప్పలేదు.

గాంధిజీ మొదలుగా భారతీయనాయకులందఱూ భారత స్వాతంత్ర్యదినమైన 1931వ సంవత్సరపు జనవరి 26వ తేదీన విడుదల అయినారు. ఆ విడుదలకు ఏమీ షరతులు లేవు. వెంటనే రాజప్రతినిధికి ఆయన అలా వ్యవహరించినందుకుగాను తన కృతజ్ఞత తెలియజేస్తూ తాము ఇద్దరూ కలసి ముఖా ముఖిగా అన్నివిషయాలూ చర్చించవచ్చునేమో తెలుపవల సిందని గాంధిజీ ఒక లేఖ వ్రాశాడు.

గాంధిజీ- హాలిఫాక్సు (లేక గాంధిజీ-ఇర్విన్) ప్రభువుల సంభాషణలు చరిత్రాత్మకమైనాయి. ఒక భారతీయుడూ, ఆంగ్లే యుడూ నాటినుంచీ పరస్పర సమానగౌరవంతో మెలగవలసిన రెండు దేశాలకూ ప్రతినిధులుగాఉండి ఒకరిపట్ల ఒకరు సమాన మర్యాదతో వ్యవహరించి సంభాషించటమే వాటి ప్రాముఖ్యా నికి మొదటికారణం. (ఎన్నటికో 17 సంవత్సరాలకు సిద్ధించిన)

భారతస్వాతంత్ర్యం రూపొందవగ్గ అంశాలమీద వారిసంభాషణలు సాగాయి.తత్ఫలితంగా ఇర్విన్‌గాంధిజీ ఒడంబడిక అనేది పుట్టింది.

సామాన్య శాసనసభ్యులసభ (House of Commons) లో ఈ విషయమై అధిక్షేపిస్తూ విన్‌స్టన్‌చర్చిల్ ఇలా అన్నాడు :

"అంతర్వాణిపేర అబద్ధాలాడేవాడూ, ఇప్పుడు మన రాజ్యాంగాన్ని ప్రతిఘటించే సన్యాసీ, అయిన ఒక అర్ధదిగంబరుడు మన ప్రభువైన సార్వభౌమునికి ప్రతినిధి అయిన వ్యక్తితో సమాన ప్రతిపత్తితో చర్చించి, సంప్రతించటంకోసం రాజ ప్రతినిధి భవనపువాకిట అంగలు వేసికొంటూ, మెట్లు ఎక్కటం అనేది ఈనాడు ఎంతో రోతపుట్టించేదీ సహించలేనిదీగా కనబడుతున్నది."

ఉన్నతమూర్తి అత్యున్నత ప్రభు బిరుదాంకితుడూ అయిన ఇర్విన్‌ప్రభువు అంగవస్త్రధారి అయిన ఆ కొద్దిపాటి నల్లజాతి మనిషిని కలిసికొన్నప్పుడు చూచేవారికి ఏదో విడ్డూరంగా కనిపించి ఉండవచ్చును. మఱి ఆ కొద్దిపాటి మనిషి గొప్పతనం సర్వసాధారణమైనది కాదుగా ! తాను కలిసికొన్న అందఱినీ తనతో సమానులుగా భావించే అనన్యమైన శీలం ఆయనది. ఆ సంవత్సరమే లండనునగరం సందర్శించినప్పుడు ఆయన యీ వ్యక్తిత్వం అక్కడివారు గమనించి తఱచూ ప్రశంసించటం జరిగింది. అయితే రాజప్రతినిధి భవనంముందు అది ఏదోవింతగా కనిపించిఉండవచ్చును.

పరిసరాలు ఎలాఅయినా ఉండనీ ! ఇర్విన్‌తో మహాత్ముడు చాలా చొరవగా సంభాషించాడు. ఒకరి పరతులు

మరొకరికి ఎంత అనంగీకారంగా తోచినా, కొన్నింటిలో అధిక మయిన అభిప్రాయభేదాలే కలిగినా ఎంతో పరస్పరగౌరవంతో వారు పలుమార్లు కలిసికొని సంప్రతించుకొన్నారు. మూడు గంటలన్నర జరిగిన మొదటి సంభాషణ ఫిబ్రవరి 17 వ తారీకున తటస్థించింది. తర్వాత ప్రతిదినమూ కొంతసేపు చొప్పున మాట్లాడుతూవచ్చారు. తర్వాత ఒక వారం ఆగి మళ్ళీ 27 తేదీన కలిసికొన్నారు. ప్రతిఘట్టంలోనూ ఇర్విన్ ప్రభువు లండను అధికారవర్గాలవారి సలహా తీసికోవలసివచ్చింది. ఇటు గాంధిజీ కాంగ్రెసుకార్య నిర్వాహకవర్గంవారికి అంతా విశదీకరించి, వారి అంగీకారం తెలుసుకోవలసి వచ్చింది. ఒకమాఱు మార్చి 1 వ తేదీన గాంధిజీ ఆ మధ్యాహ్నమూ మళ్ళీ సాయం కాలమూ రాజప్రతినిధితో సంభాషించి అక్కడికి అయిదు మైళ్ళ దూరానఉన్న తనబసలో అంటే అన్సారీభవనంలో తన కోసం కాచుకొని ఉన్న కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గ సభ్యులనుకలసికొని తెల్లవాఱుజామున రెండుగంటలకు సంప్రతింపులు జరపవలసివచ్చింది.

1931 వ సంవత్సరం మార్చి 7 వ తేదీన గాంధి-ఇర్విన్ ఒడంబడికమీద సంతకాలు జరిగాయి. అయితే భారతభవిష్యత్తు విషయమై ఈ ఒడంబడికలో ఏ విధమైన ఒప్పందాలూ జరగలేదు. స్వాతంత్ర్యమే గమ్యమనే సిద్ధాంతంమీదనే గాంధిజీ నిలబడ్డాడు. ఈ ఒడంబడిక కేవలం తాత్కాలికమూ, పరిమితమూ అయింది. కాంగ్రెసువారు శాసనధిక్కారోద్యమం విరమించేట్టున్నూ, ప్రభుత్వం రాజకీయ నిర్బంధితులను విడుదల చేసి, సముద్రతీరాల్లో ప్రజలెవరైనా స్వేచ్ఛగా ఉప్పుచేసికొన

టానికి అనుమతించేట్టున్నూ ఒప్పుకోవటంవల్ల భారత దేశంలో మళ్లీ శాంతి యేర్పడింది. రాజకీయంగా కలిగిన ప్రయోజనం ఏమిటీ అంటే లండనులో రెండవ సర్వపక్షసమావేశం (Second Round Table Conference)లో పాల్గొనటానికి భారత జాతీయసంస్థ సమ్మతించింది.

ఏమైనప్పటికీ ఫిషరున్నూ తదితరులున్నూ స్పష్టంగా పేర్కొన్నట్లు ఈ ఒడంబడిక దానిలోని అంశాలకంటె అతి ముఖ్యమైనది. సమానులమధ్య ఒడంబడిక కావటమే దాని విశిష్టత. ఈ విషయంలో అది స్వాతంత్ర్యాన్ని పరోక్షంగానైనా గుర్తించటం జరిగిందనే దానికి నిదర్శనమౌతున్నది. ఆ తర్వాత గడచిన 17 సంవత్సరాలలోనూ భారతీయులు కొంత ఆగ్రహావిష్టులు కావటమూ, బ్రిటిషువారి చిత్తశుద్ధిని ఇతరులుకూడా అనుమానించటమూ జరిగింది కానీ 1930 వ సంవత్సరంలో ప్రధానలాభం చేకూరింది. తక్కినదంతా దాని విపులీకరణమే.

రాజకీయ దృక్పథంనుంచి చూస్తే గాంధిజీ యిప్పటికె తనలక్ష్యసాధనలో తురీయపథం అందుకొన్నాడు. అప్పటికి ఎవరికీ అనుభవగోచరం కాని మార్గంలో ఆయన భారతదేశాన్ని స్వతంత్రంగా చేశాడు. ఆ సంవత్సరం కాంగ్రెసు వార్షికసమావేశంలో కాంగ్రెసుపక్షాన ఏకైకప్రతినిధిగా లండనులోని రెండవ సర్వపక్షసమావేశంలో పాల్గొనటానికి ఆయననే ఎన్నుకొనటం జరిగింది. ఆగస్టునెల 29 వ తేదీన ఆయన లండనుకు బయలు దేరాడు.

# 2

ఆ సర్వపక్ష సమావేశం గాంధిజీకి అంతవఱకెన్నడూ లేనంతగా ప్రపంచసర్వస్వపు ఆకర్షణ తెచ్చిపెట్టింది. నానా దేశ జాతీయవార్తాపత్రికలన్నిటా ఆయన సాన్నిహిత్యంలోనివారికి కూడా ఎన్నడూ అనుభూతిగోచరం కాని ఆయన ఔజ్జ్వలం ప్రతిఫలించింది. అమెరికా పత్రికలలో ఆయన ఆశయాలకంటె వేషానికీ ఆహారనియమానికీ ఎక్కువప్రచారం జరిగింది. పశ్చిమ దేశాలకు సందేశం అందజెయ్యటానికి రావటంవల్లనే ఆయన తన అలవాట్లను మార్చుకోలేకపోయాడు. రెండుపూటలా తన ప్రధానాహారమైన పాలకోసం తనమేకనుకూడా వెంటబెట్టుకొని నౌకాపార్శ్వభాగానకూర్చుండిప్రయాణంసాగించాడు. లండను నగరంలో ప్రసిద్ధమైన వెస్టెండ్ హోటలుకు వెళ్ళక, పేదలు నివసించే ప్రాంతంలోఉన్న మ్యూరిల్ లెస్టర్ అనే బ్రహ్మచారిణి యింటిలోనే బసచేశాడు. సమావేశస్థలమైన సెంట్ జేమ్సు భవనానికీ దీనికీ చాలాదూరం.అక్కడికి వెళ్ళిరావటానికి ఎంతోసేపు పట్టుతుంది. అందుచేత రిగవ నైట్స్ బ్రిడ్జివద్ద ఒక కార్యాలయాన్ని ఏర్పాటుచేసికొన్నాడు. పేదలమధ్యనే నివసించటం ఆయన అభిమతం కనుక, ఎంతరాత్రికైనా తిరిగి కింగ్స్లేహాలులోని తన మొదటిబసకు చేరుకొనేవాడు.

అక్కడి ప్రజలు కూడా ఆయన తమ మధ్యనే ఉండాలని కోరారు. ఆయన వీథిలో అడుగుపెట్టగానే ప్రజలు గుంపులు గూడి ఆయనను అనుసరించేవారు. ముఖ్యంగా చిన్నపిల్లలు ఆయనను విడచిపెట్టేవారేకారు. మఱొకవిశేష మేమిటంటే

ఉభయ దేశాలమధ్యనూ అంతగా చెలరేగిన ఆందోళనా కాలంలోకూడా గాంధీజీ ఇంగ్లాండుసందర్శింపవస్తే ఇంగ్లీషువారు ఆయనపట్ల ఎటువంటి శత్రుభావమూ ప్రకటించలేదు. అది నిజంగా ఇంగ్లీషువారికి ఘనత తెచ్చిపెట్టేవిషయం. యథార్థానికి ఆంగ్లేయప్రజానీకం గాంధీజీపట్ల ప్రదర్శించిన గౌరవాతిశయం వంటిది ఆంగ్ల దేశంలో ఉద్భవించిన మహానాయకులలో కొద్ది మందిపట్ల మాత్రమే ప్రదర్శితమైంది. గాంధీజీని పరివేష్టించిన గుంపులో కొందరు అపరాధపరిశోధకులుకూడా ఉండిఉంటారు. అయితే వారికి తగ్గపని యేమీకూడా లేదు. దీనికి కారణం ఏమై ఉండవచ్చునంటే ఎదుటివారి హృదయాలకు హత్తుకొనిపోగల గాంధిజీ నైర్మల్యమూ, నిరాడంబరతా, మానవులందరిపట్లనూ గోచరమైన సౌహార్దమూ, ఆయన లండనుసందర్శనానికి కారణమైన రాజకీయవిభేదాలను లక్ష్యం చేయనంతగా ప్రజలను లోబరచుకొన్నాయి. ఆయన ఉద్యమాలమూలంగా నిరుద్యోగానికీ ఆర్థికబాధకూ గురిఅయిన మాంచెస్టరులోకూడా వేల కొలదిమంది ఉత్సాహంతో ఆయనకు స్వాగతం ఇచ్చారు. ఇక్కడ ఉన్న కొద్దివారాలలోనూ ఆయన సమగ్రమహిమను గురించినకథలు - వాటిలో కొన్ని యథార్థాలూ, కొన్ని యథార్థాలు కానివీ అయినప్పటికీ అన్నీకూడా ఆయనవైశిష్ట్యాన్ని ఉద్ఘాటిస్తున్నవి—నానా దేశ పత్రికలలోనూ ప్రకటితాలయినాయి. గాంధికథలని ప్రఖ్యాతిగాంచిన వీటిని ఆయన నిరాకరించినట్లు కనబడదు. అసలు ఆయన వాటిలో చాలాకథలు విననూ వినలేదు. అయితే ఒక్క ఉదంతాన్ని మాత్రం ఆయన ఖండించాడు. వేల్సుయువరాజు సదర్శంగా భారత దేశసంధ

ర్శనానికి వచ్చినప్పుడు తాను అతనికి సాష్టాంగనమస్కారం చేసినట్లు చెప్పటం అభూతకల్పనే అన్నాడు. విద్వాంసులూ, తాత్త్వికులూ, శాస్త్రజ్ఞులూ, రాజకీయవేత్తలూ, పత్రికారచయితలూ అనే వివిధశ్రేణులవారున్నూ ముందుగా తెలియజేసి కొందఱూ, తెలియజేయకుండా అనేకులూ ఆయన సందర్శనానికి వచ్చారు. బెర్నార్డుషా, కాంటర్బరీ క్రైస్తవమత పీఠాధిపతీ, మహారాజూ, మహారాజ్ఞీ, అమెరికా దేశపు పత్రిక విలేకరి అయిన ఒకయువకుడూ వీథులలో కనబడే బాలబాలికలూ ఆయనకంటికి సమానులుగానే కనిపించారు. ఆ అందఱి పట్లనూ ఆయన సమానగౌరవాన్నే ప్రదర్శించాడు. ఆయన అంగవస్త్రమూ, మేకా, దాదాపు దంతాలన్నీ ఊడినబోసి నోరూ, వెనుబాటులేని చక్కని హాస్యమూ, నిష్కల్మషమైన నవ్వుమీది అనురాగమూ ఈసమస్తమూ పాశ్చాత్యలోకంలో అందఱికీకూడా ఇతరమైన యే సందర్భంలోనైనా అరుదుగా మాత్రమే స్ఫురించదగినట్లు పరిచితాలయినాయి.

లెక్కింపరాని మహాత్మునిఛలోక్తులలో ఒకటి నాకు ఇప్పటికీ స్మృతిపథంలోఉన్నది. న్యూయార్కు దేశపు పత్రికలో ఒకచిత్రం ప్రకటితమైంది. ఒకసమావేశంలో బృందగానంచేస్తూ ఉన్న ఇద్దఱుస్త్రీలరూపాలు దానిలో చిత్రించబడ్డాయి. ఆస్త్రీ మూర్తులలోఒకతె రెండవస్త్రీని ఇలా ప్రశ్నిస్తున్నది : 'బట్టల కోసం అంత బాధపడతావెందుకు? గాంధిజీకి ఆబాధే లేదు. అయినా ఆయనకు ఎటువంటిప్రచారం ఉన్నదోచూడు!' దీని మీద ఆయనవ్యాఖ్య ఇది : "నువ్వు అంతఃపరిధానం ధరిస్తు న్నావు. నాకు పరిధానాలు లేవు." ఇది లోకమంతటా ప్రచార

మైంది. ఒక ఈస్టెండ్ శిశువు గాంధిజీని వీథిలోచూచి "ఏయ్ గాంధీ! నీలాగూ ఏది?" అనిప్రశ్నిస్తే మహాత్ముడునవ్వినవ్వు యథాతథంగా అన్నిదిక్కులా ప్రచారమైనది.

దాదాపు మూడు నెలలపాటు ఇంగ్లాండులోఉన్న యీ కాలంలో సర్వపక్షసమావేశంవల్ల కలిగినదానికంటె విశేషంగా భారతీయులపట్ల ఆంగ్లేయుల సానుభూతి సంపాదించటానికి ప్రయత్నించాడు గాంధిజీ. కాంగ్రెసు ఏకైకప్రతినిధిగా ఇందుకు ఆయన ప్రయత్నించినా, కాంగ్రెసు భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం కోరుతున్నదని ప్రకటించవలసి రావటంచేత దృఢమైన ఒప్పందంమాత్రం సాధించలేకపోయాడు. దేశరక్షణా, విదేశాంగవ్యవహారాలూ, విదేశీయులకు భారతదేశం ఇయ్యవలసినబాకీలూ బ్రిటిషువారి అదుపుక్రిందనే ఉండాలనే గాంధిజీ-ఇర్విను ఒడంబడికలోని రెండవనిబంధనకు ఇది కేవలం విరుద్ధం. అయినా, సంపూర్ణస్వాతంత్ర్యమే లక్ష్యమని ప్రకటించవలసిందని కాంగ్రెసు ఆయనను ఆదేశించింది. ఆ ఆదేశాన్ని ఆయన పాలించక తప్పలేదు. ఇంగ్లీషువారికి అది గాంధిజీ వ్యక్తిగతంగా పెట్టేపేచీ అనిపించింది. ఒడంబడికమీద సంతకంచేసికూడా దానికి విరుద్ధంగా ఆయనమాట్లాడటం జరుగుతోందిగదా! మనం నిశితంగావిచారిస్తే ఇందులో వైరుధ్యమేదీ కనిపించదు. స్వాతంత్ర్య సంపాదనంకోసం జరిగినవాటిలో ఈఒప్పందంఒకటి. అయితే ఆస్వాతంత్ర్యసిద్ధి కింకా తరుణంరాలేదు. దానికి ముఖ్య కారణం బ్రిటిషువారు వెనుకడుగు వేయటమే. ఆసమయంలో తాను ఎంతప్రయత్నించినా సంపూర్ణస్వాతంత్ర్యం లభించదని గాంధిజీ గమనించకపోలేదు. అయితే భారతీయులకుఅటుతర్వాత

నైనా అభిమతసిద్ధి కావటానికి తగినట్లు ఆంగ్లేయప్రజానీకంలో హృదయపరివర్తన తీసికొనిరావటం తన ముఖ్యకర్తవ్యమని భావించుకొన్నాడు.

ఆక్సుఫర్డు, కేంబ్రిడ్జి, లాంక్‌షైర్లలో తన్ను సందర్శించిన వారితోనూ, లండనునగరంలోని ప్రజానీకంతోనూ ఆయన ఈవిషయమై చాలాపట్టుదలతో ప్రసంగించాడు. తన యథార్థ కర్తవ్యం అదే అని ఆయన వారికి నచ్చజెప్పాడు. "ఇప్పుడు నాటుతున్న ఈబీజం కొంతకాలానికి బ్రిటిషువారిహృదయాలను కరిగించగలదు." భారతదేశస్వాతంత్ర్యం అంటే ఎటువంటిదో తేటతెల్లం చేయటం ఆయనప్రథమకర్తవ్యం అయింది. నాడు ఆయన చేసిననిర్వచనమే తర్వాత అక్షరాలా యథార్థమైనది. "భారతదేశానికి లాభం తప్ప నష్టం కలిగించరాదని నేను వాంఛించినట్లయితే బ్రిటిషుఅధికారంనుంచి భారతదేశాన్ని విముక్తం చేయవలసినదేకాని బ్రిటిషుప్రజలనుంచి కాదు." అని ఆయన అన్నాడు. "గాచటికం పోవలసిందేకాని బ్రిటను సుఖదుఃఖాలలోనూ అధినివేశప్రభుత్వాల కష్టసుఖాలలోనూ మాదేశం సమానభాగస్వామ్యంతో వ్యవహరించడమే నా అభిమతం." అనికూడా అన్నాడు. "అయితే ఆభాగస్వామ్యం సమానప్రతిపత్తితోనే. అదిన్నీ ఈఉభయదేశాలకూ అచంచలమైన సౌహార్దముండాలనిభగవత్సంకల్పమైతేమాత్రమే. అంతేకానీ ఒకదేశప్రజలపైన మఱొకదేశంవారు బలవంతంగా రుద్దేభాగస్వామ్యంకాదు. ఇంగ్లాండున్నూ భారతదేశమున్నూ పరస్పరప్రేమసూత్రంతో కట్టుబడిఉండాలి" అని స్పష్టీకరించాడు.

గాంధిజీ చేసినపని ఒక్క భారతీయులకే పరిమితంకాదు,

దాని ఫలితాలు ఇంగ్లాండుప్రజలకున్నూ అనుభవగోచరాలై నాయి. స్వాతంత్ర్యసిద్ధిసమయంలో అది ఎలాఉండాలీ అనేది ఉభయ దేశాలవారున్నూ స్వేచ్ఛగా ఆలోచించి నిశ్చయించారు. ఎటువంటిమరతులూ పెట్టకుండా ఇంగ్లాండు భారత దేశానికి స్వాతంత్ర్యంఇవ్వాలని నిశ్చయించింది. తర్వాత ఒకసంవత్సరానికి భారత దేశం సర్వస్వాతంత్ర్యాలతోనూ బ్రిటను అధినివేశరాజ్యాలలో తానూ ఒకటిగా ఉండాలని నిశ్చయించుకొన్నది. 1930వ సంవత్సరంలో గాంధిజీసూచించిన పద్ధతికి ఇది చక్కగా సరిపోయింది. ఏది యేమైనా నిర్నిబంధస్వాతంత్ర్య ప్రదానం అనేది యీ పరస్పర సుఖదుఃఖభాగస్వామ్యం సంభవించడానికి ముందుగా జరుగవలసివచ్చింది. ఇది భారత దేశానికి బ్రిటను దేశపు కానుక అయింది. గాంధిజీ తననిర్యాణానికి కొంత కాలం ముందుగా ఎడ్గార్ స్నోతో సంభాషిస్తూ ఈ "కానుక" అనే పదాన్నే ఉపయోగించాడు. "బ్రిటను దేశం మాకు ఈ కానుక ప్రసాదించింది లగాయతూ" అని.

భారతభవిష్యత్తును రూపొందించేబాధ్యతతో ప్రారంభమైన సర్వపక్షసమావేశం కేవలం అతుకులబొంతకావటంచేత అది సాధించేదేమీలేదనే కనిపించింది. మనం విడనాడరాని, విడనాడలేని స్వామ్యాన్ని నిలుపుకొనటానికి తగినట్లుగానే భారతభవిష్యత్తుకు సూచనలుచేయుటమే కర్తవ్యం"అని రీడింగ్ ప్రభువు సమావేశానికిపూర్వమే దాని కర్తవ్యాన్ని గురించి ముచ్చటించాడు. ఆ సభకు హాజరైన భారతీయులలో ఇరువై ముగ్గురు స్వదేశసంస్థానాధీశులు వారివారి సంస్థానాలతరఫున ప్రతినిధులుగావచ్చారు. ఇక బ్రిటిషువారిపాలనలోఉన్న భారత

దేశభాగంలోని ప్రజలపక్షాన వచ్చినవారు అఱువైనలుగురు. ఈ అఱువైనలుగురిలోనివాడే గాంధిజీ. వీరిలో కాంగ్రెసుఉద్యమాన్ని బలపఱచేవారు చాలా కొద్దిమందిమాత్రమే ఉన్నారు. ఈసమయానికి రాజప్రతినిధిపదవిఅలంకరించిన వెల్లింగ్డన్‌ప్రభువు భారతదేశంలో యథార్థమైన ఐకమత్యాన్ని ప్రతిఘటించే అభిప్రాయాలతో అందుకుతగ్గ శిక్షణలోతయారై, తదనుగుణమైన అభిరుచులుగల కొంతమందిభారతీయులనుగూడా ప్రజాప్రతినిధులనుగా పంపించాడు. వీరు 'ఎవరికివారే యమునాతీరే' అనే ధోరణివారు. కాబట్టి ఒకరితో ఒకరు కలియటంఅనేది అసంభవమైంది. మహమ్మదీయప్రతినిధి మహమ్మదీయులకూ, పార్సీ ప్రతినిధి పార్సీలకూ ఇలాగే ఏవర్గానికి ఆవర్గం తమకు ప్రత్యేక నియోజకవర్గాలు ఉండేటట్లు నూతనరాజ్యాంగాన్ని ఏర్పాటు చేయాలనికోరారు.

గాంధిజీసిద్ధాంతాలకూ, ఆశయాలకూ ఇది పూర్తిగా విరుద్ధం. ప్రత్యేకప్రభుత్వాలు ఆయనకు నచ్చవు. భారతదేశవాసులందఱూ భారతీయులే. భారతీయుల మనుకోనేవారు తమ ప్రతినిధులను ఎన్నుకోవాలి. భారతదేశం చీలికలైపోతే అందువల్ల అత్యధికమైన విపత్తు కలుగుతుందని ఆయన ముందే పసిగట్టాడు. ఆయనపలుకుబడి, గౌరవమూ అనన్యాలయినప్పటికీ ఈ సమావేశంలో ఆయన దృక్పథాన్ని బలపఱచేవారు లేకపోయారు. ఆయన ప్రతిదినమూ సమావేశానికి వెళ్లేవాడు. అయితే తటస్థంగా నిమీలితనేత్రుడై కూర్చునేవాడు. రాజకీయచర్చలు (చాలా అధమస్థాయికిచెందిన రాజకీయచర్చలు) చెవిని పడుతున్నప్పటికీ అవి ఆయనమనస్సులో ప్రవేశించలేదు.

ఆయన కేవలం సమాధి వహించాడు. ఒక్కొక్కప్పుడు కొంత సేపు నిద్రించిఉండవచ్చునుకూడా. సమావేశాలు శాసనసభల మాదిరి వాదోపవాదరంగాలు కావటం ఆయనకు సమ్మతం కాదు. వైయక్తికంగా ఎదుటివ్యక్తితో మాట్లాడటమే ఆయ నకు కావలసింది.

1931 వ సంవత్సరం డిసెంబరుతో సమావేశం నిష్ఫలంగా ముగిసింది. ఇదివఱకెన్నడూ లేనట్లుగా భారతీయులను అనేకవర్గాలుగాచీలదీయాలనే ప్రయత్నమేఆవైఫల్యానికిముఖ్య కారణంఅయిఉంటుంది. "చీలదీసిపాలించు"అని ఇదంతా బ్రిటిషు వారు చేసిందే అని అభిప్రాయపడటంకూడా కలిగింది. అయితే అటువంటిఉద్దేశం రామ్సే మాక్డొనాల్డువంటి ఉదారచిత్తునికి ఉన్నదని ఎవ్వరూకూడా అనలేరు. ఆ కాలంలో ఆయన ఔదార్యం తెలియనివారు లేరంటే అతిశయోక్తి కాదు. అయితే స్వదేశరాజులపట్లనూ, (ముస్లిములూ, పార్సీలూ, క్రైస్తవులూ, ఆంగ్లో-ఇండియనులూ మొదయినవర్గాలవారు హిందూ సంఘంతో పోల్చిచూస్తే చాలా స్వల్పసంఖ్యాకులు.) అల్ప సంఖ్యాకవర్గాలపట్లనూ తమకుగల అనేకబాధ్యతలను పురస్కరించుకొని బ్రిటిషువారు ఆయావర్గాల రక్షణకోసం ప్రయత్నించటం జరిగింది. అంటే ఆయావర్గాలకు ప్రాతినిధ్యం వహించిన షుమారు ఇఱువైమంది బ్రిటిషు ప్రతినిధులు తమతమ ప్రత్యేక వర్గాలపట్ల తమకుగల విధ్యుక్తధర్మాన్ని నిర్వహించాలని హృదయపూర్వకంగా విశ్వసించారు. ఇవన్నీకాక బ్రిటిషువారి పరిపాలనవల్ల భారతదేశానికి ఎంతో శ్రేయస్సూ అభ్యున్నతీ ధ్రువమని కొందఱు గాఢంగా విశ్వసించటంకూడా కద్దు.

అయితే ఇది తమస్వార్థసాధనానికి కొన్ని ధర్మసూత్రాలను ఏకరువు పెట్టే ఆచారంకల (అట్లాంటిక్ మహాసముద్రానికి ఇటు వైపులా ఉండే) ఆంగ్లో సాక్సను ప్రభుత్వాలవాదం మాత్రమే.

ఈఅన్నింటిలోనూ గాంధిజీకి ఒకేఒకవిషయం చాలా సంతాపం కలిగించింది. భారతదేశంలో అధికసంఖ్యాకులయిన ప్రజలకు ప్రాతినిధ్యం వహిస్తున్న తానూ, తనమిత్రులూ అల్ప సంఖ్యల్లో ఉన్న వర్గాలవారి కష్టసుఖాలను లెక్క చెయ్యని వారుగా ప్రచారం జరుగుతున్నది. హిందూ ముస్లిముల ఐక మత్యంకోసమూ, తదితర కులమతవర్గాలన్నింటికీ పరస్పర సామ రస్యం కలిగించటంకోసమూ ఆయనపడినశ్రమ ఏఒక్కరున్నూ గుర్తించినట్లు కనబడలేదు. తనకృషిని ఇతరులు గుర్తించకపోతే పోనీ! అదీ ఆయనకు బాధఅనిపించదు. బ్రిటిషువారి చర్యలవల్ల ముందుముందుకూడా భారతదేశంలో ఈ వివిధవర్గాలవారికీ ఐకమత్యం కలిగే అవకాశంలేకుండా పోతున్నదే అనిమాత్రమే ఆయన బాధపడ్డాడు. ఏదిఏమైనా అప్పటినుంచీ (ఈనాటికీ అను భవగోచరమౌతున్నట్లు) భారతదేశంలోని అల్పసంఖ్యాకవర్గం ఏదైనా ఒకఆందోళనను లేవదీసేటట్లయితే బ్రిటిషువారి సహా కారంగానీ, ఆమోదంకానీ పొందటం తేలికఅని తేలిపోయింది. ఈసమావేశం నిష్ఫలంకావటంకంటె భవిష్యత్తులో తటస్థించ నున్నప్రమాదమే గాంధిజీకి చాలాబాధాకరమైంది. భారతదేశం నుంచి బయలుదేఱుతున్నప్పుడే ఆయన ఈ సమావేశంవల్ల ఏదైనా ఒరిగిపడుతుందనుకోలేదు. అందుచేతనే తాను బయలు దేఱుతూ తోడివారితో రిక్తహస్తాలతోనే తాను తిరిగిరావచ్చు నని చెప్పాడు. ఇప్పుడు శూన్యహస్తాలతో తిరిగిపోవటం

మాత్రమేకాదు, ఆయన అనుకొన్నదానికంటె ఎక్కువకీడే ఘటిల్లింది.

# 3

బొంబాయికి తిరిగి వెళ్ళుతూ గాంధిజీ రోమెయిన్ రోలండ్‌తో సంభాషించటంకోసం లాసేన్‌లో ఆగాడు. వీరి సంభాషణలు చరిత్రాత్మకాలయినాయి. అనేకరూపాలలో పత్రికలలో ప్రకటితాలయినాయి. వీరిద్దఱున్నూ ప్రపంచంలో తట స్థిస్తూ ఉండే సంఘటనలనుగూర్చి కాక, ప్రధానసిద్ధాంతాలను గుఱించి మాత్రమే మాట్లాడుకొన్నారు. సిద్ధాంతాలవిష యంలో ఇద్దఱికీ ఏకాభిప్రాయం కుదిరింది. అప్పటికి కొన్ని సంవత్సరాల క్రిందటనే రోలండ్ గాంధిజీ జీవితచరిత్ర రచిం చాడుకానీ ఆయనను అంతవఱకూ తాను చూడలేదు. అంతేకాదు; భారత దేశానికి ఎన్నడూ వెళ్ళలేదుకూడా. అయితే ఆగ్రంథంలో భారత దేశంపట్లనూ గాంధిజీయెడలనూ, రోలండుకు గల గౌరవం చక్కగా వ్యక్తమౌతూ నేఉన్నది. (ఏ కళగానీ సంగీతంగానీ అంతగా పట్టించుకోని) గాంధిజీ ఆ ఫ్రెంచిరచయి తను పియానో వాయించవలసిందని అడిగాడు. రోలండుకు సంగీతం అంటే ప్రాణం కనుక, వెంటనే బీతొవెన్ పంచమ వాద్యం (హార్మోనియమూ పియానోవాద్యాలు కలసిన విశిష్ట వాద్యం)మీద మనోహరంగా గానం చేశాడు.

తర్వాత మహాత్ముడు రోమునగరంలోకూడా కొంత సేపు ఆగాడు. అక్కడ ఆయన బెనిటో ముస్సోలినీతో ఇఱువై నిమిషాలు నిరర్థకసంభాషణ చేయవలసివచ్చింది. అసలాయన

పోపును సందర్శించదలచుకొన్నాడు. కానీ పోపు బ్రిటిషుప్రభుత్వానికి ఆప్తమిత్రుడుగా వ్యవహరిస్తూఉండటంచేత గాంధిజీని కలిసికొనటానికి అంగీకరించలేదు. గాంధిజీతో సంభాషించటానికి ఇష్టపడని వ్యక్తులు విన్‌స్టన్‌చర్చిలూ ఆఱవఫియాన్ (అంటే నాటి పోపు) మాత్రమే !

బొంబాయిలో ప్రజానీకం అధికోత్సాహంతో ఆయనను ఆహ్వానించింది. అది ఆయనకు ఎంతో ఆనందం కలిగించినా, అంతలోనే విన్న ఒకవార్త చాలాకష్టం కలిగించింది. ప్రభుత్వానికి శిస్తు చెల్లించవద్దని కాంగ్రెసు ప్రారంభించిన ఉద్యమం మూలంగా ఉత్తరభారతంలోనూ వాయవ్యభారతంలోనూ ప్రభుత్వం అనేకులను నిర్బంధించి చెఱసాలలకుపంపటం మొదలుపెట్టింది. గాంధిజీరాకకు రెండురోజులు ముందుగా జవహార్లాలుకూడా నిర్బంధానికి గుఱిఅయినాడు. తత్క్షణం రాజప్రతినిధిని సందర్శించాలని గాంధిజీ ఉద్దేశించాడు కానీ, తంతి వార్తలు సరిగా నడవకపోయాయి. రాజప్రతినిధికి గాంధిజీని చూడటమే యిష్టం కాలేదు. 1931 వ సంవత్సరం డిసెంబరు 28 వ తేదీన గాంధిజీ హిందూదేశానికి తిరిగి రావటం జరిగింది. 1932వ సంవత్సరం జనవరి 4వ తేదీన ఆయనను మళ్ళీ ప్రభుత్వం నిర్బంధించింది. ఈసారికూడా వెనుకటిమాదిరిగానే నేరం ఆరోపించటమూ లేదు; విచారణాలేదు. ప్రభుత్వసంకల్పాను సారం ఆయన ఎఱ్ఱవాడ చెఱసాలలో ఉండవలసివచ్చింది.

ఇంతవఱకూ మనం గమనించినట్లుగా ఆయనకు కారాగారవాసం ఎప్పుడూ సుఖంగానే గడచింది. అయితే కారాగార ప్రవేశానికి కొద్దికాలంక్రిందటనే బ్రిటిషుచక్రవర్తికీ చక్రవర్తినికీ

అతిథిగా ఉండి, బ్రిటిషుప్రజానీకంవల్ల ఎంతోగౌరవంపొందిన తనకుతిరిగి యిటువంటినిర్బంధం ఆ బ్రిటిషు ప్రభుత్వంవల్లనే కల గటం తలచుకొంటే ఆయనకు క్రోధమేకలగలేదు. కానీ నూతన రాజ్యాంగంలో హిందూముస్లిములకే వేర్వేరుకాక, అణగ ద్రొక్కబడిన జాతులనేపేర(అస్పృశ్యులపేర)మరికొన్నికూడా ప్రత్యేకనియోజకవర్గాలు ఏర్పాటుచేయటానికిబ్రిటిషుప్రభుత్వం యత్నిస్తున్నట్లు తెలిసి ఆయన చాలబాధపడ్డాడు. హిందూమతా నికి సవతిబిడ్డలవంటిఈఅస్పృశ్యులకోసంగాంధిజీతనజీవితంఅంతా ధారపోశాడు. కానీ, హిందువులను చీలదీయటానికి అస్పృశ్యు లను వినియోగించుకొనటం ఆయనకుగిట్టలేదు. అందువల్లఆయన తొట్టతొలుత మార్చినెల 11వ తేదీన భారతప్రభుత్వ కార్య దర్శిఅయిన సర్ సామ్యూల్‌హోరుకూ, చివరలో ఆగస్టు 18 వ తేదీన బ్రిటిషుప్రధాని అయిన రామ్సేమాగ్డొనాల్డుకూ ఉత్త రాలువ్రాశాడు. గాంధిజీవ్రాసిన ఉత్తరాలవల్లనేకాక, పలు విధాల ముద్రితరూపంలో గోచరమైన ఆయన అభిప్రాయాలను పరిశీలించటానికి ఈమార్చి మొదలు ఆగస్టునెలవఱకూ బ్రిటిషు ప్రభుత్వానికి తగినంతవ్యవధి లభించింది. ఏమైనప్పటికీ లండ నులో ఆగస్టు 17 వ తేదీన మాగ్డొనాల్డు ప్రకటించినట్లుగా వారు తమపథకాన్నే అమలుజరపటానికి నిశ్చయించుకొన్నారు.

గాంధిజీబాధ్యత భరించరానిదైపోయింది. ఆగస్టు 18 వ తేదీన మాగ్డొనాల్డుకు వ్రాసినఉత్తరంలో తాను సెప్టెంబరునెల 20 వ తేదీనుంచీ ఆమరణ ప్రాయోపవేశం సాగించనున్నట్లు ఆయన ప్రకటించాడు.

రామ్సేమాగ్డొనాల్డుతోబాటు పాశ్చాత్య విద్యాధికు

లైన యెందఱో భారతీయులుకూడా గాంధిజీ ప్రాయోపవేశం ప్రారంభించనున్న వార్తవిని విస్మితులైనారు. అస్పృశ్యులకుసంబంధించిన తమ ప్రత్యేకవిధానాన్ని గాంధిజీ అపార్థంచేసుకొన్నాడనే అపోహతో ఆయనకు తమఅభిప్రాయం బోధపఱచటానికి మాక్డొనాల్డు మహాత్మునికి ఒకసుదీర్ఘమైన లేఖ ప్రీతిపూర్వకంగా వ్రాశాడు. అయితే మహాత్ముడు అది తనకు మతసంబంధ విషయమనీ హైందవుల మతవిశ్వాసాన్ని దృఢపఱచటానికే తాను ప్రార్థనచేయగలననీ మాక్డొనాల్డుకు జవాబు వ్రాశాడు. మతసిద్ధాంతానుసారం కర్తవ్యం నిర్వహించేనిమిత్తమై హిందువులను ప్రోత్సహించటానికితప్ప, బ్రిటిషు ప్రభుత్వంపట్ల అసమ్మతితో ఆయనప్రాయోపవేశం సంకల్పించలేదు.

సెప్టెంబరు నెల 20 వ తేదీ మధ్యాహ్నం ఉపవాసం ప్రారంభమైంది. ఆరోజున లక్షలకొలది భారతీయులు ఉపవసించారు. ప్రతిస్థలంలోనూ ప్రార్థనలు జరిగాయి. దేశం విషాద గీతికను ఆలపించింది. ఆ క్లిష్టపరిస్థితిలో మహాత్ముడు ఒక్క రవీంద్రనాథఠాకూరుసలహానుమాత్రమే విన్నాడు. ఏసిద్ధాంతాన్నికూడా విమర్శచేసి అది యోగ్యమనితోస్తేనేకాని అనుసరించేవాడు కాడు రవీంద్రనాథఠాకూరు. పరమార్థగర్భితమూ ప్రశంసాత్మకమూ అయిన వాగ్జాలంతో ఆ మహాకవి మహాత్ముణ్ణి ఒప్పించగలిగాడు. గాంధిజీ "ఆత్మార్పణం" గురించి ఆయనచేసిన వివరణం ఎంతోసముచితమైనది. ఆయన ఇలా అన్నాడు. "మహాత్ముడిప్పుడు పూనిన ప్రాయోపవేశం ఆత్మహింస కాదు; అది అఖిలభారతదేశానికీ, ప్రపంచానికీకూడా ఒకసందేశం."

గాంధిజీ ప్రాయోపవేశాన్ని విరమింపజెయ్యటానికి తగినఒప్పందం ఒకటి జరగడంకోసం భారతీయనాయకులు త్వరితంగా ప్రయత్నం సాగించారు. ఈపర్యాయం ఆయన బలంగా లేడు. మొదటి ఇఱవై నాలుగుగంటలలోనే చాలానీరసించాడు. నాలుగవరోజుకు ఆయన బాగా క్షీణించాడు. ఆయనప్రాణం నిలవదేమో అనేభయం దేశమంతటా చెలరేగింది. అస్పృశ్యులకు నాయకుడైన అంబేద్కర్ మహాత్ముని అనుచరుడు కాడు. అతనితో వ్యవహారించటం హిందువులకు దుర్భరమైంది. అయితే అతనిసంతకంకూడా ఉంటేనేకానీ సవర్ణులూ అస్పృశ్యులూ కుదుర్చుకొనే ఒప్పందానికి విలువఉండదు. అతను మహాత్ముణ్ణి చూడటానికి చెఱసాలకు వచ్చాడు. ఒప్పందంలోని సాధారణ నిబంధనలు మహాత్ముడు ఆమోదించాడు. తర్వాత నాయకులందఱూ తర్జనభర్జనలుజరిపి సెప్టెంబరు 24వ తేదీన ఒడంబడికపై చేవ్రాళ్లుచేశారు. మహాత్ముడు దానిమీాద సంతకం చేయకపోయినా తన ఆమోదం తెలియజేశాడు. బ్రిటిషుప్రభుత్వం కూడా ఆ ఒడంబడికను ఆమోదిస్తేకానీ ఆయన ఉపవాస విరమణం చెయ్యటానికి వీలులేకపోయింది.

లండనులో సెప్టెంబరు 25 వ తేదీ ఆదివారానికి అక్కడక్కడ విశ్రాంతికోసం వెళ్లి తిరిగివచ్చిన మాక్డొనాల్డూ, హోరూ, లోధియనూ సమావేశమై అర్ధరాత్రంవఱకూ ఎఱ్ఱవాడ ఒడంబడికను పరిశీలించారు. సోమవారంనాటికి బ్రిటిషు ప్రభుత్వం ఆ ఒడంబడికను ఆమోదించినట్లు లండనులోనూ ఢిల్లీలోనూ ప్రకటన జరిగింది. దానితో మహాత్ముడు ఉపవాస

విరమణకు అంగీకరించి, కస్తూరీబా యిచ్చిన నారింజరసం తీసికొన్నాడు.

ఆయన చేసిన ఉపవాసాలలో ఇది సుదీర్ఘం కాకపోయినప్పటికీ, దీనివల్ల ఆయనఆరోగ్యం చాలా భంగవడింది. ఉపవాస విరమణకు రెండురోజులుముందునుంచీ ఆయన జీవించటం అసంభవమని వైద్యులు అభిప్రాయపడ్డారు. "ఆమరణప్రాయోపవేశం" అన్నప్పుడే మహాత్ముని మనస్సుమీద దానిప్రభావం ప్రసరించి శారీరికంగా ఆయనకు అంతఅపాయం కలిగించిందని ఒకవైద్యుడు భ్రాంతిపడ్డాడు. అంతవఱకు ఆయన చేసిన ఏ ఉపవాసానికిన్నీ "మరణపర్యంతం"అనే గడువుపెట్టటం జరుగలేదు. యథార్థానికి ఆత్మహత్య మహాపాపమనీ, దానికి తాను పాల్పడరాదనీ మహాత్ముని అభిప్రాయం. ప్రజలు తాను మరణించటం అంగీకరించరనీ, తాను ఆ విధంగా ప్రకటించటంవల్ల వారిలోని విభేదాలు చక్కదిద్దుకొంటారనీ ఆయన గాఢంగా విశ్వసించాడు. ఆయన అంతకంతకువృద్ధుడౌతున్నాడు. కాబట్టి"మరణపర్యంతం" అన్నమాట చాలా తీవ్రమైనదని భావించటంచేత మహాత్ముని ఆంతర్యం లోకానికి సుబోధం కాలేదు.

అన్నిసందర్భాలలోనూకూడా భారతీయసంఘంమీద ఈ ఉపవాసం అనేది విద్యుత్తులాగా పనిచేసింది. దేశమంతటా పల్లెలలోనూ పట్టణాలలోనూ జరిగిన ప్రదర్శనలలో సవర్ణహిందువులు అస్పృశ్యులతో కలసిమెలసి వ్యవహరించారు. అస్పృశ్యులు వడ్డించిన పదార్థాలను ఆరగించారు. వారి పంక్తిలోనే భుజించారు. ఎన్నో దేవాలయాలలోనూ, పుణ్యక్షేత్రాలలోనూ అస్పృశ్యులకు ప్రవేశం కలిగింది.

అస్పృశ్యతను ప్రతిఘటించటానికి కృషిచేస్తామని ఎందరో శపథంచేశారు. ఈ వార్తలన్నీ చెఱసాలలోఉన్న మహాత్మునికి అందజేశారు. ఉపవాసం జరిగిన ఆఱురోజులున్నూ దేశానికి దుఃఖకాలంగా భావించబడింది. ఉపవాసం ముగిసిన వెంటనే అది ఒక పెద్దపండుగగా ప్రజలు ఆనందించారు.

"అస్పృశ్యతను వేళ్ళతో నశింపజేయా"లని గాంధిజీ హిందూమతానుయాయుల్ని అభ్యర్థించాడు. సంయుక్త నియోజకవర్గం ఏర్పడచాలన్నది ఇక్కడ ప్రధానోద్దేశంకాలేదు. అయితే గాంధిజీ ఆశయాలకు అనుగుణంగా ప్రవర్తించాలని హిందూప్రజలలో కలిగిన సంకల్పమే ఒక మహత్తరశక్తిగా రూపొందింది. అదే యీనాటికిన్నీ దేశంలో పనిచేస్తున్నది. సంఘంలో చిరకాలంగా ఉంటూఉన్న ఈ అస్పృశ్యతాశాపం త్వరగానే నశిస్తుందని యెవ్వరూ భావించటంలేదు. కాని, దానిని నశింపజేయడానికి ప్రయత్నం ఎప్పటినుంచో సాగుతూనే ఉన్నదనటాన్ని మాత్రం ఎవ్వరూ కాదనలేరు. రాజకీయాలలో అన్నింటికంటెనూ మహాత్మునికి అతిముఖ్యంగా తోచిన "భారతదేశ పవిత్రీకరణం" ఆయన కొన్ని దశాబ్దాలుగా సాగించిన ప్రబోధాలన్నింటివల్లకూడా సాధ్యంకాలేదు. ఈ 1932 వ సంవత్సరపు ఉపవాసం ఆయన ఆశయాన్ని సుసాధ్యం చేసింది. అంతేకాక రాజకీయాలకు సంబంధించకపోయినా అవసరంగా తోచిన మఱికొన్నింటిమీదకూడా ఆయన మనస్సు లగ్నం కావటానికి ఇదేకారణమైంది నాతో సంభాషిస్తూ 'నా నిర్మాణాత్మకకృషి' అని ఆయన పేర్కొన్న అంశాల మీద అప్పటినుంచీ ఆయన తనదృష్టిని కేంద్రీకరించాడు. రాజ

కీయ దృక్పథంతో సాగే ఏపనిఅయినా నిర్మాణాత్మక కృషి కానేరదని ఆయన అభిప్రాయం. ఈ ఉపవాసం లగాయతూ ద్వితీయ ప్రపంచసంగ్రామం వఱకూ గాంధిజీ రాజకీయాలను ఇతరులకు ఒప్పగించి తనకాలాన్నీ, శక్తినీకూడా అస్పృశ్యుల కోసమూ, గ్రామవాసులయిన బాలబాలికలకోసమూ, స్త్రీల కోసమూ, వృత్తివిద్య''కోసమూ, రాట్నంకోసమూ వినియోగించాడు. రోగులకు పరిచర్యచేయటం వంటివైన ఇట్టి ఉద్యమాలు ఆయన సహజప్రకృతికి ఎంతో నచ్చినపనులు. వారం వారమూ, మాసం మాసమూకూడా పాదరక్షలైనా లేకుండా గ్రామగ్రామమూ పాదచారిఅయి పర్యటనసాగించి అస్పృశ్యత త్యజించవలసిందనీ, పరిశుభ్రత పాటించవలసిందనీ, ఒకర్ని ఒకరు ప్రేమించవలసిందనీ ప్రబోధించటం మొదలుపెట్టాడు. ఇలాచేయటానికి మొదలుపెట్టినకాలంలో 'ఆత్మపారిశుద్ధ్య'ంకోసం ఆయన ఇఱవైఒక్కరోజు ఉపవసించాడు. ఆయన ఈ ఉపవాసం ప్రారంభించిన రోజుననే ప్రభుత్వం ఆయనను చెఱసాలనుంచి విడుదల చేసింది. ఉపవాసంవల్ల ఆయన చెఱసాలలోనే మరణించటం తటస్థిస్తే విపరీతపరిణామాలు కలుగవచ్చుననే భయమే దీనికి కారణం. ఆఱురోజుల ఉపవాసంతోనే ఆఱునెలలు ముందుగా మృత్యుద్వారానికి చేరుకొన్న ఆయన శరీర పరిస్థితినిబట్టి విచారిస్తే ఈ మూడువారాలపాటు ఉపవాసం ఆయన తట్టుకోవటం అసాధ్యమనే అనిపించింది. అయితే సెప్టెంబరులో కలిగినంత ప్రజాందోళన లేకుండానే ఆయన యీ దీర్ఘోపవాసం ముగించి మళ్ళీ ఆరోగ్యంగా సంచరించగలిగాడు. ఆయనఅనటం

మాత్రం వెనుకటికంటె తాను ఇంకా ఆరోగ్యంగా ఉన్నాననే.

ఆదర్శగ్రామాలవల్లనూ, ఆదర్శ పాఠశాలలవల్లనూ హరిజనులను బాగుచేయటంకోసం "హరిజన సేవకసంఘం" అనేదానిని ఆయన నెలకొల్పాడు. 1933 వ సంవత్సరం ఫిబ్రవరి నెలలో తాను ఇంకా చెఱసాలలో ఉండగానే ఈకృషిని ఆయన ప్రారంభించాడు. "యువభారత" పత్రికకు బదులుగా "హరిజన" పత్రికనుకూడా అప్పుడే ప్రారంభించాడు. "అస్పృశ్యులు" అనేపదానికి బదులు "హరిజనులు" అనేపదం ఆయన సృష్టించిందే. "భగవంతుని బిడ్డలు" అని దానికి అర్థం. వర్ణవిచక్షణవల్ల దేశానికి కలుగుతున్న హానిని నివారించటానికి ఆయన ఇప్పటినుంచీ తాను మరణించేవరకూ అందరికీ ఆచరణ సాధ్యమైన మార్గంలో శక్తివంచన లేకుండా కృషిచేశాడు. హరిజనుల కోసం ఆయన నెలకొల్పిన ఆదర్శగ్రామాలు పరిశుభ్రంగానూ, ఆకర్షణీయంగానూ రూపొందాయి. ఆయన స్థాపించిన పాఠశాలలు భారతీయ స్థితిగతులకు అనుగుణమైనవి. వాటిని నిర్వహించటానికి అవసరమైన ద్రవ్యం సమకూర్చటానికి ఆయన ఎన్నడూ బద్ధకించలేదు. చివరి సంవత్సరాలలో ఈ ద్రవ్యసాధనకు ఆయన ఒక క్రొత్తమార్గాన్నికూడా అనుసరించాడు. స్వహస్తాక్షరం తన సంతకంకోరి వచ్చినవారి దగ్గఱనుంచి హరిజన సంఘోద్ధరణం కోసం అయిదురూపాయలో పదిరూపాయలో చందా తీసికొనే సంతకంపెట్టేవాడు. ప్రపంచంలోని ఏమూలలనుంచి ఎవరు ఆయన సంతకంకోసం వ్రాసినా, అది వారికి లభిం

చేది. అయితే ఆయన వారిదగ్గఱనుంచి ఖండితంగా రుసుము వసూలు చేసేవాడు.

వృత్తివిద్య, గ్రామప్రజల (ముఖ్యంగా స్త్రీల) ఉద్ధరణ అనేవి గాంధిజీ చేసిన "నిర్మాణాత్మక కృషి"లో చేరినవే. వృత్తివిద్యాబోధన విషయంలో ఆయన అభిప్రాయాలు అన్నీ భారతీయ స్థితిగతులకు తగినట్టివే. ఆయన గతించేవఱకున్నూ ఆ ఆశయాల సాధనకోసం అనేక రాష్ట్రాలలో పెద్దఎత్తున కృషి జరిగింది. 1930 వ సంవత్సరంలో లండను సందర్శించినప్పుడు శ్రీమతి మాంటిస్సోరీ అనుసరించిన విద్యాబోధనపద్ధతి ఆయన గమనించటం జరిగింది. అది ఆయనకు ఎంతోనచ్చింది. తరువాత ఆయన సొంతంగా నెలకొల్పిన పద్ధతికి చాలావఱకు ఆధారం మాంటిస్సోరీ పద్ధతే.

గ్రామవాసిఅయిన పేద భారతీయుని ఆర్థికపరిస్థితికి అనుగుణంగా విద్యాబోధన సాగాలనే ఉద్దేశంతో ఆయన ప్రణాళిక సిద్ధపఱచాడు. పేదభారతీయుడు తన బిడ్డలుకూడా ఏదో కొంత పాటుపడి ధనం ఆర్జిస్తేనేకానీ సంసారం గడపుకోలేడు. అందుచేత ధనరూపంగా ప్రతిఫలం రాదగిన పరిశ్రమతోబాటు విద్యార్థి చదువు నేర్చుకొనదగినట్లుండాలి. (ఈ పద్ధతిని చాలా తీవ్రంగా విమర్శించటం జరిగింది. చదువుకొంటూ కానీ, చదువు లేకుండా కానీ భారతదేశంలో ఇప్పటికీ కొనసాగుతూ ఉన్న ఈ "శిశువుల ధనసంపాదన"ను ప్రోత్సహించే పద్ధతి చాలా అవివేకమనే నా అభిప్రాయంకూడా.) అంటే ఒక బాలుడు ఒక దారువేదిక(Bench)నో పాదుకలనో తయారు చేయగలిగితే దానికి తగ్గప్రతిఫలం అతనికి ముట్టాలి. పాఠశాలా

కాలంలో అతను ఇటువంటి ధనార్జనోపయోగ్యకళనూ, సాధారణ విద్యనూ అభ్యసించటానికి తగినట్లుగా పాఠ్యాంగబోధన జరగాలి. నేను లోగడనే సూచించినట్లుగా ఈ వృత్తివిద్యా పద్ధతి ఈనాడు చాలా విస్తరించింది. అయితే దీని ప్రధాన లక్షణం ఇదే.

గాంధిజీ ఇలా నిర్విరామంగా భారతదేశోద్ధరణకై కృషి చేసి, గౌతమబుద్ధునినాటినుంచీ తననాటివఱకున్నూ ఏనాడూ ఎవ్వరూ కృతకృత్యులు కానంతటి మహోన్నతపథంలో తన అభిప్రాయాలను ప్రజాహృదయాలలో చొప్పించాడు. అయితే భారతదేశంలో గాంధిజీ సందర్శించని ప్రదేశాలు ఉండకపోవు. దానికి కారణం దేశం చాలా పెద్దదికావటమూ, గ్రామాలు అసంఖ్యాకంగా ఉండటమూ మాత్రమే. అయినా ఆయన చూడనిచోట్లు ఎన్నో లేవు. ఆయనను సందర్శించిన నిఱుపేద కూడా ఆ సందర్శనాన్ని ఎన్నటికీ మఱచిపోలేదు. ఆయన చూచిన చూపు అతనికి చిరకాలం జ్ఞాపకంలోనే ఉంటుంది. హిమాలయ పర్వతపాదసీమయందు ఉన్న ఆల్మోరా చెఱసాలకు (ఆనాడు అక్కడ జవహర్లాల్ నెహ్రూ నిర్బంధంలో ఉండటంచేత) నేను వెళ్ళినప్పుడు ఒక బందీ కటకటాలఅవతల నిలబడి నాతో మాట్లాడుతూ తాను ఉప్పుసత్యాగ్రహ సమయంలో మహాత్ముని అనుచరుడుగా ఉన్నట్లు చెప్పాడు. "నేను ఆయనను 1934 వ సంవత్సరంలో చూచాను." అని ఒక మహారాజు అనవచ్చును. "ఒకసారి మదరాసులో ఆయనను చూచాను." అని ఒక అస్పృశ్యుడు అనవచ్చును. కాని యెవ్వరూకూడా ఆయన సందర్శనాన్ని సాధారణంగా మఱచిపోలేరు.

# 4

గాంధిజీ ఈకాలంలో "రాజకీయాలకు దూరంగా" ఉన్నాడనే చెప్పుకొన్నాము. సత్యం విచారించినట్లయితే ఆయన యెన్నడూకూడా భారతీయజీవితానికి సంబంధించిన ఏవిషయానికీ దూరంగా లేడు. అది పెద్దదిగానీ, చిన్నదిగానీ యేసమస్యవచ్చినా, రాజకీయవేత్తలు ఆయనతో సంప్రతిస్తూనే ఉన్నారు. తాను ఏభిక్షుకునికైనా చికిత్స చేస్తూఉంటేనో, ఏ అస్పృశ్యునికైనా హితోపదేశంచేస్తుంటేనో, ఎవరైనా రాజకీయ వేత్తలు వచ్చినట్లయితే తానుచేస్తూఉన్నపని పూర్తిఅయే వఱకూ వారిని వేచిఉండవలసిందని చెప్పటానికి ఆయన సంకోచించేవాడు కాడు. వారి కార్యాలకుగల విలువా ఆయన కార్యాలకుగల విలువా ఒకేవిధమైనది కాదు. అయినా ఆయనతో సంబధంలేకుండా వారు ఏమీ చేయలేక పోయేవారు. ఏముఖ్యనిర్ణయం చేయవలసివచ్చినా దానికి ఆయనఆమోదం అవసరం. ఆయనఆమోదం లేనిది ఏఅభిప్రాయ మైనా ఏఉద్యమమైనా ఫలించేదిలేదు. అప్పటిలో కాంగ్రెసుకు నిరంతరంగా అధ్యక్షతవహించిన జవహార్ లాల్ నెహ్రూ గాంధి జీనిగుఱించి "అధ్యక్షునికికూడా ఎల్లకాలమూ అతీతుడైన వ్యక్తి" అని అన్నాడు. నూతన రాజ్యాంగానుగుణమైన శాసన సభలలో భారతీయులు పాల్గొనవచ్చునని గాంధిజీ అనుమతించి నప్పుడు ఎన్నో రాష్ట్రాలలో కాంగ్రెసుఅభ్యర్థులు గెలుపొంది ప్రభుత్వంలో పాల్గొన్నారు. గాంధిజీదృష్టిలో స్వాతంత్ర్య సంపాదనకు ఇది ప్రాథమికచర్య. అంటే అందుకు ఒకవిధమైన శిక్షణ. ఆయన తానై ఎన్నడూ ప్రభుత్వంలో పాల్గొనలేదు.

ఒకసారిమాత్రం శాసనసభకు హాజరైనాడట! అదిన్నీ ప్రేక్షకులుగావచ్చేప్రజలు కూర్చునేచోట ప్రభుత్వపు అతిథిగా కూర్చోటానికిమాత్రమే.

మహాత్ముడు తిరిగి రాజకీయాలలో ప్రవేశించటానికి రెండవ ప్రపంచయుద్ధమే కారణమైంది. యుద్ధం ప్రకటితం కాగానే బ్రిటిషువారు ఏ భారతీయుణ్ణీ సంప్రతించకుండానే భారతదేశాన్ని యుద్ధంలోకి ఈడ్చారు. ఇది భారతీయులందరికీ ముఖ్యంగా రాజకీయవర్గాలకూ, విశిష్టవ్యక్తిత్వం కలవారికీ కష్టం కలిగించింది. యుద్ధప్రకటన జరిగిన మరునటిరోజున రాజప్రతినిధి (అప్పుడు ఆ పదవిలో ఉన్నది లిన్లిత్గో ప్రభువు) సిమ్లాకు రావలసిందని గాంధిజీకికబురుచేశాడు. గాంధిజీ అక్కడికివెళ్ళాడు.

ఆ సమావేశంలో గాంధిజీ లిన్లిత్గోలు యుద్ధంవల్ల తటస్థించే అనివార్యమైన హింసనుగురించి విచారించారు. గాంధిజీకి ప్రకృతిసిద్ధంగా ఇంగ్లాండుపైని కల సానుభూతి(అనురాగమే) పెల్లుబికింది. యూరపులో పురోగమిస్తున్న హింసాత్మక రాజకీయోద్యమం ఆయన గమనిస్తూవచ్చాడు. హిట్లరుపద్ధతి కేవలం ఖండనార్హమని ఆయనకు తోచింది. అది ఆయనకు "అతురకః శాస్త్రీయతాముద్ర పొంది, కేవల శాస్త్రీయపథంలో నడుస్తూఉన్న ప్రత్యక్షరాక్షసశక్తి" అనే తోచింది. ఇంగ్లాండు దేశానికీ తన్మిత్రవర్గాలకు తన నైతికసమర్థన ఉండగలదని ఆయన వాగ్దానంచేశాడు. "నా హృదయమంతా స్వాతంత్ర్యం కోసం విషమయుద్ధంలో చిక్కుకొన్న పోలండు దేశీయులతోనే ఉన్నది." అని ప్రకటించాడు.

వీటివల్ల యుద్ధాన్ని ఆయన ఎంతవఱకు బలపఱుస్తు

న్నదీ స్పష్టమైంది. కాని అందులో ఏ విధంగానూ పాల్గొనటానికి ఆయన అంగీకరించలేదు. భారతదేశం యుద్ధంలో శించటాన్ని కూడా ఆయన సమర్థించలేదు. ఈవిధంగా ఆయన అటు బ్రిటిషువారికీ, ఇటు భారతరాజకీయ నాయకులకూ కూడా ఎడమే అయినాడు. కొన్ని రాజకీయపు ఒప్పందాలమీద యుద్ధంలో పాల్గొనవచ్చునని కాంగ్రెసు ఉద్దేశించింది. ఒక సిద్ధాంతంవిషయంలో బేరాలు సాగించటం గాంధిజీకి ఎన్నడూ గిట్టదు. మరీ ఈ సందర్భంలో ఆయన తనప్రధాన సిద్ధాంతాలేమిటో స్పష్టంగా ప్రకటించాడు. "బ్రిటనుకు చేసే సహాకారం ఏదైనా నిర్నిబంధంగా చేయవలసిందే!" అన్నాడు. ఆయన ఇలా చెప్పినప్పటికీ 1939 వ సంవత్సరం సెప్టెంబరు 14 వ తేదీన కాంగ్రెసు రాజకీయనాయకులు హిట్లరుహింసాకాండను ఖండిస్తూకూడా పశ్చిమదేశాలవారి సామ్రాజ్యవాదాన్ని ఖండించి, "భారతదేశం పారతంత్ర్య విముక్తమైతేనే" సంతోషంగా ఇతర స్వతంత్రజాతులతో సహకరించి పనిచేయగలదని ప్రకటించారు. ఈ ప్రకటన (జవహార్లాలు చేసిందే) గాంధిజీ అభిప్రాయాలకు ఎంతమాత్రమూ అనుగుణంగా లేదు. అయితే కాంగ్రెసు అలా ప్రకటించింది కాబట్టి దానిని బలపఱచవలసిందని ఆయన ప్రజలకు విజ్ఞప్తిచేశాడు. ఆయన ఆ విధంగానే చేయటానికి కారణం తన "అత్యుత్తమసహచరులు" అలా కోరటమే. వారిని ఆయన విడనాడలేకపోయాడు. కాని, "అహింసాపథంనుంచి వారి అన్యథాగమనం చాలా కొంత వఱకే; అదీతాత్కాలికమే!" అని ఆయన ఆశించిఉంటాడు.

రాజప్రతినిధి లండను నుంచి తనకువచ్చిన ఆజ్ఞలను అను సరించి కాంగ్రెసు ప్రకటనకు సమాధానం ఇస్తూ యుద్ధంచేయటం లోని ఉద్దేశాలను ఇంగ్లండు అప్పటికీ నిర్వచించలేకున్నదనీ, స్వరాజ్యంకోసం భారతదేశం అంత తొందరపడగూడదనీ చెప్పాడు. ఆ సమాధానం వినగానే ఇంగ్లాండుకు ఎటువంటి తోడ్పాటూ చేయరాదని కాంగ్రెసు నిర్ణయించింది. రాష్ట్ర ప్రభుత్వాలలో పనిచేస్తున్న కాంగ్రెసు సభ్యులందరినీ తత్ క్షణమే వారి పదవులకు రాజీనామాలియ్యవలసిందని ఆదేశించింది.

ఈ సమయంలో గాంధిజీ కోమలహృదయం అడుగడుగునా భయవిచలితమైనట్లు కనిపిస్తుంది ఇంగ్లాండుకు తటస్థించిన విపత్తును అవకాశంగా తీసికొని భారతదేశం తనస్వార్థాన్ని సాధించుకొనటానికి యత్నించినట్లు కనబడటం ఆయనకు ఎంతమాత్రమూ సమ్మతంకాలేదు. అయితే తన "అత్యుత్తమ సహచరులతో" ముఖ్యంగా నెహ్రూతో ఏకీభవించక పోవటమున్నూ అనంగీకారమే అయింది. ఈ అన్నిటి కంటెనూ ఆయనకు అహింసను మరింత దృఢంగా ఆచరణలో పెట్టాలనే సంకల్పం అత్యధికమైంది. ఈ మధ్యలో ప్రపంచంలో చాలాభాగాన సంభవమైనట్లే భారతదేశంలో కూడా 1940 వ సంవత్సరం అంతటా అనేకసంఘటనలు ఒక దానివెంట ఒకటి సంభవించాయి. దాదాపు యూరపుఅంతా హిట్లరు వశమైనట్లు కనిపించింది. బ్రిటను ధనాగారాలు వట్టి పోతున్నట్లు స్పష్టమైంది. యుద్ధానికి కావలసిన పెట్టుబడి లేక పోయినది. అప్పుడు గాంధిజీ భారతీయులను ప్రశాంతంగా ఉండవలసిందని అర్థించాడు. ఒకవేళ బ్రిటిషువారే అంతరించ

వలసివస్తే "పిరికితనంగానే" అంతరించవలసిఉంటుందన్నాడు. బ్రిటిషువారు అనుభవిస్తున్న బాధా, వారి కట్టకడపటిధీరత్వమూ ఆయన బాగా గుర్తించిఉంటాడు.

ఏమైనప్పటికీ ఆ సమయాన రాజగోపాలాచారితోడ్పాటుతో కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గాన్ని శాసిస్తున్న నెహ్రూ యుద్ధంలో బ్రిటిషువారికి తోడ్పడాలనీ, అందుకు ప్రతిఫలంగా భారతదేశం కొంతలాభం పొందాలనీ ఉద్దేశిస్తున్నాడు. ఆ ఉద్యమస్వభావానికీ గాంధిజీ అహింసకూ పొత్తు కుదరలేదు. ఈ సత్యం మహాత్మునికి తెలుసు. అయినా ఆయన తలచుకొన్నట్లయితే కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గం తనఆజ్ఞను శిరసావహించేటట్లు చేయగలిగేవాడే. కాని, యిదికూడా ఆయన అహింసాసిద్ధాంతానికి వ్యతిరేకమూ, అంతరాత్మ కెంతో బాధ కలిగించేదీ అయింది. ఈ పరిస్థితులన్నింటిలోనూ ఆయన చేయగలిగిందంతా కాంగ్రెసుకు బాధ్యత ఒప్పగించటం మాత్రమే. అది ఎలా నిర్ణయించినా సరే! (నెహ్రూబలంతో) రాజాజీ ప్రతిపాదించిన తీర్మానం నెగ్గింది. "దేశానికి స్వతంత్రత ఇచ్చి అటురాలా భారతప్రభుత్వం ఏర్పాటైస్తే భారతదేశం తన సర్వశక్తులతోనూ యుద్ధంలో పాల్గొనగలదు." అని కాంగ్రెసు ప్రకటించింది.

అప్పుడు లండనులో ప్రధానమంత్రి విన్‌స్టన్‌చర్చిల్. భారతదేశం స్వతంత్రంకావటం అతని కెన్నడూ అంగీకారయోగ్యం కానివిషయం. అతని అభ్యంతరంమాట యెలా ఉన్నా బ్రిటిషుప్రభుత్వం తన అధికారాన్ని భారతదేశానికి దత్తంచేయటానికి ఆవిషమపరిస్థితి తగినసమయమేనా అని

కూడా శంకించవలసివస్తుంది. తర్వాత ఏడేండ్లకు ఆసమయం ఆసన్నమైంది. అప్పుడుకూడా ఈ అధికారప్రధానం అంత తేలిక పని కాలేదు. ఇక 1940 వ సంవత్సరపు ఫలితాలు ఎలా ఉండ వచ్చునో ఎవరైనాసరే ఊహించటంకష్టమే.

ఏది ఎలా ఉన్నా కాంగ్రెసుకు వచ్చినసమాధానం పూర్తిగా వ్యతిరిక్తమైంది. 'భారతదేశపు జనాభాలో పెద్దపెద్ద విభాగాలకు సమ్మతం కాని ఒక భారతప్రభుత్వానికి తమ అధి కారాన్ని ఒప్పగింతపెట్టటానికి బ్రిటిషుప్రభుత్వం వారు సిద్ధపడ లేరు.' అని ఆ సమాధానంలో ఉన్నది. ఈపెద్దపెద్ద విభాగాలంటే మహమ్మదాలీజిన్నా నాయకత్వాన కాంగ్రెసుతో సంబంధం లేకుండానూ, కాంగ్రెసుకు కేవలం వ్యతిరేకంగానూ క్రొత్తగా సంఘీభవించి ప్రవర్తిస్తున్న ముస్లింప్రజానీకమే.

ఇప్పుడు కాంగ్రెసు మళ్ళీ అహింసాత్మకంగానే ప్రభు త్వంపట్ల సహాయనిరాకరణం ప్రదర్శించాలని అభిప్రాయ పడింది. రాజకీయనాయకులు తమకు లాభదాయకంగా కని పించినప్పుడున్నూ, అంతకంటె గత్యంతరం లేనప్పుడున్నూ అహింసాత్మకమైన తనఉద్యమాన్ని ఆమోదిస్తూఉంటారని గాంధిజీకి ఇప్పుడు నిదర్శనపూర్వకంగా బోధపడిఉంటుంది. అంతే కాక, వారు ఆసమయాన సంభ్రమవివశులై కార్యభారంఅంతా గాంధిజీకే ఒప్పగించాలని అభిప్రాయపడ్డారు. మహాత్ముడు మళ్ళీ వారితో కలిశాడు. అయితే బ్రిటిషువారికి ఆర్థికంగా బాధ కలిగేపని యేదీకూడా చేయరాదని హెచ్చరించాడు. యుద్ధప్రయత్నాలకు సహకరించకపోయినా ప్రజలతో కాంగ్రెసు వారు స్వేచ్ఛగా కలమెలసి పనిచేయుటానికి అనుమతించవలసిం

దని కాంగ్రెసుపక్షాన రాజప్రతినిధిని అభ్యర్థించటానికి వెళ్లాడు. కాని, రాజప్రతినిధి అందుకు సమ్మతించలేదు.

గాంధిజీ మనస్సులో కలిగిన ధర్మసందేహాలు ఆ తరుణంలో బ్రిటిషువారికి నిజంగా హాని కలిగించేపని యేదీ చేయరాదనే ఆయనకు తోచటానికి కారణమైనాయి. అయితే భారత దేశానికి ఏ హక్కూ కూడా ఇయ్యరాదని బ్రిటిషువారు మొండిగా నిరాకరించటం ఆయనమనస్సును నొప్పించింది. ఎటువంటి సంప్రతింపూ లేకుండానే బ్రిటిషువారు భారత దేశాన్ని యుద్ధంలోకి ఈడ్చారు. అలా ఎంతకాలం సాగుతుందో తెలియ లేదు. ఒక్క కాంగ్రెసునాయకులకే పరిమితంగా శాసనధిక్కారోద్యమం ప్రారంభించాలని గాంధిజీ నిశ్చయించాడు. ఆయన మొట్టమొదట వినోబాభావేను చెఱసాలకు పొమ్మన్నాడు; తర్వాత నెహ్రూ, పిమ్మట పటేలూ, తర్వాత మౌలానా అబుల్ కలామ్ ఆజాదూ అని వంతులు వేసేశాడు. గాంధిజీ మాత్రం చెఱసాలకు వెలుపలనే ఉండేటట్లు కాంగ్రెసు కార్య నిర్వాహకవర్గం ఆయనచేత వాగ్దానం చేయించుకొన్నది. సుమారు ఒకసంవత్సరంలో యుద్ధప్రయత్నాలకుగానీ, యుద్ధానికిగానీ వ్యతిరేకంగా ప్రసంగించినందుకు 23223 మంది చెఱ సాలలకు వెళ్లారు.

1941 వ సంవత్సరం అంతా జపాను యుద్ధంలో పాల్గొన టంతో భారత దేశానికి యుద్ధంతో ఇటువంటి అనుభవం అంత మైంది. బ్రిటిషు ప్రభుత్వం నాయకులను విడుదలచేసింది. ఇక కాంగ్రెసును అదుపులో ఉంచాలనే ఉద్దేశం గాంధిజీకి లేక పోయింది. ఆయన వాదోపవాదాలతో సంబంధంలేకుండా కాట

స్థ్యం వహించాడు. జపానువారు ఆగ్నేయాసియామీదుగా సేనాదళాలతోనూ నౌకాదళాలతోనూ కూడా సాగివస్తున్నారు. వారు త్వరలో భారతదేశానికి వచ్చేవారేమో!

ఈ సమయానికి అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రభుత్వమూ, రష్యా ప్రభుత్వమూకూడా ఏకీభవించి హిట్లరును ప్రతిఘటించటం జరిగింది. అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రభుత్వం ఇటు జపానువారినికూడా ఎదుర్కొన్నది. ఆ పరిస్థితులనుచూస్తే ఎప్పటికైనా బ్రిటిషువారికి విజయం కలగవచ్చు ననిపించింది. కాని, అమెరికావారెప్పుడూ భారతదేశానికి అనుకూలురు. భారతదేశంపట్ల బ్రిటిషువారు వ్యవహరించే విధానం వారికి సమ్మతం కాలేదు. యుద్ధలక్ష్యాలను ప్రకటించటంలో వారి హృదయం స్పష్టంగా ప్రకటితమైంది. భారతదేశ సమస్యను ఉత్తరప్రత్యుత్తరాలతోనే అపరిష్కృతంగా ఉంచుతూవచ్చే విన్‌స్టన్‌చర్చిలు ధోరణిని అమెరికాఅధ్యక్షుడైన రూజ్వెల్టు ఎన్నడూ కొనసాగనీయలేదని తర్వాత కొలది సంవత్సరాలలో తేటతెల్లమైంది. ఇంగ్లండులో పలుకుబడి గల పెద్ద లనేకులు చర్చిలు అభిప్రాయాలతో ఏకీభవించక, రూజ్వెల్టునే బలపరిచారు. భారతదేశ సమస్యలో పెద్దచిక్కు లేవీ లేవనీ, కొంచెం ముందోవెనుకో అది పరిష్కరించకతప్పదనీ, యుద్ధసమయంలో తగుతోడ్పాటు లభించాలంటే దానిని త్వరితంగా పరిష్కరిస్తేనే శ్రేయస్కరమనీ వారు అభిప్రాయపడ్డారు.

ఇంతవరకు రావటంచేత చర్చిలు భారతదేశంలోని రాజకీయనాయకులతో రాజ్యాంగవిషయంలో సాధ్యమయిన మార్పులను గురించి ముచ్చటించి రమ్మని సర్ స్టాఫర్డుక్రిప్సును

భారత దేశానికి పంపించాడు. అంతకుముందు ఒకసారి (కడచిన నవంబరు నెలలో) క్రిప్సు భారత దేశానికి వచ్చి వార్ధా ఆశ్రమంలో మహాత్ముణ్ణి సందర్శించాడు. ఇప్పుడు (1942 వ సంవత్సరం మార్చి నెల 22వ తేదీ) అతను అధినివేశ రాష్ట్రాల ఏర్పాటుకు తగిన ప్రణాళికతో కూడా న్యూఢిల్లీకి వచ్చాడు. (1926 వ సంవత్సరంలో వెస్టుమినిస్టర్ శాసనం ఏర్పడ్డది లగాయతు అధినివేశ ప్రభుత్వానికి, ఎప్పుడైనాసరే, బ్రిటిషువారి వలస రాజ్యాల కూటమినుంచి విడిపోయే హక్కుకూడా కలిగింది.) అయితే ఈ అధినివేశ ప్రభుత్వం యుద్ధానంతరం మాత్రమే ఏర్పాటు కాగలదన్నారు. అంతేకాక భారత దేశంలోని ఏ రాష్ట్రంకానీ, ఏ ప్రత్యేక భాగంగానీ భారతసమైక్య ప్రభుత్వంతో సంబంధంలేకుండా ప్రత్యేక రాజ్యంగా ఉండదలచుకొంటే దానికి అత్యంతరం ఉండరాదని ఒక నిబంధనకూడా ఇందులో పెట్టారు.

క్రిప్సు ప్రతిపాదనలలో ఒక్క అధి నివేశ ప్రతిపత్తి మాత్రమే గాంధిజీకి సమ్మతమైంది. స్వదేశసంస్థానాలు వేటికవి ప్రత్యేక రాజ్యాలుగా ఉండటమూ, ముఖ్యంగా దేశంలోని ఏ ప్రాంతమైనా స్వతంత్రరాజ్యంగా చీలిపోయే ప్రమాదం ఉండటమూ ఆయనకు గిట్టలేదు. యుద్ధప్రయత్నాలకు దోహదం కావాలనే చివరి నిబంధన ఆయన అహింసాసిద్ధాంతానికి గొడ్డలిపెట్టుగా తోచింది. అందువల్ల క్రిప్సు ప్రతిపాదనలను చూడటం తడవుగా ఆయన వాటిని సంపూర్తిగా నిరాకరించాడు. తిరిగి వార్ధాకు వెళ్ళిపోయాడు. ఇక సంప్రతింపులకు అవకాశమనేదే లేకపోయింది.

నెహ్రూ రాజాజీలు సంప్రతింపులు సాగించారు. అలాగే ఇతరవర్గాల నాయకులున్నూ కొన్నాళ్ళు సంప్రతించారు. చివరకు అందఱూ ఒకేవిధమైన సమాధానం ఇచ్చారు. ఆ ప్రతిపాదనలు ఆమోదించరానివైనాయి. ఏప్రిల్ 12 వ తేదీన క్రిప్సు తిరిగి ఇంగ్లాండుకు వెళ్ళాడు. అదేరోజున రూజ్వెల్టు మళ్ళీ ప్రయత్నం చేయవలసిందని చర్చిలుకు సుదీర్ఘమైన నిస్తంత్రీవార్త పంపాడు. అప్పటికే చర్చిలు తన దృఢాభిప్రాయానికి ఎంతో వ్యతిరేకంగా నడిచాడు; అలా నడవక తప్పలేదు. క్రిప్సు ప్రతిపాదనలను భారతీయులు తిరస్కరించినందుకు చర్చిలు సంతోషించిఉంటాడని యెవరైనా ఊహించినా ఊహించవచ్చునుకూడా. "చక్రవర్తి సామ్రాజ్యవిచ్ఛిత్తి" అని అతను పేర్కొన్నది మఱొకరిద్వారా జరుగవలసిఉన్నది గదా!

క్రిప్సు రాయబారంనాడు 1942 వ సంవత్సరంలో తత్క్షణమే భారతదేశం స్వతంత్రమైఉంటే మఱి అయిదుసంవత్సరాలకు సంభవించిన దైవికమైన విపత్తు తటస్థించకుండానే ఉండేదేమో అని చర్చించటం అంతాకూడా వట్టిఅయితే గియితేలే. 1942 వ సంవత్సరంలోనే భారతదేశానికి అధికారం దత్తంచెయ్యటానికి బ్రిటిషుప్రభుత్వం అంగీకరించిఉండేదనీ, "యథార్థమైన అధికారం" ఇవ్వటానికి యుద్ధం ముగిసేవఱకు మాత్రమే బ్రిటిషువారు గడువుతీసికొనిఉండేవారనీ, బ్రిటిషు మిత్రమండలి అటువంటి నిశ్చయానికి రావడమే యిందుకు కారణమనీ లూయీఫిషర్ వాదం. "యథార్థాధికారం" బ్రిటిషువారిచేతులలోనే ఉండేటట్లయితే గాంధిజీ ఆ రాజీకి ఆమోదించడనీ, ఆయన ఆమోదంలేనిదే రాజీ జరిగేదే కాదనీ నా అభిప్రాయం. ఇంతే

కాక మహమ్మదాలీ జిన్నా నాయకత్వాన నడిచే మహమ్మదీయ ప్రత్యేకతా సాధనోద్యమం అప్పటికే చాలా బలపడి ఉన్నందువల్ల అటుతర్వాతనైనా సంభవమైనట్లు 1942 వ సంవత్సరంలోనే ఎన్నో కల్లోలాలు సంభవమయేవి.

బహుశః ఆ యుద్ధసమయమే భారత స్వాతంత్ర్యానికి అదనని గాంధిజీ అభిప్రాయపడిఉండవచ్చును. కాని, గాంధిజీ తత్త్వానుగుణంగా విచారిస్తే భారతదేశంమీదకు దండెత్తివచ్చే జపానువారిని సాత్త్విక మార్గాననే నిరోధించటానికి ఆయన ఒక బ్రహ్మాండమైన ఉద్యమం నడిపిఉండేవాడు. అయితే భారతదేశం స్వతంత్రమైఉంటేనే ఆయన అలా చేయగలిగేవాడు. దేశానికి స్వాతంత్ర్యమూ లేక, జాతీయప్రభుత్వమూ లేక పోయినట్లయితే బ్రిటిషు ప్రభుత్వంవారూ, మిత్రమండలివారూ మాత్రమే భారతదేశరక్షణకు సిద్ధపడక తప్పదు. అప్పుడు గాంధిజీ వారి ప్రయత్నాలకు నిరోధం కల్పించకపోయినా, సహకారంమాత్రం జరిపేవాడుకాడు. జపానువారిదాడి సంభవించగలదని అప్పటి పరిస్థితులను పరిశీలించగా గాంధిజీకి తోచినట్లు విదితమౌతున్నది. అహింసాత్మకమైన సహాయనిరాకరణోద్యమం జరపటానికి అంతకంటె పరీక్షాకాలం మళ్లా కలిగిఉండదని కూడా ఆయనకు తోచిఉండవచ్చును. 1942 వ సంవత్సరంలో ఆయన ఇటువంటిది సంభవించవచ్చుననీ, ఎట్టి పరిస్థితులలోనూ దేశంమీదికి దండెత్తివచ్చినవారితో సంబంధమే పెట్టుకోగూడదనీ చెప్పుతూవచ్చాడు.

గాంధిజీ ఆ ఆలోచన ఆయనకు అప్తులైన రాజకీయ మిత్రుల ఆలోచనకూ, అనుచరుల ఆలోచనకూ కూడా చాలా

భిన్నంగా ఉన్నది. వారందఱునూ యుద్ధంలో పాల్గొనదగి నట్లు స్వాతంత్ర్యం కావాలని వాంఛించారు. ముఖ్యంగా సాహ సంపాలు ఎక్కువైన నెహ్రూకు గాంధిజీ ఉద్దేశించే అహింసా విధానం సముచితంగా తోచలేదు. అనేక సంవత్సరాలుగా అతను హిట్లరు క్రూరప్రభుత్వాన్ని వ్యతిరేకిస్తూ వచ్చాడు. అతను అన్నట్లు "సాధ్యమైన ప్రతిమార్గానా" ఆ క్రౌర్యాన్ని ప్రతిఘటించాలని వాంఛించాడు. రాజాజీ, మౌలానా సాహె బులు కొంత మృదువుగా మాట్లాడినప్పటికీ అదేభావాన్ని ప్రకటించారు. ముందు కావలసింది భారతదేశానికి వెంటనే స్వాతంత్ర్యం లభించటం మాత్రమే. జూలైనెల 14 వ తేదీన కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గం అలా తీర్మానించింది. ఈ తీర్మానాన్ని బ్రిటిషుప్రభుత్వం నిర్లక్ష్యంచేసినట్లైతే కాంగ్రెసు శాసన ధిక్కారోద్యమానికి "సిద్ధపడక తప్ప"దని కూడా ప్రక టన జరిగింది.

1942 వ సంవత్సరం ఆగస్టు నెల 7, 8 తేదీలలో జరిగిన అఖిలభారత జాతీయమహాసభ (కాంగ్రెసు)లో ఇందుమీద తుదినిర్ణయం జరిగింది. అయితే శాసనధిక్కారం అనేది తత్ ణమే జరపటం మంచిదికాదనీ, ముందు సంప్రతింపులు జరపా లనీ గాంధిజీ అభిప్రాయపడ్డాడు. దానికోసం ఢిల్లీకివెళ్ళి రాజ ప్రతినిధిని సందర్శించాలని ఉద్దేశించాడు. కాని, అమెరికా అధ్యక్షుడైన రూజ్వెల్టుకు ఆవిషయమై ఒకలేఖ వ్రాయబూని ఆరాత్రి చాలావఱకూ దానితోనే కాలంగడపిన గాంధిజీ (ఆగస్టు 9 వ తేదీ ఉదయానవే) తెల్లవాఱుతూ ఉండగానే ప్రభుత్వ నిర్బంధానికి గుఱిఅయి తనకడసారి చెఱసాలకు అంటే

పూనాలోని ఆగాఖాను భవనానికి వెళ్ళాడు. ఆయనతో బాటు ఇంకా చాలామంది కాంగ్రెసు నాయకులుకూడా నిర్బంధితు లయినారు.

ప్రభుత్వం చేసిన ఈ నిర్బంధాలవల్ల శాంతియుతంగానూ, అహింసాత్మకంగానూ శాసనధిక్కారోద్యమం సాగే అవకాశం అంతరించింది. భారతీయులకు ఇప్పుడు నాయకులు లేకపోయారు. వారి ఉద్రేకాలను చల్లార్చి శాంతిపథంలో నడపించే గాంధిజీవాణి వారికి వినిపించకుండా పోయింది. ఇక చెఱసాలలో ఉన్న గాంధిజీకి ప్రథమదశలో వార్తాపత్రికలు కూడా లభించలేదు. అందువల్ల దేశంలో ఏమి జరుగుతున్నదో కారాగారాధికారివర్గాలు చెప్పితే వినవలసిందే కానీ, స్వయంగా తెలిసికొనే అవకాశం లేకపోయింది. అయినాసరే, ఆయన దేశంలో జరుగుతూ ఉన్నదానిని ఖండించవలసి ఉన్నదనీ, ఆ పద్ధతిని అంతరింపజేయాలనీ ప్రభుత్వం భావించింది.

భారతీయులు గుంపులుగూడి దౌర్జన్య మవలంబించి, రైలుపట్టాలు తొలగిరిచి వెయ్యటం, తంతితీగెలు త్రెంచటం, రక్షకభటులమీాద దాడిచెయ్యటం సాగించారు. కొన్ని జిల్లాలలో ఉద్యమం అదుపు లేకుండా సాయుధవిప్లవానికిన్నీ తయారైంది.

హింసా విధానాన్ని ఖండించటానికీ, నిరోధించటానికీ గాంధిజీ ఎన్నడూ వెనుకాడి ఉండలేదు. అయితే ఈసందర్భంలో ఆయన అలా చేయదలంచలేదు. దేశంలో ఏమిజరుగుతున్నదో సత్యం గ్రహించటానికి ఆయనకు అవకాశం లేకపోయింది. కేవలం ఒకపక్షంవారి వాదనమాత్రమే ఆయన చెవికి వచ్చింది

ఇంతేకాక ఆయన వార్తాపత్రికలు చదివేఅవకాశం కలిగిననాటికి భారత దేశంలోనూ లండనులోనూ కూడా ప్రభుత్వంవారు ఆయన మాటలలో "అపోహాలూ, అపార్థాలూ" కల్పించుకొని భారత దేశంలోని అరాజకానికి మహాత్ముడే (లేక మహాత్ముడూ కాంగ్రెసూ) కారణమునేనిశ్చయానికి వచ్చినట్లు వెల్లడిఅయింది. అది యుద్ధప్రచారానికి ఒకరకమైన ప్రయత్నం. అది ఆయనను చాలా నొప్పించింది. అందువల్ల (ఆగస్టు నెల 14 వ తేదీన) చెఱసాలనుంచి ఆయన రాజప్రతినిధికి వ్రాసిన తొలిలేఖ గాంధిజీ లేఖ అనదగినట్లు లేదు. అది అయిదుపుటల సుదీర్ఘలేఖ. దోషారోపణలతో నిబిడీతమైంది. ఆ విసుర్నను తాను ఆమోదించ లేనని రాజప్రతినిధి జవాబు వ్రాశాడు. లిన్లిత్గో స్వతంత్రంగానే వ్యవహరించిఉంటే గాంధిజీతో ముందు మాట్లాడకుండా ఆయనను నిర్బంధించేవాడు కాడనీ, ఆయన కేవలం లండనునుంచి వచ్చిన ఆజ్ఞలనుబట్టి మాత్రమే వ్యవహరించి ఉంటాడనీ కొందఱి అభిప్రాయం.

మళ్ళీ నూతన సంవత్సరారంభాన గాంధిజీ రాజప్రతినిధికి ఇంకొక లేఖ వ్రాస్తూ తన చిరకాలమిత్రుడు తనమాట విని పించుకోకుండానే తన్ను నిర్బంధించినందుకు చాలా విచారిస్తున్నానని వ్రాశాడు. దేశంలోని హింసాత్మకోద్యమానికి ప్రభుత్వమే కారణంగానీ, తాను బాధ్యుణ్ణికాననీ ఉద్ఘాటించాడు. తాను, ఉపవాసం చెయ్యాలని నిశ్చయించుకొన్నట్లు కూడా తెలియజేశాడు.

ఆలేఖ చూడగానే రాజప్రతినిధి జవాబు వ్రాశాడు. అయితే అది 14 రోజులకుగానీ గాంధిజీకి చేరలేదు. అందులో

దేశంలో జరుగుతూఉన్న హింసాత్మక చర్యలను ఖండిస్తూ, ఉద్రిక్త వాతావరణాన్ని తగ్గించటానికి గాంధిజీ ప్రజలకు విజ్ఞప్తి చేయనందుకు తాను విచారిస్తున్నానని రాజప్రతినిధి వ్రాశాడు.

వెంటనే గాంధిజీ దేశంలోజరిగే సంఘటనలను తాను నిరసిస్తున్నాననీ, అయినప్పటికీ ప్రజలకు నచ్చజెప్పటానికిగానీ, వారిని అదుపులో ఉంచటానికిగానీ తనకు అవకాశం లేకపోయిందనీ, భారతప్రభుత్వమే ఆ నింద భరించవలసిఉంటుందనీ జవాబు ఇచ్చాడు. మహాత్ముడూ కాంగ్రెసువారూ మాత్రమే నిందార్హులని రాజప్రతినిధి తిరిగి సమాధానం ఇచ్చాడు.

అప్పుడు గాంధిజీ తాను ఫిబ్రవరి 9 వ తేదీనుంచి 29 రోజులపాటు ఉపవాసం చెయ్యటానికి నిశ్చయించుకొన్నానని ప్రత్యుత్తరం వ్రాశాడు.

రాజప్రతినిధి తత్క్షణం జవాబు వ్రాస్తూ ప్రజలలో అరాజకానికి కాంగ్రెసే కారణమని పునరుద్ఘాటించి, మహాత్ముడు ఉపవసించ గూడదని ఆశిస్తున్నానంటూ "రాజకీయ లక్ష్యసాధనకు ఉపవాసాన్ని వినియోగించటం ఒక పెద్దరాజకీయపు బందిపోటు అనే నాభావం. ఎందువల్లనంటే దీనికి సమంజసమైన కారణం కనిపించక పోవటమేకాక, లోగడ మీ వ్రాతలను బట్టి ఇది (ఇట్టి రాజకీయపు బందిపోటు) కూడా మీలక్ష్యమని నేను అర్థం చేసికొంటున్నాను." అని అతికఠోరమైన ధోరణిని ప్రదర్శించాడు.

మహాత్ముడు ఉపవాసాన్ని గురించి ఎంత జాగరూకతతో నిర్వచించిఉన్నాడో పరిశీలించిఉంటే రాజప్రతినిధి ఉప

యోగించిన యీభాష అతికటువుగాఉన్నదని స్పష్టమౌతుంది. దీనికి మహాత్ముడు ఇలా జవాబు ఇచ్చాడు. "ఇది రాజకీయపు బందిపోటు అని మీరువర్ణించినప్పటికీ నాకుమాత్రం మీ నుండి నాకు లభించని న్యాయంకోసం సర్వోన్నత న్యాయాధికారికి (భగవంతునికి) నేను చేసికొనే విజ్ఞప్తి మాత్రమే అవుతుంది. దీనివల్ల దైవికమైన విపత్తును నివారించుకోలేక పోయినట్లయితే, నా నిష్కల్మష సత్యపట్ల పరిపూర్ణమైన విశ్వాసంతో నేను ఆ సర్వోన్నత న్యాయాధికారి సాన్నిధ్యానికి పోతాను. సర్వ శక్తి సమన్వితమైన ఒకప్రభుత్వప్రతినిధిగా మిమ్మల్ని, నా దేశానికీ తద్వారా మానవజాతికికూడా సేవచేయటానికి ప్రయత్నించిన అల్పమానవుడుగా నన్ను—మన తర్వాత తరాలవారు రించి తీర్పు చెప్పగలరు."

గాంధిజీని చెఱసాలనుంచి విడుదల చేయటంద్వారా యీ క్లిష్టసమస్యనుంచి బయటపడాలని ప్రభుత్వం అనుకొన్నది కానీ తాను విడుదలకావడానికికూడా ఆయన అంగీకరించలేదు. తన్ను విడుదలచేస్తే తాను ఉపవాసంచెయ్యక మతొక ఉద్యమాన్ని ప్రారంభించవచ్చునన్నాడు. ఆయన చెఱసాలలోఉంటే ఎంత కొఱకరానికొయ్య అయినాడో బయటఉన్నా అంతే అని రాజప్రతినిధి అనుకొన్నాడు. కాబట్టి ఆయన ముందుగా నిశ్చయించుకొన్నట్లు చెఱసాలలో ఉపవాసం సాగించటమే మంచిదని అనుకొన్నాడు. ఉపవాసకాలంలో సాహాయ్యానికి ఎవరైనా వైద్యులనుగానీ, మిత్రులనుగానీ కావలిస్తే పిలిపించుకొనటానికి గాంధిజీకి అనుమతి ఇయ్యబడ్డది. ఆగాఖానుభవనం

విశాలమైనది కాబట్టి యెంతమందివచ్చినా చోటుచాలదనే బాధ లేదు.

ఈఉపవాసం (1943 వ సంవత్సరం ఫిబ్రవరి 10 వ తేదీ నుంచి మార్చి 2 వ తేదీవఱకూ) భారత దేశంలో ప్రతివ్యక్తికీ భయహేతువైంది. ఇక ప్రభుత్వానికి అన్నివైపులా అగ్ని అవరించినట్లయింది. మహాత్ముడు మరణిస్తాడేమో అనే భయం ప్రబలినందువల్ల అనుదినమూ ప్రజానీకం ఆయనను కన్నులారా చూచివెళ్ళే యేర్పాటు చేయవలసివచ్చింది. మొదటివారం గడచేసరికి ఆయన క్రమంగా క్షీణిస్తూవచ్చాడు. అటుపై ఇరవై ఒకటవరోజు రాకుండానే ఉపవాసకాలం లోపలనే ఆయన గతించటం సంభవమని ప్రపంచమంతా భావించటం జరిగింది. కస్తూరీబాకూడా అలాగే అనుకొన్నట్లున్నది. గాంధిజీ ఆప్తులూ బ్రిటిషుప్రభుత్వ వైద్యులూకూడా సంతకాలుచేసి యెప్పటికప్పుడు ఆయనఆరోగ్యంగుఱించి కరపత్రాలు పంచిపెట్టుతూ వచ్చారు. అయితే అవిఏమీ ఆశాజనకాలు కాలేదు. భారత దేశంతో బ్రిటిషువారి సంబంధం ఇందుమూలాన చెడగలిగినంత చెడిపోయింది.

1942 వ సంవత్సరం ఆగస్టునెల, 1944 వ సంవత్సరం మేనెల మధ్యకాలంలో ఆగాఖాన్ భవనంలో, గాంధిజీకి వ్యక్తిగతంగా కలిగిన దుఃఖం ఇంతా అంతా కాదు. ఆయన సర్వకాలసర్వావస్థలలోనూ హింసను ఖండిస్తూనేవచ్చాడు కానీ, ఈ కాలంలో అది భారత దేశంయావత్తూ ప్రబలిపోయింది పైగా అది అంతా ఆయనవల్ల కలిగిందే అని ప్రభుత్వంవారు ఆరో

పించారు. ప్రభుత్వం ఆయనను నిర్బంధించకుండా ఉన్నా, కనీసం ఆయన చెప్పేది విని నిర్బంధించినా ప్రజల విశృంఖలవర్తనాన్ని ఆయన అరికట్టగలిగేవాడు. ఆయన శాసన ధిక్కారోద్యమాన్ని ఏరూపంలో నడపించినా అందులో హింసకు తావు ఉండేది కాదు. ఉప్పుసత్యాగ్రహమే అందుకు నిదర్శనం. అయినప్పటికీ ప్రభుత్వం వేచీ ఉండలేక పోయింది; ఆయన చెప్పేది విననూ లేకపోయింది.

ఈ అనుదిన విషాదానికితోడు వ్యక్తిగతంగా ఆయనకు రెండుదుఃఖాలు ఒకదానివెంట ఒకటి వచ్చిపడ్డాయి. వాటిలో మొదటిది ఆయనకు అత్యంతప్రీతిపాత్రుడైన కార్యదర్శి మహాదేవదేశాయి మరణించటం. ఈయన భగవద్గీత విషయంలో గాంధిజీకి ఎంతోసహకరించినవాడు. ఇక రెండవది యౌవనంలో ప్రియురాలూ, జీవితపర్యంతమూ సహచారిణీఅయిన కస్తూరీబా గతించటం. ఈ రెండింటితోనూ మహాత్ముడు అనుభవించిన దుఃఖం సర్వాతీతమైనది. అయితే దానిని ఆయన గీతాభాషలో "బంధరాహిత్యం"గా అన్వయించుకోటానికి ప్రయత్నించాడు. కాని, ఆయత్నంలో ఆయన సఫలుడు కాలేదేమో! ఆనాటికి కస్తూరీబాతో ఆయన 62 సంవత్సరాలు గడపాడు. ఆమె మహాసాధ్వి, నిరాడంబరా అయి, హైందవగృహలక్ష్మీసముచిత వర్తనతో ఆయనను సేవిస్తూవచ్చినా, సత్యవిషయమై ఆయన జరిపిన పరిశోధనలకూ, అన్నింటికంటె ప్రధానంగా కులాచార విషయాలలోనూ ఆయనతో సరితూగలేక వెనుకంజవేస్తూనే వచ్చింది. ఇంత బాధపడ్డప్పటికీ ఆయన ప్రబోధంలో విశేష

భాగం "ఎందుకు? ఏమిటి?" అనకుండానే ఆమె పరిగ్రహించింది; అనుభూతి స్థిరం చేసికొన్నది. మహాదేవ్ కస్తూరీబా లిద్దఱికీ అంత్యక్రియలు చెఱసాలలోనే జరిగాయి. ఆ ఆవరణలో ప్రక్క ప్రక్కలనే వారిని దహించటమున్నూ జరిగింది.

ఆత్మీయమైన యీ విషాదానుభవం వెనువెంటనే మహాత్ముడు రెండు తీవ్రవ్యాధులతో బాధపడ్డాడు. మొదటిది మలేరియా; తర్వాతది జీర్ణకోశంలో జబ్బు. 1943 వ సంవత్సరపు వంగదేశపు మహాక్షామం ఆయన చెఱసాలలో ఉన్నప్పుడే తల యెత్తింది; అంతరించింది. బ్రిటిషు ప్రభుత్వంపట్ల భారతప్రజానీకానికి కలిగిన అసంతృప్తి అంతకంతకు అధికమయింది. మహాత్ముడు చెఱసాలలో మరణిస్తే మఱీ తీవ్రపరిస్థితులు కలగగలవనే సూచనలు బయలుదేరాయి. నూతన రాజప్రతినిధి వేవెల్ గాంధిజీనీ, పటేలునూ, శ్రీమతి సరోజనీదేవినీ వారి సహాచరులనూ 1944 వ సంవత్సరం మేనెల 6 వ తేదీన చెఱసాలనుంచి విడుదలచేశాడు.

# 5

ఇక పై మూడుసంవత్సరాల కథా "సజీవి విదళనం" అని తాను పేర్కొన్న దేశవిభజననుంచి భారతీయులను రక్షించటంకోసం గాంధిజీ కడసారి చేసిన ప్రయత్నంగుఱించిన గాథ మాత్రమే. సువిశాలమైన ఉపఖండంవంటి భరతఖండంలో ప్రత్యేక ప్రాభవానికి ఉవ్విళ్లూరే సంకుచిత ధోరణులను (వీటిని ఆయన "కత్తిరింపుల అతుకులు" అన్నాడు.) ఎదుర్కొని జాతీయసమైక్యాన్ని సాధించటానికి ఎప్పుడూ కృషిచేస్తూనే

వచ్చాడు. ఇప్పుడు సరిగా దేశానికి స్వేచ్ఛ రానున్న సమయంలో, భారతీయుల ఐకమత్యానికి భంగకరాలైన వాటిలో తీవ్రతమమూ, ప్రత్యేకజాతీయతను సృష్టించటమే ప్రధాన లక్ష్యంగా కయ్యానికి కాలుదువ్వేదీ, అయిన ముస్లిము జాతీయోద్యమం ప్రత్యక్షమైంది.

ఆ ఉద్యమం సరిక్రొత్తది. ఆ నవీనజాతికి పాకిస్తాన్ అని నామకరణం జరిగింది. ఆ పేరు అంతవఱకు ఎవరూ విన్నదీ కాదు; ఎవరూ ఉపయోగించిందీ కాదు. భారతదేశం అన్ని ప్రాంతాలలోనూ అప్పటికి కొన్నివందలసంవత్సరాలనుంచీ ముస్లిములూ హిందువులూ నివసిస్తున్నారు. పల్లెలలోనూ పట్టణాలలోనూకూడా కలసిమెలసి తిరుగుతున్నారు. వారందఱూ ఒకచోట పుట్టి పెరిగినవారే. ముస్లిములలో చాలామంది కడచిన శతాబ్దాలలో కొన్ని కొన్ని సమయాలలో హిందూమతం నుంచి మహమ్మదీయమతానికి వెళ్ళినవారే. (అదిన్నీ సాధారణంగాబలవంతంచేతనే)అనగా మొట్టమొదటవారందఱూహిందువులు మాత్రమే. దక్షిణభారతంలో నివసించే ముస్లిములకూ హిందువులకూ భాషలున్నూ ఒకవిధమైనవే. ఉత్తరభారతంలో ఉరుదూ అనీ, హిందీ అనీ రెండురకాలభాషలు ఏర్పడ్డాయి. వీటిలో మహమ్మదీయమతభాషఅయిన ఉరుదూ దాని ప్రత్యేక లిపిలో పర్షియన్ భాషకు సన్నిహితంగా వాడుకలోకివచ్చింది. ఇక హిందీమీాద సంస్కృతభాషాముద్ర విశేషంగా ఉన్నది. ఇలా అయినప్పటికీ ఈ రెండుభాషలూ చాలా సన్నిహితంగానే సాగాయి. ఉరుదూవారికి హిందీ అర్థమవుతుంది.

హిందీవారికి ఉరుదూ అర్థమవుతుంది. ఆ రెంటికీ అంత పర స్పరబాంధవ్యం ఉన్నది.

ముస్లిములకు ప్రత్యేకరాజ్యం ఎందుకు అవసరమో గాంధిజీకి బోధపడలేదు. ఈసందర్భంలో మహమ్మదాలీజిన్నాకు ఆయన వెల్లడించిన ప్రశస్తభావం ఇది: "నీకు అభిమతమైతే నన్ను రెండుముక్కలుగా ఖండించు; అంతేకానీ, భారతదేశాన్ని మాత్రం రెండు చెయ్యకు." జిన్నా ఇందుకు విరుద్ధంగా ముస్లిము జాతి అనేది అప్పటికే ఏర్పడిఉన్నదనీ, దాని హక్కులు అది అనుభవించవలసిందే అనీ జవాబు చెప్పాడు. ఒకజాతిగా ఉన్న పదికోట్లమందిముస్లింలుముప్ఫైకోట్లమందిహిందువుల పరిపాలన లోఉండటం దారిద్ర్యదుఃఖాలలో మగ్నమైపోవటమే అన్నాడు. తర్వాత దేశస్వాతంత్ర్యం వచ్చేవఱకూ జరిగిన కథ ఈ శత్రుత్వ కథే. ఇది కొన్నిసందర్భాలలో సంప్రతింపులతోనూ, కొన్ని సందర్భాలలో సంప్రతింపులు అసాధ్యమనుకోవటాలతోనూ గడచింది.

గాంధిజీ చాలా ప్రయత్నంచేశాడు. ఆయనకు తాను నెమ్మదిగా ఆరోగ్యం సంపాదిస్తున్నట్లూ తెలుసు; స్వాతంత్ర్యం చేరువైందనీ తెలుసు. హిందువులనూ ముస్లిములనూ సమాధానపఱచగలిగితే అది తత్క్షణమే రాగలదనీ తెలుసు. అప్పటికి ఎన్నోసంవత్సరాలు ముందు, అంటే ఆయన దక్షిణాఫ్రికాలో ఉన్నప్పుడే, ఈ పరిస్థితిని ఊహించి, తనకు "అతి తీవ్రపరీక్ష" యిదే అని విశదీకరించాడు. ఆ పరీక్షకు తాను నిలబడగలనని తోచగానే మహమ్మదాలీ జిన్నాకు ఒకలేఖవ్రాస్తూ స్నేహ

పూర్వకమైన సమాధానంకోసం సంభాషించుకొందామని సూచించాడు.

ఈ సంభాషణలు బొంబాయిలోని మహమ్మదాలీజిన్నా సుందరభవనంలో 1944 వ సంవత్సరపు వేసగిలో జరిగాయి. పిమ్మట ఆ సంభాషణలలో అనుకొన్న విషయాలను పునరుద్ఘాటిస్తూ ఇద్దరిమధ్యనూ ఉత్తరప్రత్యుత్తరాలుకూడా నడచాయి. సంప్రతింపులు విఫలమైన తర్వాత ఆ లేఖలు సంపూర్ణంగా పత్రికలో ప్రకటించబడ్డాయి. వాటివల్ల ఉభయుల ఐకమత్యానికీ తీవ్రవైముఖ్యం జిన్నాదే అని కనబడుతున్నది. ముస్లిము జనాభా అధికంగా ఉన్న భారత దేశప్రాంతాలనుంచి ప్రజల అభిప్రాయం సేకరించాలన్నాడు. అయితే ఆ అంగీకారం తెలియ జేయవలసింది ముస్లిములు మాత్రమే అనికూడా అన్నాడు. అంటే హిందువులూ ముస్లిములూ దాదాపు సమానంగాఉన్న కీలకప్రాంతాలలో హిందువులందరూ నోరులేనివారుగా పడి ఉండాలన్నమాట. అప్పటికీకూడా శాంతికాముకుడైన గాంధిజీ స్వాతంత్ర్యం వచ్చినతర్వాత హెచ్చు ముస్లింజనాభా ప్రత్యేక రాజ్యం కావాలని కోరినట్లయితే అలాగే ఏర్పాటుచేద్దామని అన్నాడు. కాని, విదేశవ్యవహారాలూ, ఎగుమతి దిగుమతి సుంకాల వసూళ్లువంటివాటిలో సంయుక్తప్రభుత్వం ఉండాలని ఆశించాడు.

జిన్నా అతిసమర్థుడూ ఆరితేరినవాడూ అయిన న్యాయవాది. ఒకప్పుడు కాంగ్రెసుపక్షంలో తీవ్రంగా కృషిచేసిన వాడే. కాని లండనులో కొంతకాలం ఉండి హిందూదేశానికి

తిరిగివచ్చిన తర్వాత అంతవఱకూ కాంగ్రెసుతో సహకరిస్తున్న ముస్లింలీగు తద్విరుద్ధంగా వ్యవహరించాలనే నిశ్చయానికి వచ్చాడు. జవహర్లాల్ నెహ్రూపట్ల అతనికి కల అసమ్మతికి తోడు, గాంధిజీకి కల అనన్యసామాన్యస్థితి చూచి అసూయ పడి ఉండటమే అతని యీ విధానానికి కొంతవఱకు కారణం కావచ్చును. అతనితో ఎన్నడైనా మాట్లాడినవారికి అతని తత్త్వం గోచరమవుతుంది. అతను గర్వంకలవాడు. ఎవరితోనైనా సమానుడుగా ఉండి పనిచేయటం అనేది నచ్చకపోవటం అతని విశిష్టత అయిఉండాలి. ముఖ్యంగా తాను సర్వోత్కృష్టుడనని అతను హృదయపూర్వకంగా విశ్వసించిఉండాలి. అతను ముస్లిములీగునుంచి కాంగ్రెసుకు వ్యతిరేకతను సృష్టించి, దానికి హింసాత్మక ధోరణిని అలవఱచి (1936 వ సంవత్సరం నుంచీ) తన యుద్ధనినాదంగా పాకిస్తాన్ సిద్ధాంతాన్ని అవలంబించాడు. ఈ క్రొత్తరాజ్యంలో సింధు, బెలూచిస్థానం, వాయువ్య సరిహద్దురాష్ట్రం, బెంగాలు, అస్సాముల్ని అప్పటికి వాటికి గల ఎల్లలతో చేర్చాలని ఉద్దేశించాడు. అందువల్ల ఆయా రాష్ట్రాలలో అల్పసంఖ్యాకవర్గాలై పోయిన బహుళ హైందవ సంఘానికి తన భవిష్యత్తునుగుఱించి నోరెత్తే అవకాశంలేకుండా పోతుంది. పదిసంవత్సరాలలోపలనే జిన్నా భారతదేశపరిస్థితులను తాఱుమాఱు చేశాడు. దానితో దేశంలోని రాజకీయ పరిజ్ఞానంతో వ్యవహరిస్తున్న చాలామంది భారతీయులకు భారతదేశ రాజకీయాభ్యున్నతికి అవరోధంగా నిలిచినది బ్రిటిషువారు కారనీ, మఱొకమతానికి చెందిన భారతీయులే అనీ తోచింది.

చర్చిలు ఇంకా ప్రధానమంత్రి పదవిలో ఉండగానే 1945 వ సంవత్సరం జూనునెల అంత్యంలో వేవెల్‌ప్రభువు నాయకులనందరినీ సిమ్లాకు ఆహ్వానించాడు. రాజప్రతినిధి సలహాసంఘంలో భారతీయులే సభ్యులుగా ఉండేటట్లూ, రాజకీయపక్షాలన్నీ వ్రాసియిచ్చిన భారతీయుల పేర్ల పట్టికలోనుంచి రాజప్రతినిధి సభ్యులను ఎన్నుకోనేటట్లూ ఒకపథకాన్ని ఆ నాయకులముందు ఉంచాడు. ఇంతేకాక ఈపథకం ప్రకారం సలహాసంఘం సభ్యులలో హిందూ ముస్లిం ప్రతినిధులు సమాన సంఖ్యలోనే ఉండాలి. అయితే దేశంజనాభాలో ముస్లిములకు మూడురెట్లు హిందువు లున్నారు. ఆ దామాషా ప్రకారం న్యాయంగా ఈ సభ్యులలోగూడా నాల్గింట మూడువంతులు హిందువులు ఉండవలసివచ్చినా, ఆన్యాయాన్ని గుర్తించలేదన్న మాట. అయినప్పటికీ ఇది ఒకవిధంగా స్వపరిపాలనమేకాబట్టిన్నీ ప్రాచీన సామ్రాజ్యంలో ఈ ప్రభుత్వం నామమాత్రపుభాగమే కాబట్టిన్నీ కాంగ్రెసునాయకులు ఇందుకు ఒప్పుకొందామనే అనుకొన్నారుకానీ, జిన్నా ఒప్పుకోలేదు. ముస్లిం ప్రతినిధిగా వ్యవహరించటానికి తానుమాత్రమే అర్హుణ్ణని అతనిఉద్దేశం కాబట్టి, అందుకు వ్యతిరేకంగా మఱికొందఱు ముస్లిములను గూడా సభ్యులుగా తీసికొనాలని రాజప్రతినిధి అనటం అతనికి సమ్మతం కాకపోవచ్చును. (చాలామంది ముస్లింసభ్యులున్న దయినా కాంగ్రెసుకు ఆ హక్కు లేదని అతని అభిప్రాయం.)

తర్వాత సంఘటనలు తటుముకొనివచ్చాయి. బ్రిటను లోని ఎన్నికలలో చర్చిల్ పరాజితుడయాడు. కార్మికప్రభుత్వం

అధికారంలోకివచ్చి వేవెలును ఇంగ్లాండుకు పిలిపించింది. ఆయన భారత దేశానికి తిరిగివచ్చినతర్వాత నూతన రాజ్యాంగ విధానానికి ప్రథమసోపానంగా భారత దేశంలో అన్ని రాష్ట్రాలలోనూ కేంద్రప్రభుత్వంతో సహా శాసనసభలకు ఎన్నికలు జరపాలనే క్రొత్తపథకం ప్రకటించాడు. ఎన్నికలలో ఫలితాలు ముందు ఊహించినట్లే సంభవించాయి. హిందువులు అధిక సంఖ్యాకులయిన ప్రాంతాలలో కాంగ్రెసుకు విజయంలభించింది. అలాగే ముస్లిములు హెచ్చుగాకల ప్రాంతాలలో ముస్లిములీగు గెలిచింది. ఈ పెనగులాటను ఇంతటితో అంతరింపజెయ్యటంకోసమై చేయదగ్గ ప్రయత్నమేదీకూడా జిన్నా అసమ్మతిమూలంగా రాణించేటట్లు కనబడలేదు. గాంధిజీ ఇందులో విఫలుడైనాడు. తన వైఫల్యాన్ని ఆయన అంగీకరించాడు. బ్రిటిషువారిదే తప్పు అనటానికి అనేకభారతీయులు సాహసించినా ఆయనమాత్రం ఆమాట అనలేదు. బ్రిటిషు ప్రభుత్వం చేతులలోనుంచి భారతీయులకు అధికారం ఒప్పగింతపెట్టడానికి ఒక నూతనపథకం ఏర్పాటుచేసే అధికారంతో ముగ్గురు మంత్రివర్గసభ్యులను రాయబారివర్గంగా క్లిమెంట్ఆట్లీ భారతదేశానికి పంపించాడు. క్రిప్సూ, పెథిక్ లారెన్సూ, ఎ. వి. అలెగ్జాండరూ అనేవారు ఈ రాయబారవర్గంలోనివారు. వీరు క్రొత్తఢిల్లీలోనూ మఱి కొన్నిచోట్లా భారతీయ నాయకులతో రెండునెలలపాటు సంప్రతింపులు జరిపారు. ఆసంప్రతింపులు ముగియగానే వాటి ఫలితాలను 1946 వ సంవత్సరం మేనెల 16 వ తేదీన ప్రకటించారు.

వీరు అప్పటిపరిస్థితులను జాగ్రత్తగా పరిశీలించి, ప్రత్యేక మహమ్మదీయ ప్రభుత్వంకోసం జిన్నా చేస్తున్న వాదాన్ని కూడా విచారించారు. వీరిని వేదికలో ఈవిషయాన్ని గుఱించిన పరిశీలన కొంత కనిపిస్తుంది. భారతదేశాన్ని ఎలా విభజించినప్పటికీ విభక్తప్రాంతాలు రెంటిలోనూ అల్పసంఖ్యాకవర్గంగా చాలా జనాభా చిక్కుపోతుందని తేలింది. అంతేకాక అనేక రాష్ట్రాల భౌగోళికస్థితులలోనూ, ఆర్థిక వాణిజ్య వ్యవహారాలలోనూ కూడా చిక్కులు కలుగుతాయని స్పష్టమైంది. ఇందువల్ల ఈ మంత్రులు దేశవిభజనకు బదులుగా హిందూ మహమ్మదీయ ప్రజానీకాలు రెంటికీ తగినట్లుగా ఇఱువర్గాలకూ ప్రాధాన్యం కల ఒక సంయుక్తప్రభుత్వాన్ని ఏర్పఱచవలసి ఉన్నదని సూచించారు. రాజ్యాంగసభ ఏర్పాటుకు మార్గంగా ఒక తాత్కాలిక జాతీయ ప్రభుత్వాన్ని నిర్మించాలని తేలింది.

ఇతరులకు తోచినట్లే గాంధిజీకికూడా ఈ ప్రతిపాదనలు తాత్కాలికాచరణయోగ్యాలే అని తోచింది. బ్రిటిషువారి ఉద్దేశాలను విస్పష్టంగా తెలిసికొన్నప్పుడు అవి వారు హృదయపూర్వకంగా చెప్పేవే అని నమ్మటానికి గాంధిజీ ఎన్నడూ సంకోచించేవాడు కాడు. అయినా ఆ సందర్భంలో ఆయనకు అంతా అయోమయంగా కనిపించింది. ఆ కాలంలో లూయీ ఫిషర్‌తో ముచ్చటిస్తున్నప్పుడు ఆయన భారతదేశానికి తాను చేసిన ప్రబోధం విజయవంతంకాలేదని అన్నాడు. భారతీయులకు అహింస బోధపడలేదనీ, అందువల్ల తాను ఏ రూపాన్నయినా శాసనధిక్కారోద్యమాన్ని సాగించదలచుకోలేదనీ స్పష్టీకరిం

చాడు. రాజ్యాంగసభలో పాల్గొని తాము ఆ అవకాశాన్ని సద్వినియోగంచేయటమే కాంగ్రెసునాయకులు చేయగలిగిన పని అనికూడా అన్నాడు. ఈ సంభాషణలతో భారత దేశంలో పాదుకొన్న హింసావాదంమూలంగా ఆయనకు కలిగిన విచారం విశదమైంది. అదే నాటిపరిస్థితులనుగూర్చి ఆయనచేసిన రచనలోనూ కనిపిస్తుంది.

ఈకాలంలో అడుగడుగునా ఇటు కాంగ్రెసువారూ అటు బ్రిటిషువారూ కూడా గాంధిజీతో సంప్రతిస్తూనే ఉన్నారు. ఆయన ఎన్నడూ ఒకప్రభుత్వానికి అతిథీ కాలేదు; ఒకసంఘంలో సభ్యుడూ కాలేదు. అయితే ఆయన ఆమోదంకానీ, సంప్రతింపుగానీ లేకుండా భారత దేశంలో ఏ పనీ జరిగేది కాదు. చివర కాయన కాంగ్రెసుసభ్యుడుగాకూడా లేడు. కాంగ్రెసు సభ్యులు చెల్లించే వార్షికపుచందాలనుగూర్చి ముచ్చటిస్తూ నేను 'నాలుగణాల సభ్యుణ్ణికూడా కాను' అనేవాడాయన.

1946 వ సంవత్సరంలో పరిస్థితి అంతా చంచలంగానే ఉండిపోయింది. ఈ తాత్కాలికప్రభుత్వంలో జిన్నాకు స్థానం ఉండేదే. అయితే అతను అందుకు అంగీకరించలేదు. కాంగ్రెసు పక్షాన చాలామంది ముస్లిము అభ్యర్థులు ఉన్నారు. తాను తప్ప ఇతరులు ఎవ్వరూ ముస్లింప్రతినిధులుగా వ్యవహరించటం అతనికి గిట్టకపోవటమే యిందుకు కారణం. చిట్టచివరకు రాజప్రతినిధి తాత్కాలికప్రభుత్వాన్ని ఏర్పాటు చేయవలసిందని నెహ్రూకు చెప్పాడు. దానితో 1946 వ సంవత్సరం సెప్టెంబరు నెల 2 వ తేదీన తాత్కాలిక భారతీయప్రభుత్వం ఏర్పాటైంది.

ఈ శుభసమయంలో నెహ్రూను ఉద్దేశించి గాంధీజీ "మకుటంలేని మహారాజవ్రా ప్రధానమంత్రిపీ" అనటం జిన్నాకూ ముస్లింలీగుకూ దుఃఖహేతువై నల్లజెండాల ప్రదర్శనకు మూలమైంది. అంతకుముందు నెలలోనే కలకత్తాలో హిందూముస్లిములమధ్య కొట్లాటలు జరిగాయి. ఆ దెబ్బలాటలలో కనీసం 500 మంది మరణించారు. 15000 మందికి పైగా గాయపడ్డారు. వీటివెంటనే నూతనజాతిస్థానంలో మరి పన్నెండు చోట్ల మతకలహాలు జరిగాయి.

ఈ మతాలమధ్య జరిగే హింసాకాండవల్ల మహాత్ముని కడసారి యాత్రలలో మహత్తరమైనది సంభవించింది. ఈ సందర్భాన కలిగిన విచారం ఆయన హృదయాన్ని ఎంతైనా కలచివేసింది. తూర్పుబెంగాలులో గ్రామగ్రామానికీ పాదచారియై వెళ్ళాలని నిశ్చయించుకొన్నాడు. క్రొత్తఢిల్లీలో ఆయన హరిజనులపేటలో నివసిస్తుంటే నూతనప్రభుత్వ సభ్యులు అక్కడికి వెళ్ళటం ఇష్టమైనా కాకపోయినా ఆయనతో సంప్రదించటానికి వెళ్ళుతూనే ఉండేవారు. తూర్పుబెంగాలులో జరిగిన క్రూరచర్యలు అక్కడి గ్రామాలలో పర్యటించాలనే కోరిక గాంధీజీకి కలిగించాయి. ఆయన గ్రామాలలోనే పర్యటించగోరటానికి కారణం ఏమంటే, అక్కడ తరతరాలుగా ముస్లిములూ హిందువులూ కలసిమెలసి ఉంటూఉన్నవారైనా, పరస్పర ద్వేషంతో వ్యవహరించటానికి హేతువు ఏమో పరిశీలించి నచ్చజెప్పి యథాపూర్వంగా జీవించేటట్లు చేయాలనుకోవటమే. చిత్రవధలు జరిగిన నవఖాలీ త్రిపురాజిల్లాలలో ముందుగా

పర్యటించి తాను చేయగలిగిందేమైనా ఉంటుందేమో చూడా లనుకొన్నాడు. అయితే తనప్రయత్నం నిజంగా ఫలించగలదనే ఆశ ఆయనకు లేదు. ఆ క్రూరత్వం ఆయనను నిరుత్సాహపరచింది. తనమాట వినేవారు ఇకలేరని ఆయనకు తోచింది. ఆయన చిరకాలమిత్రులూ, నూతనప్రభుత్వమూకూడా అంగీకరించకపోయినా అంతరాత్మ ప్రబోధంచేత ఆయన తూర్పు బెంగాలులో పర్యటించాలనే నిశ్చయించుకొన్నాడు.

యథాపూర్వంగా ఆయన దేశపర్యటన ప్రత్యేకపు రైలుబండిమీదనే సాగింది. ఆయన ప్రయాణానికి అదే అవసరమైంది కూడా. మామూలు రైలుబండి అయితే అక్కడక్కడ ఎక్కువసేపు ఆగవలసి రావటంతో అది నిర్ణీతసమయానుగుణంగా వెళ్ళటం జరుగదు. ఆయనకోసం ప్రత్యేకించబడ్డ రైలుబండిలో పెట్టెలన్నీ పరిశుభ్రంగా ఉంచిన మూడవ తరగతివే. స్టేషను స్టేషనులోనూ ఆయన సందర్శనకోసం ప్రజలు గుమిగూడి వచ్చేవారు. అందువల్ల ప్రయాణం చాలా నెమ్మదిగా జరిగేది. అయినా గాంధిజీ అక్టోబరునెల ఆఖరుకు కలకత్తా చేరుకొన్నాడు. ఆయన అక్కడకు వచ్చేముందే మళ్ళీ కొన్ని మతకలహాలు జరిగాయి. వాటివెంటనే బీహారులో ఎన్నో రక్తపాతాలు జరిగాయి. బీహారు జనసంఖ్యలో హిందువులు ఏడింట ఆరువంతులు ఉన్నారు. అక్కడి హిందూనాయకులు అక్టోబరు 25 వ తేదీ నవఖాళీదినంగా ప్రకటించి హిందువుల మరణానికి ప్రతీకారంగా మహమ్మదీయులమీద పగ తీర్చుకొనటానికి సిద్ధపడ్డారు. ఆ కలహాలలో పదివేలమందికి

పైగా మరణించారు. మృతులలో హెచ్చుమంది ముస్లిములే. దీనితో దేశంఅంతటా ఒకచోట జరిగిన స్వమతస్థుల హత్యలకు ప్రతీకారంగా మరొకచోట దారుణంగా హత్యలుచేయటం జరుగుతూవచ్చింది.

మొదట బీహారుహత్యలకు ప్రాయశ్చిత్తంగా ఉపవాసం ప్రారంభించాలని మహాత్ముడనుకొన్నాడుగానీ తూర్పు బెంగాలులో పర్యటించాలనే తొందరవల్ల అదిజరుగలేదు. నవంబరు 7 వ తేదీన నవఖాళీకి ప్రయాణమై గ్రామగ్రామానికి నడచి పోతూ 1947 వ సంవత్సరం మార్చి 2 వ తేదీవరకూ ఆజిల్లాలో నలుమూలలా పర్యటన సాగించాడు. తనతోబాటు కొందరు స్త్రీలనూ పురుషులనూగూడా వెంటబెట్టుకొని వెళ్ళాడు. ప్రతి గ్రామంలోనూ తనతోబాటు కొంతకాలం ఆగి అక్కడిప్రజలందరినీ కలిసికొని వారి భయక్రోధాలను ఉపశమింపజేయటం వారివిధి. ఇవి చాలా కుగ్రామాలు. గంగా బ్రహ్మపుత్రానదులు కలిసి ప్రవహించే ప్రాంతంలోవి. సరిఅయిన బాటలులేవు. రాకపోకలకుఏవిధమైనసౌకర్యాలూ లేవు.ఆయన ప్రతిగ్రామంలోనూ కొన్నిరోజులు ఉండేవాడు. ఒక్కొక్కప్పుడు రెండుమూడు రోజులు ఒకేఊరిలోఉండి, తర్వాత ఆముందుగ్రామానికి వెళ్లేవాడు. ముఖ్యంగా హిందువులపట్ల తీవ్రమైన ద్వేషంకల ఊళ్ళకు ఎవరో ముగ్గురు సహచరుల్నిమాత్రమే వెంటబెట్టుకొని వెళ్లాడు. చాలాదూరం చెప్పులులేకుండానే నడక సాగించాడు. కొన్ని చోట్ల గ్రామాలు అర్ధశిథిలాలై ఉండేవి. దోపిళ్లు విశేషంగా జరిగేవి. భయభ్రాంతులైనహిందువులెందరోఇండ్లువదలిపోయేవారు.

మహాత్ముడు నిర్విరామంగా యాత్రసాగించాడు. వేలకొలది ముస్లిములు ఆయనమాటలు వినటానికి వచ్చారు. సౌభ్రాత్రం, చిత్తనైర్మల్యం, క్షమఅనేవాటిని ఆయన వారికి విశదీకరించాడు. ఆయనయాత్ర ముగియటానికి పూర్వమే నవకాళీ త్రిపురాజిల్లాలలో చక్కని మార్పువచ్చింది. హిందువులకూ ముస్లిములకూ సఖ్యం కలిగింది. బీహారుకుకూడా అదేప్రబోధం చేయాలని అప్పుడాయన నిశ్చయించుకొన్నాడు. "నేనుచెప్పే ప్రత్యంశమూ కులపర్వతాలవలె అతి ప్రాచీనం." అని ఆయన ప్రకటించాడు. బీహారులో తప్పుచేసినవారు హిందువులు. సహజంగా ముస్లిములపట్లకంటె హిందువులపట్ల ఆయన క్రొంచెంకఠినంగా వ్యవహరించేవాడు. హిందువులు ఆయన సొంతమనుష్యులు కావటమే యిందుకుకారణం. "తోడిహిందువుల దుశ్చర్యనుగానీ, మరేమానవుని దుశ్చర్యనుగానీ నేను సమర్థించినట్లయితే నా హైందవత్వాన్నే కోల్పోతాను." అన్నాడాయన.

కాని, సమస్తభారతానికీ, ప్రపంచంలోని విశేషాభాగానికీకూడా కుతూహల జనకంగా ఆయన యిలా యాత్రచేస్తూ ఉండగానే భారతరాజకీయాలు ఒకగట్టుకు వచ్చాయి. లండను కార్మికప్రభుత్వం భారతదేశానికి వెంటనే అధికారం ఒప్పగింతపెట్టాలని నిశ్చయించి "1948 వ సంవత్సరం జూన్ నెలలోపల" ఏదో ఒకరోజున అధికారప్రదానం జరుగగలదని ప్రకటించింది. అయితే ఆ అధికారప్రదానమనేది 1947 వ సంవత్సరం ఆగస్టు నెల 15 వ తేదీనాడే జరిగింది, చివరి సంప్రతింపులూ, అధికారప్రదానం క్రియాపూర్వకంగా జరపటమూకూడా రాజప్రతినిధి

ఇష్టానుసారం చేయవచ్చునన్నాడు అట్లీ. సరసుడూ, ఉత్సాహీ, మేధావీఅయిన మౌంట్ బాటెన్ ప్రభువు ఈ అసమానబాధ్యతను నిర్వహించటానికి వచ్చాడు. ఆయన 1947 వ సంవత్సరం మార్చి నెల 22 వ తేదీన ఢిల్లీ చేరి వెంటనే జిన్నా గాంధిజీలను తనభవనానికి రావలసిందని ఆహ్వానించాడు. స్వాతంత్ర్యం రానే వచ్చింది. అయితే దానిలక్షణాలను నిర్ణయించటంమాత్రం జరుగవలసిఉన్నది. అది చాలాకష్టమే. దానితో బాటు ఎంతో భయంకరహింసలు జరిగాయి. ఏమైనాసరే చిట్టచివరకు వాంఛితసిద్ధికలిగింది. గాంధిజీ అనుకొన్నట్లు ఆయన జీవితంలో జరిగిన యాత్రలన్నింటిలో ఈ బీహారు-ఢిల్లీ ప్రయాణమే కట్టకడపటిది. కావలసిఉన్నది. తన సుదీర్ఘజీవయాత్రకు ఇది అంతిమఘట్టమని ఆయన భావించిఉండవచ్చును. అప్పటికీ ఆయనమనస్సు ఎంత విషాదభరితమై ఉన్నా, స్వాతంత్ర్యభానూదయం ఆయనకు అపూర్వానందాన్ని కలిగించి ఉంటుంది.

## సప్తమప్రకరణం

### ఆత్మార్పణమూ, పరిపూర్ణతా

ప్రధానంగా భారత దేశ విభజనవల్లనూ, దానితో మానవసమాజంలో చెలరేగిన దుఃఖవీచికవల్లనూ, శారీరిక హింసవల్లనూ తాను కీర్తిశేషుడు కావటానికి ముందు ఆఱు లేక ఎనిమిది నెలలు మహాత్మునికి దైవికపరీక్ష చరమస్థాయిలో జరిగింది.

మౌంట్ బాటెన్‌తో ఇతరనాయకు లందతివలెనే మహాత్ముడుకూడా చాలా ఉల్లాసంగా ముచ్చటించాడు. భారతదేశ విభజనకూ స్వాతంత్ర్యానికీ ముడిపెట్టడంలో మౌంటుబాటెన్ దోషం ఎంతమాత్రమూ లేదు. జిన్నా ఒప్పుకోలేదు. అతని మనస్సులో పదికోట్ల ముస్లిములకు మాత్రమే స్థానం ఉన్నది. అతను కోరినట్లు దేశవిభజన జరుగవచ్చునని మౌంటుబాటెన్ అన్నాడు. అయితే పాకిస్థానులోనికి వెళ్ళగోరని హిందూ సిక్కు ప్రజానీకాలను బలవంతంగా అందులోనికి నెట్టటం మాత్రం జరుగరాదన్నాడు. పంజాబు బెంగాలురాష్ట్రాలు పూర్తిగా పాకిస్థానులో చేరిపోవాలని జిన్నా అభిప్రాయం. అయినా ఆ రెంటిలోకూడా ముస్లిము జనాభా హెచ్చుగా కల ప్రాంతాలనే పరిమితంచేసి పాకిస్థానును నెలకొల్పాలని మౌంటుబాటెన్ చెప్పాడు. స్వాతంత్ర్యం మూల్యంగా దేశవిభజనను నెహ్రూ రాజాజీ ప్రభృతులయిన కాంగ్రెసునాయకులు అంగీకరించటానికి అవకాశం కనిపించింది. దేశవిభజనకు తలఒగ్గినట్లే కాంగ్రెసు నాయకుల అభీష్టాకిన్నీ గాంధిజీ తలఒగ్గాడు. అంతేకానీ అందుకు ఆయన ఆమోదం ఎంతమాత్రమూ లేదు. లాంఛనప్రాయంగా కాంగ్రెసునాయకుల నిర్ణయానికి సమ్మతి తెలిపాడు. ఇది 1947 వ సంవత్సరం జూన్ నెల 4 వ తేదీన ఢిల్లీలో ఆయన జరిపే ప్రార్థనసమావేశంలో తటస్థించింది. దానితో బ్రిటిషు రాచరికం అంతమైంది.

కానీ, ఆ వేసంగిలోనూ, ఆ తర్వాత శీతకాలంలోనూ కూడా మహాత్ముడు ఎంతో చిత్తసంక్షోభం అనుభవించాడు.

ఇక్కడా అక్కడా అని నిర్దేశించటానికి వీలులేకుండా సర్వత్రా దొమ్మీలూ, హత్యలూ, రక్తపాతాలూ సంభవించాయి. మహమ్మదీయులలో ఆయనకు చాలా పలుకుబడే ఉన్నది. మతరీత్యా హిందువులకు ఆయన అప్పుడూ గౌరవనీయుడూ గా నే ఉన్నాడు. అయినా ఇక తనమాట వినేవారు ఒక్కరూ లేరు అని ఆయనకు తోచింది. అంతిమక్షణాలు చేరువౌతున్న తనజీవితం అప్పటికి పూర్తిగా వ్యర్థమైపోయిందనీ, జీవితంలో తాను సాధించిన విజయం ఏమీలేదనీ బాధపడ్డాడు. గతం మఱచి, భవిష్యత్తును నిర్మించుకొని అన్యోన్యానురాగంతో ఒకరినొకరు విశ్వసించి జీవితాలు గడపవలసిందని ప్రజలకు నచ్చ జెప్పటానికి పెనగులాడి చూద్దామనుకొన్నాడు. సాధుతా, వివేకమూ మూర్తీభవించిన మహాత్ముడు ఎక్కడకు వెళ్ళినా ఆ సాన్నిహిత్య ప్రభావంవల్ల ప్రజలకు ఆయన ఉపదేశం బోధ పడినట్లే కనిపించేది. కానీ, అంతలోనే శాంతికొఱకు ఆయన చేసిన విజ్ఞప్తులను ప్రజలు పాటించటంలేదని దేశంలోని ఇతర ప్రాంతాలనుంచి తంతివార్తలు వచ్చేవి. స్వబలం హెచ్చుగా కల అన్నిచోట్లా ముస్లిములు హిందువులను వధిస్తూవచ్చారు. అలాగే హిందువులూ ముస్లిములను వధించేవారు.

ఈ అననుభూత సామూహిక హత్యలలో ఎన్నోలక్షల మంది (70 లేక 80 లక్షలమంది వఱకూ) హతులైనట్లు అంచనా వేయటం జరిగింది. దాదాపు 1,50,00,000 మంది ఇండ్లు వాకిళ్ళు వదలిపెట్టి పాకిస్థానునుంచి భారతప్రభుత్వ ప్రాంతా

లకూ, భారతభూభాగాలనుంచి పాకిస్థానుకూ ప్రాణరక్షణార్థం పారిపోయారు.

మహాత్ముని జీవితంలో ఇంతగా హృదయాన్ని నొప్పించిన ఘట్టం మరొకటి ఉండదు. ఈ జాతివిద్వేషాన్ని తొలగించటానికే ఆయన తనజీవితం ధారపోశాడు. ఇప్పుడు మళ్లీ ఘోరహత్యలు పెద్దపెట్టున జరుగుతున్న కలకత్తాకు వరుగెత్తాడు. వీధివీధీ తిరిగి ప్రజలందరినీ కలిసికొని సానునయంగా హితోపదేశం చేయటం మొదలుపెట్టాడు. ఇది సరిగా బ్రిటిషు ప్రభుత్వం భారతీయులకు అధికారం ఒప్పగించేరోజుకు ఆరురోజులు ముందు తటస్థించింది. కలకత్తాలో ఉన్నన్నిరోజులూ ఆయన హిందువులకూ మహమ్మదీయులకూ కల విద్వేషం తొలగించి, సౌమనస్యం నెలకొల్పటానికే ప్రయత్నించాడు. ఆగస్టు నెల 15 వ తేదీన భారతదేశం స్వతంత్రమైంది. ఆ రోజంతా ఆయన మౌనవ్రతంతో భగవద్ధ్యానపరాయణుడై ఉపవసించాడు. ఆయన సాన్నిధ్యప్రభావం మహత్తరమైనది. కాబట్టి కలకత్తాలో తిరిగి శాంతి నెలకొన్నది. సంవత్సరంనుంచి సాగుతూవచ్చిన హత్యాపరంపర ఒక్కుమ్మడిగా అంతమైపోయింది. అయితే మహాత్ముని కర్తవ్యం పూర్తికాలేదు. ఆయన ఉపవాసం సాగించాడు. ఈసారి "ఆమరణోపవాసం" లేదా కలకత్తా అంతటా కూడా ప్రశాంతవాతావరణం స్థిరపడేవఱకూ ఉపవాసం అని నిశ్చయించుకొన్నాడు. 13 గంటలలోపల కలకత్తాలో ప్రశాంతత నెలకొన్నది. తర్వాత దానికి భంగం కలుగలేదు. భారతదేశంలోని ఇతరప్రాంతాలందు ఆ మఱుసటినెలలో ఎన్నో

దురంతాలు జరిగాయి. అయినా కలకత్తాలో అటువంటివి తల ఎత్తలేదు. నగరంలో నిమ్మళం సిరెత్తినట్లున్నది. ఇరుపక్షాల నాయకులూ మహాత్ముణ్ణి సందర్శించి తాము శాంతిని సుస్థిరం చేయగలమని శపథాలు చేశారు; ఆ మాట నిలబెట్టుకొన్నారు.

సెప్టెంబరు 7 వ తేదీన మహాత్ముడు కలకత్తానుంచి ఢిల్లీకి ప్రయాణమైనాడు. అక్కడనుంచి పంజాబుకు వెళ్లాలని ఆయన ఉద్దేశం. పంజాబులో అప్పుడు ఎన్నడూ ఎఱుగని విధంగా మతకలహం ప్రజ్వరిల్లింది. అయితే ప్రభుత్వం కోరినందువల్ల మహాత్ముడు ఢిల్లీలో కొంతసేపు ఆగవలసివచ్చింది.

ఇంతలో ఢిల్లీలోకూడా చాలా కిరాతచర్యలు జరగటం వల్ల మహాత్ముడక్కడ కొంతకాలం ఆగిపోయాడు. ఆయన తన కడపటి యత్నాలతో ఢిల్లీపంజాబుల మధ్యనే జీవితం చాలించేవాడు. అయితే ఆయనశక్తి అప్పటికి చాలావఱకు సన్నగిల్లిపోయింది.

ఆధునికచరిత్రలో బహుశః చరిత్ర అంతటిలోకూడా, అతిదారుణంగా భావించదగ్గ ఒక ప్రళయం రావలసిఉన్నది. ఒకసారి సాయంకాల ప్రార్థనసభలో మహాత్ము డిలా అన్నాడు: "ఇదంతా ఎలాజరుగుతున్నదో అనే ఆలోచనతో నాతల తిరిగిపోతున్నది. ప్రపంచచరిత్రలో ఇటువంటిదెన్నడూ సంభవించి ఉండలేదు. దీనివల్ల మీామాదిరిగానే నేనూ లజ్జతో తలయెత్తలేక పోతున్నాను." నూతనప్రభుత్వానికి రాజధానిఅయిన ఢిల్లీలో హత్యలు అనివార్యాలయినాయి. ఏవీథిలోనూ భద్రత లేదు. నగరవీథులలో రక్తం కాల్వలుగట్టి ప్రవహించేసమయాన

నేను ఢిల్లీ చేరాను. ఇక ఆ హత్యాగాథలకు అంతే కనిపించలేదు. నేను అక్కడికి వెళ్ళేసరికి ముస్లిములు చాలావఱకు నగరంనుంచి పలాయితులైనా అయినారు; నిహతులైనా అయినారు. మహాత్ముడు ఒక్కనిమిషంకూడా అలసుడు కాలేదు. ఆయన వెళ్ళిన చోటనెల్లా శాంతి నెలకొంటూనేఉన్నది. అయితే ఏకకాలంలో అన్ని చోట్లనూ ఆయన ఉండాలంటే అది సాధ్యమా? పంజాబులో ఇదేవిధంగా హిందువులూ, సిక్కులూ నిహతులౌతున్నారు. పంజాబుపరిస్థితులు ఘోరాతి ఘోరంగా ఉన్నాయి. తన భారతదేశపర్యటననూ, తన సిద్ధాంతప్రచారాన్నీ పంజాబులో(అమృతసర్ వద్ద)ఒకానొకఉద్దేశంతో వెనుక ప్రారంభించినట్లుగా ఇప్పుడూ అక్కడే ముగించాలని ఆయన నిశ్చయించుకొన్నాడు.

కానీ, దైవేచ్ఛ అలా లేదు. ఢిల్లీలో శాంతి నెలకొనే నిమిత్తం 1948 వ సంవత్సరం జనవరి నెల 13 వ తేదీన ఆయన తన కడపటిఉపవాసం మొదలుపెట్టాడు. రాజధానిలో భద్రత లేనంతవఱకూ తాను మఱిఒక చోటికి వెళ్ళటం అసంభవమని ఆయనభావం. "ఢిల్లీలోనే శాంతిలేకపోతే భారతంలో శాంతి ఉండదు; దానితో ప్రపంచశాంతినిగుఱించి ఆశించటానికి అవకాశమే ఉండదు." అన్నాడాయన. ఢిల్లీలో శాంతినెలకొనే వఱకున్నూ అది జరుగనట్లయితే మరణపర్యంతమున్నూ, ఉపవసించవలసిందే అనుకొన్నాడు.

ఆరోజులు అద్భుతంగా గడిచాయి. ప్రజలలో విషాదమే తాండవించింది. ఒకప్పుడు అన్యమతస్థులరక్తంతో ధాత్రి రంజిత

మైన వీథులలో ఆబాలగోపాలంగా అన్ని మతాల ప్రజానీకమూ తమతమ అంతస్తులనుకూడా మఱచి నిలబడి మహాత్ముని ప్రాణం నిలవాలని ప్రార్థనలుసాగించారు. ఆరోజులు నేనెన్నటికీ మఱవ లేను. భారతీయులేకాక విదేశీయులుకూడా ఆయనప్రాణానికి ముప్పువాటిల్లుతుందేమో అని భయవిచలితులైనారు. అసలు దేశమంతా ప్రజానీకం ఉచ్ఛ్వాస నిశ్వాసాలుకూడా మఱచి పోతుందేమో అనిపించింది. ఆతరుణాన పాకిస్థానులోకూడా అదే పరిస్థితి సంభవించిందని నేను విన్నాను.

ఢిల్లీలోనూ తక్కిన భారతదేశంఅంతటానూ శాంతి రక్షణకు నడుము కట్టుకొంటామని హైందవనాయకులువచ్చి వాగ్దానం చేయగా మహాత్ముడు ఆకడవటి ఉపవాసాన్ని విర మించాడు. (1948 వ సంవత్సరం జనవరి నెల 18 వ తేదీన) తన చిరకాల మిత్రుడైన మౌలానాసాహెబు అందిచ్చిన నారింజ రసం పుచ్చుకొన్నాడు.

అప్పటికి 12 రోజులపాటు గాంధిజీ ఉపసించిఉండటంచేత, తర్వాత కొన్నిరోజులవఱకూ సాయంకాల ప్రార్థనస్థలానికి ఆయ నను ఒక కొయ్యకుర్చీలో కూర్చోపెట్టి మోసికొని రావలసి వచ్చింది. తర్వాతమాత్రం బాలికలు (ఆయన మనుమరాండ్రో మనుమలభార్యలో) ఇరువైపులా తోడురాగా నెమ్మదిగా తోటలో నడచివెళ్ళేవాడు. అలా 1948 వ సంవత్సరం జనవరి నెల 30 వ తేదీ సాయంకాలం 5 గంటల 5 నిమిషాలవఱకూ, కూడా ఆయన పాదుకలు తొడిగికొని తిరుగుతూనేఉన్నాడు. ప్రార్థనస్థలంలో నేను ఆయనకోసం నిలబడి ఉన్నాను.

ఆయన నాకంటబడేసరికి 5 గంటల 12 నిమిషాలయింది. అంత ఆలస్యం ఎన్నడూ జరుగలేదు. ఆయన సరిగా 5 గంటలకే రావలసింది. 5 గంటల 5 నిమిషాలకే ఆయన బయలుదేరాడని అక్కడి ఉద్యోగులన్నారు. ఆయన తోటచివర ఉండే వేదిక ముందటిమెట్లు కొన్ని ఎక్కాడు. ప్రార్థన చేసేచోటు అదే. నాథూరాం వినాయక్ గోడ్సే అనే ఒక యువక హైందవ తీవ్రజాతీయవాది ఆయనకు పాదాభివందనంచేశాడు. దీవన అందుకొన్నాడు; ఉత్తరక్షణంలోనే పిస్తోలుతో కాల్చివేశాడు.

## 2

యుద్ధానికి కల ఆటంకం తొలగించటంకోసమే మహాత్ముణ్ణి చంపటం జరిగిందని గోడ్సే అన్నాడు. గాంధిజీవల్లనే భారత దేశానికీ పాకిస్థానుకూ మధ్య యుద్ధం బయలుదేఅలేదనీ, యుద్ధంతో భారత దేశం పాకిస్థానును సులభంగా జయించి, ప్రభుశక్తితో దేశాన్ని తిరిగి ఏకంచేయటం సంభవమనీ, గోడ్సే, గోడ్సేను ప్రోత్సహించిన ఇతర విప్లవకారులూ అభిప్రాయపడ్డారు.

అయితే గాంధిజీ హత్యవల్ల కలిగినఫలం శాంతితప్ప యుద్ధం కాదు. ఈ ఉపఖండమంతటాకూడా యుద్ధవైముఖ్యం ఏర్పడింది. ఇది ఎంతో అద్భుతమైనదే. కాక అక్షరాలా యథార్థమైనదికూడా. భారత దేశంలోనూ, పాకిస్థానులోనూ కూడా ఇది ఒకేవిధంగా వర్తిల్లింది. తర్వాత కొన్ని వారాలకు నేను శాంతి అనగా ఏమిటో తెలియని పఠానులు నివసించే వాయువ్యపు సరిహద్దుప్రాంతానికి వెళ్లాను. ఈ పఠానులు జ్వాలి

అనేది మొలుగనివారు. కొన్ని గ్రామాలలో వీరు నన్ను గాంధిజీ నిర్యాణకథను చెప్పవలసిందని అడిగారు. ఆ కథ వింటూ ఉన్నప్పుడు అతి ముష్కరనేత్రాలుకూడా చెమర్చాయి. సర్వభారతమూ సమస్త పాకిస్థానుకూడా మహాత్ముని శాంతిసందేశాన్ని విషాదంతో వరించాయి. అలా చేయటంతో ఉభయ దేశాలమధ్యా యుద్ధంఅనేదే సంభవంకాని మానసిక పరివర్తన ప్రజలలో కలిగింది.

ప్రపంచంలో నేటివరకూ శాంతి నిలవటానికి ఇదే కారణం కావచ్చును. ఈ నాడు అణుశక్తిమూలాన యుద్ధం ఎప్పుడు వచ్చిపడుతుందో అనేభయం ప్రపంచపరిస్థితులు గమనించేవారి కెవరికైనా కలగటం సహజమే. అయితే ఇది ప్రపంచమంతటికీ ఇంకా తెలిసిరాలేదు. దానివల్ల కలిగే ప్రమాదం గ్రహించటానికి రెండేండ్లో మూడేండ్లో పట్టవచ్చును. 1948 వ సంవత్సరంలో భారతమూ పాకిస్థానూ అన్యోన్యం బెదరించుకొన్నట్లు అప్పుడే కయ్యానికి సిద్ధపడిఉంటే అవి ప్రపంచమంతటినీ అందులోకి ఈడ్చి ఉండేది. అప్పుడు ప్రపంచయుద్ధానికి ఇలా వాయిదాపడి ఉండేది కాదు. ఇది గాంధిజీ నిర్యాణ ఫలమే అయిఉండాలి. అందువల్ల మహాత్ముని ఆత్మార్పణం కృతకృత్యత పొందింది. ఆయన ప్రార్థించినవిధంగా ఢిల్లీకీ, భారతానికీ, ప్రపంచానికీకూడా శాంతి సంఘటించాడు. చరిత్ర ప్రారంభమైననాటినుంచీ భగవదంశసంభూతులైన మహాపురుషుల జీవితాలవలె ఆయనజీవితమున్నూ మరణంతో పరిపూర్ణ

తను సాధించింది. నాజరైతు ఏసుకు ఎంతమాత్రమూ తీసి పోకుండా ఆయనకూడా మానవకల్యాణంకోసం మరణించాడు. ఆదినుంచి అంతంవఱకున్నూ కేవలా స్తిక్యమూ కేవలాత్మా ర్పణమూ, కేవల త్యాగపేృమలే అయిన జీవితానికి ఇంత కంటె మంచి మరణం కలగదు. తోడిమానవులందఱినీ ఆత్మ సమానులుగా సమాదరించిన యీ మానవుడు మనకాలంలో అసమానుడు పూర్వకాలంలో సుప్రసిద్ధుడైన సోక్రటీసువలెనే యింతవఱకూ మనకు తెలిసినదానినిబట్టి మహాత్ముడు వేత్త అనీ సత్తముడు అనీ మాత్రమే చెప్పగలము.

